భారతీయ - పాశ్చాత్య తులనాత్మక సాహిత్య దర్శనము

Indian–Western Comparative Literary Thought

# గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్రము

# Greek-Roman Literary Criticism

*

డా॥ బి. వేంకటేశం. సాహిత్యరత్న.,

ఎం.ఏ., (తెలుగు, హిందీ, ఆంగ్లము) పిహెచ్.డి., డి.డి.ఇ.,



భారతీయ - పాశ్చాత్య తులనాత్మక సాహిత్య దర్శనము

**Indian–Western Comparative Literary Thought**

# గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్రము

## Greek-Roman Literary Criticism

*

**డా॥ బి. వేంకటేశం. సాహిత్య రత్న.,**

ఎం.ఏ., (తెలుగు, హిందీ, ఆంగ్లము) పిహెచ్.డి., డి.డి.ఇ.,



సరోజా పబ్లికేషన్స్

**కరీంనగర్ – 2.**

# Greek-Roman Sahitya Sastramu

(Indian-Western Comparative Literary Thought)

by

**Dr. B. VENKATESHAM**



First Edition : Vijaya Dasami, 1994

Publishers : **Saroja Publications**
H.No. 5, Padmanagar,
Karimnagar-505 002. (A.P.)

Published by :
Smt. B. SAROJA

For Copies :
**Smt. B. Saroja**
H.No. 5, Padmanagar,
Karimnagar-505 002. (A.P.)

Cover Page : Author

Price : Rs. 160/-

---

Printed at :
SRI BALAJI PRINTING PRESS
(Automatic Power Press)
Tilak Road,
Karimnagar-505 001 (A.P.)

# ప్రార్థన





**విఘ్నరాజు :**

ఆకారమే యుండదని వాపోవుదు వేలయని
వికారమే తనకు తాను నీకు దాసోహమ్మనె
పూజార్హత యుండనేరదను భ్రాంతి నీకేల యని
మొదటి పూజయే సరగున నీ మ్రోల నిలిచె
కూర్చుండ నెలవు లేదను చింత నీకేల యని
మూషక రాజము తన మస్తకమ్ము తాకట్టుపెట్టె
వింతగా నున్నదేమి నీ చరితము విఘ్నరాజా
అంతలోనే ఆరాధ్యుడవైతి వదేల గణనాయకా
విఘ్నంబు లెన్నైనా రాకుండ జూడుమని వేడుకొంటి
విఘ్నములే లేవెన్నటికీ ఈ కావ్య శాస్త్రమ్మున కంటివి.



**వాగ్దేవత :**

బాసరలో నున్నావని బయలు దేరిపోవ
వేసారి పోదువేల వెనుదిరుగు మంటివి
కావ్య లోకాన మరోసారి పరిశీలించి చూతునన
కావ్య శాస్త్ర రచనలో నీవు పరిశీలించిన దేమంటివి
ఏదో నాలోన మెదిలేటి రూప మదేమియన
ఏథెన్స్ సత్యార్థుల నేల మరచి యూర్కొన్నా వంటివి
తెలియ రాదేమి తరతరాల నా తెలివిహీనత యన
తెలుగున రచింపజేసి తరతరాలకు వెలిగింతు నంటివి
సార్వభౌమిక జ్ఞాన దేవతవై నాలో వెలసినావు
సార్వకాలీన జ్యోతిగా ఈ కావ్యశాస్త్రమ్ము నలరించినావు.



పవన తనయ :

ఆశానిరాశా కల్లోల కడలిలో ఆకంపించునాడు
పవన తనయుడవై పలకరించినావు
విషాగ్ని జ్వాలా విజృంభణలో విల విల లాడునాడు
మనోజవమై నాలోన మెదలినావు
క్రూరపిశాచ మాయాజాలంలో క్రుంగి పోవునాడు
మహా బలుడవై నన్ను మన్నించి నావు
అజ్ఞాన తిమిర లోకాన అలమటించు నాడు
రామ నామమ్ము నా నోట రప్పించినావు
దివ్య తేజో రాశివైన నీ దయకు పాత్రమగు
నవ్యభావ భరితమైన ఈ సాహిత్య శాస్త్రము.



భారతీయ - పాశ్చాత్య తులనాత్మక సాహిత్య దర్శనము
Indian Western Comparative Literary Thought

# గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్రము
## Greek - Roman Literary Criticism

—డా॥ బి. వెంకటేశం.

విషయ-విభజన - *Division of Subject Matter*

Grams : "TELVERS"

Phone: Off: 234815
236911
Res: 238244
Fax : 0842 - 236045

తెలుగు విశ్వవిద్యాలయం
TELUGU UNIVERSITY

Prof. PERVARAM JAGANNADAM
M.A., Ph.D.
VICE-CHANCELLOR.

Lalitha Kala Kshetram,
Public Gardens,
HYDERABAD-500 004. (A.P.)

తేది 14-10-1994

విజయదశమి

# ఆలోకన

భాష పుట్టినప్పుడే దానితోపాటు సాహిత్యం పాటగానో, పద్యంగానో పుట్టినా చాలా కాలం వరకూ శాస్త్ర స్థాయి నందుకొనే సాహిత్య విమర్శ పుట్టదు. పాశ్చాత్య దేశాల్లో ఇలా సాహిత్య విమర్శ శాస్త్ర స్థాయిలో గ్రీస్‌లో పుట్టింది తర్వాత దాని ప్రభావం రోమ్‌మీద పడింది. ప్లేటో, అరిస్టాటిల్ ఇద్దరు కూడా గ్రీస్‌కు చెందిన వారే. ఈ గురుశిష్యు లిద్దరూ తర్వాత వచ్చిన లాంజినస్ పాశ్చాత్య విమర్శకు మూల పురుషు లనుకోవచ్చును.

గ్రీస్ ప్రాబల్యం తగ్గి రోమన్ రాజ్యం స్థిరపడే టప్పటికి అక్కడి హోరేస్, క్వింటీలియన్ వంటి విమర్శకులు పాశ్చాత్య సాహిత్య విమర్శ సంప్రదాయానికి కొంత స్థిరత్వాన్ని సాధించారు. తర్వాత వచ్చిన పాశ్చాత్య సాహిత్య విమర్శకు బీజము లన్నీ ఈ గ్రీక్ - రోమన్ విమర్శకులలోనే వున్నాయి.

నేడు మనం భారతీయ సాహిత్య శాస్త్రాన్ని అధ్యయనం చేయడంలో తృప్తి పడడం లేదు. నిజానికి దానికన్న పాశ్చాత్య విమర్శ ఎలా ఉన్నది? అన్న ఆలోచన తీవ్రంగా సాగుతున్నది దానికి మూల కందంగా ఉన్న ఈ గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్రము ఎట్టిదో పరిశీలింప వలసిన అవసరం ఉంది. ఆ అవసరాన్ని తీర్చడానికే డా॥ బి. వేంకటేశం గారు ఈ పుస్తకాన్ని రచించినారు.

ఇక భారతీయ సాహిత్య శాస్త్రానికి, ఈ గ్రీక్ – రోమన్ సాహిత్య శాస్త్రానికి ఏమయిన పోలికలు ఉన్నాయా? అన్న అనుమానం సాహిత్య విద్యార్థికి కలగడం సహజం. అసలు సాహిత్యం, కవిత్వం అన్ని దేశాలలోని మానవుల్ని ఆకర్షిస్తుంది; కదుపుతుంది; కుదుపుతుంది. ఈ ప్రతిస్పందనలో ఎంతో సామ్యముంటే, సాహిత్య తత్త్వాన్ని అన్వేషించే విమర్శలో కూడా సామ్యముండాలి. ఆ సామ్య మెట్టిదో పరిశీలించడానికే డా॥ బి. వేంకటేశంగారు ఈ గ్రంథాన్ని భారతీయ–పాశ్చాత్య తులనాత్మక సాహిత్య దర్శనంగా రూపొందించినారు.

ఈ గ్రంథ రచనలో ఈ దృక్పధాలు సంక్షిప్తంగా గాక విపులంగా చర్చించ బడినాయి. డా॥ వేంకటేశం గారు అక్కడా ఇక్కడా ఉన్న మూల గ్రంథాలను శ్రద్ధాగా అధ్యయనం చేసినారు వాని నుండి విశేషంగా ఉటంకిస్తూ వానికి వ్యాఖ్యానం చేసినారు. ఆ మీద ఈ రెండు దృక్పధాల సామ్యాన్ని చర్చించినారు.

ఇందులో ప్లేటోను, లాంజినస్‌ను గురించి చర్చించినంత విపులంగా అరిస్టాటిల్‌ను గురించి చర్చించలేదు దీనికి కారణం వేంకటేశం గారు వారు లోగడ వ్రాసిన "అరిస్టాటిల్ కావ్య శాస్త్రము" అన్న గ్రంథంలో అరిస్టాటిల్ కావ్యసిద్ధాంతాలను వివరిస్తూ వానిని భారతీయ కావ్యదృష్టితో కనబడే సామ్య భేదాల వివరణ ఇవ్వబడిందని అంటున్నారు అయినప్పటికీ ఇందులో అరిస్టాటిల్ సాహిత్య దర్శనం సమగ్రంగా ఈయబడింది; పాఠకునికి ఉపకారకంగా ఉంది.

డా॥ బి. వేంకటేశంగారు ఈ గ్రంథాన్నీ విషయం పట్ల ఆసక్తితో అభినివేశంతో వ్రాయడం ఎంతో సంతోషాన్ని కలిగిస్తున్నది. ఇలాంటి ఉత్తమ గ్రంథాల్ని రచించిన డా॥ బౌద్ధుల వేంకటేశం గారిని అభినందిస్తున్నాను. ఇక ముందు కూడా మరిన్ని మంచి గ్రంథాలు రచిస్తారని ఆశిస్తున్నాను.

– పేర్వారం జగన్నాథం

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత,
పద్మభూషణ్
**డా॥ సి. నారాయణరెడ్డి,**
ఎం.ఏ; పి.హెచ్.డి; డి.లిట్.
రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక,
భాషావ్యవహారాల సలహాదారు.



కార్యాలయం : 242082
గృహం : 248451

కళాభవన్,
హైదరాబాద్-500 004.

**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము**

# కరదీపిక

తేది 5-10-1994

సాహిత్య సృష్టి సృజనాత్మక ప్రవృత్తికి సంబంధించింది సాహిత్య లక్షణ విశ్లేషణం ఆలోచనాత్మక విధానానికి సంబంధించింది. ఇంగ్లీషులో "ఈస్తటిక్స్" అనే పదానికి తెలుగులో లక్షణ గ్రంథం అని, సాహిత శాస్త్ర మని అనడం వాడుకలో వుంది. గ్రీక్-లాటిన్ భాషల్లో అత్యంత మౌలిక సాహిత్య దర్శన గ్రంథాలు వెలువడ్డాయి అలాగే సంస్కృతం లోనూ

ఇంగ్లీషు, హిందీ భాషల్లో గ్రీక్-రోమన్ సాహిత్యశాస్త్ర సమీక్షణ గ్రంథాలు ఎన్నో వెలువడినా ఈ రంగంలో తెలుగులో తగినంత వాఙ్మయం రాలేదు. డా॥ బి. వేంకటేశంగారు గ్రీక్, రోమన్ సాహిత్య శాస్త్రాల్లోని ప్రముఖాంశాలతో పాటు భారతీయ కావ్య లాక్షణిక దృక్పథాలను కూడా జత పరచి ఈ తులనాత్మక రచన రూపొందించడం అభినందనీయం.

డా॥ బి. వేంకటేశం గారిది లోతైన అధ్యయన శీలమున్న చిత్తవృత్తి. అందుకే సమతౌల్యం ప్రమాణంగా, నిష్పాక్షిక విశ్లేషణ మూల ధాతువుగా రచించిన ఈ గ్రంథం (గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్రము) సాహిత్య విమర్శనా క్షేత్రంలో తెలుగు భాషీయులకు కరదీపిక అవుతుందని ఆశిస్తున్నాను.

**Dr. C. VARADA CHARY,**
M.A., M.Phil., Ph.D.
Head, Department of English
Kakatiya University,
WARANGAL-506 009-A.P.

తేది: 14-10-94
విజయ దశమి

# అభినందన

ఒక జాతి ఔన్నత్య నిరూపణలో సాహిత్యము ప్రముఖ భూమిక వహిస్తుంది. సృజనాత్మక సాహిత్యము ఆ జాతి హృదయం నుండి వెలువడితే, బుద్ధిజీవులు ఆ సాహిత్యానుభవాలను విశ్లేషించి సిద్ధాంతాలు ప్రవచించుతారు.

ప్రపంచ నాగరికతలో సింధు నాగరికత ఎంత ప్రాచీనమో, గ్రీక్-రోమను నాగరికత అంత చారిత్రకమైనది. భారతీయ సాహిత్య మూలాలను దర్శించడానికి సంస్కృతం ప్రధానమైంది. కాగా అంతర్జాతీయ సాహిత్యావగాహనకు ఆంగ్లభాషానేత్రం కావాలి. ప్రాచీన తెలుగు సాహిత్యం సంస్కృత సాహిత్యం నుండి వచ్చినట్లే, ఆధునిక తెలుగు సాహిత్యం మీద అత్యంత ప్రభావం చూపిన ఆంగ్లభాషా సాహిత్యానికి మూలాలు గ్రీకు-లాటిన్ సాహిత్యంలో లభిస్తాయి.

భారతీయ-పాశ్చాత్య తులనాత్మక సాహిత్య దర్శనం వల్ల అనేక ఆశ్చర్యకరమైన విషయాలు వెలుగులోకి వస్తాయి. ''సత్యమ్, శివమ్, సుందరమ్' అన్న సాహిత్య తాత్త్విక సూత్రంలో ప్రపంచ మానవ నాగరికతను, సమానత్వాన్ని దర్శించవచ్చు అత్యంత ప్రాచీన కాలంలోనూ ప్రాచ్య-పాశ్చాత్య సాహిత్యాచార్యుల ఆలోచనా విధానంలో వైవిధ్యమును, సమాన లక్షణాలను అనుశీలించవచ్చు కవి, రచయిత, ఇతి వృత్తము. కావ్య నిర్మాణ శిల్పము, రసము, ధ్వని, నీతి మొదలైన అనేక అంశాలను గూర్చి భారతీయాలంకారికులు, గ్రీక్-రోమన్ సాహిత్యాచార్యులు చేసిన వివేచనను డా॥ బొద్దుల వేంకటేశం గారు ఈ గ్రంథంలో చక్కగా విశ్లేషించినారు. తెలుగులో ఇలాంటి గ్రంథాలు అరుదు సాహిత్య విద్యార్థులందరు విధిగా అధ్యయనం చేయవలసిన ఉత్తమ గ్రంథం ఈ 'గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్రము'.

ఆయా భాషలలోని సుప్రసిద్ధ ఆలంకారికుల సిద్ధాంతాలను తులనాత్మకంగా అధ్యయనం చేసి "తెలుగు" వారికి అందుబాటులో ఉండునట్లు గ్రంథ రూపంలోకి తీసుక రావడం సాహస కార్యమే. పట్టు వదలని విక్రమార్కుడు డా॥ బొద్దుల వేంకటేశం గారు మిక్కిలి అభినందనీయులు.

—డా॥ సి. వరదాచారి,

**Prof. H. SHIVA KUMAR**
M.A., Ph.D.
Head. Department of Telugu
Kakatiya University,
WARANGAL-506 009-A.P.

☎ 72532
8-4-18, 'Sreevihar'
Sri Krishna Colony,
WARANGAL-506 002-A.P.

# ఆకాంక్ష

ప్రాచ్య దేశాలలో భారతదేశ నాగరికత ఎలాంటిదో, పాశ్చాత్య దేశాలలో గ్రీక్-రోమన్ నాగరికతలు అలాంటివి మన భారతీయ లాక్షణికుల లాగానే గ్రీక్-రోమన్ లాక్షణికులు కూడా కావ్యశాస్త్ర లక్షణాలను క్షుణ్ణంగా వివేచించి. కొన్ని సిద్ధాంతాలను వెలువరించారు. కొన్ని వేల మైళ్లదూరంలో ఉన్న ప్రాచ్య–పాశ్చాత్య లాక్షణికులలో ఒకే రకమైన అభిప్రాయాలు ఉండడం ఆశ్చర్యకరమైన విషయం. అందుకే అన్నారు– ''సంవాదిన్యో మేధావీ నాం బుద్ధయః'' – అని.

తెలుగు, ఆంగ్లము, హిందీ భాషలలో ఎం.ఏ. పట్టాలను పొందటమే కాక, ఆయా భాషలలోని కావ్యశాస్త్రాలను బాగా అధ్యయనం చేశారు డా॥ బి వేంకటేశం గారు. అంతేగాక వారివారి మేధా సంపత్తికి పతాకలైన లాక్షణిక సిద్ధాంతాలను తులనాత్మకంగా అధ్యయనం చేసి, సంవదించే అంశాలను "గ్రీక్ – రోమన్ సాహిత్య శాస్త్రము" అన్న గ్రంథంలో చక్కగా వివరించారు.

ఇంతకు పూర్వమే వేంకటేశం గారు ''అరిస్టాటిల్ కావ్యశాస్త్రము" అనే గ్రంథం ప్రచురించారు. అందులో ఆయన– అరిస్టాటిల్‌కు పూర్వము ప్రచారంలో ఉండిన కావ్య సిద్ధాంతాలు, అరిస్టాటిల్ గురువైన ప్లేటో అభిప్రాయాలు, ఆ తరువాత అరిస్టాటిల్ అభిప్రాయాలు, వారి సిద్ధాంతాలు భారతీయ లాక్షణికుల అభిప్రాయాలతో సంవదిస్తున్న తీరును వివరించారు. కావ్యాత్మ, కావ్యహేతువులు, కావ్య స్వరూపము, కావ్య ప్రయోజనము వంటి పలు విషయాలలో ప్రాచ్య–పాశ్చాత్య లాక్షణికుల అభిప్రాయాలలోని భేద-సాదృశ్యాలను తులనాత్మకంగా వ్యాఖ్యానించారు.

డా॥ వేంకటేశంగారి అధ్యయనం అంతటితో ఆగలేదు. తన అధ్యయన పరిధిని పెంచి, కేవలం అరిస్టాటిల్‌నే కాక, గ్రీక్-రోమన్ సాహిత్య వేత్తల దృక్పథాలన్నింటిని గ్రహించి పరిశీలించారు. ఆ కృషి ఫలితమే ఈ "గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్రము''. ఇందులో హోమర్, హేసియడ్, పిండార్, అరిస్టోఫనీజ్, యురిపిడజ్ వంటి ప్రాచీన గ్రీకు లాక్షణికుల సిద్ధాంతాలను కూడా తీసుకొన్నారు. అట్లాగే ఆరిస్టాటిల్‌కు గురువైన ప్లేటో సిద్ధాంతాలను, అదే క్రమంలో అరిస్టాటిల్ సిద్ధాంతాలను కూడా వివరించారు. అట్లాగే సిసిరో, హోరేస్, క్వింటీలియన్, డాంటె వంటి ప్రసిద్ధుల కావ్య సిద్ధాంతాలను కూడా గ్రహించారు. ఆయా గ్రీక్-రోమన్ లాక్షణికుల సిద్ధాంతాలతో భారతీయ లాక్షణికుల అభిప్రాయాలను పోలుస్తూ, అందలి భేద-సాదృశ్యాలను చక్కగా వివరించారు. మొత్తం మీద- ఈ''గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్రము'' పాశ్చాత్య కావ్య సిద్ధాంతాలను పరిణామ క్రమంతో అధ్యయనం చేయటానికే కాక, భారతీయ సిద్ధాంతాలతో తులనాత్మకంగా అధ్యయనం చేయటానికి కూడా ఎంతో ఉపకరిస్తున్నదనటం అతిశయోక్తి కాదు.

మరొక విశేషం- ఒక్కొక్క తత్త్వవేత్త సిద్ధాంతాలను వరుసగా వివరించటమే కాక, చిట్టచివర వాని సారాంశం ఇవ్వటంవల్ల ఆయా సిద్ధాంతాలను సులభంగా అర్థం చేసుకోవటానికి ఈ గ్రంథం చాలా ఉపకరిస్తుంది.

తెలుగులో ఇలాంటి గ్రంధాలు లేవనే చెప్పవచ్చును. కనుక వేంకటేశం గారి ఈ గ్రంధము ప్రాచ్య-పాశ్చాత్య కావ్య శాస్త్ర తులనాత్మక అధ్యయనానికి ఎంతో సహకరిస్తుందనటం సముచితము.

పోతే- ఈ గ్రంథంలోని విషయం క్లిష్టమైనది. కనుక గ్రంథములోని చర్చలను కొంచెం తగ్గించి, పఠితలకు మౌలిక సిద్ధాంతాలనే సులభంగా అందించి ఉంటే ఇంకా కొంత పఠితలకు అనుకూలంగా ఉండేదనిపిస్తున్నది.

ఏమైనప్పటికి- డా॥ బి. వేంకటేశం గారి కృషి ప్రశంసనీయమైనది ముందు ముందు వారు ఇంకా ఇలాంటి గ్రంథాలను వెలువరించి భాషామతల్లికి ఇతోధికంగా సేవ చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

శుభం భూయాత్

వరంగల్
.10-1994

**ఆచార్య హరి శివకుమార్**

**Prof. M. RANGA RAO**
Chairman, Board of Studies
Department of Telugu
KAKATIYA UNIVERSITY
WARANGAL-506 009-A.P.

Quarter No. 14
Kakatiya University Campus
Vidyaranyapuri,
WARANGAL-506009-A.P.

# ఆశంసనం

తెలుగులో మొదటి సారిగా గ్రీక్–రోమన్ సాహిత్యశాస్త్ర గ్రంథం వెలువడుతూంది. ఈ రచయిత వ్రాసిన పాశ్చాత్య కావ్యశాస్త్రానికి సంబంధించిన రచనల్లో ఇది రెండోది. అరిస్టాటిల్ కావ్యశాస్త్రం, గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్రం– ఈ రెండు శాస్త్ర గ్రంథాలు తెలుగులో సాహిత్య శాస్త్రాన్ని సంపన్నం చేసేవి. శాస్త్ర రచన క్లిష్టతరమైంది ఇందులో గ్రీక్-రోమన్ తత్త్వవేత్తలు ప్రదర్శించిన సాహిత్య దృక్పథాలను భారతీయాలంకారికుల సాహిత్య దర్శనాలతో సమన్వయం చేసి చూపడం కనిపిస్తుంది. వీటిలో నున్న సామ్య–భేదాలు పరిశీలిత మైనాయి.

ఆధునిక యుగంలో భారతీయ జీవనంలోనూ, సాహిత్యం పైనా పాశ్చాత్య ప్రభావము స్పష్టం. సాహిత్యంలో నిహితమైయున్న ఉదాత్త విషయాలను, సార్వజనీన లక్షణాలను యువ తరాలకు అందించే సంకల్పం ఇందులో కన్పిస్తుంది. దీని పరిజ్ఞానం లేంది సాహిత్య విజ్ఞానానికి పరిపూర్ణత చేకూరదు.

భారతీయాలంకారికుల వలెనే ప్రాచీన గ్రీక్–రోమన్ తత్త్వవేత్తలు కూడా సాహిత్యాన్ని గురించి సూక్ష్మాతి సూక్ష్మంగా వివేచన చేశారు. ప్రతిభ, భావనా సంపత్తి, కల్పనా రామణీయకత, రచనా శిల్పం, అనుభవశక్తి మొదలైన లక్షణాలను ఎంతో విస్తృత పరిధిలో పరిశీలన చేశారు. బహు సిద్ధాంతాలను ప్రతిపాదించారు. భావితరాలకు మార్గదర్శకులుగానూ నిలిచారు.

ప్లేటో కావ్యవస్తు దృష్టి, సౌందర్య భావన ఈ గ్రంథంలో వివరింబడినాయి. దీనితో పాటు భారతీయాలంకారికుల కావ్య దృక్పథాల సౌందర్య తత్త్వాలు పరిశీలిత మైనాయి. సాహిత్యంలో ఔదాత్య సిద్ధాంతాన్ని ప్రతిపాదిచిన లాంజినస్, ధ్వని సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన ఆనందవర్ధనుడు- వీరి వురిలోనున్న సామ్యతలు విశ్లేషితమైనాయి సాహిత్యంలో ఈ విధమై సాహిత్య దర్శనం తులనాత్మకమైన అధ్యయనంతో మొదటి సారిగా సహృదయులకు సమర్పితమైంది.

సాహిత్య విద్యార్థుల్లో సాహిత్యంపట్ల అవగాహనకై వారిలో తత్త్వ జిజ్ఞాసను పెంచుటకై ఈ గ్రంథం ఉపకరిస్తుందనడంలో సందేహంలేదు ఆధునిక యుగంలో భారతీయాలంకారిక విజ్ఞానంతో పాటు పాశ్చాత్య సాహిత్య వేత్తల విజ్ఞానాన్ని సమీకరించి, సమన్వయించి విమర్శనాత్మకమైన గురుతర కార్యాన్ని సమర్థవంతంగా నిర్వహించిన డా॥ బొద్దుల వేంకటేశం అభినందనీయులు ఈ గ్రంథం తెలుగులో సాహిత్యశాస్త్ర విమర్శనా ప్రపంచాని విస్తృతిని కలిగించడమే కాక ఆలోచనా స్వరూపాన్ని పరిపుష్టం చేసేదిగాన భావిస్తాను.

ఈ గ్రంథ రచయిత గుణాత్మకమైన సాహిత్య వ్యక్తిత్వం చేత తెలుగు సాహిత్య విమర్శనా జగత్తులో ఉల్లేఖనీయమైన స్థానాన్ని పొందుతారనడంలో సందేహం లేదు.

వరంగల్
తేది 4-10-1994

ఆచార్య. మాదిరాజు రంగారావు.

**Professor. S. LAXMANA MURTHY**
Chairman, Board of Studies

 Off: 77101 Ext.35
Res: 79852

Department of English
Kakatiya University
Warangal-506 009.
Telex : 825-230 KUCW IN
Grams : KAKATIYA, Fax: (08712) 78935

Date 4-11-94

I am delighted to read 'Greek-Roman Sahitya Sastramu' of Dr. B. Venkatesham. This is perhaps the first scholarly attempt in Telugu to present the poetics of East and West in a Comparative perspective. Dr. Venkatesham has provided in this volume a balanced and critical view of the theories of Plato, Aristotle, Longinus and Horace explicating them for clarity in the light of Indian poetics. He has quoted copiously from the original sources and he has throughout relied on authentic commentaries. This is surely a welcome contribution to the Comparative studies in Telugu. It fulfills a long-felt need. The scholars and students of comparative studies will greately benefit by this Judicious assessment of poetics.

-Prof. S. Laxmana Murthy.

# అవతారిక

గ్రీకు తత్త్వవేత్తల సాహిత్య దర్శనము, దాని కనుగమనముగా లాటిన్
భాషలో వెలసిన రోమన్ సాహిత్యాచార్యుల కావ్య దృక్పథము తెలుగులో
మొదటి సారిగా గ్రీక్–రోమన్ సాహిత్య శాస్త్రముగా వెలువడుతుంది.
పాశ్చాత్య సాహిత్యచార్యులు అరిస్టాటిల్ కావ్య శాస్త్రముతో పాటు సాహిత
శాస్త్ర రచనల నన్నింటిని 'లిటరరీ క్రిటిసిజమ్' గా పరిగణించినట్లే భారతీయ
సాహిత్యాచార్యులు భరతుని నాట్యశాస్త్రముతో పాటు కావ్యశాస్త్ర రచనలనన్నిం
టిని 'సాహిత్యశాస్త్రము'గా పరిగణించి యున్నారు. కావున లిటరరీ క్రిటిసిజమ్
యన్నను, 'సాహిత్యశాస్త్రము యన్నను, 'సాహిత్య వ్యాఖ్యానము' అను అర్థమే
ధ్వనిత మగును. "Literary Criticism, in the most elastic meaning of
the term, is literature discussing itself. It exends from the formal
treatise to the floatting criticism of everyday conversation on
literary topics" —Moulton. సాహిత్యము జీవన వ్యాఖ్యానమైనందున
సాహిత్య శాస్త్రము లేదా లిటరరీ క్రిటిసిజమ్ సాహిత్య వ్యాఖ్యాన మగుచున్నది.

ఆంగ్లములోని, హిందీలోని ఈ సాహిత్యశాస్త్ర గ్రంథము లందు గ్రీక్-
రోమన్ కావ్య దృక్పథముతో పాటు భారతీయ కావ్యదృక్పథము సమీక్షింప
బడలేదు; సామ్య-భేదములు నిరూపింపబడలేదు. తెలుగులో మొదటి సారిగా
వెలువడుతున్న ఈ గ్రీక్–రోమన్ సాహిత్య శాస్త్రము భారతీయ - పాశ్చాత్య
తులనాత్మక సాహిత్య దృక్పథంతో కూడా మొదటి రచన యగుచున్నది.

ఈ గ్రంథ మందు గ్రీక్–రోమన్ సాహిత్య శాస్త్రము నాలుగు ఉద్యో
తము లందు వివరింపబడింది; భారతీయ దృక్పథంతో పరిశీలింపబడింది.
భారతీయ–పాశ్చాత్య సాహిత్య శాస్త్రావిర్భావ దశ లందలి సామ్యత నిరూ
పింప బడింది. ప్లేటో ఆదర్శ సాహిత్య దర్శనం భారతీయ లాక్షణికుల కావ్య
చింతనను ఏతీరున పోలి యున్నదో నమీక్షింపబడినది లాంజినస్ ఔదాత్య
సిద్ధాంతము, ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతము– ఈ రెండింటి యందు కాన
వచ్చు సామ్యత సూక్ష్మాతి సూక్ష్మ వివేచన ద్వారా ఇట నిరూపితమైయున్నది.
గంభీర అధ్యయనము వినా అందలి సామ్యత అవగతము కానేరదు. హోరేస్,
క్షేమేంద్రుడు– వీరిద్దరి ఔచిత్య సిద్ధాంతము లందలి పోలిక చూపబడింది.
భారతీయ 'రీతి' సిద్ధాంత మందు క్వింటీలియన్ కావ్య శైలీ దృక్పథ మేతీరున
అంతర్భావం చెంది యున్నదో వివేచింపబడింది. సాదృశ్య వైదృశ్యాలు నిరూ
పింపబడి సారాంశం తేల్చి చూపడం జరిగింది. అరిస్టాటిల్ సమగ్ర సాహిత్య
దర్శనమునకై పాఠకులు అరిస్టాటిల్ కావ్య శాస్త్రమును చూడగలరు.

ఈ గ్రంథంలో సాధ్యమైనంత మేరకు సరళ భాషయే వాడబడినది; తులనాత్మక శాస్త్ర మగుట వలన అనుగమనము ఆయామము, నిగమనము, సంవృతి, వివృతి మున్నగు పదముల ప్రయోగము తప్పలేదు. ఆంగ్ల పద ములకు సరియైన భారతీయ పదముల ఎంపిక యందు అత్యంత జాగరూకత వహింపబడినది. రస నిష్పత్తి, రసానుభూతి, శబ్దవృత్తి శబ్దశక్తి, శయ్య, పాకము వంటి పదములకు ఏదో యొక రకమున ఆంగ్లపదములు సమకూర్చ బడినవి; రస ధ్వని, రీతి శాంత, కరుణ రసములు మున్నగు పదములు ఆంగ్లము నందు అట్లే వాడబడినవి. సాహిత్య పారిభాషిక పదసూచిని పరి శీలించగలరు.

భారతీయ-పాశ్చాత్య తులనాత్మక సాహిత్య శాస్త్ర దృక్పథంతో ఈ రచ నకు పూనుకొనుటకు నా దుస్సాహసమే యనిపించింది. ప్రాచీన, అధునిక సంస్కృతాంధ్రాంగ్ల హిందీ సాహిత్యాచార్యులు రచించిన కావ్యశాస్త్రరచనలు ఈ కార్యమును సుకరము కావించినవి. వారలకు నేనెంతయో ఋణపడి యున్నాను. మొదటి సారిగా ఈ తులనాత్మక సాహిత్య దర్శనమును సహృ దయులకు సమర్పించుట నా పురాకృత పుణ్యఫల విశేషంగా భావిస్తాను. సాహిత్య విదులు నా యీ సాహసమును మన్నింతురు గాక!

నా విన్నపమును మన్నించి ఈ గ్రంథమును పరిశీలించి నిష్పాక్షికంగా తమ తమ అమూల్యములైన అభిప్రాయముల నంద జేసిన మాన్యులు ఆచార్య వర్యులందరికి నా హృదయ పూర్వక ధన్యవాదములు.

అరిస్టాటిల్ కావ్య శాస్త్రమునకు ఎం.ఏ., తెలుగు పాఠ్య ప్రణాళిక యందు అధ్యయన గ్రంథ స్థానమును కల్పించి ఈ రచనకు పరోక్షంగా నన్ను ప్రేరేపించిన కాకతీయ విశ్వవిద్యాలయ తెలుగు విభాగ ఆచార్యవర్యు లకు కృతజ్ఞతలు. ఈ గ్రంథంను సైతం అట్లే మన్నించగలరని మనవి. ఇతర విశ్వ విద్యాలయ తెలుగు ఆచార్యవర్యులు అరిస్టాటిల్ కావ్య శాస్త్రముతో పాటు ఈ సాహిత్య శాస్త్రమునకు తమ తమ పాఠ్య ప్రణాళికల యందు సముచిత స్థానమును కల్పించగలరని ఆశిస్తున్నాను.

నా చేవ్రాలుకు అందమైన ముద్రిత గ్రంథ రూపమును సంతరించిన శ్రీ బాలాజి ప్రింటింగ్ ప్రెస్ కరీంనగర్ ప్రొప్రయిటర్‌కు మరియు సిబ్బందికి నా ధన్యవాదములు.

తేది 14-10-1994

విజయదశమి

వినీతుడు

డా॥ బి. వేంకటేశం.

# విషయ సూచిక - CONTENTS

## ప్రథమోద్ద్యోతము - The First Flash.

### 1. రూపకల్పన–The Forming pp. 1-126

## ద్వితీయోద్యోతము – The Second Flash.

### 2. సూత్రీకరణ-The Formulating pp. 1-116

## తృతీయోద్యోతము- The Third Flash.

### అనుగమన-The Following. pp. I-96

## చతుర్థోద్ద్యోతము - The Fourth Flash.

### ఉపసంహారము-The Epilogue. pp. 1-8





''నరత్వం దుర్లభం లోకే, విద్యా తత్ర సుదుర్లభా
కవిత్వం దుర్లభం తత్ర, శక్తిస్తత్ర సుదుర్లభా''

—విశ్వనాథుడు.



"Man knows that there is a likeness in the worlds of men; this likeness is expressed for example in science, the world of perceptual reality. In the same way he knows there is a likeness in feelings. This likeness is expressed in art, the world of effective reality".

-Christopher Caldwel.



''ఆత్మయొక్క విముక్తావస్థ జ్ఞానదశగా ఎలా పరిగణింపబడుతుందో, అలాగే హృదయం యొక్క ముక్తావస్థ రసదశగా చెప్పబడుతుంది. హృదయం యొక్క ఇలాంటి ముక్తి సాధనకై మానవుని వాక్కు ఏ శబ్ద విధానాన్నైతే రూపొందిస్తూ వచ్చిందో అదే కవిత''.

—ఆచార్య రామచంద్ర శుక్ల.

# ప్రథమోద్ద్యోతము - The First Flash

# రూప కల్పన

## THE FORMING

## I

## ఆవిర్భావము - Beginnings

సాహిత్యము సృష్టికి ప్రతి సృష్టి. సాహిత్య సృజనకు తోడ్పడు ఉపాదానములు, సమాజముపై దాని ప్రభావము, కవి మహనీయత ఉదాత్త సాహిత్య స్వరూపము మున్నగునవి వివేచింపబడి సిద్ధాంత రూపమున ప్రతిపాదింప బడగా రూపొందునదే సాహిత్య శాస్త్రము. అందువలన సాహిత్య మవతరించిన తరువాత కాని సాహిత్యశాస్త్ర మావిర్భవింపదు. విశ్వసాహిత్య శాస్త్ర మంతయు సాహిత్య వివేచనకు మరియు సిద్ధాంత ప్రతిపాదనమునకు పరిణామముగా వెలసియున్నది. సాహిత్యశాస్త్రము ప్రాచీన కాలమందు కావ్యశాస్త్రముగా—Poetics వ్యవహరింపబడినది

హోమర్ (Homer-B.C. 800). పాశ్చాత్య కావ్యశాస్త్ర మూల రూపము గ్రీకు ఆదికవియైన హోమర్ కావ్యములందు కానవచ్చును. ఆ మహాకవి గ్రీకు భాషయందు ఇలియడ్ (Iliad), ఒడిస్సే Odessay) యను విశ్వవిఖ్యాత మహాకావ్యములను రచించి తరువాతి కవులకు మార్గ దర్శకుడయ్యెను. యూరపు ఖండ వాఙ్మయమందు హోమర్ కావ్యములకు కల ప్రాధాన్య ప్రభావము లపారములు. గ్రీకు రాజులు ఆ కావ్యములందు ఆదరాభిమానములను ప్రదర్శించుచుండిరి. అలెగ్జాండరు హోమర్ కావ్యములను తలగడ క్రింద నుంచుకొని పరుండెడి వాడని ప్రతీతి.

హోమర్ రెండు కావ్యములందు ఆరంభమున వాగ్దేవతను స్తుతించెను. కవుల ఇష్టదేవతా స్తుతులు కావ్యరచనకు సంబంధించిన ముఖ్యాంశములను వెల్లడించును. కావ్యములందు సందర్భానుగుణముగా కవుల రచనానుభవము,

వ్యక్తిత్వము ప్రతిఫలించును. కనుక కావ్యమందు కావ్యశాస్త్ర సంబంధిత ముఖ్యాంశము లిమిడి యుండుట సహజము. ఒడిస్సే యందు హోమర్ సందర్భాను గుణముగా కావ్యశాస్త్రమున కుపకరించు అంశములను పాత్రల ముఖమున నిట్లు వెల్లడించెను.

'తన గాన మహిమచే మానవులను వారెట్టి స్థితి యందున్నను ఆనందింప జేయుశక్తిగల ఆ దివ్యగాయకుని, డెమోడకస్, సిటు రమ్మనుము. అన్యుల కెవరికిని సాధ్యముకాని దివ్యశక్తిని భగవాను డాతనికి ప్రసాదించి యున్నాడు. 1.

'అపుడు వాగ్దేవత కృపకు పాత్రుడైన ఆ ప్రియగాయకుడు వెంటరాగా సహాయకుడు సమీపమునకు వచ్చెను. వాగ్దేవత అతనికి సదసత్ వరముల రెండింటిని అనుగ్రహించెను. అతని లౌకిక దృష్టిని హరించి వేసెను ఐనను మధుర గానాలాప వరమును ప్రసాదించియే యున్నది.–2.
'ఓ డెమోడకస్! మానవు లందరిలో నిన్నే నేను శ్లాఘించెదను జీసెస్ కుమార్తెయైన వాగ్దేవత లేదా కుమారుడైన అపోలో నీకు కళావైదగ్ధ్యమును ప్రసాదించి యుండును. 3

'జనులందరిచే గాయకులు ఆదరింప బడెదరు; పూజింప బడెదరు. కారణ మేమన వాగ్దేవత గాయకులకు గానాలాపన మార్గమును స్ఫురింప జేయును మరియు సమస్త గాయక జాతిపై కృప వహించి యుండును. 4.
ఇలియడ్ నందలి 18వ అధ్యాయమునందు అఖిల్లెస్ ఢాలును హోమర్ ఇట్లు వర్ణించెను–

'మరియు నాగలికి వెనక భాగమున నల్లని మట్టి పడియున్నట్లుండెను. ఆ ఢాలు స్వర్ణ నిర్మితమైయున్నను చూపరుల కది సేద్య భూభాగముగా ప్రతీత మయ్యెను. ఇదియే ఆతనికళా కౌశలము. 5.

'హిమ్ టుద డేలియన్ అపోలో', యందు డేలాస్ కన్యల, అపోలో, లిట్ మరియు ఆర్టిమిస్ స్తోత్రగానములీ తీరున వర్ణితములు–

'భూతకాలమందలి స్త్రీ పురుషుల ధ్యానించుచు వారు గీతముల నాలాపిం

తురు. మానవ జాతిని భావ విముగ్ధుల కావింతురు. వారు అందరి వాక్కుల ననుకరించుటనెరింగి యుందురు; మరియు నాట్యము సలిపెదరు. ప్రేక్షకుడు తానే స్వయముగా వారితో గానాలాపన చేయుచున్నట్లు తన్మయు డగును. 6.

కావ్యశాస్త్రమునకు ప్రధానాంగములైన కావ్యసృజన మరియు కావ్యప్రయోజనము-ఈ రెండింటిని హోమర్ సూత్రప్రాయముగా తన కావ్యములందు నిబంధించెనని పై ఉల్లేఖముల ద్వారా గ్రహింప గలము. వానిని కావ్యశాస్త్ర బీజములుగా గుర్తింప వచ్చును. తదను సారము హోమర్ కావ్యదృక్పథము మనకు ఈ తీరున అవగత మగును.

1. సామాన్యులకు కావ్యరచన సాధ్యము కానేరదు. వాగ్దేవతా వరప్రసాదులైన వారు మాత్రమే కావ్య రచనాశక్తిని కలిగియుందురు. ఆమె అనుగ్రహమున వారికి సదసత్ వివేక జ్ఞానము సిద్ధించును లౌకిక దృష్టి హరింప బడగా వారు అలౌకిక జ్ఞాన సంపన్ను లయ్యెదరు. అందువలన భూతకాల మందలి విశేష సంఘటనలు, వ్యక్తులు వారికి స్ఫురింతురు. వానిననుకరించి వాగ్దేవతానుగ్రహమున వారు సర్వజన హృదయాహ్లాదకరముగా కావ్యములను రచింతురు.

2. కవుల కావ్యములు చమత్కారవంతములై యుండును అందువలన కవుల కావ్యవస్తువు లేక కళాకారుని కళాకృతి అవాస్తవమై యుండియు వాస్తవికముగా ప్రతీత మగును. అఖిల్లెస్ ఢాలు స్వర్ణనిర్మితము. కళాకారుడైన 'హెఫాయిస్టస్' ఆ ఢాలునందు ఆకసము, సూర్యచంద్రులు నాగిలి, దాని వెనక నల్లని మట్టిని చిత్రించెను. ఆ ఢాలును భూమండలముగా అత్యంత రమణీయముగా తీర్చి దిద్దెను. చూపరుల కది నల్లని భూభాగముగా ప్రతీతమై వారి అపరిమితానందమునకు హేతువైనది. వారు దానిని భూభాగమని అనందించిరే కాని స్వర్ణనిర్మిత మని కాదు. ఇట్లు కళాకారుడు తన కళాకౌశలముచే అవాస్తవమును వాస్తవికముగా చిత్రించి సామాజికునకు ఆనందమును కల్గించును. అది వాస్తవిక మను భ్రమకులోనై సామాజికుడు ఆనందము ననుభవించును. కావున కావ్యానందము

కవి యొక్క కళానైపుణ్యము ద్వారా అనుభూత మగును. అది కళానై పుణ్య జనితము.

3. కవులు/కళాకారులు వాగ్దేవతావర ప్రసాదులై యుందురు. తమ రచనల ద్వారా మానవ జాతికి ఇంద్రియాతీతమైన ఆనందమును ప్రసాదింతురు. కనుక కళాకారులు ఆదరణీయులు.

హోమర్ కావ్యదృక్పథము ననుసరించి కావ్యశాస్త్రమున కుపకరించు ఈ అంశములను సారాంశముగా ఇట్లు గుర్తింప గలము.

1. కవి దైవప్రేరితుడై కావ్యరచన కుపక్రమించును
2. కవి గత సంఘటనల. వ్యక్తుల ననుకరించి కావ్యమును రచించును.
3. కవి కనబరచిన కళాకౌశలము ద్వారా సామాజికుడు ఆనందము ననుభవించును.
4. కవి ఆదరణీయుడు; సంస్తవనీయుడు.

క్రీ.పూ. ఆరవ శతాబ్ది నాటికే హోమర్ కావ్యములు నెరవేర్చు ప్రయోజనము వివేచింప బడినది. పరిణామముగా వివిధాభిప్రాయములు ప్రచారమునకు వచ్చెను. నిశ్చిత నియమముల కధీనమై యున్న ఈ జగత్తునందు ఈర్ష్యాగ్రస్తులుగా, ఇంద్రియ లోలురుగా చిత్రింప బడిన దేవతల ప్రమేయము దార్శనికులకు నచ్చలేదు. హోమర్ కావ్యములను వారు అధర్మపోషకములుగా విమ ంచిరి శెనెఫెనెస్ మరియు పైథాగరస్ ఈ నిరసన విమర్శయందు ప్రము దేవతలు సైతము అనైతికతకు పాల్పబడినట్లు చిత్రింప బడిరి. దేవతల రించు మానవుల యందిట్టి అనైతిక కార్య రమణమందు అనురక్తి కలుగుట ాజము. కావున హోమర్ కావ్యములు మానవుని అనైతిక ప్రవృత్తిని పెంపొందించి దేశమును తీవ్ర సంక్షోభమునకు గురి చేయు చున్న వని నైతికవాదులు సంఘ సంస్కర్తలు అధిక్షేపించిరి. హోమర్ కావ్యగాథలు వాస్తవములు కానేరవని కళాచాతుర్యముచే అవి వాస్తవికములుగా ప్రతీతము లగుచున్నవి. అందువలన అవి దూషితములు కానేరవని, మన అమితానందమునకు హేతువు లగుట వలన ఆదరణీయములే యగునని కళావాదులు హోమర్ కావ్యములను సమర్థించిరి. పై

విధముగా కావ్య స్వరూపము మరియు కావ్యప్రయోజనములను గురించి పాశ్చాత్య దేశములందు విభిన్నాభిప్రాయములు నాడే తలయెత్తెను.

హేసియడ్ (Hasiad B.C. 800) - హోమర్ తరువాత ప్రసిద్ధుడైన గ్రీకు కవి హేసియడ్. ఈయన ఒక సామాన్య రైతు పుత్రుడు; కవియేకాక దార్శనికుడు కూడా. హేసియడ్ 'థియోగోనీ' (Theogony-దేవతల వంశవృక్షము) రచించెను. తాను హెలికాన్ పర్వత ప్రాంతమున మేషచారణచేయు చున్నపుడు వాగ్దేవత ఆవేశించెనని తెలిపెను. ఆ దేవతయే సంగీత సాహిత్యములకు అధిష్ఠాత్రియని, ఆమె అనుగ్రహమున కవికి భూత, భవిష్యత్ జ్ఞానము సిద్ధించుననెను. వాగ్దేవత తనకిట్లు ఉపదేశించెనని హేసియడ్ తెలిపెను-

> 'అవాస్తవిక విషయముల నెన్నింటినైన వాస్తవములుగా ఎట్లు నిరూపింప వలయునో మనకు తెలిసియే యున్నది. ఐనను అవసరమైనపుడు సత్యమునే రూపమున వ్యక్తపరచ వలయునో తెలిసికొనియుండ వలయును 7.

సరస్వతీదేవి కవుల జిహ్వలకు మధుర హిమకణము నందజేయుట వలన వారి పెదిమల నుండి మధుర పద జాలము జాలువారుచుండునని హేసియడ్ తెలిపెను. హోమర్ వలె హేసియడ్ సైతం వాగ్దేవతానుగ్రహమును కావ్యప్రేరణగా విశ్వసించెను. ఐనను కావ్యప్రయోజన మందు భిన్న దృక్పథమును కనబరచెను. ఆయన కావ్యప్రయోజనమును ఆనందమునకే పరిమితము కావింపక జ్ఞానోపదేశము వరకు విస్తరించెను. అనగా జ్ఞానోపదేశ యుక్తమైనదే కావ్యానందము. అది కళాచమత్కార జనిత ఆనందము కానేరదు. అందువలన, అది దివ్య సందేశ భరిత మగుట వలన అలౌకిక మగును. కనుక హేసియడ్ కాలము నాటికే సాహిత్య విషయిక సదభిప్రాయము ప్రచారములో నుండెనని తెలియ వచ్చును. దార్శనికు లాశించు దార్శనికతను, ధార్మికులు వాంఛించు ధర్మనిరతిని, నైతికు లారాధించు నైతికతను సాహిత్యము ప్రతిపాదించునని సాహితీవేత్తలు కావ్యప్రాశస్త్యమును వెల్లడించిరి.

పిండార్ (Pindar, B.C. 518-442)-గ్రీకు గేయ కవిగా పిండార్ అత్యంత ప్రసిద్ధుడు. బృందగానమున కుపయుక్తములగు గేయములలో పెక్కు రకములనాయన రచించెను. అతని గేయములు బృందగాన రచనా కౌశలమునకు పట్టు

కొమ్మలు. తన కాలము వరకు ప్రచారములో నున్న దైవికమైన కావ్యప్రేరణను పిండార్ సమర్థించెను. కళాకౌశలమును అంగముగా గుర్తించెను. ఐనను వాగ్దేవతానుగ్రహమే కావ్యరచనకు సమగ్రహేతువు కానేరదనెను. కావ్యరచనయందు కవికి నైసర్గికమైన (inborn) ప్రతిభ అనివార్యమగును. అదియే సరస్వతీ అనుగ్రహమునకు కారణమగును. ప్రతిభాహీనులకు ఆ దేవతానుగ్రహము సిద్ధింపనేరదు. కనుక కవులకు ప్రతిభయే ప్రధానము. వాగ్దేవతా నుగ్రహమును ప్రతిభతో సమన్వయ పరచి పిండార్ నూతన దృక్పథమును ప్రదర్శించెను. ఆయన కవులను రెండు రకములుగా విభజించెను. ప్రతిభా సంపన్నులు మరియు వ్యుత్పన్నులు. ప్రతిభా సంపన్నులే మహా కవులు; మిగిలినవారు సామాన్యులు. సామాన్యుల కావ్యము చిరకాలము నిలువజాలదని పిండార్ ఇట్లు తెలిపెను-

> 'నైసర్గిక ప్రతిభా సంపన్నుడైన వ్యక్తియే వాస్తవముగా శక్తిమంతుడు. వ్యుత్పన్నుడు కాంతిని కోల్పోవుచున్న నంజవెలుంగుతో సమానము. 8.

ఆనందానుభూతిని కావ్యప్రయోజనముగా పిండార్ అంగీకరించెను. ఐనను అది కళాకౌశల జనితము కానేరక కవి ప్రతిభాజనితము కావలయుననెను. అపుడే అలౌకిక స్థాయికి జేరుననెను. వ్యుత్పన్నుని కళాచమత్కార జనిత ఆనందము ఇంద్రియ సుఖమే యగును; సామాన్య తరగతికి చెందిన దగును. ప్రతిభావంతుడు దైవానుగ్రహమును పొంది యుండుట వలన సామాన్యశబ్దముల ద్వారానే మహనీయార్థమును ధ్వనింప జేయును; తద్వారా అనుభూతమగు ఆనందమే అలౌకికము.

**డార్ కావ్యదృక్పథ మందు కానవచ్చు ముఖ్యాంశము లివి—**

వాగ్దేవత స్వయముగా కవిచే కావ్యమును రచింప జేయదు. ఆ దేవత కవి కావ్యప్రతిభను ప్రకాశింప జేయు ప్రేరక శక్తిగా పనిచేయును. కవి నైసర్గిక ప్రతిభ సరస్వతీ అనుగ్రహమున కావ్యరచనా రూపమున ప్రకాశించును.

2. ప్రతిభా సంపన్నులైన కవులు మాత్రమే తమ కళాకౌశలముచే అలౌకిక సమమైన కావ్యానందమును ప్రసాదింప సమర్థులగుదురు.

3. కవు లిరు తెరంగులు-ప్రతిభాసంపన్నులు, వ్యుత్పన్నులు.

4. కవులు సామాన్య శబ్దముల ద్వారా గంభీరమైన అర్థమును ధ్వనింప జేయు దక్షతను కలిగి యుండ వలయును.

**గార్జియన్** (Gargeous. B.C 483-376)–గద్యమును సామాన్య స్థాయి నుండి కావ్యశైలికి చేర్చిన ప్రథమ పాశ్చాత్య సాహిత్యవేత్త గార్జియన్. 'ద ఇన్‌కొమిస్ ఆఫ్ హెలెన్' (The encomius of Helen) మరియు 'ద డిఫెన్స్ ఆఫ్ పెలాడస్ (The Defence of phaladas) యను రెండు గ్రంథములందు గార్జియన్ తన గురువైన ఎంపిడాక్లీజ్ మార్గమును అధిక ప్రచారమునకు తెచ్చెను; శబ్దశక్తి మహిమను వెల్లడించెను. సాహిత్యమందు శబ్దము నిర్వహించు మహనీయపాత్ర ను వివరించెను. ఆనాటి యుగ పరిస్థితు లాతనికి తోడ్పడినవి.

క్రీ.పూ. 510లో ఏథెన్స్ నందు ప్రజా ప్రభుత్వ మేర్పడెను. ప్రజాసేవ పేరుతో నాయకులుగా, చట్ట సభాధికారులుగా చలామణి కావలయునను ఆకాంక్ష నాగరికులలో తీవ్రతర మయ్యెను; ప్రజలలో స్పర్ధ యేర్పడెను; ప్రజల నాకట్టు కొని నాయకులుగా ఎన్నిక కావలయునను ఆరాట మెక్కుడయ్యెను. అందువలన వక్తృత్వకళానైపుణ్యమును సంపాదించుటయే నాటి నాగరికుల ప్రధాన లక్ష్యము గా నుండెను. వారి అవసరములను తీర్చుటకై వక్తృత్వ కళాసంస్థ లెన్నియో వెలుగునకు వచ్చెను. తర్కవాదులు (Sophists) ఈ అవకాశమును వినియోగిం చు కొనిరి. తమ తర్కనైపుణ్యముతో దర్శనమునకు, ధర్మమునకు, నీతికి విప రీతార్థములను కల్పించి తమ ఉపన్యాసముల ద్వారా ప్రజల నాకట్టుకొనుటకై యత్నించిరి. ఆనాడు వక్తృత్వకళ పరమ విద్యగా పరిగణింపబడెను. సంగీత– సాహిత్యములు వక్తృత్వ కళకు వినూత్న తేజస్సును సమకూర్చినవి అంతే కాదు వక్తృత్వకళ యొకటి నేర్చియున్న చాలు రాజ్యము లేల వచ్చును; రాజ సౌఖ్యముల బడయ వచ్చును; వేయేల దివిజమును నేరుగా భువికి దింపవచ్చును అందు వలన వక్తృత్వ కళా పారంగతుడు సర్వకళాశాస్త్రములందు నిష్ణాతుడను భావము ఆనాటి ప్రజలలో పాదుకొని పోయెను. వక్తృత్వ కళకు మూలమైన భాషాశక్తి గుర్తింప బడెను. ఆనాడు వకృత్వ కళాపారంగతులైన వారు ముప్వురు కోరెక్స్, టిసియన్ మరియు గార్జియన్.

గార్జియన్ శబ్దశక్తి మహిమ నిట్లుతెలిపెను– 'శబ్దము శక్తివంతుడైన శాస కుని వంటిది. మనలోని భయము నంత మొందించును; దుఃఖమును పారద్రోలి

ఆనందమును చేకూర్చును; మరియు విశ్వాసమును పెంపొందించును''9.

కావ్యము కలిగించు ప్రభావము మరియు నెరవేర్చు ప్రయోజనము శబ్దశక్తికి అధీనమై యున్నదని ఆయన వివరించెను. గద్యము సైతం శబ్దశక్తి మహిమ వలన కావ్యము కలిగించు ప్రభావమును సామాజికునిపై నెరపునని గార్జియస్ గద్యభాగమును చిన్న చిన్న వాక్యములందు కావ్యశైలీ మంతముగా మార్చి చూపెను. రూపకాలంకారమునకు బదులుగా శబ్దాలంకార ప్రయోగమును మొదటి సారిగా ప్రవేశపెట్టి ఆయన గద్యమునకు కావ్యత్వమును సిద్ధింప జేసెను. ఆయన పాశ్చాత్య సాహిత్య మందు శబ్దాలంకార ప్రవర్తకుడు. కవిత్వమును ఆయన ఛందాత్మక గద్యముగా తెలిపెను. కావ్యభాషాశైలి యందు గార్జియస్ సముచితమైన మార్పులను కల్గించి కావ్య వస్తువు కన్న కావ్యకళా తత్త్వమునకే అధిక ప్రాధాన్యత నొసంగెను ఆనాడు ఉత్తమ సాహిత్య ప్రక్రియగా రాణించిన విషాద రూపక స్వభావమును గార్జియన్ ఇట్లు తెలిపెను.

> 'విషాదరూపకము ప్రతీకాత్మకమైన కథను మరియు విభిన్న భావములను ప్రదర్శించి మనల భ్రాంతికి లోను చేయును. ప్రేక్షకులలో నిట్టి భ్రాంతిని కల్గింప నేరని విషాదరూపక కర్తల కన్న భ్రమకు లోనుచేయు రూపక కర్తలే శ్రేష్ఠులు. అట్లే ఇట్టి భ్రాంతికి లోనుకానేరని ప్రేక్షకుల కన్న భ్రాంతిని చెందువారే సహృదయులు. 10.

పాశ్చాత్య సాహిత్యశాస్త్ర వికాసమందు కావ్యశైలి నిర్వహించిన పాత్ర శంసనీయము. గార్జియస్ మొదటి సారిగా కావ్యశైలీ ప్రాధాన్యతను, శబ్దశక్తి మహిమను గుర్తించి భావితరము వారికి కళా ఔన్నత్యమును గురించి తెలియ జేసెను సారాంశముగా గార్జియన్ కావ్యదృక్పథ మిది —

1. వస్తువుకన్న అభివ్యక్తీకరణమే కావ్యమందు ప్రధానముగా నుండును.
2. అలంకార ప్రయోగముచే గద్యము సైతము కవిత వలె ప్రభావ వంతమగును.
3. శబ్దాలంకార ప్రయోగము వలన శైలి ఆకర్షణీయ మగును.
4. కావ్యానందము కళాచమత్కార జన్య భ్రాంతియే యైనను అది శబ్దశక్తిద్వారా మాత్రమే ఆవిర్భూత మగును.

**అరిస్టోఫనీజ్** (Aristophanes. B.C. 450-385). రాజకీయపరముగా ఉన్నత స్థానముల నలంకరించుటకై వాదాడంబరముచే తిమ్మిని బమ్మిగా జేయు వక్తృత్వ కళాపారంగతుల సంఖ్య అరిస్టోఫనీజ్ నాటికి పెరిగి పోయెను. విషయమును పక్కకునెట్టి అభివ్యక్తినే పరమావధిగా భావించిన తర్కవాదులకు విపరీతార్థము లను కల్పించి ఉపన్యాస కళానైపుణ్యముచే సామాన్య ప్రజానీకమును మోస పుచ్చుట పరిపాటి యయ్యెను. పర్యవసానముగా ప్రజాసేవ పేరిట అవినీతి విలయతాండవము చేసెను. సాహిత్య వీథులందుకూడావక్తృత్వ కళాప్రాభవమే ఎల్లె డల కానవచ్చెను. సాహిత్యమునకు, సమాజమునకు పట్టిన ఇట్టి దుర్దశను రూపు మాపుటకై అరిస్టోఫనీజ్ అనేక నాటకములందు తత్కాలీన అనైతికతను వ్యంగ్య మొనర్చెను. సమకాలీన కవులకు సాహితీవేత్తలకు కనువిప్పు కల్గించెను; ఉదా త్త సాహిత్యమును గురించి ఆలోచించు అవకాశమును కల్పించెను. కావ్యశాస్త్ర దృష్టితో 'ద క్లౌడ్స్' (The clouds). 'ద ఫ్రాగ్స్' (The Frogs). వీమెన్ సెలెబ్రేటింగ్ ద థేస్మోఫేరియా (We men celebrating Thesmopharia)యను నాటకములు ప్రశంస నీయములు.

'దక్లౌడ్స్' యను హాస్యనాటకము వక్తృత్వ కళా సంబంధితము. వక్తృత్వ కళ కావ్యశైలీ రామణీయకమునకు తోడ్పడు ననుటలో సందేహం లేదు. ఐనను శైలీ రమ్యతయే కావ్య సర్వస్వ మని వాదించు వారికి ఈ నాటక ము చక్కని గుణ పాఠము. అరిస్టోఫనీజ్ ఈ నాటకమందు వక్తృత్వ కళను తీవ్రముగా అధిక్షేపించి తత్ నిష్ప్రయోజకతను వెల్లడించెను. ఇందలి ప్రధాన పాత్ర 'స్ట్రెప్సియాడిజ్' యను నొక సామాన్యరైతు. వక్తృత్వ కళ యందు పారంగతుడై ప్రజలను, నాయకులను వంచింప వలయు ననెడి తన కోరిక నెర వేర నందున ఆ రైతు తనకు మారుగా తన కుమారుని తీర్చి దిద్ద సంకల్పించెను: వక్తృత్వ కళా పారంగతుల యొద్దకు శిక్షణకై పంపెను. అతని కుమారుడు వక్తృ త్వ కళ యందు నిష్ణాతుడై తిరిగి వచ్చి వాదమందు తండ్రినే అవమాన పరచెను. ఈ నాటక రచన ద్వారా వక్తృత్వకళ తర్కమునే సమ్మానించును కాని హృదయ మును స్పర్శింప నేరదను సత్యమును అరిస్టోఫనీజ్ వెల్లడించెను అట్లే కావ్య స్తువును నిరసించిన కావ్య శైలి అది ఎంత రమణీయముగా నున్ననేమి? సహృద ముల నలరింప జాలదని కూడా ఆయన ఈ నాటకమందు ధ్వనిత మొనర్చెను.

కావ్యశాస్త్ర దృష్టితో అత్యంత ప్రధానమైనది. ద ఫ్రాగ్స్. ఇందలి కథా వస్తువు నేరుగా కావ్యశాస్త్రముతో సంబంధించి యున్నందున ప్లేటో కు పూర్వము వెలువడిన కావ్యశాస్త్ర రచనగా ఈ నాటకము పరిగణింప బడినది. డయోనిసస్ యను నొక నాటక కంపెనీ యజమాని ఇందలి ప్రధాన పాత్ర. విషాద రూపక భవిష్యత్తును ఉజ్వలముగా తీర్చి దిద్ది వలయుననునది అతని ఆశ యము. అతని దృష్టియందు ఉత్తమ విషాదరూపక కర్తలందరు స్వర్గస్థులైనారు; జీవించి యున్నవారు నామమాత్రపు నాటక కర్తలు. అందువలన డయోనిసస్ పరలోక గతుడైన యురిపిడిజ్ యను ప్రసిద్ధ విషాదరూపక కర్తను భూలో కమందు వెదకుటకై బయలుదేరెను. మార్గమందు ప్లూటో భవనమందు యురిపి డీజ్ మరియు ఎస్కాయిలజ్–వీరిరురిలో ఉత్తమ నాటక కర్తను నిరూపించు నాటక ప్రదర్శన జరుగబోవుచున్నదని వినెను. వెంటనే డయోనిసస్ ప్లూటో భవనమును చేరెను నాటక ప్రదర్శన ప్రారంభమయ్యెను. నాటకారంభము ననే ఎస్కాయిలజ్ పాత్ర ద్వారా అరిస్టోఫనీజ్ ఈ మౌలిక ప్రశ్నను లేవలెత్తెను.

'ఏ విశిష్ట ప్రమాణము ఆధారముగా కవి కీర్తికి అధికారి కాగలడు'? అన్యులతో కలసి యురిపిడీజ్ ఈ సమాధాన మొసంగెను.

> 'అతని (కళాకారుని) కళనిజమైయున్న చో, అతని సందేశము శ్రేయోదాయ కమై యున్న చో మరియు ఏ తీరుననైనా మానవుని మంచివానిగా మార్చి దేశ సౌభాగ్యమునకు తోడ్పడి యున్న చో.

**యురిపిడీజ్ దృష్టియందు కవికీర్తికి అధికారి కావలయునన్న అతనిరచన–**

i. కళానైపుణ్య భరితమై యుండ వలయును.

ii. లోకశ్రేయస్సును చేకూర్చు దివ్యసందేశాత్మకమై యుండవలయును.

మొదటి నియమము ననుసరించి ఎస్కాయిలీజ్ కీర్తికి అధికారి కానేరడు. కారణమేమన ఆయన నాటకములందు సామాన్యేతర భాష నుపయోగించి ప్రేక్షకుల నాటకానుభూతిని క్లిష్ట మొనర్చెను. అతని నాటకముల ఆశయము ఉదాత్తమే ఐనప్పటికిని ఆయన తన ఆశయమును సిద్ధింప జేయు భాష నుపయోగింప వలసి యుండెను. కాని అతడు అవసరమునకు మించి అలంకార భూయిష్ఠమైన సామాన్యే తర భాషాప్రయోగము కావించెను; ప్రేక్షక మానసికస్థాయి నుపేక్షించెను. కనుక

అతని నాటకవస్తువుకు నాటక భాషతో సరియైన పొందిక కానరానందున కళాత్మక దృష్టితో అవి ఉత్తమములుగా పరిగణింప బడ జాలవు. యురిపిడిజ్ నాటకములు ఎస్కాయిలీజ్ నాటకము లంతటి ఉదాత్తతను కలిగిలేవు. అందలి కథా వస్తువులన్ని సామాన్యములే. ఐనను అవి కళాత్మక దృష్టితో అసమానములు యురిపిడిజ్ సామాన్యభాష నుపయోగించి ప్రేక్షక నాటకానుభూతిని సుకరము కావించెను. ప్రేక్షక మానసికస్థాయిని దృష్టి యందుంచుకొని అయన వ్యావహారిక భాషాప్రయోగమునే అభిలషించెను. అందువలన అవి మేలుబంతులుగా పరిగణింప బడినవి. అతని నాటకములందు భాషాభావముల మనోహర సమరసత కానవచ్చును. కావున కావ్యాత్మక దృష్టితో అవి కళాత్మకములు. ఈ దృష్టితో ఎస్కాయిలీజ్ కన్న యురిపిడీజ్ శ్రేష్ఠుడు. కనుక అతడే కవి కీర్తికి అధికారి. యురిపిడిజ్ స్వయముగా ఇట్లనెను-

> 'దైనందిన జీవితమునకు సంబధించిన విషయములనే నేను రంగశాల యందు ప్రదర్శించెదను;
>
> 'నేను నా కళను ప్రదర్శనా కౌశలముతో పాటు ఒక పరిమితి ననుసరించి తర్కముతో జతపరచి యున్నాను. అదియును శ్రోతల ఆలోచనా వికాస నిమిత్తము; వారి సరియైన చింతనకు మరియు వారు తమ తమ సంసార ములను చక్కదిద్దుకొనుటకు.
>
> 'కనీసం మానవులు మాట్లాడు భాషనైనా ఉపయోగింప వలదా! 12.

తదనంతరం లోకశ్రేయస్సు దృష్ట్యా ఎస్కాయిలీజ్, యురిపిడీజ్‌లలో శ్రేష్ఠు లెవరు? యను చర్చ ప్రారంభ మయ్యెను. ఈ సందర్భమున అరిస్టోఫసీజ్ తన అభిప్రాయము నిట్లు తెలిపెను-మానవులలో నైతికతను పోషించి, వారిని నాగరికులుగా తీర్చి దిద్దువారే మహాకవులుగా ఖ్యాతి నొందగలరు మహాకవు లందరు లోకశ్రేయోపాదకములైన దివ్య సందేశముల ద్వారా ఇట్టి మహత్తర ప్రయోజనమును నెరవేర్చినందు వలననేవారు కీర్తికి అధికారులు కాగలిగిరి. ఈ దృష్టితో ఎస్కాయిలీజ్ ఉత్తమ కళాకారుడు అయన హోమర్ ఆదర్శమును పాటించెను; ఉదాత్త విషయములనే తన నాటక కథా వస్తువులుగా ఎన్నుకొనెను. అంతే కాదు ఎస్కాయిలీజ్ తన నాటకములందు ప్రదర్శించిన మానవులు ధీరో

దాత్తులుగా స్వామిభక్తపరాయణులుగా, వీరులుగా ప్రత్యక్షమయ్యేదరు. ఆయన ప్రేక్షకులలో నవజాగృతిని కల్గించెను. జనులను నవనాగరికులుగా, దేశశ్రేయస్సుకై పాటుబడువారిగా మార్చుటకైఆయన నాటకములను రచించినఫలీకృతుడయ్యెను. ఎస్కాయిలీజ్ స్వయముగా తన నాటకములను గురించి ఇట్లుతెలిపెను–

'ఒకింత ఆలోచించి చూడండి. నేనెట్టి ధీరోదాత్తులను ప్రదర్శించియున్నానో. వారందరు వీరత్వమునకు ప్రతిమూర్తులు సమరము, శాంతి–రెండింటి యందు నాగరక కర్తవ్యము నుండి వైముఖ్యము నొందని వారు. సమయమును దురుపయోగ పరచు సోమరులు, అసమర్థులు, కుటిలురు కారు: ధనుర్బాణములతో ప్రకాశించు వారు; వారు ధరించిన ఏడు పొరల గట్టి చర్మమును కలిగియున్న కవచమునకు అడుగు భాగమున వారి శౌర్యహృదయము అధివసించి యున్నది. 13.

**తరువాత యురిపిడీజ్ రచించిన 'ఫెయిడ్రా'ను ఇట్లు విమర్శించెను–**

'ఇంద్రియాత్మక అశ్లీలతను నర్తవి సామాన్యప్రజానీక దృష్టినుండి తప్పింపవలయునే కాని అట్టి ప్రవృత్తినే ఉద్రిక్తరూపమున రంగశాలయందు ప్రదర్శింప రాదు. పిల్లలకు ఉపాధ్యాయులవలె మనము కవులము ప్రజలకు గురువులము. ఉదాత్తములును, పవిత్రములు నైన విషయములనే వ్యక్తీకరించుటకు బాధ్యులమై యున్నాము. 14.

సమకాలీన దురాచారములను, అనైతికతను నిర్మూలించి దేశమును చక్కని బాటయందు పయనింప యత్నించిన ఎస్కాయిలీజ్‌ను అరిస్టోఫనీజ్ కీర్తించెను; ఆతని ఆదర్శములను ప్రశంసించెను. కాని యురిపిడీజ్‌నందు ఇట్టి ఆదర్శ దృక్పథము కానరాదు. వ్యక్తులను స్వార్థపరులుగా, ధూర్తులుగా, దేశ సంక్షోభకారకులుగా చిత్రించెను; తర్కవాద ప్రేరితులై ప్రజలను వంచించుటలో నేర్పరులుగా ఆతని పాత్రలు మనముందు సాక్షాత్కరించెదరు. వాస్తవముగా ఇట్టి చరిత్రహీనుల వలన ఏథెన్స్ చరిత్ర అధోగతిని చేరినది. అరిస్టోఫనీజ్ యురిపిడీజ్‌నిట్లు విమర్శించెను–

'ఏ దురాగతములకు సృజనకర్తగా లేక కారణముగా ఆతడు కాకుండా యున్నాడు? ఆతని ద్వారా ప్రదర్శింపబడు దృశ్యములన్నియు అవినీతికి తావలములు, మరియు అశ్లీల వ్యక్తులను కుటిల స్వభావులను ప్రదర్శించును .. అందువలనే నేడు మన నగరమంతయు గుమాస్తాలతో మరియు వక్తృత్వ కళావాద వానరులతో నిండియున్నది. వారు ఎల్లవేళల ప్రతి చోట వంకరటింకరగా నడచెదరు మరియు నాగరికులను పథభ్రష్టుల కావించుచు తిరిగెదరు. ఆట పాటలందు సుశిక్షితులైన వారెవరును లేరు. సమర్థవంతంగా దివిటీని అందుకొని పోటీల యందు పాల్గొను వ్యక్తి ఒక్కరును లేరు. 15.

పై విధముగా ఉత్తమ కళా నియమములు చర్చింప బడినవి. తదనంతరం ఉత్తమ కళాకారుడెవరో నిర్ణయించు బాధ్యత డయోనిసస్‌కు వదలివేయ బడెను. డయోనిసస్ చాలాకాలము వరకు ఆలోచించి ఎస్క్యాయిలిజ్‌ను ఉత్తమ విషాద రూపక కర్తగా నిర్ణయించుకొనును అంతటితో నాటకము సమాప్తమగును.

కావ్యశాస్త్ర దృష్టితో అరిస్టోఫనీజ్ మూడవ నాటకము 'వీమెన్ సెలబ్రేటింగ్ థేస్మోఫోరియా' కూడా ఎన్నదగినది. ఈ నాటకమందలి ఎగథెన్ యను పాత్ర స్త్రీల దుస్తులను ధరించి ఇట్లనును–

> 'నేను నా ఆలోచన కనురూపముగా నున్న దుస్తులనే ధరించెదను. కవియును తన రచనల కనుగుణముగా వ్యవహరింప వలయును. ఒకవేళ అతడు స్త్రీలకు సంబంధించియున్న నాటకము నేదేని రచించుచున్నచో అతడు తన శరీరముతో కూడా దాని కనురూపముగనే వ్యవహరింప వలయును మరియు మనలోనున్న లోపమును పూరించుటకై అనుకరణము మనల వెంబండించియేయున్నది 16

పై వాక్యములందు కవి వ్యక్తిత్వము కావ్యరచనావేళ ఏ తీరున రూపొంద వలయునో తెలుప బడినది కవి తన వ్యక్తిత్వమున కనుగుణముగా పాత్రలను పోషింప వలయును లేదా తన పాత్రల కనురూపమైన వ్యక్తిత్వము నైనా రూపొందించుకొనవలయును. లేనియెడల ఆతని పాత్రలు కృత్రిమములై సామా

జికుని విశ్వాసమును చూరగొనలేవు. కావున కవి తన పాత్రలతో తాదాత్మ్యము నొందవలయును. అపుడే ఆ పాత్రలు సజీవ వంతము లగును. ఐనను పాత్ర చిత్రణమందు ఏదేని లోపము కనబడిన యెడల దానినాతడు అనుకరణముద్వారా తీర్చిదిద్ద వచ్చును. ఇట్లు అనుకరణ మనగా యథాతథముగా వ్యక్తులను, ఘట్ట ముల ననుకరించుట కానేరదని ప్రేక్షకుడు లేదా పాఠకుని మానసమునకు స్వాభా వికములై యుండునట్లు చిత్రించుట యనుభావమును అరిస్టోఫనీజ్ పై వాక్యముల ద్వారా ప్రకటించెను. సారాంశముగా అరిస్టోఫనీజ్ తన నాటకముల ద్వారా కావ్యశాస్త్రమునకు సంబంధించిన ఈ క్రింది ముఖ్యాంశములను వెల్లడించెను—

1. కావ్యవస్తువు మరియు కావ్యభాషకు కల సంబంధం అవినాభావము.
2. లోకశ్రేయస్సును చేకూర్చునదే ఉదాత్త సాహిత్యము. తద్రచయితలే మహాకవులు.
3. ఉత్తమ కథావస్తువు మరియు ఉత్కృష్ట కళ - ఈ రెండింటికి ఉదాత్త సాహి త్యము సమన్విత రూపము.
4. కావ్యప్రభావము కేవలము ఆనందాత్మకమే కాదు: ఉపదేశాత్మకముకూడా.
5. సాహిత్యమందు అనుకరణమనగా యథాతథానుకరణము కానేరదు.
6. సామాజికుని ఉత్తేజపరచు అశ్లీల కార్యకలాపములను ప్రదర్శింప రాదు.
7. కవి తన పాత్రలతో ఏకాకారము నొందవలయును. అనగా సాహిత్య వ్యక్తి త్వమును ధరింప వలయును.

. కావ్యమందు ప్రధానముగా భావింపబడునది కథావస్తువు; కవి కళాకౌశలము కాదు.

9. సాహిత్యవివేచన ద్విముఖము : సైద్ధాంతికము మరియు వ్యావహారికము.

ప్రాచీన గ్రీకు సాహిత్య మందు హోమర్ మొదలుకొని అరిస్టోఫనీజ్ వరకు సాహిత్య స్వరూప మేతీరున భావింప బడినదో తెలుపనైనది. దానికి సారాంశ మిది.

1. వాగ్దేవత కవిని ప్రేరేపించును; ఆమె అనుగ్రహమున కవి కావ్యమును రచించునని హోమర్ తెలిపెను. కవి ప్రతిభను పిండార్ రచనాత్మక శక్తిగా పేర్కొనెను. సరస్వతీ అనుగ్రహము కవి ప్రతిభను కావ్యరూపమున ప్రకాశింప జేయునను దృక్పథమును ఆయన ప్రకటించెను ప్రతిభాసంపన్నులైన వారే ఉత్తమ కవులని వారే సార్వకాలీనమైన ఉదాత్త సాహిత్యమును రచించి మహాకవులుగా రాణించగలరని ఆయన తెలిపెను.

2. అనుకరణము కావ్యరచనకు మూలము. ఆ ప్రక్రియయందు ఆనంద మిమిడి యున్నది. గత సంఘటనల వ్యక్తుల ననుకరించి కవులు కావ్యముల రచించెదరని హోమర్ ర్కొనెను పాత్రల వ్యక్తిత్వములను సర్వాంగ సుందరముగా తీర్చి దిద్దుటకై అనుకరణము ఉపకరించునని అరిస్టోఫనీజ్ తెలిపెను. కావున అనుకరణము సాహిత్య మందు పునఃసృజనాత్మక మగును అందువలన సాహిత్య వస్తువుయదార్థము కానేరక లోకాతీతమై భాసించును.

3. రచయిత తన పాత్రలతో ఏకాకారమునొందు వ్యక్తిత్వమును కలిగి యుండ వలయునని అరిస్టోఫనీజ్ తెలిపెను. అపుడే పాత్రలు సజీవ వంతములై మన యెదుట నడయాడుచున్నట్లు ప్రకాశింప గలవు. కనుక కవి విశిష్ట వ్యక్తిత్వ సంపన్నుడు.

4. కావ్యభాషకు కావ్యవస్తువుతో కల సంబంధం అవినాభావము. గద్యము సైతము శబ్దాలంకార ప్రయుక్తమై కవితవంటి ప్రభావమునే నెరవేర్చ గలదని గార్జియస్ ప్రకటించెను. ఆయన కవితను ఛందాత్మక గద్యముగా తెలిపెను.

5. సాహిత్యప్రయోజనము ఆనందమని, అది కళాచమత్కార జన్యమని హోమర్ భావించెను. అ ప్రీతిభాజనిత మని పిండార్ తెలిపెను. ఆనందమును దివ్య సందేశ సమన్వితముగా హేసియడ్ భావించెను. కావ్యానందము శబ్దశక్తి జనితమని, మనలోని శోకభయములను పారద్రోలి ఆత్మ విశ్వాసమును పెంపొందించునని గార్జియస్ తెలిపెను. సాహిత్యానందము మానవ జీవితమును సంస్కరించు నదిగా నుండవలయునని అరిస్టోఫనీజ్ ప్రకటించెను.

6. లోకశ్రేయస్సును చేకూర్చునదే ఉదాత్త సాహిత్యమని అరిస్టోఫనీజ్ ఉదాత్త కావ్యవస్తువును సమర్థించెను.

7 సామాన్యులకు సాధ్యము కానేరని సాహిత్య రచన ద్వారా అందరిని అలరింపజేయు కవితాశక్తిని కలిగి యున్నందున కవి సంస్తవ నీయుడు: ఆదరణీయుడు.

8. సాహిత్యానుశీలనము సైద్ధాంతిక, వ్యావహారికములను రెండు రూపములను కలిగి యుండునని అరిస్టోఫనీజ్ నిరూపించెను.

హోమర్ కావ్యములందు రేఖామాత్రముగ భాసించిన గ్రీకు సాహిత్యచింతన హేసియడ్, పిండార్, గార్జియస్ రచనల యందు క్రమ పరిణతినిగాంచి అరిస్టోఫనీజ్ నాటకములందు శాస్త్రీయతా రూపమును సంతరించు కొనినదని స్పష్టమగును. కాని అట్టి ఆలోచనాసరణిని సిద్ధాంత రూపమున ప్రతిపాదించి ప్రత్యేక శాస్త్రముగా రూపొందింప వలయునను తలంపు ఆనాటి గ్రీకు రచయితలకు లేదనియే చెప్ప వచ్చును. అట్టి తలంపే యున్నచో అరిస్టోఫనీజ్ కవులను, విమర్శకులను ఒకే సూత్రమందు ఇమడ్చక వేర్వేరుగా పరిశీలించెడి వాడు. కావ్యము మరియు కావ్యశాస్త్రము విభిన్నశాఖలుగా, సాహిత్య అనివార్య అంగములుగా తరువాతి కాలమున వెలసినవి. పాశ్చాత్య సాహిత్యశాస్త్రమునకు వికాస మార్గముల నేర్పరచి, శాశ్వత సాహిత్య సమస్యల పరిష్కారమునకై భావితరపు సాహిత్య విదులను ప్రేరేపించిన మహామేధావి ప్లేటో. అందువలన ఆ జగత్ప్రసిద్ధ దార్శనికుడు పాశ్చాత్య కావ్యశాస్త్రమునకు మూల పురుషుడై వెలసెను. ఆయన నిషేధాత్మక రూపమున సాహిత్య విమర్శను వెలయించి శాశ్వత సమస్యలను లేవదీసెను.

## భారతీయ దృక్పథము-Indian View.

భారతీయ కావ్యశాస్త్రమునకు అధారములు అత్యంత ప్రాచీనమైన వైదిక వాఙ్మయమందు కానవచ్చును. తనదంతరం పురాణవాఙ్మయము, రామాయణము వ్యాకరణ శాస్త్రాదులలో పుష్పించి నాట్యశాస్త్రమందు ఫలించినవి. భరత ముని నాట్యశాస్త్రమునకు పూర్వమే కృశాశ్వ, మేధావిన్ మున్నగు వారలు కావ్య

శాస్త్రమున కుపకరించు రచనల వెలయించిరని తెలియవచ్చును. అవి అనుప లబ్ధములగుటచే భరతుని నాట్యశాస్త్రమే ప్రథమ భారతీయ లాక్షణిక గ్రంథముగా ప్రసిద్ధి వహించినది. నాట్యశాస్త్రమునకు పూర్వము రేఖామాత్రమున భాసించిన కావ్యశాస్త్ర పరిశీలన భారతీయ కావ్యశాస్త్రావిర్భావదశగా తెలియదగును. ఆ దశ యందే కావ్యశాస్త్ర వికాసమునకు తోడ్పడు బీజములు ప్రాచీన భారతీయ వాఙ్మయ క్షేత్రమందు నాటబడినవి. కావ్యశాస్త్రమున కుపకరించు కావ్యప్రధానాంగములు మూడు - కవి (కర్త), కావ్యము (కర్మ) కావ్యము నెరవేర్చు ప్రయోజనము (క్రియ), కావ్యకర్త కవి, కవి కర్మ కావ్యము మరియు కావ్యక్రియాత్మక ప్రభావము-ఈ అంగత్రయ మందే కావ్యవ్యాపారము ఇమిడి యున్నది. ప్రాచీన భారతీయ వాఙ్మయ మందు కావ్యశాస్త్రము ఈ కావ్యాంగత్రయమందు ప్రతిఫలించిన తీరును సంగ్రహముగా తెలిసికొందము.

## కవి - Poet.

కవృ=వర్ణే; కవతే ఇది కవి.=చమత్కారవంతముగా వర్ణించు నతను- కు=శబ్దే, కవతే ఇతి కవిః - కై=శబ్దే, కాయతీతి కవిః - ఈ విధముగా కవి శబ్దము రమణీయశబ్ద వ్యాపార దక్షునిగా వ్యుత్పత్తి అర్థము ఏర్పడుచున్నది. వేదములోను ఉపనిషత్తులలోను కవి పదము పరమాత్మ వాచకముగా ప్రయోగింప బడినది.

ఋగ్వేదమందు కవి పదము ఈశ్వర పర్యాయముగా నుపయోగింపబడినది.

—గణానాం త్వా గణపతి (గ్) ం హవామహే కవిం కవీనాము పశ్రవస్తమమ్.

—అత్వా మంత్రాః కవి శస్తావహన్తు.

—సతో బంధ మపతి నిరవిందన్ హృతి ప్రతీష్య కవయో మనీషా.

ఉపనిషత్తులందు కూడా కవి ఈశ్వర సమునిగా కీర్తింప బడినాడు.

—కవిర్మనీషి పరిభూః స్వయంభూః

ఋషులవలె కవులు మంత్ర ద్రష్టలుగా ఆదరణీయులైయుండిరి.

—ఋషయః మంత్ర ద్రష్టారాః

వేదకాలమందు కవి సమాజమందు ఉన్నత స్థానమును వహించి యుండె నని పై వాక్యముల ద్వారా స్పష్టము.

## కావ్యము-Poetry.

కవి కర్మను ప్రకాశింప జేయుదైవిక శక్తి సరస్వతి యని ఆ వాగ్దేవతయే జ్ఞాన-విజ్ఞానములకు అధిష్ఠాత్రి యని ఆరాధింప బడినది.
నిధులను సంగ్రహపరచు యాజ్ఞికులలో నేను ప్రథమ రాజ్ఞ్నని.

—అహం సురాష్ట్రీ సగమనీ వసూనా చితిక్షీ ప్రథమా యజ్ఞయానామ్.
దేవతలకును. మానవులకును సమానముగా ప్రీతిని కల్గించు శబ్దమునునేనే స్వయముగా ఉచ్చరించెదను. నన్ను ఆరాధించిన వారిని నేను పరాక్రమ వంతులుగా, మేధావులుగా, ఋషులుగా మరియు సద్బ్రాహ్మణులుగా చేయుదును. (కావున ఉదాత్తకావ్య రచనకై కవులు వాగ్దేవత నవశ్యముగా నుపాసింప వలయును )

—అహమేవ స్వయ మిదం వదామి జుష్టం దేవీ భిస్తమానుషేభిః
తు కామయే తతుమగ్రి కృణోమి తం బ్రహ్మాణం తు మషితం సుమేధసామ్.

—వేదములందు వాగ్దేవత ఇట్లు ఆరాధింప బడినది-
వాగ్దేవతను దేవతలు సృష్టించిరి. నానారకములైన పశువు లామెను ఉచ్చరించును. ఆహ్లాదకారియగు వాగ్ధేనువు ఆహారమును శక్తిని ఇచ్చును. మాచే చక్కగా స్తుతింపబడిమమ్ముచేరుగాక!

—దేవీం వాచ మజనయంత దేవాస్తాం విశ్వరూపాః పశవో వదంతి
సానో మంద్రే షమూర్జం దుహానా ధేనుర్వాగస్మా నుపసుష్టు తైతు,

పరమార్థ ప్రాప్తికై మానవుడు సలువు జ్ఞాన-విజ్ఞాన యాత్రను తరతరాల వరకు భద్రపరచు మాధ్యమమైన భాష శబ్ద బ్రహ్మముగా ఇట్లు కీర్తింపబడినది--

'భాషను నాలుగు భాగములుగా విభజించినచో, అవి భావనాశీలుడైనకవికి అవగతములే యగును. కాని వీనిలో మూడు భాగములు గుహలో దాగి కదలికను

తీసికొని రాక యున్నవి. నాల్గవ భాగమునే మానవులీ లోకమున ఉపయోగింతురు. (కవి ఒక్కడే భాషను ఉపయోగించుటలో సమర్థుడను భావము ఇట ధ్వనించును. అట్లే కావ్యపరమార్థము రమణీయ భాషాప్రయోగమున కతీతమై యున్నదను అర్థము బోధ పడును)

—చత్వారి వాక్పరిమితా పదాని తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః
గుహా త్రీణి నిహితానేంగయంతి తురీయం వాచో మనుష్యావదంతి.

ఉపమాద్యలంకార ప్రయోగము ద్వారా కవి వాక్కు అతిలోకమోహనమై అందరిని అలరించునను కావ్య సౌందర్య తత్త్వ మిట్లు నిరూపింప బడినది.

సాలీడు తన గూటి నల్లినట్లు దేవ పత్నులు ఇంద్రియ సూక్తముల నల్లిరి.
—'అస్మై ఇదుగ్నాశ్చిద్దేవ పత్నీరింద్రియార్క మహిహత్య ఊవుః'
విద్యుత్తు యనెడి బెత్తెముతో మేఘము అనెడి అశ్వములను తోలుచు వీర రథి వలె వరుణుడు ప్రకాశించెను.

—రథీ కశయాశ్వాం అభీక్షపన్నా విర్దూ తానుకృణతే వష్యాం అహ,
శరీరము రథము: బుద్ధి సారథి; మనస్సు కళ్లెము; ఇంద్రియములు విషయ వాంఛా రూపమైన మార్గమందు పయనింప జేయు అశ్వములు; మరియు ఆత్మ శరీర రూపమైన రథమునకు యజమాని వంటిది. (ఇట ఉపమాలంకార ప్రయోగమందు కవియొక్క మనోహర కల్పనాశక్తి ప్రదర్శింప బడినది)

—'ఆత్మానం రథినం విద్ధి శరీర రథమేవతు
బుద్ధింతు సారథిం విద్ధిమనః ప్రగ్రహమేవచ
ఇంద్రియాణి హయానాహుర్విషయాన్ తేషుగోచరాన్
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః

వైదిక వాఙ్మయమందు 'ఉపమ' పదము ప్రయోగింప బడినది.

—'ఈయుషీ ణాగముపమా శాశ్వతీనామ్'
'తదప్యుమాస్తి'

## ప్రయోజనము-Functioning.

ఉపనిషత్తులందు పరమాత్మ సచ్చిదానంద స్వరూపముగా తెలుప బడినది. సత్ = సత్యము, చిత్ = శ్రేయము, ఆనందము = ఆహ్లాదకరము. పరమార్థప్రతిపాదనమును లక్షించియున్న కవి-కర్మ ఆనందదాయకముగా నుండుననునది ఇట గమనార్హము. ఆనంద ఆత్మా-ఆనందము ఆత్మ లక్షణమని కూడా నిర్దేశింప బడినది కనుక ఆనందము కావ్యమునకు ప్రయోజనముగా పరిగణింపవచ్చును. ఏట్లన పరమార్థ సిద్ధి యందు ఆనంద భావ మిమిడి యున్నది. ఆ ఆనందము రసరూపమున నుండునను ధ్వని వైదిక వాఙ్మయమందు కలదు.

'దధానః కలశే రసమ్-అని మొదట రస పదము సోమరసము అను అర్థమునందు ప్రయుక్తమైనది.

'రసోవైసః, రసగ్ం హ్యేవాయం లబ్ధ్వా ఆనందీ భవతి-అని రసపదము ఆనందమను అర్థమున వాడబడినది. కనుక భగవానుడు రస స్వరూపుడు. ఆ ఆనందము అమృత స్వరూపముగా ఇట్లు తెలుప బడినది-ఇంద్రా నిన్ను అలంకరించుచు, మహనీయము, బలసమన్వితమగు నీ స్వభావమును మనస్సుచే ప్రేరేపింప బడిన సూక్త లక్షణమగు వాక్కుతో అమృతమునకై ప్రేరేపించుచున్నాను-'ముఖస్య తేతవ విషస్య ప్రజాతి మియర్మివాచ మమృతాయ భూషన్.'

రసము పరమాత్మ స్వరూపమైన దివ్యానందము; అమృత సమము. కవి వాక్కు దివ్యానందమువైపు పురోగమింప జేయును. కనుక కావ్యప్రయోజనము దివ్యానందానుభూతియే యగును. అనగా కవి ఏ ఉద్దేశ్యముతో కావ్యరచన యందు ప్రవృత్తుడగునో అది రసరూపమైన దివ్యాంద రూపమున నెరవేరుచున్నది. భరతముని నాటకము నెరవేర్చు ప్రయోజనమును 'రసానుభూతి'యని ప్రప్రథమము సాహిత్యపరముగా సిద్ధాంత పరచెను. అందువలన కవి వాక్కు హ్లాదైకమయి యగుచున్నది.

వైదిక వాఙ్మయమున రేఖామాత్రమున భాసించిన కావ్యత్వక్పథమును పై ఉల్లేఖముల ఆధారముగా ఇట్లు క్రోడీకరింప వచ్చును.

1. కవి తత్త్వదర్శి మరియు మంత్రద్రష్ట.
2. జ్ఞాన-విజ్ఞానములకు ఆది దేవత సరస్వతి.
3. వాగ్దేవతానుగ్రహము సుకవికి ఆవశ్యకము.
4. కావ్యభాష అలంకారికమై అధిక ప్రభావ వంతముగా నుండును.
5. కావ్యప్రయోజనము దివ్యానందప్రాప్తి.

## పురాణములు-Puranas.

వైదిక యుగానంతరము భారత జన జీవనమును ప్రభావిత పరచినది పురాణ యుగము భారతీయ సంస్కృతికి పురాణములు పట్టుగొమ్మలు. వేదములు ప్రవచించిన పారమార్థిక సత్యమునకు ఐతిహాసిక రూపమును కల్పించి భారత సంస్కృతిని తీర్చి దిద్దినవి పురాణములు; అశేష భారత ప్రజానీకము సలరించి సన్మార్గము ఆచరణసాధ్యముగా నిరూపించినవి పురాణములే. అసాధ్యముగా నున్న పరమార్థ ప్రాప్తిని సుసాధ్యముగా మార్చి అధ్యాత్మిక విశ్వాసమే భారతజాతి శ్వాసయని పురాణములు నిరూపించినవి; హృదయంగమమైన మానవ వర్తన చిత్రణ ద్వారా మానవ జీవితమును దేవతల కన్న భవ్యతరముగా, ఆదర్శ వంతముగా తీర్చి దిద్దినవి. సూక్తుల రూపమున పండితుల వరకే పరిమితమై యున్న పారమార్థిక జ్ఞానమునకు వ్యావహారిక భాషారూపమును కల్పించి సత్యము సర్వజనులకు ఆచరణీయమను సార్వజనీనతను వెల్లడించినవి. మనోరమములైన పుణ్యక్షేత్ర, తీర్థ వర్ణనాదుల ద్వారా భారతావనిని పుణ్యభూమిగా సాక్షాత్కరింప జేయుటలో పురాణములు నిర్వహించిన పాత్ర ప్రశంస నీయము; మానవుని అపూర్వ కల్పనాశక్తికి ఇవినిదర్శనములు. కావున పురాణములు కపోల కల్పితములని భ్రాంతి జెందరాదు. భారతదేశ చరిత్రకును, సాహిత్య జగత్తునకు వలసినంత వస్తుసామగ్రిని సమకూర్చినవి పురాణములు. ఇట్టి పురాణముల రచన ప్రపంచ మందెచటను జరుగ లేదు. అందువలన వైదిక వాఙ్మయము తరువాత పురాణవాఙ్మయము ప్రాశస్త్ర్యమును వహించినది. పురాణములు భారతీయ కావ్య శాస్త్రమున కుపకరించు అంశములను కలిగియున్నవి. కావ్య లక్షణ నిరూపణమునకు తోడ్పడిన ప్రధాన అంశములను పురాణ వాఙ్మయమందు ఇట్లు గుర్తింపవచ్చును.

కావ్యము-

1. ప్రసిద్ధ కథావస్తువును కలిగి యుండును.
2. ఉదాత్త చరితము చిత్రితమై యుండును.
3. వర్ణనా ప్రాధాన్యతను కలిగి యుండును.
4. కవి కల్పనాశక్తిచే శోభితమై యుండును.
5. కావ్యభాష సామాన్య భాషకన్న భిన్నమై అతిశయోక్తి భరితమై యుండును
6. కవి భావనా వ్యాపారమును ప్రధానముగా కలిగియుండును.
7. సత్యమును ఉపదేశాత్మకముగా, ఆచరణీయ యోగ్యముగా నిరూపించును.
8. సామాజికునకు ఇంద్రియాతీతమైన అలౌకికానందానుభూతిని కలిగించును.

వైదిక, పురాణ వాఙ్మయములందు కవి మహోన్నత వ్యక్తిత్వము కీర్తింప బడినది; కవి కల్పనా వైభవము ప్రశంసింప బడినది : ఉపమ, అతిశయోక్త్యాది అలంకార ప్రయోగము వలన భాష అత్యంత ఆకర్షణీయమై శోభిల్లు నని నిరూపింప బడినది : ఉదాత్త కావ్యరచనకై కవికి వాగ్దేవతానుగ్రహ ఆవశ్యకత సమర్థింప బడినది. పరమాత్మ ప్రాప్తి ఆనంద దాయక మని, అట్టి అలౌకికానందము కవి వాక్కు ద్వారా సిద్ధించునని కావ్యమహాత్మ్యము కొనియాడబడినది. కావ్యము సచ్చిదానంద రూపముగా ప్రతిపాదింప బడినది. ఋగ్వేద ఋషులకు రస, ధ్వని సిద్ధాంతములు, ఆలంకారిక వాదములు క్రొత్తవి కావు. తర్వాతి కాలమున వచ్చిన సాహిత్యశాస్త్రములోని వాదములనేకములు వైదిక వాఙ్మయమున సూచింపబడి యున్నవి. 17.

## రామాయణము-the Ramayana.

సర్వలక్షణోపేతమైన ప్రథమ కావ్యము మర్యాదా పురుషోత్తముడైన శ్రీరామచంద్రుని దివ్యగాథా రూపమున వాల్మీకి మహర్షిచే రచింప బడినది. అంతకుపూర్వము మహాభారతము రచింప బడినను పండితులు ఆ గ్రంథమును మహేతిహాస రూపముననే గ్రహించిరి కాని కావ్యరూపమున కాదు. అందువలన వాల్మీకి ఆది కవిగా ప్రసిద్ధిగాంచెను. ఆ మహర్షి రచిత రామాయణమే ప్రథమ గీర్వాణ కావ్యావతారము. రామాయణ రచనా కాలము క్రీ.పూ. 500 గా భావింప బడినది. మాధుర్య గుణోపేతమై, విచిత్ర పదములతోను, విచిత్రార్థ పదముల

తోను అందరి హృదయములకు అహ్లాదమును కల్గించు కావ్యముగా రామాయణము చిర ప్రసిద్ధము. శృంగార, హాస్య, కరుణ, వీరాది రసములతో యుక్తమైనదిగా, భావి కవులకు ఆదర్శప్రాయముగా తరతరాలకు దివ్యసందేశము నీయగలుగు మహాకావ్యముగా వాల్మీకి రామాయణము చిరప్రతిష్ఠ నందుకొన్నది రామాయణము భావితరమునకు కావ్యశాస్త్ర రచన యందు ఏ విధముగా ఉపకరించినదో పరిశీలింతము.

రామాయణ రచనకై వాల్మీకిని ప్రేరేపించిన క్రౌంచ ద్వంద్వ వియోగ సంఘటన చిరప్రసిద్ధము. శోకాకుల మానసుడై ఆ మహర్షి నిషాదుని శపించిన శాపమే శ్లోకముగా అవతరించి కావ్యరచనకు నాంది పలికింది. ఆ శ్లోకము రఘువంశము, ఉత్తర రామచరితము, ధ్వన్యాలోకము లందు ఉదాహృతమైనది.

'మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః
యత్ క్రౌంచ మిథునాదేక మవధీ కామమోహితమ్.

—ఓ నిషాదుడా। కామమోహితమైన క్రౌంచ జంటకు శాశ్వత వియోగమును కల్పించిన నీకు ప్రతిష్ఠ కలుగకుండు గాక.

తన వాక్కుకు తానే ఆశ్చర్యపడి వాల్మీకి ఆ సంఘటనను పునః స్మరించుకొనెను: ఇట్లు నిశ్చయించుకొనెను.

'పాదబద్ధోఽక్షర సమ తంత్రీలయ సమన్వితః
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా,

—నాలుగు పాదములతో, సమాన సంఖ్య గల అక్షరములతో, లయ సమన్వితమై శోకార్త హృదయము నుండి వెలువడినది, శ్లోకము (కవిత) కన్న భిన్నము కానేరదు.

వాల్మీకి శోకానుభూతి నుండి అవతరించినది అనుష్టుప్‌ఛంద శ్లోకము. ఉపనిషత్తులందు అనుష్టుప్ ఛంద ప్రయోగము కలదు. కాని లౌకిక సంస్కృత మందు వ్యవహృత మగు సమాక్షర యుక్తమైన అనుష్టుప్ ఛందము మొదటి సారిగా తీవ్ర భావావేగ ప్రభావమున వాల్మీకిచే అవిష్కృతమైంది. అకస్మాత్తుగా వాల్మీకి ముఖమునుండి వెలువడిన కళ్యాణప్రదమైన రమణీయ వాక్కును విని స్వయముగా

బ్రహ్మ వాల్మీకి యెదుట ప్రత్యక్ష మయ్యెను. దివ్యమైన రామాయణమును రచింపుమని బ్రహ్మ వాల్మీకికి అలౌకిక దృష్టిని ప్రసాదించెను. తరువాత వాల్మీకి నారదుని ఆదర్శగుణ సంపన్నమైన దైవచరితమును గురించి తెలుపుమని అడిగెను. అనుపమ గుణ సంపన్నుడైన నరుని చరితమును గానము చేయుమని నారదుడు సలహా నొసంగెను-తైర్యుక్తః శ్రూయతాం నరః. అపుడు మనోరమ ములగు ఉదార వృత్తములతోను, ఉదార శబ్దార్థములతోను రాముని చరితమును వాల్మీకి హృదయంగమముగా గానము చేసెను. శిష్యులు రామాయణ గానమును విని విస్మితులైరి, ఆనంద పరవశులై శోకానుభూతియే లౌకిక అనుష్టుప్ఛంద రూపమున అవతరించిన దను రహస్యమును గ్రహించిరి.

'సమాక్షరైశ్చతుర్భిర్యః పాదైర్గీతో మహర్షిణా
సోఽను వ్యాహరణాద్భూయః శోకః శ్లోకత్వమాగతః,

రామాయణ బాలకాండమందు వాల్మీకి రసములను గురించి తెలిపెను. కాని పండితులు వానిని ప్రక్షిప్తములుగా పరిగణించిరి. ఆయన రసములను గురించి ఇట్లు తెలిపెను-

'పాఠ్యేగేయేచ మధురం చ ప్రమాణై స్త్రిభిరాన్వితమ్
జాతిభిః సప్తభిర్యుక్తం, తంత్రీలయ సమన్వితమ్
రసైశ్శృంగార, కరుణ, హాస్య, రౌద్ర, భయానకైః
వీరాది భీరసైర్యుక్తం కావ్యమేతత్ గాయతామ్,

ఆది కావ్యమైన రామాయణ అనుశీలనము ద్వారా కావ్యశాస్త్ర రచనకు ఉప కరించు అంశములనీ విధముగా మనము గ్రహింప గలము.

1. వాల్మీకి తత్త్వజ్ఞాన సంపన్నుడైన మహర్షి. ఆ మహర్షి ఉదాత్తమైన శ్రీ రాముని చరితమును కావ్యరూపమున వర్ణించుట వలన ఆది కవిగా ప్రసిద్ధుడు. వాల్మీకి తత్త్వదర్శి కాక యున్నచో రామాయణ కావ్యము అవతరించెడిది కాదు.

2. రామాయణ రచనకు పూర్వము వాల్మీకి కాంచిన దృశ్యమిట్లున్నది. మనోహరమైన ప్రకృతి వాతావరణము; హాయిగా ఆకసమందు తిరుగాడు చున్న క్రౌంచ జంట. ఆ రమణీయ దృశ్యముతో వాల్మీకి సంతుష్టాంత రంగుడయ్యెను. మరుక్షణమున ఆ ఆనందమయ వాతావరణము శోక గ్రస్తమయ్యెను—. వ్యాధుడు వాడి బాణముతో క్రౌంచిని నేల కూల్చుట; రక్తసిక్తమైన క్రౌంచి చుట్టు తిరుగుచు క్రౌంచము శోకించుట; క్షణములో ఆనందము విషాదమగుట యేమి? తత్త్వదర్శియైన వాల్మీకి హృదయము వికలమై శోకానుభూతికి లోనగుట. మానసిక ప్రతిక్రియచే పరిభావితమై శోకానుభూతి భావావేగ రూపమున వ్యాధుని కిరాత కృత్యమును గర్హించుచు వ్యక్తమగుట. శోకానుభూతిచే ప్రేరితమై వ్యక్తమైన వాల్మీకి తీవ్రభావావేగమే భాషా మాధ్యమమున శ్లోకముగా అవతరించుట. అకస్మాత్తుగా తన నుండి వెలువడిన వాక్కుకు వాల్మీకి స్వయముగా చకితుడగుట. శోకాకుల మానసము నుండి వెలువడిన నా శోకమే శ్లోకముగా మారెనని ఆ మహర్షి నిశ్చయించుకొనుట. కావున వాల్మీకి కరుణాత్మకమైన క్రౌంచ ద్వంద్వ వియోగ సన్నివేశమును చూచి యుండనిచో అతని నుండి కవిత వెలువడి యుండెడిది కాదని గ్రహింప గలము. కవి నుండి వెలువడు కవితకు వెనుక ఏదోయొక ప్రబల కారణము ఉండి తీరును. ఆ కారణమే అతనిని కావ్యరచనకై ప్రేరేపించును. అదియే కావ్యప్రేరణ; అది హృదయమును కదలించు వేయు మార్మిక సంఘటనకు ఆశ్రితమై యుండునని వాల్మీకి కవిత ఋజువు పరచును. ఆ హృదయ విదారక సంఘటనను స్వీయముగా తానే అనుభవించినట్లు వాల్మీకి భావించు కొనెను. ఆ మానసిక దశయందు వాల్మీకి వ్యక్తిగత రాగ, ద్వేషాదుల నుండి విముక్తుడై సార్వజనీనలోకమున సత్యము నన్వేషించెను. ఆ దివ్యావేశమందు వెలువడిన వాక్కు హృదయము నలరించు కవిత రూపమున అవతరించినది. వాల్మీకివలె సుకవియు మార్మిక ఘటనచే ప్రేరితుడై నపుడే ఆహ్లాదకరమైన కవితను వెలయించును. కనుక కవికి కావ్యరచనకై కావ్య ప్రేరణ ఆవశ్యకమై యుండును.

3. బ్రహ్మ వాల్మీకికి దివ్య దృష్టిని ప్రసాదించెను; దివ్యచరితమును రచింపుమనెను. తద్వారా వాల్మీకి పరమార్థమును దర్శించెను. దానిని మానవ

జీవితమున కన్వయింపు మని నారదుడు సలహా నిచ్చెను పరమసత్యమును మానవ జీవితమునకు అన్వయించుటలోనే వాల్మీకి దివ్యభావనా శక్తియిమిడి యున్నది. అది దైవానుగ్రహమున వాల్మీకికి సిద్ధించినది. ఆ భావనా శక్తియే కవులకు ప్రధానమైనది. తద్వారా అతడు రవికాంచని చోటును దర్శించి తాను కనుగొన్న వస్తు సత్యమును మనోహర రూపమున శ్రోతల ముందు సాక్షాత్కరింప జేయును. ఐనను కవి ప్రదర్శన శ్రోతకు గగన కుసుమమ్ము కారాదు. అందువలన నారదుడు సత్యమును ఆచరణీయ ముగా మానవజీవనోచితముగా తీర్చి దిద్దుమని వాల్మీకికి చెప్పెను. కనుక కవి భావానాశక్తితో పాటు వివేకశక్తిని కూడా కలిగి యుండ వలయును. అన్యథా అతని కావ్యము కేవలము కల్పిత గాథగా మిగిలి పోవునేకాని మానవ హృదయము నలరించ జాలదు. భావనాశక్తి మరియు వివేకశక్తి - ఈ రెండింటి సమాహారమే కవి శక్తి, కవికి ఇట్టి కవితాశక్తి దైవానుగ్రహమున సిద్ధించును. అదియే దైవదత్తమైన ప్రతిభ.

4. అందరి హృదయముల నాహ్లాదపరచు అనుష్టుప్ ఛందమును వాల్మీకి ఆవిష్క రించెను. వాల్మీకి శ్లోకము భాషాసౌందర్య శక్తికి నిదర్శనము. సామాన్య వాక్కు కన్న భిన్నమై రమణీయముగా నున్నది వాల్మీకి శ్లోకము. వాల్మీకి లౌకిక సంస్కృతమునందే రామాయణమును రచించెను. ఐనను రామాయణ భాష లౌకికభాషకన్న రమ్యాతిరమ్యమై అందరిని ఆకట్టు కొన్నది. బ్రహ్మాది దేవతలు సంతసించిరి వాల్మీకి భాషకిట్టిఅద్భుత శక్తిని సిద్ధింప జేసెను. దానికి కారణము ఆయన కావ్యమందు ఉపయోగించిన గంభీర ధ్వనియుక్త పదములు; ఉపమాద్యలంకారములు. తద్వారా భాష మాధుర్యగుణోపేతమై అలౌకికార్థమును స్ఫురింప జేయుశక్తిని సంతరించు కొనెను. ఇట్లు కావ్యమందు ప్రయుక్తమగు భాష ఆలంకారికమై సామాన్య భాషకన్న భిన్నమగును. అందువలన కవి భాష రాగాత్మకమై అందరిని పరవశింప జేయును. భాష కిట్టి ఆకర్షణశక్తి కవి తన కావ్యమందు ఉప యోగించు ఛందము ఆధారముగా కూడా చేకూరును. ఏ సందర్భమునకు ఏ ఛందము ఉపయుక్తముగానుండునో అట్టి ఛందమును ఉపయోగించుట లోనే కవికళాకౌశలము ఇమిడియున్నది. అట్లే సందర్భమునకు తగినట్టిపద

ములను, అలంకారాదులను ప్రయోగింప వలయును. వాల్మీకి సందర్భోచితమైన పద, ఛంద, అలంకారాదుల ప్రయోగముచే భాషకు అద్వితీయమైన ఆకర్షణశక్తిని సమకూర్చెను. మనోరమములైన ఉపమ, ఉత్ప్రేక్షలకు రామాయణము విశాలమైన భవ్య ప్రాసాదము. కావున కవి భాషాప్రయోగమందు దక్షుడై యుండ వలయును.

5 రామాయణము అద్భుత వర్ణనలకు నిలయమై వివిధ కాండము లందు విభక్తమై యున్నది. సీతారాముల చరిత్ర చిత్రణమందు వాల్మీకి ప్రదర్శించిన మౌలిక ప్రతిభా వైశిష్ట్యము తరువాతి కవులకు ఆదర్శమై వెలసింది. ప్రసంగానుకూలముగా రామాయణమందు అనేక వర్ణనములకు స్థానము కల్పించి వాల్మీకి అద్భుత వర్ణనాశక్తిని ప్రదర్శించెను. వివిధ రూపముల భాసించు ప్రకృతి రమణీయ దృశ్యములతో పాటు ప్రకృతి భీకర రూపముసైతము రామాయణమందు వర్ణితము. మంజుల మనోహర వాతావరణముతో శోభాయ మానములై సాత్వికానందమును వెలార్చు ఋష్యాశ్రమములను వాల్మీకి హృదయంగమములుగా వర్ణించెను రామ-రావణ సంగ్రామమును దేవ-దానవ యుద్ధముగా వాల్మీకి వర్ణించెను. గృహస్థ ధర్మము, రాజనీతి రాజ్య పరిపాలన, పరమార్థ సాధన మున్నగువాని వర్ణనములందు వాల్మీకి సహృదయుల హృదయములను చూరగొనెననుటలో అతిశయోక్తి లేదు. మానవ చరితను దివ్య చరితముగా వర్ణించిన మొదటి కవి వాల్మీకి. కావున కవి కావ్యము ఉచిత వర్ణనాయుక్తమై యుండ వలయును. ప్రసంగానుకూలములైన కవి వర్ణనలు మానవ హృదయమును రమింపజేయును. కావ్యము వివిధ భాగములందు విభజింపబడి కథాసూత్రమునకు అన్వితమై యుండును.

6. వాల్మీకి రామాయణగాథను శిష్యులకు వినిపించెను. వారు తన్మయులై రామాయణమును గానము చేసిరి: పరమానందమును బడసిరి; పరమార్థమును గ్రహించిరి. ధర్మ సంస్థాపనార్థము రాముడు రాక్షసులతో సలిపిన పోరాటమునందలి అంతరార్థమును గ్రహించి వారు ఉదాత్తమైన అనుభూతిని పొందిరి. జగత్తునందు వ్యాపించియున్న మాయాజాలమును ఛేదించి పరమాత్మయందు ఐక్యము నొందుటయే మానవ లక్ష్యమను భావము వారిలో జాగృతమయ్యెను. దీనికి మించిన వేరొక సత్యము లేదు; రామచరితమునకు మించిన ఉదారవృత్తము మరి

యొకటిలేదు. మానవుడు లోక కళ్యాణమునకు పాటుబడిన నాడు మాధవునిగా రాణించ గలడు; దివ్యపథము నందుకోగలడు. రామాయణ రచన ద్వారా వాల్మీకి తరతరాలకు చెరగి పోని ఈ దివ్య సందేశమును లోకమందు చాటెను. కావున కావ్యము లోకశ్రేయోపాదకమైన దివ్య సందేశ భరితమై యుండవలయును.

7 రసోవైసః- భగవానుడు రస స్వరూపుడు. ఆ సచ్చితానంద స్వరూపము లోకమందు వివిధ రూపముల ప్రకాశమానమై యున్నది. ఆ రూపారాధనద్వారా మానవులు అద్వితీయమైన ఆనందమును, సంతృప్తిని బడయుచున్నారు. కావ్యము రస సమయము. రసము నానా రూపముల కావ్యమందు నెలకొని యున్నది. కావ్య పఠనము ద్వారా సామాజికుడు అలౌకిక సమమైన ఆనందానుభూతిని పొందు చున్నాడు. రసములెన్ని యున్నను కావ్యమందు ప్రధానముగా నుండునది ఒకటే రసము. ప్రసంగ విశేషమును బట్టి ఇతర రసములకు కావ్యమందు స్థానము కల్పింప బడును. ఐనను సామాజికుడు ఆ స్వాదించునది కావ్యనిహిత ప్రధాన రసము. కావ్య మందలి ప్రధాన రసము కవి అనుభవ విశేషమునకు ఆధారితమై యుండును. వాల్మీకి తీవ్రమైన శోకానుభవమే రామాయణముగ పరిణమించింది. భూగర్భ మందు సీతామాత అంతర్ధానము నొందుటతో రామాయణ గాథ ముగిసింది. ఇట్లు ఆద్యంతములందు శోకానుభూతియే రామాయణమందు కానవచ్చును. అందువలన రామాయణము శోకానుభూతి ద్వారా పరిణతినొందిన కరుణ రస ప్రధాన కావ్య మగుచున్నది. ఈ విషయము మానవ యథార్థ జీవనమునకు భిన్నముగా లేదు. మానవ జననము సశోకము: అంతము కూడా సశోకమే. అందువలన ఆనంద వర్ధనుడు రామాయణమును కరుణ రస ప్రధాన కావ్యముగా ఇట్లు తెలిపెను. 'శ్రీరామాయణమున 'శోకము శ్లోకత్వమంద గలిగె నని యాదికవి యగు వాల్మీకి కరుణ రసము నా సూత్రించెను. సీతాదేవి తోడి వియోగమును శ్రీరామచంద్రునకు పునస్సమాగమ రహిత మగు నట్లే తన మహా కావ్యమును నిర్మించి పై కరుణ రసమునే నిర్వహించెను.18. సీతా వియోగమున ఆక్రోశించు రాముని దీనావస్థను కాంచి శిలలు ద్రవించెను; వజ్రహృదయముసైత ము విదీర్ణమయ్యెనని భవభూతి రామాయణ మందు కరుణ రసమునే సమర్థించెను. అపి గ్రావా రోదిత్యపి దలతి వజ్రస్య హృదయమ్- కావున భారతీయ ప్రథమ కావ్యము కరుణ రస ప్రధానము. లోకశాంతి స్థాపనకు, మానవ జీవన సంస్క

రణకు కరుణయున కున్నంత శక్తి వేరొక రసమునకు లేదని చెప్ప వచ్చును. అందువలన కరుణమే ప్రకృతి రసము. మిగిలిన శృంగార, హాస్యాదులన్ని వికృత రసములు.

ఆది కావ్యమైన వాల్మీకి రామాయణమందు కానవచ్చు పైన వివరింపబడిన కావ్యశాస్త్ర విషయములను పారిభాషిక పదావళియందు ఇట్లు క్రోడీకరింపవచ్చును

1. కవి తత్త్వదర్శియైన ఋషి
2. కవి లౌకికమైన మార్మిక సంఘటన నుండి కావ్య రచనాప్రేరణను గ్రహించును
3. కవి దైవ దత్తమైన ప్రతిభను కలిగియుండును.
4. కవి కావ్యభాషా ప్రయోగమందు నిష్ణాతుడై యుండ వలయును.
5. కావ్యమందు ఉదాత్త చరితము వర్ణితమై యుండును.
6. కావ్యము లోకశ్రేయస్సును చేకూర్చు దివ్యసందేశ భరితమైయుండును.
7. కావ్యమందు ప్రధాన రసము ఒకటి యుండును. అది కరుణరసమైనచో లోకశ్రేయోపాదక మగును.
8. కావ్యరచన ద్వారా స్వయముగా కవి మరియు పఠనము ద్వారా సహృదయుడు- ఇరువురును అలౌకిక సమమైన రసానందము ననుభవింతురు. కనుక కవి రసస్రష్ట మరియు రస భోక్త

## వైయాకరణులు-Grammarians.

వ్యాకరణ శాస్త్రము, వాల్మీకి రామాయణము వలె భారతీయ కావ్యశాస్త్ర వికాసమునకు అధికముగా తోడ్పడినది. వాక్ శుద్ధిని పరీక్షించు ఈ శాస్త్రము కావ్యశాస్త్రమునకు స్వాభావిక అంగమగుచున్నది. కావ్యము స్వయముగా భాషా రూపమై యున్నందున భాషను సంస్కరించు వ్యాకరణ శాస్త్రము భారతీయ కావ్య శాస్త్రమును ఉన్నత శిఖర మందుఅధివసింప జేసినదనుటలో అతిశయోక్తి లేదు. భారతీయ కావ్యసంప్రదాయములలో ప్రధానమైన ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతమునకు వైయాకరణుల స్ఫోట వాదమే ఆకరము. ధ్వని సిద్ధాంతమునకు మూలమైన శబ్దశక్తి వ్యాకరణ శాస్త్ర సంబంధితము. కనుక కావ్యశాస్త్రము మొదట వ్యాకరణ శాస్త్రముతో ముడివడి యున్నదని గ్రహింప వచ్చును. ఆనందవరనుడు

వైయాకరణులనే మొదటి విద్వాంసులుగా పేర్కొనెను-ప్రథమే విద్వాంసాః-

యాస్కుడు నిరుక్తమందు తనకన్న పూర్వీకుడైన గార్గ్యమునియొక్క ఉపమాలంకార నిర్వచనము నిట్లుదహరించెను–అర్థాత్ ఉపమా యత్ తత్ తత్సదృశ్యమితి గార్గ్యః. అంతేకాక యాస్కుడు ఉపమాభేదముల కొన్నింటిని నిరూపించెను.

'యథావాతో యథావనం తథా సముద్ర సజతి-కర్మోపమ'
'లుప్తోపమ న్యార్థోపమా నీత్యా చక్షతే–లుప్తోమ.

పాణిని అష్టాధ్యయీ యందు ఈ క్రింది సూత్రములను అలంకారికులు తమ పారిభాషిక పదములను ప్రయోగించు అర్థమునందే రచించెను.

'ఉపమానాని సామాన్య వచనైః'
'ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్య ప్రయోగే.
'తుల్యార్థై రతులోపమాభ్యాం తృతీయాన్యతర స్యామ్.

పతంజలి మహాభాష్యము వ్యాకరణమునకు సమగ్రవ్యాఖ్యానము. వాక్కును అలకంరించు విధానమునందు మహాభాష్యము అత్యధికముగా తోడ్పడినది.

తత్త్వశాస్త్రము సైతము కావ్యశాస్త్ర వికాసమునకు తోడ్పడినదని చెప్ప వచ్చును. అభిధ, లక్షణ, వ్యంజన మున్నగు శబ్దశక్తులు మొదట తత్త్వశాస్త్రమునకు సంబంధించినవి. నైయాయికులు అభిధాశక్తిని వ్యక్తి, జాతి, గుణములను బోధించునదిగా నిర్ధారించిరి. వారు శబ్దార్థములను గౌణము, భవ్యము, లాక్షణికము, ఔపచారికము లని నాలుగు తరగతులుగా విభజించిరి. ఆ శబ్దములే భారతీయ కావ్యశాస్త్రమందు స్థిరములై వెలసినవి.

'నిఘంటుకారులు కవి శబ్దమును పండిత పర్యాయములలో చేర్చివాడినారు. విద్వాన్ విపశ్చిద్దోషజ్ఞస్స న్సుధీః కోవిదో బుధః ధీరో మనీషిజ్ఞః ప్రాజ్ఞః సంఖ్యావాన్ పండితః కవిః .. (అమర). రాగద్వేషాది విరహితుడును, సత్వసంపన్నుడు నగువాడు ఋషి. తత్త్వదర్శనము చేసిన వాడతడు. కవియు సర్వవిధముల ఋషులను బోలును. విశుద్ధమైన మనోముకురమున లోకాతీత పదార్థ దర్శన మాతనికి కలుగును. శబ్దబ్రహ్మ సాక్షాత్కారమును పొందినపుణ్యుడు.19.

కావ్యశాస్త్రాధారములు కొన్ని శిలా శాసనములందు కానవచ్చును. రుద్రదమనుని శిలాశాసనమందు అలంకారిక భాష ఉపయోగింప బడుటయే కాక కొన్ని అలంకార సూత్రములు సైతము నిర్దేశింప బడినవి. హరిషేణుడు సముద్రగుప్తుని 'ప్రతిష్ఠిత కవి రాజు'గా కీర్తించి అలంకారిక భాషావైభవమును నిరూపించెను.

వేద, పురాణ, నిరుక్తాదులందు కావ్యశాస్త్రము బీజరూపమున ప్రస్తావింప బడినది. ఆదికావ్యమైన రామాయణమందు కావ్యశాస్త్ర పురోగమన దశ సూచింపబడినది. కావున భారతీయ కావ్యశాస్త్రా విర్భావము భరతుని నాట్యశాస్త్రమునకు సుస్థిరమైన నాందిగా నిలిచినదని ఉపర్యుక్త వివరణ ద్వారా స్పష్టము.

## సింహావలోకము-A Review.

భారతీయ-పాశ్చాత్య కావ్యశాస్త్ర ప్రారంభిక దశలు వివరింపబడినవి. ఈ రెండింటి యందు కానవచ్చు సామ్య-భేదములను పరిశీలింతము.

రెండు దేశములందు కవి తత్త్వ వేత్తగా, దివ్య ప్రతిభా సంపన్నునిగా, అపర సృష్టికర్తగా కీర్తింప బడినాడు. వాగ్దేవతానుగ్రహము కవికి ఆవశ్యకముగా నిర్ణయింప బడినది. ప్రతిభతో పాటు కళాకౌశలము సమర్థింప బడినది. కవి కర్మకు పరిణామియైన కావ్యము లోక కళ్యాణ కారకముగా, ఆనంద దాయకముగా ప్రశంసింప బడినది. సైద్ధాంతిక దృష్టితో ఉభయ దేశములందు కానవచ్చు కావ్యదృక్పథములందు సామ్యత కలదు కాని వ్యావహారిక దృష్టితో ఇది కానరాదు.

కావ్యము సామాజికునిపై నెరపు ప్రభావమునకు మరియు నెరవేర్చు ప్రయోజనమునకు సంబంధించినది వ్యావహారిక కావ్య దృక్పథము. అనగా కావ్యము సామాజికునే తీరున ప్రభావిత పరచి ఏ తరగతికి చెందిన ఆనందానుభూతి కాతనిని లోనుకాజేయుచున్నది? కావ్య ప్రభావము మానవ జీవితమున కెంతవరకు ఉపయోగ వంత మగుచున్నది? కావ్యము ద్వారా లోకశ్రేయస్సు ఏ తీరున సమకూరును? మున్నగు ప్రశ్నలకు సమాధానముగా వెలసిన విమర్శయే వ్యావహారిక కావ్యదృక్పథము (Practical Poetic view.)గా పరిగణింప బడును సైద్ధాంతిక, వ్యావహారిక కావ్యదృక్పథముల సమ్మేళనమే సమగ్ర కావ్యశాస్త్రము.

పాశ్చాత్య దేశములందు వ్యావహారిక కావ్యదృక్పథము ప్రాచీనకాలమందే ప్రారంభమైనదిగా తెలియ వచ్చును. సమగ్ర గ్రీకుజాతి చరిత్రకు ప్రతీకములుగా ఆదికవియైన హోమర్ ఇలియడ్, ఒడిస్సే-యను రెండు మహా కావ్యములను రచించెను. ఇలియడ్ నందు ట్రాయ్ పతనము మరియు ఒడిస్సేయందు ఒడిస్సే సాహసయాత్ర అత్యద్భుతముగా వర్ణతములు. ఈ రెండు కావ్యముల రచన యందు హోమర్ మౌలిక ప్రతిభను, అద్భుత కళాకౌశమును ప్రదర్శించెను. అవి ఆబాలగోపాలము నానంద పరచుచు బహుళ ప్రచారములో నున్న నాడే విమర్శకు లోనయ్యెను. అందుకు ప్రధాన కారణములు రెండు. ఒకటి దేవతలు సైతము మానవులవలె స్వార్థపరులుగా, ఈర్ష్యా గ్రస్తులుగా హోమర్ కావ్యము లందు వర్ణింప బడుట. రెండు ట్రాయ్‌నగర విధ్వంసకు కారకురాలైన హెలెన్ ను గ్రీకు నాగరికులు పట్టపు రాణిగా పునః సమ్మానించుట. మొదటి కారణము దార్శనికుల మతమునకు విరోధము. రెండవది ధార్మికుల నినాదమునకు వ్యతిరేకము. ఇట్లు మతమునకు, ధర్మమునకు విరోధమైన ట్రాయ్‌పతన గాథ దేశమున కెట్లు మేలు చేకూర్చ గలుగును? మానవ జీవితమునెట్లు సంస్కరింపగలదు? కావున హోమర్ కావ్యముల ద్వారా అనుభూతమగు ఆనందము పరమార్థ ప్రతిపాదకము కానేరక ఇంద్రియ సౌఖ్యమునకే పరిమితమై యున్నది. ఈ కావ్య వ్యతిరేక దృక్పథమే రాను రాను కావ్య బహిష్కారమునకు దారి తీసినది. కళా వాదులు కావ్యానందమును కళాజన్య ఆనందముగా, ఇంద్రియాతీతమైన అలౌకికానందముగా నిరూపింప యత్నించిరి. కాని కళావాదమున కానాడు బలము చేకూరలేదు. అందువల్లనే అరిస్టోఫనీజ్ తన హాస్యనాటకములందు వివిధ కావ్య సమస్యలను లేవనెత్తి వానిని పరిష్కరించుటకు ప్రయత్నించెను. అందు ప్రధానముగా భావింపబడునది కవి ఎన్నుకొనిన కథావస్తువు యగునా? లేదా కవి ప్రదర్శించిన కళాకౌశమా? అరిస్టోఫనీజ్ కథావస్తువు వైపే మొగ్గు చూపెను. అనుకరణ శీలుడైన కవి పరమార్థాభివ్యంజక కథావస్తు నిర్మాణమునందు దక్షుడు కానేరడను వాదము సైపము నాడే ప్రచారములో నుండెను. ఈ దృక్పథమే క్రమముగా వివిధ వాదములకు దారి తీసి ప్లేటో కావ్య అభిశంసకు నాంది పలికినది.

భారత దేశమందు ప్రాచీన కాలమున వ్యావహారిక కావ్య దృక్పథము కాన రాదు. ఇలియడ్‌ను రామాయణము కొన్ని సందర్భములందు పోలియున్నది.

సీతాపహరణ ఘట్టము మరియు లంకాదహనముతో పాటు రావణ సంహారము ప్రధానముగా పోలియున్నవని చెప్పవచ్చును. రామ-రావణ సంగ్రామమందు దేవతలు సైతము భాగస్వాములై యుండిరే కాని ఈర్ష్యాగ్రస్తులుగా చిత్రింప బడలేదు. వారు లోక కళ్యాణమును కాంక్షించియే యుద్ధమందు సహకరించిరి. కాని హోమర్ కావ్యము లందలి దేవతల యందిట్టి లోకకళ్యాణ దృష్టి కానరాదు. రావణ వధానంతరము సీతకు అగ్నిపరీక్ష నియమింప బడెను. అందు కృతార్థురాలైతన శీలమును ఋజువుపరచుకొన్న తరువాతనే సీత పట్టపు రాణిగా పౌరులచే సమ్మానింప బడెను. కాని ఇలియడ్ నందు హెలెన్ కిట్టి శీలపరీక్ష జరుగ లేదు. ఐనను పౌరులు హెలెన్‌ను తిరిగి పట్టమహిషిగా స్వీకరించిరి. కారణమీ విధముగా ఇలియడ్ నందు తెలుప బడినది. ట్రోజనులు మరియు ఎకినియనులు హెలెన్ కొరకు భీకర సంగ్రామమునకైనా వెనుదీయక సహించిరనుటలో సందేహము లేదు. ఆమె అమరత్వమునకు సాక్షాత్తు దేవతారూపము. హెలెన్ అతిలోక మోహన రూపమునకు తన్మయ మొంది పౌరులు ఆమె అపరాధములన్నింటిని విస్మరించిరి. ఆమె వలన దేశమునకు కలిగిన అపనిందను సైతము మరచి యుండిది''20. కనుక పాశ్చాత్యులు సౌందర్యమునే పరమార్థముగా భావించిరనుటలో సందేహం లేదు. వారి దృష్టియందు శీలమంత ప్రధానముకాదు. కాని భారతీయుల దృష్టి ఇందుకు భిన్నముగా నున్నది. వారు శీలమునే ప్రధానముగా భావించి సౌందర్యమును శీలమునకు అంగముగా చేర్చిరి. ఇట్లు రామాయణము దార్శనికులకు, ధార్మికులకు, నైతిక పరులకు మరియు రాజనీతి శాస్త్ర వేత్తలకు సమ్మాననీయమైనది. రామాయణ మాహాత్మ్యము అందరికి శిరోధార్యమైంది. అందు వలన రామాయణము దేశమునకు చేకూర్చు ప్రయోజన మెట్టిది? తద్వారా అనుభూతమగు ఆనందము ఏ తరగతికి చెందినది? మున్నగు ప్రశ్నలు ప్రాచీన భారత ప్రజానీకమును కాని సాహితీ వేత్తలను కాని కలవర పరచలేదు. అట్లే కావ్యమందు వస్తు ప్రధానమగునా? లేక కళాకౌశలమా? యను సమస్య తలయెత్తలేదు. కావ్యము పరమార్థ ప్రతిపాదక మగుట వలన తద్వారా అనుభూతమగు ఆనందము ఇంద్రియాతీతమును, అలౌకికసమ మను దృక్పథమందు భారతీయాచార్యులలో భేదము కానరాదు. ఆ అలౌకికానందమే రససిద్ధాంతముగా భరతమునిచే ప్రతిపాదింపబడినది. భారతీయులు కావ్యమును వస్తుతత్త్వ, కళాతత్త్వములకు సమన్వయాత్మక రూపమున స్థిరపరచిరే కాని పాశ్చాత్యులవలే వస్తు-కళా

తత్త్వములను వేరు వేరుగా విభజించి విమర్శించలేదు. ప్రాచీన కాలమందు భారతీయ పాశ్చాత్య ఆచార్యులు స్పష్టముగా కనబరచిన విభిన్న కావ్య దృక్పథములే క్రమక్రమముగా భారతీయ-పాశ్చత్య కావ్యశాస్త్రములను విభిన్న దిశల యందు వికసింప చేసినవి.

## అధోజ్ఞాపికలు-Foot Notes.

1. Bid hither the divine minstral, Demodocus, for the God hathe given ministresly to him as to none other, to make men glad in what way soever his spirit him to sing-Odessay, VIII, 43-45.

2. Then the henchman drew near, leading with him the beloved minstral whom the Muse loved dearly and she gave him both good and evil, of his sight she reft him, but granted him sweet song. Ibid-62-64.

3. W.H.D. Rose-Odessay (Trans) p. 91.

4. For ministrels from all men on earth get their mead of honour and worship, inasmuch as the Muse teacheth them the paths of song, and loveth the tribes of mistrels. Ibid-479-481.

5. And behind the plough the earth went back and looked like ploughed ground, though it was made of gold, that was a very miracle of his craft.

6. Calling to the mind the men and women of the past they sing a hymn and charm the tribes of men. They know how to imitate the speech (Mimesis) of all and they dance. Any spectator would think himself to be singing.

7. Many feined thing like the truth, we know how to tell, yet we know how, when we are willing to tell what is truth.

8. Through inborn glory a man is mighty indeed, but he who learns from teaching is a twilight man wavering in spirit-Hamilton' Greekwary. p. 53.

9. Mighty ruler able to stop fear, remove sorrow, produce joy and increase confidence.

10. Tragedy deceives by myth and the display of various passions and whereas the tragic poet who deceives is juster than he who is not the deceived is also wiser than one who is not deceived.

11. Pray, tell me on what particular ground a poet should claim admiration. If his art is true and his counsel sound and if he brings help to the nation by making men better in some respect.

12. I put things on the stage that come from daily life and business.
I mingled reasoning with my art
And shrewdness till I fired their heart
To brood, to think things through and through,
And rule their houses better, too.

13. For just consider what style of men
he received from me, great six foot man
Heroical soulswho never would flinch from
a towns man's duties in peace or war,
Not idle loaphers nor low bafoons, or
rascally scamps such as now they are,
But men who were breathing spears and helms
and the snow white plume in its crested pride,
The frievem and the dart, and the warrior's heart
in its seven fold casing to tough bull-hyde.

14, But tales of inceptuous vide
the sacred poet should hide from view,
Nor ever exhibit and blason forth
on the public stage to the public kin,
For boys a teacher at school is found
but we the poets are teachers of men,
we are bound things honest and pure to speak.

15. Of what ills is he not the creator and causes
Consider the scandalous scenes that draws,
His bawds, and his pandars.........
And therefore our city is swarming today
with clerks and with damagogua-monkeys who play
Their jack-a-nap tricks at all times, in all places,
Deluding the people of Athens: but none
Has training enough in atheletics to run
with the torch in his hand at the races.

16. I wear clothes to go with my thoughts; a poet must adjust his ways to his compositions if he composes a play for women, his body must share their ways......
and what we have not, mimesis will hunt up for us.

17. స్వామీ శివశంకరస్వామి-కావ్యస్వరూపమ్-P. 17,

18. రామాయణే హి కరుణోరసః స్వయమాది కవినా సూచితః
'శోకః శ్లోకత్వ మాగతః, ఇత్యేయం వాదినా। నిరూఢ్యశ్చ
స ఏవం సీతాఽత్యంత వియోగ పర్యంతమేవ స్వప్రిబంధ
ము ప చరితా. —ధ్వన్యాలోకము - చతుర్థోద్యోతము.

19. చెలమచెర్ల రంగాచార్యులు-ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము.P. 53

20. రామచంద్ర తివారీ - సాహిత్య కా మూల్యాంకన్. P. 79.



# II

# ప్లేటో—Plato.

(427 - 327 B.C.)

## ప్రస్తావన-Introduction.

హోమర్ మొదలుకొని అరిస్టోఫనీజ్ వరకు వెలసిన ప్రాచీన గ్రీకు సాహిత్య చింతన యందు స్పష్టముగా కవి ప్రతిభ కీర్తింపబడినది: కావ్య మహిమ కొనియాడ బడినది. వాగ్దేవతాను గ్రహము, కావ్యశైలి, కావ్య ప్రయోజనము మున్నగు సాహిత్యాంగములను గురించి విభిన్నాభి ప్రాయములు వెలువడినను, కవి కర్మ ముక్తకంఠముగా స్తుతింప బడియే యున్నది. ఆ ఆలో చనా పరంపర తరువాతి యుగమున కావ్యశాస్త్ర రూపమున స్థిరత్వము నొంద వలసి యుండెను. కాని అట్లు జరుగ లేదు. ఆనాటి అధోగతిని చెందిన యుగ ప్రవృత్తి పురోగామియగుచున్న సాహిత్య చింతనను తిరోగామిగా మార్చి వేసింది. దేశ సంక్షోభ కారకముగా సాహిత్యమును వక్రీకరించింది పరిణామముగా సాహిత్యము దార్శనికుల నిరసనకు గురియయ్యెను. ప్లేటో సాహిత్యమును దార్శనిక దృక్పథంతో వివేచించెను. సాహిత్య నిష్ప్రయోజకతను సిద్ధాంత రూప మున ప్రతిపాదించి కావ్యశాస్త్రమునకు నాంది పలికెను. ఇట్లు పాశ్చాత్య కావ్య శాస్త్రము కావ్య దూషణతో, కవి బహిష్కారముతో ప్రారంభమగుట విచిత్ర సంఘటన.

పాశ్చాత్యదేశములకు తలమానికమైన ఏథెన్స్ నగరము అసమర్థులైన నాయకుల పాలనయందు చిన్నాభిన్నమై దిగజారిపోవుచున్న రోజులలో ప్లేటో జన్మించెను. ఆనాడు తన దివ్య సందేశముల ద్వారా ప్రజలలో నవచైతన్యమును కల్గించుచున్న సోక్రటీస్‌కు ప్లేటో శిష్యుడై గణితమును, దర్శనమును కూలంకషంగా అభ్యసించెను. సోక్రటీస్‌చే ప్లేటో ప్రభావితుడై తన సాహిత్య కృతులను అగ్నికి ఆహుతి కావించెనందురు. సోక్రిటీస్ మరణ శిక్షతో ప్లేటో హృదయము వికలమయ్యెను. తన గురువును బలిగొన్న ఆనాటి కుటిల రాజనీతిని గర్హించి ఆయన ఏథెన్స్‌ను పరిత్యజించెను; రమారమి పదునొకండు సంవత్సరములు విదేశ పర్యటన యందు గడపెను. ఆసియామైనరు మొదలుగాని ఇటలీ వరకు కల సుప్రసిద్ధ క్షేత్రములను సందర్శించి ఆయన అపారజ్ఞానమునార్జించెను. స్వదేశమునకు తిరిగి వచ్చి సోక్రటీస్ కలలను ఫలింపజేయుటకై ఆదర్శ గురుకుల విద్యాపీఠమును స్థాపించెను. ఆ విద్యాపీఠమందు అరిస్టాటిల్ విద్యార్థిగా చేరెను.

ప్లేటో బహుముఖ ప్రతిభా శాలి. ప్లేటో వంటి మహామేధావి మరియొకరు ఈ ప్రపంచమున జన్మించ లేదని మెకాలే కీర్తించెను. ఆయన గొప్ప తాత్త్వికుడే కాదు; ఆది గద్య రచయిత కూడా. ఆతని రచనలలో ప్రధానములైనవి దరిపబ్లిక్, దలాస్, ద స్టేట్‌మన్, సింపోజియమ్, డైలాగ్స్, ఫేడ్రిస్, అయోన్ ఇవి సంవాదాత్మకములు. సోక్రటీస్ విభిన్న వ్యక్తులతో విభిన్న సమస్యలను చర్చించి జ్ఞానోపదేశము చేయుట ఇందలి విషయము.

ఏథెన్స్ పూర్వ వైభవము నుద్ధరించుటకై ప్లేటో సర్వశాస్త్రములను సంస్కరించెను. ధర్మరాజ్య సంస్థాపనను లక్షించి యున్న ఆతని సంస్కరణలు సార్వకాలీన సత్యములుగా పరిగణింప బడినవి; పాశ్చాత్య సభ్యతకు, సంస్కృతికి మూలకందములైనవి. ఆయన ప్రదర్శించిన ఆదర్శ దార్శనిక దృక్పథము భావితరము వారికి మార్గదర్శక మయ్యెను. ఆయన తన కాలం వరకు ప్రసిద్ధములైయున్న ప్రముఖ సాహిత్య కృతులను, వానినిగురించిన అభిప్రాయములను క్షుణ్ణంగా పరిశీలించెను. సాహిత్యము జీవితము నేతీరున ప్రభావితము జేయును? జీవితమును సంస్కరింప జాలని సాహిత్యమును ప్రజలు, నాయకులు ఏ తీరున పరిగణింపవలెను? జీవితమును సంస్కరించి దేశశ్రేయస్సును చేకూర్చు సాహిత్య

స్వరూప మేతీరున నుండ వలయును? మున్నగు ప్రశ్నలపై ప్లేటో గంభీరముగ ఆలోచించెను. ఏ ప్రభావమునకు లొంగక తన నిర్ణయములను బాహాటముగ సిద్ధాంత రూపమున ప్రకటించెను. దాని పరిణామమే సాహిత్య నిషేధాత్మ ముగా ప్రారంభమైన పాశ్చాత్య సాహిత్యశాస్త్ర తొలి రూపము.

ప్లేటో ప్రత్యేకంగా కావ్యశాస్త్రమును రచింప లేదు. అయోన్ మరియ రిపబ్లిక్ X నందు ఆయన తన సాహిత్య చింతనను అత్యంత నిశితముగా వ్యక్త పరచెను; సార్వకాలీన సాహిత్య సిద్ధాంతములను ప్రతిపాదించెను. ఆ సిద్ధాంతమ లాతని దర్శనిక చింతనతో ముడివడి యున్నది. కావున అతని దార్శనిక దృక్ప మెట్టిదో గ్రహించిన కాని ఆ కావ్యసిద్ధాంతములను సరిగా గ్రహింప జాలము.

## దర్శనము-Philosophy.

విశ్వరహస్య పరిశోధనా పరిణామమే దర్శనము. సత్యాన్వేషణము దా లక్ష్యము. నేనెవరిని? ఇటకేల వచ్చితిని? మరియు నా గమ్యస్థానమేమి? యన చింతన మానవ మేధస్సును కలవరపరచిన నాడే దర్శన ముదయించింది. ప్రకృ యందు సంభవించు అనూహ్య పరిస్థితులు మానవుని సత్యసందర్శనమునకై ప్రేరేపించినవి. అనాది కాలము నుండి అనవరతముగా సాగుచున్న మానవు ఈ సత్యాన్వేషణ రెండు దిశల వికసించింది. ఈ విశ్వమునకు రహస్యాత్మ మైన శక్తి కలదను విశ్వాసము ఒక దిశన వికసింప, ఆ శక్తి మనము నివసించ ఈ జగత్తునందే యిమిడి యున్నదను భావన మరొక దిశయందు వికాసమానమైం మొదటి తెగకు చెందిన దర్శన శాస్త్రములు అతిభౌతికము (Metaphysics) గ పరిగణింపబడ, రెండవ తెగకు చెందిన ప్రకృతి శాస్త్రములు భౌతికము (Phy sics)గా ప్రచారమునకు వచ్చినవి. ఈ రెండింటి మార్గములు వేరైనను లక్ష్యమ మాత్ర మొకటే అదియే సత్యము. జగత్ప్రసిద్ధుడైన ప్లేటో మొదటి తెగక చెందిన దార్శనికుడు. ఆయన అదర్శవాద ప్రవర్తకుడు. ఈ జగత్తునక మూలము అధ్యాత్మిక శక్తియని విశ్వసించిన మేధావి అతడు. అతని దర్శనమ ననుసరించి ఈ జగత్తు మిధ్య. అధ్యాత్మిక జగత్తు సత్యము; అనశ్వరము.

ఆంగ్లసాహిత్యమందు శేక్స్పియర్‌కు కలస్థానమే పాశ్చాత్య దర్శనమందు ప్లేటోకు కలదు. ఆయన సమగ్ర విశ్వమును రెండుగా విభజించెను. 1. అధ్యాత్మిక జగత్తు–The world of Ideas. 2. భౌతిక జగత్తు – The world of matter or Nature. మన కనులకు గోచరించుచు జీవనయాత్రకు ఆధారముగా నిలిచియున్న ఈ జగత్తు భౌతికము. ఇది శాశ్వతము కాదు. ఈ జగత్తు నందలి ప్రాణులన్నియు శాశ్వతములు కానేరక నశ్వరము లగుచున్నవి. ఈ జగత్తు సత్యమైనచో ఇది యున్నట్లే యుండెడిది; ప్రాణులన్నియు తమ దేహములతో శాశ్వత రూపమున నుండెడివి. కాని అట్లు జరుగుట లేదు. ప్రాణులన్నియు నశించును; ప్రకృతి యందలి పదార్థము లన్నియు మారు రూపము నొందు చున్నవి. అట్లే మనము నిత్యజీవనమున అనుభవించు రాగ-ద్వేషములు, సుఖ దుఃఖాదులన్ని మనలో స్థిరముగా నుండ జాలకున్నవి; మరుక్షణమున అవి మాయ మగు చున్నవి. సారాంశముగా ఈ భౌతిక జగత్తు శాశ్వతము కాదు; నశ్వరము.

మరి ఈ జగత్తునకు మూలమేమి? అనగా శాశ్వతమైన సత్యమేది? ఈ చిక్కు సమస్యను మహా మేధావియైన ప్లేటో ఇట్లు విడదీసెను. ఈ జగత్తుకు మూలము ఆధ్యాత్మిక జగత్తు; అదియే శాశ్వత జగత్తు; అదియే సత్యము, ఆ సత్యలోకమునుండియే అసత్యమైన ఈ భౌతిక జగత్తు ప్రభవించింది. దానికిది అనురూపము (Copy). దాని కనుసన్నల ఇది మెలంగు చున్నది. కావున ఈ జగత్తునందు సంభవించు ప్రతి సంఘటన ఆ సత్యలోకమందు కలిగెడి పరివర్తనలకు పరిణామము. అందువలన ఈ జగత్తు నందలి వస్తుజాలము ననుభవించియు మనము దీనినే పరమ సత్యముగా నమ్మ జాలకున్నాము. దీనికి అతీతముగా ఏదో యొకటి కలదని భావిస్తున్నాము. అదియే మన గమ్యస్థానము కావచ్చునని అనుకుంటున్నాము. ఆ స్థానమును పోల్చుకొనుచున్నాము ఐనను మనము భౌతికమైన ఇంద్రియ సౌఖ్య ప్రీతిని వదల కున్నాము. ఈ ఇంద్రియముల ప్రభావము అత్యంత అమోఘము. కారణమేమన ఇంద్రియములే మనకు సుఖ-దుఃఖాదులను కల్గించు చున్నవి; భౌతిక సుఖముపై ఆసక్తిని పెంచుచున్నవి. తనివి తీర మనము ఈ ప్రకృతి సంపదను కొల్లగొట్టి సౌఖ్యమునందు తేలియాడ వలయునను కుంటాము, కాని అది సాధ్యము కానేరకున్నది. తుదకు చేయునది లేక ఇంద్రియములు తమ పటుత్వమును కోల్పోవు చున్నవి. ఆ దశ యందు మన ఆత్మ మన

లను సత్యలోకమువైపు ప్రేరేపించును. అట్టి భావనయే ఇంద్రియాతీతము: సత్యలోకోన్ముఖము. ఆ భావనచే ప్రేరితులమై సత్యలోకమును పోల్చుకొనుచున్నాము. ఆ దశయందు మనకు ఈ భౌతిక జగత్తు నిస్సారముగా తోచును. అదియే వైరాగ్యము. ఆస్థితియందు మనకు జ్ఞానోదయము కలుగును. ఈ సృష్టికి మూలము సత్యలోకమను విశ్వాసము దృఢ మగును. తద్వారా సిద్ధించునది సత్య లోక ప్రాప్తి. అదియే మన గమ్యస్థానము; మోక్ష మదియే.

మరి ఆ సత్యలోక రూపమేమి? దాని స్వభావమేమి? ఈ ప్రశ్నలకు ప్లేటో సమాధాన మిది. ఆ సత్యలోక స్వరూప, స్వభావాదులను గ్రహింప వలయు నన్న మనము నివసించు ఈ జగత్తును పరీక్షింప వలయును. ఇందు సంభవించు ప్రతి సంఘటన సత్యలోకముతో ముడివడి యున్నదని తలంచ వలయును ఆ సంఘటనలను, సన్నివేశములను పరీక్షించిన కొలది మనకు సత్యలోక స్వరూప స్వభావాదులు స్ఫురించును. కారణమేమన ఈ జగత్తు ఆ జగత్తునకు అనుకృతమై యున్నందున సత్యమును దీప్తమొనర్చు చున్నది. ఈ భ్రమనుండి విముక్తులమైన నాడు మనకు సత్య సందర్శనము కలుగును. కనుక మన జీవనమునకు ఆధారముగా నున్న ఈ ప్రకృతి ద్వారా మాత్రమే మనకు స్వర్లోక భావన కలుగుచున్నది. ఇంద్రియ ప్రాబల్యమునకు లోనైన నాడు మన కట్టి సత్య భావన కలుగ నేరదు. కావున మనము ఇంద్రియాతీతులయ్యె ఆ పరమభావన వైపు పురోగాములము కావలయును. తద్వారా మనకు లబ్ధమగునదే సత్యము. అదియే మన ఆదర్శము ఆ ఆదర్శలోక స్థాపనను మనము స్థాపింపవలసి యున్నది. అది జరిగిన నాడు దివిజలోకము భువికి దిగి వచ్చును. సర్వం సత్యమై మనల రాగ-ద్వేష, సుఖదుఃఖాదులనుండి విముక్తుల కావించును. అంతే కాదు ఈ జగత్తు సైతము నిత్య పరివర్తనముల ద్వారా తన స్వర్లోక పయనమునే సూచించు చున్నది.

భౌతిక జగత్తు సత్యమైన ఆధ్యాత్మిక జగత్తు నాశ్రయించి యున్నట్లు మానవ జీవితం సైతము సత్యమైన శక్తి నాశ్రయించి యున్నది. అదియే ఆత్మ: సత్యమైన జీవనము అదియే. అనైతిక కార్యకలాపము లందనురక్తమై, సత్యలోకమును విస్మరించుచు ఇంద్రియాధీనమైన జీవనమును ఆత్మ శాసించుచున్నది. భౌతిక సౌఖ్యమునకై ప్రాకులాడుట పశుతుల్యమని మనల హెచ్చరించు చున్నది; మనల ఆధ్యాత్మికలోకము వైపు పురోగమింప జేయుచున్నది; ఆదర్శలోక స్థాపనకై ప్రేరేపించు చున్నది. కావున సత్యమైన ఆత్మయే సత్యలోకమును దర్శింప

గలదు. అది జ్ఞానమునకు మూలము. ప్లేటో ఆత్మను మూడు విధములుగా తెలిపెను–

1. విశ్వాత్మ–World soul–ఇది అధ్యాత్మిక శక్తి సమన్వితము
2. గ్రహాంతరాత్మ–Plar etary soul–ఇది విశ్వాత్మసందర్శనమందు తోడ్పడున్నది.
3. మానవాత్మ–Human soul–ఇంద్రియములచే ఆవరింపబడి యున్నది.

## మానవాత్మ–Human soul.

మానవాత్మ మూడు ప్రవృత్తులను కలిగి యున్నదని ప్లేటో తెలిపెను. అవి–

1. స్వయంచాలకము–స్వీయశక్తిచే తనకు తాను చలించుచు దేహమును చలింప జేయుట. ఈ చలనమే మానవ ప్రవర్తనమునకు పరిణామము.

2. వాసనాయుక్తము – వివిధ భావములకు నిలయమై వాని సంస్కారములను వాసనా రూపమున స్థిరపరచు కొనును.

3. ద్వంద్వాత్మకము–సుఖ-దుఃఖాదులకు ధర్మాధర్మములకు నిలయమై ద్వంద్వాత్మక రూపమున నుండును·

మానవాత్మను ప్లేటో ఉదాత్తము, అనుదాత్తము లని రెండుగా తెలిపెను. ఉదాత్తమైన ఆత్మయే అనుదాత్త పరిధి నతిక్రమంచి విశ్వాత్మ సందర్శనమున కాయత్తమగును. ఈ ప్రయత్నమందు ఆత్మ ఇంద్రియాతీతమై జ్ఞాన ప్రాప్తికై ప్రాకులాడును. ఈ జ్ఞాన సిద్ధికి ఆయన మూడు సోపానముల నేర్పరచెను.

1. భావము – Opinion—ఈ జగత్తునందు తాను పొందిన అనుభవమును జోడించి స్వీయాభిప్రాయము నేర్పరచు కొనుటయే భావము. ఇదియే క్రమముగా విశ్వాస మందు పరిణత మగును.

2. ఇంద్రియోపలబ్ధి–Sense preception–విశ్వాసము ఇంద్రియములను ప్రేరేపించును. తదనుభూతి బుద్ధికి కలుగును. బుద్ధి హేతువాద పూర్వకంగా ఉచితానుచితములను నిర్ణయించి భావమును పరిష్కరించును.

3 అధ్యాత్మిక జ్ఞానము–Ideal knowledge – ఇదియే జ్ఞాన ప్రాప్తియందలి అంతిమ సోపానము. ఈ దశయందు పరిష్కృత భావము జ్ఞానముగా రూపొందును. ఆ జ్ఞానమే సార్వకాలీన సత్యము. ఈ సత్యమును గ్రహించుటయే అధ్యాత్మిక జ్ఞానము. ఇదియే మానవ జన్మకు అంతిమ లక్ష్యము. ఇది సిద్ధించి నపుడు భూలోక, స్వర్లోక భేదము ఉండనేరదు.

జ్ఞాన ప్రాప్తికి నిర్ణయింప బడిన సోపాన త్రియ మందు సంస్మరణ (Recollection) అనుస్యూతమై యున్నది. ఈ సంస్మరణ భావములను, వస్తువులను పోల్చుకొనుచు చరమ లక్ష్యసిద్ధికి తోడ్పడును. ఇట్లు ప్లేటో దర్శనము ననుసరించి జ్ఞానప్రాప్తి ప్రక్రియ ఈ తీరున జరుగును.

భావ ప్రేరణ ⟶ ఇంద్రియోపలబ్ధి ⟶ జ్ఞాన ప్రాప్తి = సత్య సందర్శనము

ప్లేటో దర్శనము సంగ్రహముగా తెలుపనైనది. ఇట ఒక సందేహం రాక తప్పదు. ఆయన తెలిపిన సత్యలోక మెట నున్నది? ఈ జగత్తుకుపైన విశ్వాంతరాళ మందున్నదా? దానికి సమాధానము అతని దర్శనమందే యిమిడి యున్నది. ఈ జగత్తునకు మూలమైన సత్యలోకము ఇట్లుండి యుండునని భావించుటలో, సంస్మరించుటలోనే యున్నది. అనగా అది మానవుని భావప్రత్యయ మందే కలదు. ఆ స్వర్లోకమునకు గుణ, రూపములు లేవు. కావున సత్యము ఒక భావ ప్రత్యయము–Idea-ఆ భావప్రత్యయ సందర్శనార్థము మానవుడు చేయు యత్నమంతయు జ్ఞాన సాధన యగుచున్నది ఆ సాధనయే దర్శన శాస్త్రముగా రూపొందును. ప్లేటో దర్శనము భావప్రత్యయము నాశ్రయించి యున్నందున అతని దార్శనిక దృక్పథము ఆదర్శవాదముగా ప్రసిద్ధినొందెను–Ideal + ism = Ideailsm ఆదర్శ వాదము. కావున ఆయన ఆదర్శవాది. ఆయన ప్రతిపాదించిన పరమ తత్త్వము నకు నామ, రూప గుణములు లేవు.

## సౌందర్య దృక్పథము-His veiw of Beauty.

ప్లేటో సాహిత్య–కళలను వివేచించెను; సార్వకాలీన సమస్యలను లేవదీసెను. కళా సౌందర్యమును గురించిన అతని దృక్పథ మెట్టిదో తెలిసికొను అవ

శ్యకత ఇట కలదు. ఏలన సౌందర్యము, ప్రేమ ఇవి రెండును సాహిత్య-కళలకు శాశ్వత ధర్మములు. వీటిని సాహిత్య-కళల నుండి వేరు చేయ లేము. అట్లయిన నాడు సాహిత్యము లేదు; కళ యుండదు. ప్లేటో ప్రధానముగా దార్శనికు డగుట వలన సౌందర్యమును, ప్రేమను ఆదర్శరాజ్య సంస్థాపనకు అంగములుగా నిర్ణ యించెను. అనగా అవి అధ్యాత్మిక జ్ఞాన ప్రాప్తియందు సహకరించునవిగా నున్న పుడు మాత్రమే వానికి అస్తిత్వము కలదు. అపుడు మాత్రమే విషయము సౌంద ర్యవంతంగా భాసిల్ల గలదు: ప్రేమాభిరామ మగును. సౌందర్యము మ రి యు ప్రేమకు సంబంధించిన అనుభూతి సంస్మరణ యందే యిమిడి యున్నది. ఈ ప్రక్రియ యందు సౌందర్యాత్మకముగా తోచునదే సుందరము. ఐనను దీనికి స్వతంత్రమైన ప్రతిపత్తి యుండదు. కారణ మేమన అది అధ్యాత్మిక సత్యమునకు అంగమై జ్ఞాన సిద్ధియందు సహకరించును. ఈ దృష్టితో ప్లేటో సౌందర్య తత్త్వ మును ఇంద్రియాత్మక సౌందర్యప్రతీతి నుండి వేరు పరచెను. మరి భౌతిక ం గా మనము అనుభవించు సౌందర్యము మాట యేమి? ఇట్టి సౌందర్యము ఇంద్రియ ములకు పరిమితమై యున్నది. ఇది పరిష్కరింప బడినపుడు సౌందర్య స్థాయినం దును. శాశ్వత రూపమున విశ్వసౌందర్య సాగర మందు లీన మగును. ఇట్టి సౌందర్యము వివేకము, సంక్షేమము మున్నగు సద్గుణముల నాశ్రయించి యుం డును. ఇట్లు జ్ఞాన సిద్ధి ఆనంద దాయకమే యగునని భావింప వలయును. ప్లేటో తన అభిప్రాయము నిట్లు తెలిపెను--

> 'సమగ్రముగా అల్లబడినది, అది పేడబుట్టయైనను సౌందర్యవంతమే యగును. అసమగ్రముగా నిర్మింపబడినది, అది బంగారపు ఢాలు యైనను వికారమే యగును. శ్రవణ-చక్షు రింద్రియముల ద్వారా ప్రయోజనవంత మైన ఆహ్లాదమును కల్గించునదే సౌందర్యవంత మగును-1.

పై వక్తృవ్యము ననుసరించి ప్లేటో దృష్టియందు సౌందర్యమునగా —

i. శ్రవణ-చక్షురింద్రియముల ద్వారా ఆహ్లాదమును చేకూర్చునది.
ii. ఆహ్లాదముతో పాటు జీవితమునకు ఉపయోగవంతంగా నుండునది.
iii ఉపయోగవంతంగా నుండు ఆహ్లాద తత్త్వమే సౌందర్యము. ఉపయోగ పడనిది సౌందర్యవంతంగా తీర్చి దిద్దబడి యున్నను సుందరం

కానేరదు.

ఇక ప్రేమ. దీనికి కూడా స్వతంత్ర ప్రతిపత్తి లేదు. అంతే కాదు ఇది సౌందర్య జనితము. సౌందర్యము వలె ప్రేమ ఆహ్లాదభరితమై ఉపయోగవంతంగా నుండవలయును. ఇంద్రియానుభూతి వరకే పరిమితము కాకుండా అధ్యాత్మిక సత్య లోకము వరకు పరివ్యాప్తమై యుండవలయును. అది సుందరముగా భాసించి స్వర్లోకమువైపు మానవులను పురోగమింప జేయునదిగా నుండ వలయును. సేవా భావ సమన్వితమై యుండ వలయును. సారాంశముగా ఆధ్యాత్మిక సత్య పరమైనదే ప్రేమ.

## ఆదర్శవాదము-Idealism.

ప్లేటో దార్శనిక చింతన యొక్క ప్రభావము రాజనీతి యందు కానవచ్చును. తన గురువును బలిగొన్న ఆనాటి అరాచక పిశాచమును సమూలముగా పెల్లగించి ధర్మరాజ్యమును స్థాపింప దీక్ష వహించిన మహామనీషి ప్లేటో. దేశ సంక్షోభమునకు కారకులైన రాజుల, నాయకుల సన్మార్గులుగా తీర్చి దిద్దుటకై ఆయన ఒక అదర్శ విద్యాపీఠమును నెలకొల్పెను. విద్యార్థులను ఆదర్శపౌరులుగా మార్చుటకై అనేక పరీక్షలను ఏర్పరచెను. అందు ఉత్తముడుగా నెగ్గిన విద్యార్థియే రాజ్యాధికారమునకు అర్హుడు. ఐనను ప్లేటో అంతటితో సంతృప్తి నొందలేదు. రాజునకు గార్హస్త్యజీవనమును నిషేధించెను. ప్రజలను పాలించు రాజునకు భార్యా పుత్రాది బంధనము ఉండరాదు. ఏలన రక్తసంబంధమను పేరుతో రాజు అనేక అన్యాయాలకు ఒడికట్ట వచ్చును. ఐనను రాజుసైతము మానవ మాత్రుడగుట వలన వేశ్యలను అంతఃపుర కాంతలగా నియమించుకొన వచ్చునని ఆయన స్పష్ట పరచెను. కారణమేమన విషయ వాంఛ తీరగనే ఆతని స్వార్థము తీరిపోవును. వేరే స్వార్థలాభమునకై అరాచక కృత్యములను చేయలేడు; వాని వలన ఆతనికి చేకూరు ప్రయోజన మేమియు నుండదు. ఇట్లు ధర్మరాజ్యమునకు ధర్మప్రభువును ఆయన నియమింప దలచెను. మానవునిలో దాగియున్న దానవ ప్రవృత్తిని సంస్కరించు నైతికతను పోషింపదలచెను. దేశ శాంతి సౌభాగ్యములను పెంపొందించ నెంచెను.

ఐనను శాసన మొక్కటే ధర్మరాజ్యమును స్థాపింప నేరదు. దానికితోడుగా

మానవుని కార్య కలాపములన్ని సంస్కరింప బడవలయును. సాహిత్య-కళలు దేశ సితి గతులను మార్చుటలో ప్రధాన పాత్ర వహించును. అవి మానవుని భావములను ప్రేరేపించి కార్యోన్ముఖుల కావించును. వీనికి కల శక్తి వేరొకదానికి లేదు. అందువలన ప్లేటో సాహిత్య-కళలు దేశమున కెట్టి ప్రయోజనమును చేకూర్చలేక పోయెనని పరితాప పడెను. మానవునిలో నైతికతను పెంపొందించుటకు బదులుగా అనైతికతను తనివితీర పోషించి దేశమును అధోగతికి క్రింగ దీసినవని ఆయన ఆవేదనను వ్యక్త పరచెను. భవిష్యత్తు నందిట్టి అశుభము జరుగ కూడదని సాహిత్యమును సిద్ధాంత రూపమున శాసించెను. ఆ ప్రతిభాశాలి ప్రతిపాదించిన కావ్య సిద్ధాంతములే భావితరము వారిని సాహిత్యమును గురించి గంభీరముగా ఆలోచించుటకు ప్రేరేపించినవి. భావి కావ్యశాస్త్ర వికాసమునకు మార్గదర్శకములై వెలసినవి. అందువలన ఆయన పాశ్చాత్య కావ్యశాస్త్రమునకు ఆద్యుడయ్యెను. ఆయన ప్రత్యేకంగా కావ్యశాస్త్రమును రచింపలేదు. కావ్యశాస్త్ర రచయిత అనుసరించు విషయ క్రమమును పాటింప లేదు. ప్రసంగానుకూలముగా వివిధ రచనల యందు వ్యక్తపరచిన ఆతని సాహిత్య దృక్పథము కవి, కావ్యసత్యము, కావ్య ప్రయోజనము మరియు కావ్యశైలి యను శీర్షికలయందు వివరింప బడుచున్నది.

## అభిశంస-Censure.

వాగ్దేవతా వరప్రసాదునిగా, సర్వజన సంస్తవనీయునిగా కవిని హోమర్ అత్యున్నత స్థానమందు చేర్చెను. హేసియడ్, పిండార్ మున్నగు కవులు, నాటక కర్తలందరు కవిని దివ్య ప్రతిభావంతునిగా కొనియాడిరి. కావ్య రచనాశక్తి అనితర సాధ్యమని వారు కళాత్మక దృష్టితో కవిని కీర్తించిరి కాని కవి స్థాన నిర్ణయమందు ప్లేటో సమకాలీన యుగ పరిస్థితి కనుగుణముగా దార్శనిక దృక్పథమును వహించెను. జనులను వారి వృత్తులరీత్యా ప్లేటో ఆరు తరగతులుగా విభజించి కవిని నిమ్న స్థానమందు చేర్చెను. ఫేడ్రస్ యను గ్రంథమందు ఆయన కవి స్థానము నిట్లు నిర్ణయించెను —

'సత్యమును సమగ్రముగా దర్శించిన ఆత్మ మరు జన్మమందు దార్శనికునిగానైన, కళాకారునిగానైన లేదా సంగీత ప్రియునిగానైన అవతరించును.

సత్యమును అసమగ్రముగా దర్శించిన ఆత్మ న్యాయ పరిపాలనా దక్షుడైన లేదా నాయకునిగానైన జన్మ నొందును మూడవ తరగతికి చెందిన ఆత్మ రాజనీతిపరునిగానైన లేదా వ్యాపారిగానైనా రాణించును. నాలుగవ తరగతి ఆత్మ క్రీడాకారునిగానైన లేదా వైద్యశాస్త్ర పారంగతునిగానైనా జనించును. ఐదవ తరగతి ఆత్మ భవిష్యత్కాల వేత్తయగును. ఇక షష్ఠమ శ్రేణి ఆత్మ అనుకృత కళాకారునిగా జననము నొందును. 2.

తన దార్శనిక విశ్వాసమున కనుగుణముగా ప్లేటో ఆరు తరగతులుగా ప్రజలను విభజించెనే కాని వైజ్ఞానిక దృక్పథమును కనబరచ లేదనుట స్పష్టము. అందరిని అలరింపజేయు కవిని, కళాకారుని నిమ్నతమునిగా పరిగిణించుటలో అతని ఆశయము కళా కారుని రచన దేశ పురోగతికి ప్రతిబంధక మనుట. సాహిత్య-కళల వల్లనే దేశము అరాచకమునకు ఆలవాలమై తీవ్ర సంక్షోభమునకు గురి యగుచున్నదని అతని ప్రగాఢ విశ్వాసము. ఐనపుడు కవి కళాచాతుర్య ప్రదర్శన వలన కలుగు ప్రయోజన మేమి? కవి సంస్తవ నీయు డెట్లగును? అధ్యాత్మిక సత్యచింతన లేని కవి దేశహితైషి యనుట కల్ల. కనుక ఇట్టి అసత్యవాది దేశము నందుండుట కూడా నైతిక దృష్టితో వాంఛనీయము కాదు. కవిని దేశము నుండి బహుష్కరించుటయే మేలని ప్లేటో ఇట్లు తెలిపెను—

'ఈ తరగతికి చెందిన కథారచయితలను మరియు ఇతరులను మనము అదుపు నందుంచుకొన వలయును; మరియు కేవలము అపశబ్దములతోనే తనివి నొందక నిమ్నజాతిని ప్రభావితము చేయవలసి యున్నదని వారికి విన్నవింప వలయును వారి అనుకృతము లన్ని అవాస్తవికములని, వాని ప్రభావము భావి యోధులకు హానికరముగా పరిణమించునని కూడ స్పష్ట పరచ వలయును. హోమర్, హేసియడ్ వంటి ప్రతిభాసంపన్నులైన కవులైన నేమి? తమ రచనల ద్వారా నవయువకులను దుష్ప్రభావితుల కావింప రాదని, వారిని పెడత్రోవన పట్టించ రాదని కూడా హెచ్చరింప వలయును. ఈ కవులందరు దేవతల అవాస్తవిక రూపములను ప్రదర్శించెదరు. వారిని క్రూరులుగా, ప్రతీకార వాంఛాపరులుగా ఇంద్రియ రతులుగా చిత్రించెదరు అందువలన వారు బహిష్కరింపబడ వలయును. 3.

కవి బహిష్కరణతో ప్లేటో తనివి నొంద లేదు. కవిని ఒక వింత ప్రాణిగా చిత్రించి దేశమునుండి సాగనంప వలయునని తెలిపెను--

'కావున అసత్యప్రదర్శకుడైన ఇట్టి వ్యక్తి ఎవరేని (కవి) తనను మరియు తన కవితను మనముందు సాక్షాత్కరింప దలచెనేని మన మాతనికి నమస్కరింప వలయును; మధురమును, పవిత్రమును మరియు విచిత్రమునైన ప్రాణిగా అతని నారాధింప వలయును. ఐనను మన రాజ్యమందు అతనికి స్థానములేదని, శాసన ము అనుమతింప బోదని కూడా తెలియ జేయ వలయును. ధూప దీపములచే అలంకరించి అతనిని ఏదేని నగరమునకు సాగనంప వలయును.4.

ఆదికవియైన హోమర్ తన మహేతిహాసముల ద్వారా రాజుల, ప్రజల హృదయమును చూరగొని మహాకవిగా, అద్వితీయునిగా ప్రసిద్ధి నొందెను. కాని ప్లేటో దృష్టి యందు హోమర్‌సైతము నిందార్హుడే. ఆయన హోమర్ నిట్లు విమర్శించెను--'ఈ రచయిత లందరు నీతి నణగద్రొక్కి, అవినీతికి పట్టము గట్టెదరు; దురాచారమును తనివితీర పోషించెదరు. హోమర్ మహాకావ్యములు, హేసియడ్ కథా కావ్యములు, పిండార్ గేయములు, ఎస్కాయిలీజ్, సోఫోక్లీజ్ మరియు యురిపిడీజ్ నాటకములు దేశమున కెట్టి ప్రయోజనమును చేకూర్చ లేక పోయినవి. మనము హోమర్ నిట్లు అడుగ వలసి యున్నది. మిత్రమా! సార్వజనీన జీవనమందు ఉత్కృష్టముగా లేక నికృష్టముగా పరిగణింపబడుటకు కారణముగా వ్యక్తియందలి ఏ ప్రవృత్తి మూలమై యుండునో దని వివేచిన మందు నీవు దక్షడవై యున్నావా? అట్లయినచో నీ రచనల ద్వారా లాభాన్వితమైన దేశమేది?... నీవొక ఉదాత్తవిధాయకుని వని, నీ వలన దేశమునకు మేలు చేకూరెనని, ఎవరేని తెలుప గలరా?....ఒకవేళ హోమర్ అనుకర్త కానేరక, జ్ఞాతుడై మానవజాతి సంక్షేమ స్థాపన యందు సమర్థుడై యున్నచో అతని అడుగు జాడలలో నడచు శిష్య పరంపర యుండెడిది. వారలాతని సంప్రదాయమును వికసింప జేసెడి వారు: మరియు అందరి ప్రశంసలకు పాత్రులయ్యెడి వారు. 5.

## కవి ఆదర్శము-Poet's Ideality.

పైన తెలుపబడినట్లు ఫేడ్రస్ నందు ప్లేటో కవులను, నాటక కర్తలను, గేయ రచయితలను తీవ్రముగా విమర్శించెను; బహిష్కరణీయులని తెలిపెను.

ఈ దృష్టితో జగత్ప్రసిద్ధుడైన ప్లేటో పాశ్చాత్య కావ్యశాస్త్రమును కవిదూషణతో ప్రారంభించె ననుటలో సందేహం లేదు. ఐనను ఈ దృష్టినే ఆయన తన ఇతర రచనలలో కావ్యవివేచన ప్రసంగమందు పాటించలేదు. రిపబ్లిక్ నందు మహా కవులను, వారి కృతులను దేశహితైక దృష్టితో ఆదరణీయులుగా ఇట్లు తెలిపెను.

'కవులందరిలో హోమర్ అగ్రగణ్యుడని, ట్రాజెడీ రచయిత లందరిలో ఆతడే ప్రథముడని మేము అంగీకరించెదము. ఐనప్పటికిని దేవతా స్తోత్రములు మరియు మహాత్ముల యశోగానమే వస్తువుగా కలిగియున్న కవిత్వము మన రాజ్యమునకు అర్హమగునను నియమమునకు మనము కట్టుబడి యుండవలయును. ఒకవేళ నీవు ఈ నియమము నతిక్రమించి మహాకావ్యము లేక గీతములందు వర్ణితమై యున్న ఆనందప్రదాయినీదేవతనే ఆరాధించిన యెడల, నియమము మరియు సిద్ధాంతములకు బదులుగా సుఖ-దుఃఖములే మన రాజ్యము నేలగలవు. ఒకవేళ ఆ దేవత మనల నిర్దాక్షిణ్యులుగా, అనాగరకులుగా దూరినచో ఆమెతో మనము స్పష్టముగా ఇట్లు తెలుపవలయును. దర్శనమునకు మరియు సాహిత్యమునకు మధ్య కల వివాదము అనాది. 6.

'మేము ఆమె (కవిత్వ) ఆకర్షణశక్తికి, ప్రత్యేకంగా హోమర్ కావ్యములందు భాసించినపుడు, మంత్ర ముగ్ధుల మయ్యెదము. ఐనను ఈ కారణము చేతనే మనము సత్యమును పరిహరింప జాలము. 7.

'రాజ్యాంగము ద్వారా నిర్దేశింప బడిన చట్టము, న్యాయము, సౌందర్యము మరియు శివమునకు భంగము వాటిల్లు నట్లు ఏ కవియైనను కావ్యమును రచించుటకు వీలు లేదు. నిర్ణీత పరీక్షకుల మరియు న్యాయనిర్ణేతల ఆమోదము లభించనంత వరకు దానిని ప్రకటించుటకు వీలు లేదు. 8.

పై వాక్యములందు ప్లేటో కవి-శక్తిని గుర్తించెను; మనోముగ్ధుల కావించు ప్రతిభను హోమర్ వంటి కవులు మాత్రమే కలిగి యుందురని స్పష్ట పరచెను. ఈ దృష్టితో ప్లేటో సాహిత్య సౌందర్యోపాసకుడన వచ్చును. ఉదాత్త సాహిత్య ప్రశంసకునిగా పేర్కొన వచ్చును. ఐనను ఆయన కవిని దూషించెను. వాస్తవముగా ఆతని కవి నింద హోమర్ వంటి ప్రతిభా సంపన్న కవులకు వర్తింపదు.

అల్పతర రచనల ద్వారా సమాజమును దుర్గతి పాలు చేయు కుకవుల కది వర్తిం చునని భావింప వలయును. హోమర్‌నందు సైతము దోషములను లెక్కించి అవి దేశమునకు హానికారకములని తెలుపుటలో ప్లేటో ఆశయము కావ్యము సత్య, శివ సుందర రూపాత్మకముగా భాసింప వలయు ననుట. మరియు అట్టి రచనల సలుపు వారే ధర్మరాజ్యమందు ఆదరణీయులని, మిగిలిన వారందరు బహిష్కరణీయు లని అతని విస్పష్ట అభిప్రాయము.

సామాన్యులు సాధారణముగా ఇంద్రియ సుఖమునే వాంచింతురు. ఈ విషయ జ్ఞానము వెన్నతోపెట్టిన విద్య. సామాన్యుల నాకట్టుకొనుటకైవారు అల్ప తర వస్తువునే రమ్యాతి రమ్యముగా తీర్చి దిద్దెదరు. తద్వారా వారికి ఇంద్రియ జన్య ఆనందమును కల్గించెదరు, అదియే అలౌకిక ఆనందమను భ్రమను కల్పించి వారి మన్ననల వడసెదరు. ఇట్లు విశేష ప్రతిభ లేకుండనే సామాన్య కవులు అశేషప్రజానీకముచే మహాకవులుగా ఆదరింప బడెదరు. మహాకవులుగా చలామణి యయ్యెదరు తాము కల్గించు ఆనందము అనైతికతకు హేతువగు చున్నదను ధ్యా సయే సామాజికునకు కలుగకుండు నట్లుగా వారు కళాచాతుర్యమును ప్రదర్శించె దరు. వాస్తవముగా కుకవులు దేశ సంక్షోభమునకు రహదారుల నేర్పరతురు. కావున వారిని దేశమునుండి బహిష్కరించుటయే మేలని ప్లేటో తలంపు. వారే కాదు అత్యద్భుత సౌందర్య వైభవమును సృష్టించు హోమర్ వంటి మహాకవులు సైతము సామాజికుని ఆదర్శమార్గ విముఖునిగా కావించిన కథాగత సంఘటన లెన్నియో కలవు. దేవతలను సైతము వారు ఈర్ష్యా, రాగ, ద్వేష యుక్తులైన సామాన్య మానవులుగా చిత్రించి ప్రజలలో దైవ విశ్వాసమును సన్నగిల జేసినారు. అందువలన ప్లేటో హోమర్‌నుసైతం మహాకవిగా పరిగణింప లేక పోయెను. దేవ తాస్తోత్ర రచయితలను, వీరగాథా కవులను ఉత్తమ కవులుగా కొనియాడెను. కారణమేమన ఆ రచనల ద్వారా సామాజికుడు ఇంద్రియ సౌఖ్యాపేక్ష నుండి విడివడి దేశ సంక్షేమము నందనురక్తుడగును. కావున దేశకళ్యాణమును చేకూర్చు దార్శనిక దృక్పథము కల కవులే మహాకవులని, మిగిలిన వారందరు కవి నామ మాత్రులని ప్లేటో అరిస్టోఫనీజ్ అభిప్రాయంతో ఏకీభవించినట్లు తోచును. అంతే కాదు దార్శనికులకు సాధ్యము కాని అపూర్వ సౌందర్య సృష్టి కేవలము ఋషి తుల్యులైన కవులకు మాత్రమే సాధ్యమగును సత్యమును కూడా ప్లేటో హోమర్

కారుడు. తాను హోమర్ కావ్యములను గానము చేయునపుడు దివ్యావేశ సంభూతుడనై యుందునని తెలిపెను. వీరి సంవాదము ద్వారా కావ్యప్రేరణకు సంబంధించిన మూడు ప్రధానాంశములు వెల్లడి యగును.

1. కవితో పాటు వ్యాఖ్యాత కూడా దైవిక ప్రేరణచే ఆవిష్టుడై యుండును.
2 వ్యాఖ్యాత వలె సామాజికుడుసైతము దైవప్రేరణచే ఆవిష్టుడై యుండును.
3. కవి, వాఖ్యాత, సామాజికుడు వీరి మువ్వురి యందు కావ్యప్రేరణ అనుస్యూతమై యుండును.

వ్యాఖ్యాత రూపమున దైవప్రేరణచే అవిష్టుడై అయోన్ తన మానసిక స్థితిని సోక్రిటీస్‌తో ఇట్లు ప్రకటించును-

"సోక్రిటీస్। అది సంగతమే. నేను ఉన్మాదావస్థయందు హోమర్ కావ్యము నాలాపించు నపుడు నా అవస్థను నీవు కలిగి యుందువని నేను విశ్వసింపజాలను. నేనాతని కావ్యము నాలాపించునపుడు విని యున్నచో నీవిట్లు ఎన్నడును భావింపలేవని నేను ఘంటాపథముగా చెప్పగలను. 10.

అయోన్ హోమర్ కావ్యగాయకుడు. అతడు స్వయముగా దివ్యావేశముచే ఆవిష్టుడై నపుడు మాత్రమే హోమర్ కావ్యమునాలాపింప గలడు. అట్లే అతని కావ్యగానాపముల వినుశ్రోతలందరు దివ్యావేశమునకు అనుభూతు లగుదురని అయన తెలుపును. ఈ తీరున కావ్యప్రేరణ కవి నుండి వ్యాఖ్యాతకు మరి అట నుండి సామాజికుని వరకు ఎడతెగక వ్యాపించి యుండును. ఇది యంతయు దైవికము. దివ్యప్రేరితులైనపుడు మాత్రమే సామాజికులు కావ్యానందమును బడయగలరు. ఈ విషయమును సోక్రిటీస్ ఇట్లుప్రతిపాదించెను—

'నీవు ప్రదర్శించునది ప్రతిభ.... కళ కానేరదు. నేను ఇంతకు పూర్వము తెలిపినట్లు అదియొక దివ్యప్రేరణ. దివ్యమైన శక్తి యొకటి నీ హృదయమును కదలించు చున్నది. 11.

సోక్రటీస్ అయోన్‌ను ప్రశంసించి అతడు తెలిపినట్లే దివ్యానుభూతిని అతనిలో సమర్థించును. శ్రోతగా అట్టి దివ్యావేశమునే తాను అంగీకరించును.

స్ఫురణ కలుగును. ఆ దశయందాతడు వీరగాథలను, ఉత్తా సాహిత్యమును రచింప గలడు. అప్డాతడు అమృతంపు వలుకులను వ్యక్తపరచ గలడు. అతని వాణి అమరవాణియై అందరిని అలరింప గలదు. హిమ్టుద డేలియన్ అపోలోయందు నర్తకుల స్వీయజ్ఞాన విస్మృతి తెలుప బడినది. గార్జియస్ శబ్దమహిమ నుగ్గడించుచు సరస్వతీదేవి కవుల జిహ్వకు మధుర హిమ కణము నంద జేయునని తెలిపెను. ఇట్లు ప్లేటో పూర్వ సాహిత్యాచార్యులతో ఏకీభవించెను. ఐనను అతని దృష్టియందు కవి స్వతంత్రుడు కానేరడు. వాగ్దేవత కనుసన్నల మెలంగు భక్తుడు అందువలన అతని అమృతంపు పలుకులు అతని స్వీయములుకానేరవు. వాగ్దేవత నేరుగా శ్రోతలకు తన మధురవాణిని వినిపింప నేరక కవి మాధ్యమమున వ్యక్తపరచును. ఈ విషయమును సోక్రటీస్ ఇట్లు తెలిపెను-భగవానుడు తన దివ్యసందేశమును కవుల మాధ్యమమున మానవులకు అంద జేయును. కవులే సరస్వతీ దేవికి అనుగ్రహ పాత్రులు. కవులు వాగ్దేవత కనుసన్నలకు బద్ధులైనపుడు వారికి తెలియరాని దివ్యావేశము ననుభవింపక తప్పదు: అట్లే భౌతిక జ్ఞాన విస్మృతి వారికి కలుగక మానదు. ఈ విధముగా ప్లేటో దృష్టి యందు కవి దివ్యావేశుడైన దార్శనికుడు లేదా ఋషి. దివ్యోన్మాదయుక్తమైన కావ్య ప్రేరణను ప్రతిపాదించి ప్లేటో ఒక రకమున పూర్వాచార్యుల వలె కవిని ఋషి పథమున చేర్చెను; అనమాన ప్రతిభావంతునిగా కీర్తించెను.

కావ్యప్రేరణను ప్లేటో దార్శనిక దృష్టితో వివరించి కావ్యరచనకు అన్వయించెను. ఆయన తెలిపిన దివ్యోన్మాదము భక్తుని భక్త్యావేశము వంటిది; జ్ఞాన విస్మృతి సమాధి వంటిది. ఆ దశయందు యోగికి బాహ్యజగత్తుతో సంబంధం ఉండనేరదు. అట్లే ఇంద్రియ జ్ఞానము నుండి విలుప్తుడగును. అనగా భక్తుడు భౌతిక జగత్తు నుండి విడివడి సార్వజనీన సత్యలోకమున ప్రవేశించును: స్వీయ వ్యక్తిత్వముచే విరహితుడై విశ్వాత్మయందు విలీనుడగును; ఊర్ధ్వ ముఖుండగును. ఆ దశయందే భక్తుడు భగవన్నామ సంకీర్తన గానము చేయ గలడు, అట్లే కవి ఉదాత్త సాహిత్యమును రచింప గలడు. అతని కావ్యగానము భక్తుని దివ్యస్తోత్రము వలె సామాజికులను ప్రభావిత మొనర్చి వారి వ్యక్తిత్వములను సత్యమైన సన్మార్గము వైపు మరల్పగలదు. అపుడు సామాజికులు కవి వలె తమ స్వీయ భౌతిక స్పృహ

నుండి విడివడి అపారమైన ఆనందము ననుభవింప గలరు ఇట్లు ఈ దివ్యావేశము కావ్యస్రష్టకే పరిమితము కానేరక ఆ కావ్యమును గానము చేయు వ్యాఖ్యాత నుండి సామాజికుని వరకు పరివ్యాప్తమై యుండును.

కావ్యదృష్టితో ప్లేటో కవి యందు ఆశించిన దివ్యావేశము నించుక పరిశీలింతము. మన అందరివలె కవియు మానవ మాత్రుడే మనవలె అతడును ప్రకృతి యొక్క చిత్ర విచిత్రగతులకు లోనై హర్ష-శోకాదుల ననుభవించును మన అనుభవ మంత ఇంద్రియముల ద్వా ప్రేరితములైన భావములకు పరిణామము ఈ విధముగా ప్రకృతి మనలో ఇంద్రియముల ద్వారా వివిధ భావములను ఉత్తేజింప జేయును. అవి తీవ్రతరములైన కొలది వానికి మనము వశీభూతుల మయ్యెదము. ఇదియే భావావేశము, కాని ఇది సత్యజగత్తుకు అనుకృతియైన ప్రకృతికి సంబంధితమైనందున సామాన్యమైనది ప్లేటో ఆశించిన భావావేశము సామాన్యము కాదు. సత్యలోకమునకు సంబంధించినది; అసామాన్యము. కనుక కవి ఆ లోకమును సందర్శించ వలయును: అట వాగ్దేవతానుగ్రహమును పొంద వలయును. అపుడే ఆ దేవత కృప వలన అతనిలో దివ్యావేశము ప్రసరించును. తాననుభవించిన దివ్యావేశమును కవి భాషామాధ్యమమున వ్యక్తపరచినపుడు ఆ దివ్యప్రభావము గాయకుని నుండి సామాజికుని వరకు సంచరించి వారిని తన్మయుల కావించును. ఆ ప్రభావమందు సత్యము ఇమిడి యుంది; లోక సంక్షేమము ఉపదేశ రూపమున నిహితమై యున్నది. ఇట్టి దివ్యతత్త్వమును సాధించి ప్రదర్శించుటయే కవి లేదా కళాకారుని గురుతర బాధ్యత. మరి భౌతిక జగత్తునందే నివసించి యున్న మానవ మాత్రుడైన కవికి ఆ పరమ తత్త్వ సాధన సాధ్యమగునా? ప్లేటో దీని నిట్లు తెలిపెను—

> 'అనేక ప్రాణులకు ఒక సామాన్య సంజ్ఞ అనువర్తితమై యున్నపుడు దానికి అన్వయించు ఆదర్శము లేదా రూప మొకటి యుండునని మనము భావించు కొందుము' 14.

ప్లేటో ఈ విషయము నిట్లు వివరించి తెలిపెను, భగవానుడొక మంచమ్మును నిర్మించెను. దానికి అనుకృతులుగా ఈ జగత్తునందు అనేక మంచములువెలసి యున్నవి. వీని యన్నింటికి మంచము యను సంజ్ఞ తగియున్నది. కావునవీనికి

అన్వయించు ఆదర్శరూప మొకటి యున్నదని భావింపక తప్పదు. ఆ ఆదర్శ రూపమే నిత్యము, సత్యము. దాని కనుకృతములైనవి సత్యము కానేరవు. అందువలన అవి నశించును; లేదా వికృతములగును. అట్లే ఈ ప్రకృతి యందు సంభవించు పరివర్తనము లన్నింటికి మూలమైన ఆదర్శరూప మొకటి యుండియే తీరును అదియే సత్యమని అంగీకరింపక తప్పదు. ఈ భౌతిక జగత్తునందలి సంఘటనలు మనల ప్రేరేపించును. పరిణామముగా సుఖ-దుఃఖాత్మకమైన సామాన్య అనుభవమును మనము పొందెదము. అది ఇంద్రియములకు కట్టుబడి యున్నందున సత్యము కాదను వివేకమును పొందలేకున్నాము. మన అనుభవము వాస్తవికమను భ్రమకు మనము లోనగుచున్నాము. మనల మనమే వంచించు కొనుచున్నాము. ఈ ఇంద్రియోపలబ్ధి నతిక్రమించిన కాని మన భావము లన్నింటికి మూలమైన సత్యము లేదా సార్వజనీన భావన-Unive sal Idea అనుభవమునకు రానేరదు ఇట్టి సార్వజనీన భావ చింతనయే కవికి నిజమైన దివ్యావేశము. ఆ దశ యందాతడు దివ్యలోకమును సందర్శింప గలడు. అదియే కవులు భావించు వాగ్దేవతానుగ్రహము; అదియే ప్రతిభా దర్శనము. ప్లేటో కవి యందు ఆశించిన దివ్యావేశమే ఇంద్రియాతీత అవస్థ. ఆ స్థితి యందాతడు స్వ, పర భూమిక నుండి విడివడి ఊర్ధ్వ ముఖుండగును. అపుడతడు అనుకర్త కానేరక దివ్యసందేశ వాహకు డగును.

పై వివేచనాసారము సార్వజనీన భావనను గ్రహించుటయే కావ్యప్రేరణ. అది దేశసంక్షేమమును చేకూర్చునదైనందు వలన దివ్యమును దైవికమునై యుండును. అపుడు కవి ప్రతిభ దైవదత్తముగా ప్రకాశించును కాని చాలావరకు కవులు సుఖ-దుఃఖాత్మకమైన భౌతిక జగత్తు నుండి ప్రేరణ గ్రహింతురు. దాని కనుగుణముగా కవనము నల్లి దివ్యానందమను పేరుతో ఇంద్రియములకు సుఖమును కల్గింతురు, ఇట్లు వారు తమ రచనల ద్వారా మానవ నైతికతను చెరచి, దేశమును అధః పాతాళమున కూలద్రోయుచున్నారని ప్లేటో బాధపడెను. అట్టి వారు వాగ్దేవతానుగ్రహమునకు పాత్రులు కానేరక దివ్యప్రతిభా శక్తిచే కొరవడి యుందురు. ఐనను వారు రచనల ప్రచురించి సమాజమందు మహాకవులుగా కీర్తి నందవలయునని తాపత్రయ పడెదరు. అనుకరణాత్మక జ్ఞానముచే విర్రవీగి రచనలు సలుపు కుకవులను ప్లేటో ఇట్లు అధిక్షేపించెను-

'వాగ్దేవత ప్రసాదించు దివ్యావేశ స్పర్శ కూడా తన ఆత్మకు లేకున్నను ఆమె మందిర ద్వారము కడ నిలచి, తన కళాచాతుర్యముచే మందిరమున ప్రవేశింపదలచిన కవికి, ఆతని కవితకు ప్రవేశార్హత యుండ బోదని నేను స్పష్టము చేసెదను. అట్టి కవి విలుప్తుడగును; మరియు విక్షిప్తతా ప్రతి యోగిత యందు నిలిచినచో ఆతని కెట్టి స్థానమును ఉండనేరదు 15.

పై వాక్యములందు ప్లేటో కవి కళానైపుణ్యమును ప్రతిభ కన్న అల్పతరముగా తెలిపెను. కవికి దివ్యమైన ప్రతిభయే ప్రధానము. కళాకౌశలము అభ్యాస సిద్ధమైనందున సరస్వతీ మందిరమును ప్రవేశించుటకు అర్హము కానేరదు అది యునుగాక అభ్యాసము అనుకరణము ద్వారా సాధితము. కాని ప్రతిభ స్వభావ సిద్ధము. అది వాగ్దేవతానుగ్రహ ప్రసాదము, అభ్యాసకునకు దివ్యావేశను కలుగ నేరదు. అది ప్రతిభావంతుడైన కవి యొక్క సత్యాన్వేషణకు పరిణామముగా వెలయును. ఇట్లు ప్లేటో ప్రాచీనాచార్యులు తెలిపిన కావ్యప్రేరణను దార్శనిక దృక్పథముతో వివేచించెను. వారి అభిప్రాయములను సమర్థించెను. విద్యుత్తు స-యంప్రకాశమానమగుచు సర్వమును ప్రకాశిత మొనర్చునట్లు వాగ్దేవతానుగ్రహలబ్ధ ప్రతిభ స్వయం ప్రకాశమానమై వివిధ సాహిత్య ప్రక్రియలను ప్రకాశింపజేయును. కనుక కావ్యరూపమున కనుగుణమైన కావ్యప్రేరణను కవి కలిగి యుండ వలయుననునది ప్లేటో అభిప్రాయము. కాని ప్రతిభాహీనులైన కవులు ఈ మిథ్యా జగత్తు ననుకరించి ప్రేరణను పొందెదరు. ప్రకృతియే స్వయముగా మిథ్యయై యుండ ఆ ప్రకృతి దేవతయే కల్గించు ప్రేరణ దివ్యమును సత్యమును ఎట్లగును? ఇట్లు ప్రతిభాహీనులు మిథ్యాజగత్తు ననుకరించి తద్వారా ప్రేరితులై తమకు తోచినట్లు ఒకే వస్తువుకు వివిధ కావ్యరూపములను కల్పించెదరు; సామాజికులలో భ్రాంతిని సృష్టించెదరు: మరియు వారిని నీతిభ్రష్టుల కావించెదరు. అందువలన కుకవుల కావ్యప్రేరణ అసత్యమూలకమని ప్లేటో తేల్చి వైచెను. ఒక వేళ వారి ప్రేరణ సత్యమై యున్నచో వారి కావ్యములు వివిధ రూపములతో వివిధ రీతుల దేశమును క్రుంగ దీసెడివి కావు.

## కావ్యము అసత్యము-Peotry is Untruthful.

ప్రాచీన కాలమందే గ్రీసు దేశమందు సంగీతము, చిత్రలేఖనము, శిల్పము మున్నగు వాని వలె కావ్యము కూడా ఒక కళగా పరిగణింప బడెను. కళాసృజనకు మూలము అనుకరణము అను అభిప్రాయము కూడా హోమర్‌కు పూర్వమే ప్రచారములో నుండెను. 'హిమ్ టుదడేలియర్ అపోలో' నందు డేలాస్ కన్యలు గత పురుషుల, స్త్రీలను, సంఘటనలను అనుకరించి గావాలానన చేసిరని, నాట్యము సలిపిరని తెలుప బడినది. ఆ భావనయే క్రమ క్రమముగా ప్లేటో వరకు బహుళ ప్రచారమునకు వచ్చి యుండును. పరంపరాగత అభిప్రాయమును అయన సమర్థించి కావ్యమును ప్రకృతికి అనుకృతమైన కళగా తెలిపెను. కళాకారునివలె కవియును తన కావ్యరచన కావశ్యకమైన సామగ్రిని అనుకరణము ద్వారా సేకరించును: మరియు వ్యక్త పరుచును. ఇట్లు కవిత్వము ప్రకృతికి అనుకృతియగును. అనుకృతికి కర్తయైన కవి ఒక అనుకర్త యగును. కావున కావ్యరచనకు మూలముగా అనుకరణమును ప్లేటో సమర్థించెను. కాని ఈ అనుకరణ ప్రక్రియను అయన దార్శనిక దృక్పథముతో వివేచించి కావ్యము అసత్యమూలక మని సిద్ధాంత మొనర్చెను. అయన కళాకారుని అనుకరణ కార్యము నిట్లు వివరించెను—

> "మంచము మూడు రకములుగా నుండును. వాటిని నిర్మించు వారు ముగ్గురును కళాకారులే. భగవానుడు, వడ్రంగి మరియు చిత్రకారుడు. భగవానుడు మొదట తన ఇష్టానుసారమో లేక అవసరమును దృష్టియందుంచు కొనియో కేవలము ఒకటి. ఒక దానిని మాత్రమే ఈ సృష్టియందు నిర్మించెను. రెండు లేక అంతకన్న నెక్కుడు రూపముల నాతడు సృష్టింప లేదు. ఏలన రెండింటికి మూలమైన వేరొక మూల రూపము ఏదో యొకటి యుండి తీరవలయును. భగవానుడి విషయమును గుర్తించి యున్నందున వాస్తవికమైన మంచమును మాత్రమే నిర్మించి, వాస్తవిక నిర్మాతగా నుండుటయే మేలని తలంచెను. విశేష నిర్మాతగా కాదు.16.

పై వాక్యముల ద్వారా సామాన్యమైన రూపమే సత్యమని బోధపడును. అదియే ఇతర రూపములకు ఆదర్శము. కనుక భగవానుడు వాస్తవిక రూపమునే సృష్టించి సంతృప్తుడై యున్నాడు. ఈ తీరున ప్రపంచమందు కానవచ్చు రూపము

లన్నింటికి మూలముగా వాస్తవిక రూపమును భగవానుడు మొదటనే నిర్మించి యున్నాడని భావము. ఇట్లు ప్లేటో దృష్టియందు ఈ జగత్తు ఈశ్వర నిర్మిత వాస్తవిక జగత్తునకు అనుకృతి యగును. కళాకారుడు ప్రకృతి ననుకరించును. అనగా భగవానుని సృష్టికి అనుకృతమై యున్న ఈ ప్రకృతిని అనుకరించును. ఐనపుడు భగవానుడు నిర్మించుకొన్న సత్యమైన ప్రకృతి యొక్క రూపము మాటే మిటి? అది మనకు దృశ్యమానముగా నున్న ప్రకృతికి మూలముగా నిలిచి యున్నది. అది మన కనులకు అగోచరము, ఐనను అదియే సత్యమై యున్నది. కాని వాస్తవముగా కళాకారుడు అగోచరమాసమైన అసత్యప్రకృతిని అనుకరింపడు దానికి ఛాయా మాత్రమున నున్న ఈ మిథ్యాప్రకృతినే అనుకరించి కళను సృష్టించును. ఐనపుడు కళ అసత్యమూలకము కాక సత్యమూలక మెట్లగును? అది అసత్యమేకాదు; సత్యమునుండి మున్విధముల దూరీకృతమై యున్నదని ప్లేటో పై వాక్యముల ద్వారా స్పష్టపరచెను.

ప్లేటో దృష్టియందు భగవానుడు సృష్టితో పాటు అవశ్యక వస్తుసముదాయమును సైతము సృష్టించి యున్నాడు. ఆ సృష్టియంతయు సత్యలోకమునకు సంబంధితము. అందులో మంచ మొకటి. ఈ ప్రకృతి యందు నివసించు వడ్రంగి ప్రకృతినుండి సామగ్రిని సేకరించి ప్రకృతి ద్వారా భగవానుడు నిర్మించిన మంచమును అనుకరించి మరో మంచమును తయారు చేయును. అట్లే చిత్రకారుడు దాని పటమును వేసి చూపును. ఇట్లు కళాకారులందరు సృష్టికి ప్రతిరూపమైన ఈ ప్రకృతి యందే తమ తమ కళాత్మక రూపములను వెలయించెదరు కనుక వీరి కళాకృతులు ప్రకృతికి అనుకృతులే యగుచున్నవి. అనగా వీరు రచించునవి సత్యమునకు మూడవ రూపము లగుచున్నవి. అందు ఈశ్వర నిర్మితమైనదే సత్యము. కళాకృతుల రచనా విధాన మీ తీరున నున్నది.

భగవన్నిర్మితరూపము ⟶ దృశ్యమాన ప్రకృతి రూపము ⟶ కళాత్మకరూపము
సత్యస్వరూపము ⟶ సత్యమునకు ద్వితీయ రూపము ⟶ సత్యమునకు తృతీయ రూపము

కావున కళ సత్యమునకు మూడవ రూపమగుట వలన సత్యమునుండి ముమ్మార్లు దూరీకృత మగుచున్నది-Removed thrice from truth-భగవన్నిర్మి

తమైనదే సత్యము. అదియే ఆదర్శము. ప్రకృతిలో సంభవించు మార్పుచేర్పు లన్నియు ఆ ఆదర్శమునకు ననుకృతులగును. కనుక కవికర్మయైన కావ్యమును ఆదర్శముగా, సత్యముగా పరిగణించుట ఎంత వరకు సమీచీనము అన్య కళా కారులవలె కావ్య–నాటక రచయితలు కూడా ప్రకృతి ననుకరించు అనుకర్తలే యగుదురు. కనుక —

'విషాదరూపక రచయిత కూడా ఒక అనుకర్తయే యగును. అందువలన అతడు ఇతర అనుకర్తల మాదిరి నృపతి మరియు సత్యము నుండి ముప్వి ధముల దూరీకృతుడై యుండును .....అందువలన అనుకరణాత్మక సాహిత్యము దూషితము. అది హీనతకు సంలగ్నితము; మరియు హీన మైన దానినే సృష్టించును.17

పై వివేచనాను సారము అసత్యమూలకమైన కావ్యము దూషితము. అది సృష్టించు ఆనందము సైతము అసత్యమే యగును కాని ఇంద్రియాతీతమైన దివ్యా నంద మెట్లగును? కావ్యనాటకాదులు ఇట్టి అసత్య ప్రదర్శనచే మానవ సమాజ మును దుర్గతి పాలు చేయుచున్నవి. అంతేకాదు అన్యకళల కన్న కావ్యకళ హీన తరమని ప్లేటో ఈ క్రింది సంభాషణ ద్వారా నిరూపించెను.

'నా దృష్టియందు చిత్రకారుడు సైతం సత్యాభాసం నుండి భ్రష్టుడే యగు చున్నాడు. నీవే మంటావు'

'అవును నిజముగా'

'అతని సృజన మిథ్యయని నీవంటివి. నా అభిప్రాయము కూడా అదియే ఐనను ఒక విధమున చిత్రకారుడు కూడా మంచమును నిర్మించును.

'నిజమేకాని అతడు నిర్మించున? వాస్తవికమైన మంచము కానేరదు'.

'మరి వడ్రంగి సంగతేమిటి? అతడు వాస్తవికమైన, మూలమునైన మంచ మును కాక విశేషమైన దానినే నిర్మించునని నీవంటివి కదా!'

'అవును అట్లంటిని'

'అతడు వాస్తవికమైన దానిని నిర్మించ లేనపుడు దానిని పోలియున్నమరో మంచమును తయారు చేయును. ఒకవేళ ఎవరేని శిల్పిలేక వండ్రంగి తయారుచేసిన రూపమునే వాస్తవిక మన్నచో అదియును సత్యముకానేరదు.

'అపుడు మూడు రకములైన మంచములగును. మువ్వురును కళాకారు లగుదురు. అందులో ఒకటి ప్రకృతి గతమై భగవన్నిర్మితమైనది.

'అవును'

'రెండవది వడ్రింగి తయారు చేసినది'

'అవును నిజమే'

'మరియు మూడవది చిత్రకారుని ద్వారా చిత్రితమైనది'

'అవును అట్లే అంగీకరింప వలయును'

'చిత్రకారుడు, వడ్రంగి మరియు భగవానుడు-వీరి మువ్వురి పేర్లు మూడు రకములైన మంచములకు సంబంధించి యున్నవి'

'అవును'

'మరియు భగవానుడు తన ఇష్టాను సారముగనో లేక ఆవశ్యకతను దృష్టి యందుంచుకొనియో ప్రకృతి యందు ఒకదాని కంటె నెక్కుడు మంచములను లేక అంతకంటె నెక్కుడు మంచములను నిర్మించలేదు. సత్యమైన ఒకే మంచమును నిర్మించెను. ఈ విధములైన రెండు లేక అంతకంటె నెక్కుడు మంచముల నాతడు నిర్మించ లేదు. నిర్మింపలేడు కూడా'

'మరి ఒకరకమైన మంచమునకు నిర్మాతయైన వడ్రంగి విషయమున నీ యభిప్రాయము.

'అవును అదియే'

'మరి చిత్రకారుని కూడా నీవు అదేవిధంగా ఒక వస్తు నిర్మాతగా. సత్యాభాస భ్రష్టునిగా చెప్పగలవా?.

'కాదు అట్లు చెప్ప జాలను'

'అతడొకవేళ వస్తు నిర్మాత కానపుడు అతనికి మంచముతో కల సంబంధ మేమి?

'నా అభిప్రాయమందు అతడు ఇతరుల ననుకరించు వాడగును'

'మంచిది; అట్లయినపుడు ఆతనిని నీవు ప్రకృతి నుండి రెండు మారులు దూరీకృతుడైన అనుకర్తగా ఎంచెదవు.

**పై సంవాదము ద్వారా మనము గ్రహింపదగిన ప్రధానాంశము లివి..**

1. కవి లేదా లలిత కళాకారుడు యాంత్రిక కళాకారుని కన్న అల్పతరుడు.

2. అనుకర్తకు మూలవస్తువు యొక్క తత్త్వ జ్ఞానము ఉండదు.

3. అనుకరణమునకు అనుకరణ మగుట వలన కావ్యము సత్యమునుండి బహు దూరము చనుచున్నది. అందువలన అది మానవ అసత్ప్రవృత్తికి మాత్రమే ఆనంద దాయకము.

కావున మానవ సమాజమునకు ప్రయోజన వంతమైనదే కళ యని ప్లేటో అభిప్రాయము. వడ్రంగి తయారుచేయు మంచము చిత్రకారుని చిత్రముకన్న అధికతర ఉపయోగముగా నుండును. కారణ మేమన వడ్రంగి మానవున కుప యోగ పడును అతని అవశ్యకతను తీర్చును; దైనందిన జీవితమునకు సౌకర్య మును కల్గించును. అందువలన ప్లేటో దృష్టి యందు కళాశ్రేష్ఠత కళావైభవము ఆధారముగా నిర్ణయింపబడదు; అది నెవవేర్చు ప్రయోజనము ఆధారముగా నిర్ణీ తము కావలయును. అపుడే అది సౌందర్య వంతము. అందువలన ఆయన పై సంవాదమందు సౌందర్యమునుండి బహుదూరీకృతమై యున్న వడ్రంగి మంచ మునే అత్యంత ఆకర్షణీయమైన చిత్రకారుని చిత్రముకన్న, కవి కృత మనోహర వర్ణనము కన్న మిన్నగా నిర్ధారించెను ఈ ప్రసంగమందు ప్లేటో ఇట్లు స్పష్టము గా వచించెను — 'సమగ్రముగా అల్లబడినది. అది పేడ బుట్టయైనను సౌందర్య వంతమే యగును. అసమగ్రముగా తయారైనది. అది బంగారపు ఢాలుయైనను వికారమే యగును. శ్రవణ-చక్షు రింద్రియముల ద్వారా ప్రయోజన వంతమైన ఆహ్లాదమును కల్గించునదే సౌందర్యవంత మగును.

ఉపర్యుక్త వివేచనానుసారము ప్లేటో దృష్టి యందు కావ్యము అసత్యము: నిరుపయోగము: కావున దూషితము. మరి వాగ్దేవతావర ప్రసాదులైన కవుల రచనల మాటేమిటి? ఆ మహాకవులు మానవ సమాజహితమును చేకూర్చు దివ్య స్తోత్రములను, వీర గాథలను రచింతురు తద్వారా మానవ లక్ష్యమైన సత్య సం దర్శన భాగ్యము సిద్ధించును: ఆదర్శ రాజ్యము స్థాపింప బడును. కనుక ప్లేటో మతాను సారము అట్టి కావ్యములు ఆదరణీయములే యగును, సారాంశముగా ప్లేటో ఉదాత్త సాహిత్యమును విరోధించని ఆదర్శతత్త్వ వేత్త.

## కావ్యము హానికరము–Poetry is harmful.

వాగ్దేవతానుగ్రహమును ప్రేరణాస్రోతముగా కలిగియుండని కావ్యమ అసత్యమని, దూషిత మని ప్లేటో స్పష్టము చేసెను. ఆ కావ్యము దేశము అధోగతికి చేర్చి మానవ సంక్షోభమును సృష్టించు ననెను. అంతేకాదు మాన లను ఇంద్రియ దాసులుగా మార్చివేయుననెను. ఈ తరగతికి చెందిన సాహిత మంతయు అశ్లీలము: దోషభూయిష్ఠము. హోమర్ వంటి మహా కవులు ప్లేటో విమర్శకు గురి కాలేక పోలేదు. ఈ క్రింది వాక్యములందు హోమర్ కావ్యము మానవుల నెట్లు దిగజార్చినవో ప్లేటో నిరూపించెను—

'హోమర్ లేదా ఎవరేని ఒక విషాదరూపక కర్త నాయకుని శోకావస్థన అత్యంత రమ్యముగా వర్ణించి యున్నాడని నీవు భావించుకొన్నపుడు వినునపుడ ఆ విషాద నాయకుడు తన విలాపమునంతా ఏకరువు పెట్టును; శోకించుచు లేద వక్షస్థలమును బాదుకొనుచు మన యెదుట సాక్షాత్కరించును. ఆ స్థితి యం మనము ఆనంద మనుభవింతుము. అది మనలోని సానుభూతిని పెంపొందిం టకు దారి తీయును. ఆ తీవ్రావేశమందు రచయిత తన శక్తికొలది మన భావమ లను వేగవంతముగా నుద్రిక్త పరచును. కాని అట్టి విషాద స్థితియే మనకు త స్థించినపుడు దానికి వ్యతిరిక్తమైన గుణమును ప్రదర్శించుటలోనే గర్వముగా నీ గమనించి యుందువు. మనము నిర్లప్తంగా, సహనశీలురగా నుండుటయే మనక ప్రధానము. కాని ఇతరులు తమ రోదనల ద్వారా మనకు ఆనందమును కల్గి తురు. వాస్తవముగా ఆస్థితి మనకన్న వేరై నారీస్వభావోచితమగును. ఐనపు దానిని స్వయంగా అనుభవింపనేరక, వేరొక రనుభవించుచున్నారని భావించ అట్టి స్థితికే లోనైన వ్యక్తికిని అతని స్వభావమునకును అది హేయమును, ల కరము కానేరక యుండునా?18

పై వాక్యములందు ప్లేటో ఉత్తమ సాహిత్య ప్రక్రియయైన విషాద రూ కము కల్గించు ఆనందము నిస్సారమని, లజ్జాకరమని తెలిపెను, వాస్తవం నాయక వివశత అత్యంత హేయము. కారణ మేమన ఆ స్థితి అతని శక్తిహీనత ప్రదర్శించును; అలసతను ప్రకటించును. అట్టి స్థితి ననుభవించుట ధీరలక్షణ కానేరదు. మనలోని దుఃఖమును దిగమ్రింగి, సహనమును ప్రదర్శించుట లో

ధీరత మరియు ఉదాత్తత యిమిడి యున్నది. కాని హోమర్ కావ్యములందు నాయకు డట్లు చిత్రితము కాలేదు. నాయకుని బలహీనత ప్రదర్శింప బడినది. అట్టి స్థితిని భావించి మనము ఆనందించుట వాస్తవముగా మనకు లజ్జాకరము కాదా? ఇట్లు ఉత్తమ సాహిత్య ప్రక్రియగా భావింప బడిన విషాదరూపకము సైతము మనల నిర్వీర్యులుగా మార్చి ఆనందింప జేయుచున్నది. మనకు ఇంద్రియ దాసోహమ్మను నీతిని ఉపదేశించును. కావున ఇట్టి కావ్యములు దూషితములని ప్లేటో నిరూపించెను. అట్లే హాస్యరూపక నిష్ప్రయోజకత్వము నిట్లునిరూపించెను—

> 'మరియు హాస్యరూపకము కూడా ఆ తీరుననే మనపై ప్రభావం నెరపడం లేదా? అందలి పరిహాసోక్తులు నిన్ను నీవే లజ్జించు కొనుచున్నట్లుండును. నాటక రంగశాలయందైనా లేకనీవు వ్యక్తిగతంగానైనా విని యున్న యెడల అవి వాస్తవంగా నీకు అత్యంత హేయములుగానే యుండును. ఐనను నీవు వానిని విందువు. కారణమేమన విదూషకునిగా పరిగణింప బడుదునేమో నను భయముతో నీవు పీడింప బడుదువు. అట్టి స్థితినే ఇది ఉద్రేకింప జేయును మరియు చాలా మోతాదునందు రంగశాల యందు బహిరంగ పరచును. నీకు తెలియ కుండనే నీ అంతరంగమందు నిన్ను హాస్యకవిగా భావించు కొందువు. నీకు నీవే మోసగించు కొందువు.19.

ప్లేటో దృష్టి యందు హాస్యరూపకము విషాదరూపకము కన్నహీనతరము. కారణమేమన అది మనలో హీనభావములను పోషించును. ఏ ప్రవృత్తి మనలో విదూషక ప్రవృత్తిని వృద్ధిపరచునని భయపడుదుమో, అట్టి ప్రవృత్తికిది స్వతంత్రతను కల్గించును. తద్వారా మనము ఆనంద మనుభవించుచున్నామను కొందుము. కాని అది ఆనందము కాదు: అది యొక భ్రాంతి. ఆ ఆనందం మన వ్యక్తిత్వ వికాసమందు పర్యవసింప నేరదు. మీదు మిక్కిలి మన వ్యక్తిత్వమునే భ్రష్ట మొనర్చును.

విషాద-హాస్య రూపకముల వలెనే మిగిలిన సాహిత్య ప్రక్రియ లన్ని దేశహితైక దృష్టితో దూషితము లు. అవి మానవ ఉదాత్తతను వృద్ధి పరచకున్న మేలే యని భావింప వచ్చును కాని మానవ జీవితమును యథాతథముగా సాగనీయక భ్రాంతిని కల్గించు చున్నవి నైతికంగా జీవితంను కుృంగ దీయుచున్నవి. మన

లో అణగి మణగి యున్న అశ్లీల ప్రవృత్తిని పోషించి దేశమును నరక కూపమున కూల ద్రోయుచున్నవను విషయమును నాతడిట్లు ఖచ్చితంగా తేల్చి వైచెను.

'శాంతి-సౌభాగ్యాల ప్రాప్తికై వేని నియంత్రణ మనకు అవశ్యకమై యున్నదో, అట్టి ఉద్రేకములను అదుపు చేయుటకు బదులుగా, అవి (కావ్య-నాటకాదులు) వానినే ఉద్రిక్త పరచును., పరిపుష్ట పరచును; మరియు వానిని శాసించుటకు బదులుగా వానిచేతనే శాసితము లగును. 20

అంతేకాదు—

'దుష్టులు భోగ భాగ్యములతో తులదూగెదరని, వారి దుష్కార్యములు గుప్తముగా నున్నంత కాలము వారు సుఖముల నందెదరని: మరియు సజ్జనుల వర్తనము ఇతరులకు సౌఖ్యప్రదంగా నుండి వారి వ్యక్తిగత వినాశమునకె దారి తీయునని అవి (కావ్య నాటకాదులు) ప్రదర్శించును 21

పై విధముగా సాహిత్యము సామాజికునకు అందించు లాభమేమియును దనేరదని ప్లేటో అభిప్రాయము. మీదు మిక్కిలి మానవుని మంచితనమును రెంచు వేయుటలో కూడా వెనుకాడదు. దేశమునకు అపకారమునే తలపెట్టు 'హిత్యము వాస్తవంగా సాహిత్యము కానేరదని ప్లేటో తలంపు. ఆయన దృష్టి యందు ఉదాత్తమైన సాహిత్యము యొక్క కర్తవ్య మిది—

'మానవ ప్రకృతి యందలి ఉన్నతమును, ఉదాత్తమునైన వస్తు సౌందర్యము వైపు మన కనుల తెరపించుటయే కళ యొక్క ప్రథమ కర్తవ్యము. తదనంతరం తన దివ్యశక్తిచే మన ఆత్మను ప్రభావిత మొనర్చి ఆహ్లాదమును చేకూర్చు మలయ మారుతము వలె మానవజాతి యందు సార్వజనీనతను మరియు నైతికతను పోషింప వలయును. 22

'ఏ చిత్రములు సమగ్రముగా మహత్తరమలై సౌందర్యవంతము లగునో అట్టి వానిని ఆత్మ సమ్ముఖమున ప్రదర్శించుటయే కళనెరవేర్చు వాస్తవిక ప్రయోజనము. 23:

'సర్వోన్నతమైన న్యాయ స్వరూపమును ప్రకటింప జాలని ఏ ఇతరతత్త్వ మైనను ఆమోదింప బడనేరదు. 24

ప్లేటో మతమందు సాహిత్యము ప్రకృతికి అనుకృతములైన ఇతర కళల కన్న ఉదాత్తమును, ఉన్నతమును, అద్వితీయమై రాణింప వలయును., తన అలౌకిక సౌందర్య శక్తిచే మనల మనోముగ్ధుల కావింప వలయును మరియు ఆదర్శమువైపు మనల మల్లింప వలయును. అపుడే భువి దివిగా మారును; లోక శ్రేయస్సు సిద్ధించును. సారాంశముగా కావ్యము ద్వారా ప్లేటో ఆశించిన ప్రయోజన మిదియే.

## శైలీ పరిశీలన-Observations on style.

కవి భావనకు రూపమును కల్పించు కావ్యభాషాశైలిని కూడా ప్లేటో వివేచించెను ఆయన భాషను మూలతః ప్రకృతి గతమని, కాలక్రమమున సంప్రదాయానుకూలముగా అందు రూప పరివర్తన మేర్పడి యున్నదని తెలిపెను. కనుక భాష వ్యక్తిగతము కానేరదు: వ్యవహారమున కనుగుణముగా అందు పరివర్తన కలుగుట సహజము. మానవునిలో సౌమ్యత్వ, క్రూరత్వ గుణములు నెలకొని యున్నట్లే భాషయందలి వర్ణముల ధ్వనులందు కూడా అట్టి భేదమే కానవచ్చును. ఆ ధ్వను లన్నింటిని విశ్లేషించి ప్లేటో వానినన్నింటిని ముప్విధము లుగా విభజించెను అవి--. కఠోరములు, మధురములు. కోమలములు.

ప్లేటోకు పూర్వమే వక్తృత్వ కళ గ్రీసు దేశమందు తారాస్థాయి నందు కొనెను. అనాడే వక్తృత్వము గొప్ప కళగా పరిగణింప బడెను. అనాడు వక్త యగుట గొప్ప విశేషం. వక్తృత్వము యొక్క లక్ష్యము నెరుంగకయే వక్తలుగా రాణించు నాగరికులను ప్లేటో అసహ్యించు కొనెను. దేశ దుర్గతికి వక్తలు కూడా కారకులైనందున ఆయన వక్తృత్వ కళను సంస్కరించెను. విషయ జ్ఞానము లేక మాటల గారడీచే సామాన్యులను మోసగించుటయే వక్తృత్వ కళ కానేరదని ఆయన స్పష్ట పరచెను. కవి వలె వక్త కూడా కళాకారుడే యగుచున్నాడు. అతడు ఉపన్యసించు విధానమే శైలి. ఇట్లు సాహిత్యకారుని శైలితో వక్తృత్వ శైలికి సన్నిహిత సంబంధం కలదు, విషయ జ్ఞానము, ప్రసంగానుకూల పదప్రయోగము

_లికి సౌష్ఠవము చేకూర్చునని ప్లేటో తెలిపెను.

వక్తకు ఆవశ్యకమైన మూడు గుణములను ఆయన నిర్ధారించెను—

1. నైసర్గిక ప్రతిభ – Natural gift.
2. నియమ జ్ఞానము – Knawledge of the principles.
3. అభ్యాసము – Practice.

వక్తకు ప్లేటో నిర్ధారించిన పై గుణములు కవికి కావ్యరచనయందు ఆవశ్యకములుగా నుండవలయును. అన్యథా కవి సఫల కావ్యరచన సలుప జాలడు. కావ్యశాస్త్ర పదావళి యందు అవి క్రమముగా కావ్యప్రతిభ కావ్యశాస్త్ర పరిజ్ఞానము. మరియు అభ్యాసముగా కావ్యహేతువులగును. ప్లేటో 'డైలాగ్స్' నందు ప్రకటించిన వక్తృత్వ సంబంధిత అభిప్రాయము లన్నియు కావ్యశైలికి అన్వయించును. ఆయన వక్తృత్వమును కావ్యశైలి కన్న మిన్నగా భావించెను. కారణమే మన వక్త తన ప్రభావమును శ్రోతపై శీఘ్రముగా నెరప గలడు. కాని కవికి అట్టి అవకాశము లేదు ఆయన వక్తృత్వకళను గురించి తెలిపిన ప్రధాన అంశము లివి—

'వక్తృత్వ కళకు సంబంధించిన విచారణ న్యాయాలయములకు, రాజకీయమునకు మాత్రమే పరిమితముకాదు. అది స్పష్టంగా అన్నింటికి సంబంధించినది. అన్నిరకములైన వాగ్వ్యవహారములన్నింటికిని సమానముగా వర్తించు ఏకైక కళ యిదియే. ఇది యొక కళ. దీని ద్వారా మానవుడు విభిన్న విషయము లందు సాదృశ్యమును స్థాపించుటలో సమర్థుడగును. 25.

'సామాజికుల ముందు ఉపన్యసించుటకు మరియు అభినయించుటకు మాత్రమే ఇది ఉపకరించునని భావింప రాదు. దీని ద్వారా వక్తసాధ్యమైనంత మేరకు దేవతలు సంతసించునట్లు భాషించు నేర్పును మరియు కార్యదక్షతను సంపాదించు కొనును. 26.

'కాని వక్తృత్వ కళాజ్ఞానము మాత్రమే వక్తకు సరిపోదు. దానిని మించిన దివ్యావేశ మాతనిని ఉదాత్త కార్యసాధనకు ప్రేరేపించునని నా యభిప్రాయము. 27.

ప్లేటో దృక్పథము ననుసరించి —

1. వక్తృత్వ శాస్త్రమన శబ్దశక్తి నిరూపణము. ఇది విభిన్న శాస్త్రములకు, కళలకు (కావ్య కళకు) అనివార్యమైన అంగము.
2. ఇది విభిన్నత్వమందు ఏకత్వమును స్థాపించుటకు అనగా లౌకిక, పారలౌకికముల మధ్య సాదృశ్యమును స్థాపించుట కుపకరించును.
3. దివ్యావేశ సంపన్నత వల్లనే వక్తృత్వము రాణించును. కనుక వక్తృత్వ శాస్త్రము దివ్యావేశ భరితమైన దర్శనము-Rhetorics is a kind of inspired philosophy.

లిఖిత భాషకును, మౌఖిక భాషకు మధ్య కల భేదమును ప్లేటో ఇట్లు తెలిపెను- లిఖితపదములు స్థిరములు. ప్రాచీన యుగ విజ్ఞానమునకు విస్మృతి కలుగకుండ జ్ఞాప కార్థము అవి ప్రజలకు తెలిసి యున్న విషయములను వివరించుట కుపకరించును. కాని మౌఖిక పదము వాచ్యము: సత్యము: అపరిమేయము మరియు దార్శనిక ధ్వని గర్భితము. ఇది శ్రోతృ మనోఫలకమందు లిఖింపబడి ప్రశ్నోత్తర ప్రణాళిక ద్వారా పుష్టిని చేకూర్చు కొనును.

సామాజికులను తన ఉపన్యాసములచే ప్రభావిత మొనర్చినపుడే వక్తయొక్క అభీష్టము నెరవేరును. కావున వక్త తన భాషాప్రయోగము నందు కొన్ని నియమములను పాటింప వలయును. అపుడే అతని ఉపన్యాస శైలి రూపొందును. వక్తృత్వశైలికి ఏర్పరచిన నియమములే కావ్యశైలికి అన్వయించును. ప్లేటో వక్తృత్వ శైలికి ఈ నియమముల నేర్పరచెను- 1. విషయజ్ఞాన పరిపూర్ణత. 2. సామాజికుల నాకట్టుకొను శక్తి 3. స్వాభావికత 4 సామాజిక మానసికావస్థ. ఇవి కావ్య శైలికి ఈ విధమున అన్వయించును. 1. కవి తాను కథావస్తువుగా గ్రహించిన విషయమునందు సంపూర్ణమైన జ్ఞానమును కలిగి యుండ వలయును. అపుడే అతడు కథావస్తువును వివిధ భావములతో మేళవించి రమ్యాతి రమ్యముగా ప్రదర్శింప గలడు. విషయజ్ఞాన హీనుడు భావ దారిద్ర్యముచే కొరవడి యుండును. అందువలన అతని కావ్యశైలి యందు పునరుక్తతా దోషము ఏర్పడు అవకాశము కలదు. నూతన పద ప్రయోగమునకు తావు ఉండ నేరదు. 2. సామాజికుల నాకట్టుకొనుట వశీకరణ మంత్రము కాదు. కవి తన ప్రతిభాశక్తిచే విషయమున

కనుగుణమైన సన్నివేశములను కల్పించి రచించుట ప్రసంగానుకూలమైన పద ప్రయోగము ఇందు చేరును. కావ్యశైలికి ఈ అంశము ఆకర్షణశక్తిని చేకూర్చును 3. స్వాభావికత యన కథావస్తువు కృత్రిమముగా నుండక సామాజికుని కావ్యాస్వాదనకు దోహదముగా నుండ వలయును; సరసమై, సంవేద్యమానమై యుండ వలయును. భాషాపదములు సామాజికునకు సుబోధకములుగా, మంజులముగా నుండ వలయును. కావున కావ్యశైలి సరసముగా నున్నచో క్లిష్టత ఏర్పడదు, కనుక కవి సాధ్యమైనంత మేరకు సరళ పద ప్రయోగమునే అభిలషించ వలయును 4. సామాజికుని మానసిక పరిజ్ఞానము వక్తవలె కవికి కూడా అవశ్యకమేయగును సామాజికుని స్థాయికి మించిన భాషాపద ప్రయోగము శైలియందు యున్నచో అది చెవిటి వాని ముందు శంఖ మూది నట్లుండును; అట్లే ఆతవి విషయము భావ గర్భితమై యుండియు, మంజుల పద మండితమై యుండియు సామాజికుని ప్రభావితము జేయ నేరదు. కనుక పాండిత్య ప్రదర్శనమునే పరమావధిగా కవి భావింప రాదు. పై వివరణము ఆధారముకా కావ్యశైలికి ఈ గుణము లేర్పడును. విషయ జ్ఞాన సంపన్నత. ఆకర్షణీయ పద ప్రయోగము. ప్రసంగానుకూల పద ప్రయోగము మరియు సామాజిక గ్రహణానుకూలము,

శైలీ భేదములను గురించి ప్లేటో తన అభిప్రాయము నిట్లు వ్యక్తపరచెను—

> 'నీవు విషాద-హాస్య రూపకములను గురించి వచించి నట్లు, కావ్యము మరియు పురాణేతిహాసములు అపుడపుడు సంపూర్ణ అనుకరణాత్మకములుగా తోచును; మరి కొన్ని వేళలందు కవి స్వయముగా కథనము చేసి నట్లుండును. ఈ రెండవ రకమైన కథనాత్మక శైలి చాలావరకు తాండవ స్తోత్రములందు కానవచ్చును. ఈ రెండు విధముల సమాహార రూపము మహాకవుల కృతులందును మరి యితరకావ్య కృతులందును చాలావరకు కానవచ్చును. 28

పై వాక్యముల అధారముగా ప్లేటో కావ్యశైలీ భేదములను మూడు రకములుగా గుర్తించె నని గ్రహింప వచ్చును.

1. అనుకరణాత్మక శైలి లేదా నాటకీయ శైలి-Dramatic style.

2. కథనాత్మక శైలి లేదా వర్ణనాత్మక శైలి-Narrative style.
3 నాటకీయమైన కథనాత్మక శైలి-Mixed style.

## గుణ దోషములు-Qualites and Defects.

ప్లేటో శైలీగుణముల నిట్లు తెలిపెను--

'ఉదాత్తశైలి సమరసత, భవ్యత మరియు లయాత్మకత - యను మూడు సద్గుణముల (సత్కావ్య గుణముల) ననుసరించును. సద్గుణమనగా నా అభిప్రాయ మందు విజల్పనంతో కూడిన మూర్ఖత యని కాదు. గుణమును ఉదాత్తముగా, సుందరముగా తీర్చి దిద్దు వివేక శక్తి. 29.

కావున సమరసత, భవ్యత, లయాత్మకత యను మూడు గుణములను కలిగియున్నదే ఉదాత్త శైలి ఈ గుణములకు వ్యతిరిక్తములైన వానిని దోషములుగా ప్లేటో పరిగణించెను.

'భవ్యతా లోపము, లయాత్మకతా లోపము మరియు సమరసతాలోపము యనునవి దోషభూయిష్ఠమైన శైలికి చిరసహచరములు. మరియు అదే మాదిరి వీనికి వ్యతిరిక్తములైన గుణములు వివేకశక్తికి మరియు సద్గుణమునకు అనుకృత సహచరములు. 30.

కావున శైలీ దోషము లివి- భవ్యతా లోపము. లయాత్మకతాలోపము. సమరసతా లోపము.

కావ్యమును, అది నెరవేర్చు ప్రయోజనమును ప్లేటో తీవ్రముగా విమర్శించె ననుట నిజము. ఐనను సాహిత్య శిల్ప సౌందర్యమును నిరసించిన అరసికుడు మాత్రము కాదు. కావ్య రామణీయకము అతని సహృదయత నెట్లు పరవశింప జేసెనో ఈ వాక్యము లందు సువ్యక్తము.

'అవును నిజమే. విషయజ్ఞానము లేని వక్తవలె ఈ విషయమును (కావ్య శైలిని) గురించి నేను పరిపూర్ణముగా విశదీకరింప జాలను. కాని కేవలము అందలి ఒక భాగమును మాత్రమే గైకొని నాయభిప్రాయము లెట్టివో నీకు

విశద పరచు యత్నము చేసెదను 31.

## కావ్యధృక్పథము-Poetic conception.

ప్లేటో కావ్యపరిశీలన వివరింప బడినది. ఆతని కావ్యదృక్పథము నిట్లు సంగ్రహింపగలము.

1. దివ్య ప్రతిభాసంపన్నుడైన రచయితయే కవి.
2. కవి ఒక ఆదర్శ సృష్టి కర్త.
3. కావ్యము పారమార్థిక సత్యమును ప్రతిపాదింప వలయును.
4. కావ్యము ఉదాత్త ప్రయోజనమును కలిగి యుండ వలయును.

## ప్లేటో మహనీయత-Plato's Greatness.

పాశ్చాత్య కావ్యశాస్త్రమునకు ఆద్యుడైన ప్లేటో సాహిత్య దృక్పథము వివిధ శీర్షికలందు వివరింప బడినది. కావ్యశాస్త్ర దృష్టితో ఆతని స్థాన మెట్టిదో నిర్ణయింప వలసి యున్నది. అధికాంశ సాహిత్య సమాలోచకులకు ప్లేటోపై సద్భావం లేదనియే చెప్ప వచ్చును. ఆతని సాహిత్య చింతన విశుద్ధ సాహిత్య దృక్పథము ననుసరింప నందువలన ద్వైధీభావంతో నిండి యున్నదని వారి తలంపు. కారణం ఆయన సాహిత్య మర్మజ్ఞుడు కానేరక ప్రధానంగా దార్శనికుడై దార్శనిక దృక్పథంతో సాహిత్య వివేచనకు పూనుకొనుట; మరియు కావ్య మాహాత్మ్యమును తూలనాడి కవిని బహిష్కరించుట. ఇది కొంత వరకు నిజమే కాని సంపూర్ణముగా కాదు. యుగ పరిస్థితిచే ప్రేరితుడై కవి కావ్యమును రచించునట్లు, కావ్య కృతులచే ప్రభావితమైన సామాజిక స్థితిచే ప్రేరితుడై విమర్శకుడు సాహిత్యమును విమర్శింపక తప్పదు. ప్లేటో అట్లే చేసెను. దారము తెగిన గాలి పటము వలె ఊగిసలాడుచు అధోగతిని చెందుతున్న సామాజిక స్థితిని పునరుద్ధరించుటకై సాహిత్య విమర్శకుడు అశ్లీల సాహిత్యమును దూషింపక తప్పదు; సంస్కరింపక తప్పదు. అది నిజమైన సాహితీవేత్త కర్తవ్యం ప్లేటో నిర్భయంగా ఏ విధమైన ప్రభావమునకు లొంగక కావ్య-నాటకాదులను అవి సామాజికునిపై నెరపు దుష్ప్ర

భావమును పరిశీలించి నిశితముగా విమర్శించెను. ఈ సమీక్షా కార్యమందాతడు పరంపరాగత అభిప్రాయములను కాదనలేదు. ప్రాచీనకాలం నుండి ప్రచారంలో నున్న కావ్యచింతన ఆధారముగా సమకాలీన యుగావస్థ కనుగుణముగా ఆయన సాహిత్యమును విమర్శించెను; పూర్వులు తెలుపని నూతన కావ్యదృక్పథమును ప్రకటించెను. ఈ సమీక్షా కార్యమందాతని దార్శనిక దృక్పథము దేశహితైక దృష్టితో ప్రభావితమైయున్నది.

కావ్యరచన కావశ్యకములైన వాగ్దేవతానుగ్రహము, కావ్యప్రేరణ, దైవ దత్త ప్రతిభ యను తత్త్వముల ప్రతిపాదనప్లేటో మౌలికము కాదు. ప్రాచీనగ్రీకు సాహిత్య మందు వాని ప్రసక్తి కలదు. తన దార్శనిక దృక్పథమున కనుగుణ ముగా ఆయన వివేచించి సిద్ధాంత రూపమున వానిని సమర్థించెను. ఆధునిక యుగమున వాగ్దేవతాను-గ్రహము వింతగా తోచును. ఏ కవియైన ఏదో యొక పరిస్థితి విశేషమునకు లొంగి కావ్యమును రచించుట సత్యము. దైవముపై. అత్యంత విశ్వాసము కల అనాటి యుగము ఆ పరిస్థితి విశేషమునే వాగ్దేవతాను గ్రహ రూపమున గ్రహించుటలో ఆశ్చర్యపడ వలసిన అవసరం లేదు ఈ విషయ విశదీకరణ మందు ప్లేటో పూర్వులు తెలుపని సత్యమునొక దానిని ప్రకటించెను. అదియే కావ్యరచనా వేళ కవికి కలుగు మనః విక్షేపము లేదా స్వీయ ఇంద్రియ జ్ఞాన విస్మృతి. తద్వారా కవి దివ్యావేశమునకు లోనై కావ్యగీతముల నాలపిం చును. డెలాస్ కన్యలు తమ్ము తా మరచి గానము చేసిరని, నాట్యమును ప్రద ర్శించిరని అత్యంత ప్రాచీన కాలముననే కవి మనోస్థితి సూచనాప్రాయంగా తెలుప బడినది. దానినే గ్రహించి ప్లేటో కవి దివ్యావేశమును విశదీకరించెను. కవిని దార్శనికునిగా కొనియాడెను. కవి వ్యక్తిత్వము నిట్లు విశదీకరించి అత్యు న్నత స్థాయికి చేర్చిన ప్రథమ సాహిత్య వేత్త ప్లేటో. ఎవరెన్ని విధముల కావ్య రచనా వేళ కవి మానసిక స్థితిని వ్యాఖ్యానించినను కవి మనః విక్షేపమును త్రోసి రాజాలకున్నారు. ఈ తత్త్వ వివేచన మందు ప్లేటో మౌలకతను ప్రదర్శించి సార్వకాలీన సాహిత్య సిద్ధాంతమును ప్రతి పాదించెను.

డేలాస్ కన్యలు గత పురుషుల, సంఘటనల ననుకరించి కావ్యగానాలాపన సలిపిరని ప్రాచీన కాలమందే తెలుపబడినది. ఈ అనుకరణ ప్రక్రియ ప్లేటో

కాలము వరకు కావ్యమూల తత్త్వముగా పరిగణింపబడి యుండ వచ్చును. ఈ అనుకరణ ప్రక్రియనే ప్లేటో కావ్యమునకు తత్త్వముగా అంగీకరించి ప్రాచీనా చార్యుల మతమునే సమర్థించెను. ఐనను దార్శనిక దృక్పథంతో వివేచించి కావ్య మునకు ప్రాణతత్త్వమైన అనుకరణము సత్యమునకు కడుదవ్వుచనుచున్నదని విమర్శించెను. కావ్యము ప్రకృతికి లేదా జీవనమునకు అనుకృతి. ఐనపుడు మిథ్యయైన ప్రకృతి ననుకరించి కవి సత్యము నెట్లు ప్రదర్శింప గలడు? కనుక కావ్యము అసత్యమూలకము. తాననుకరించు విషయము సత్యమా? అసత్యమా యను జ్ఞానము కవికి యుండదు. అందువలననే అజ్ఞానము, అసత్యము మూల స్రోతముగాకల అశ్లీల సాహిత్యము గుట్టలు గుట్టలుగా పేరుకు పోవుచున్నది. కావున సాహిత్యము సత్యమును ప్రదర్శింప నేరక హీనతరమగుచున్నది; దార్శ నిక స్థాయికి చేరకున్నది. ఈ ఆక్షేపణ యందు సత్యము లేకపోలేదు: ఎట్లన వాస్తవంగా తను భావించినది సత్యమని స్వయంగా కవియే విశ్వసింప నపుడు సామాజికుని కది సత్యముగా ప్రదర్శించుట యొకరమున అతన్ని వంచించుట యగుచున్నది. అంతేకాక కుకవులు తాము ప్రదర్శించినదే సత్యమని ధీమాగా ప్రచారం చేయుచున్నారు ప్రజలను పలు రీతుల నీతి భ్రష్టుల కావించుచున్నారు. ఇట్లు ప్లేటో కావ్యము అసత్య మూలకమను ఉద్దేశమును ప్రకటించి భావితరమును ఉదాత్త సాహిత్యోన్ముఖుల కావించెను.

కావ్య-నాటకాదులు అసత్యమూలకములైనపుడు, అవి నెరవేర్చు ప్రయోజనం సైతం హానికరముగానే యుండును కాని ఆనందదాయకము మాత్రము కాదను నూతన దృక్పథంను ప్లేటో వెల్లడించెను. తన కన్న పూర్వం గార్జియన్ శబ్దశక్తి నుగ్గడించుచు అది మనలోని దుఃఖమును దూరము, చేయును మరియు భయ పిశాచమును పారదోలు ననెను. బహుశ ప్లేటో ఈ అభిప్రాయము నే తన దార్శనిక దృక్పథంతో పరిశీలించి కావ్య నాటకాదుల నిష్ప్రయోజకతను వెల్లడిం చెనని గమనింప గలము. ఉత్తమ సాహిత్య ప్రక్రియయైన విషాదరూపక ప్రయో జనము దేశహితమును చేకూర్చ జాలదని ప్లేటో ఇట్లు తెలిపెను-విషాదరూపకము దుఃఖ భరితము నాయకుని దౌర్భాగ్య ప్రదర్శనమును కాంచి శోకాకుల సంత ప్తులగుదుము. మరియు మనము సైతము నాయకునితో పాటే మనమే అనుభవిం చుచున్నట్లు దౌర్భాగ్యమునకు లొంగిపోదుము. ఇట్టి ప్రవృత్తి పురుషోచితము

కానేరదు దేశసౌభాగ్యమునకై దీక్షవహించెడి ఉత్సాహమును మనము పొంద లేము సహనమును ప్రదర్శించుటకు బదులు మనమే దుఃఖమునకు లోనై నిర్వీర్యుల మగుదుము. కావున విషాదరూపకము దుఃఖమును దూరము జేసి మనలను దేశపురోగతికి ప్రేరేపించు ననుట కల్ల, అట్లే హాస్యరూపము. రంగశాలయందు ప్రదర్శింపబడు వికృత వేషము, హాస్యపూరితమైన వ్యవహారమును కాంచి మనము నవ్వుకొందుము. దానికి కారణం మనలోని చెడుప్రవృత్తి బయటపడు నేమో నను బెంగతో అట్లు చేయుదుమే కాని నిజముగా కాదు. ఇట్లు హాస్య రూపకము మనలోని భయమును పారదోలదు: మీదు మిక్కిలి మన భయమును ఇనుమడింప జేయును. ఇట్టి భయప్రవృత్తి అనైతికత నెదిరింప జాలదు: దేశాభివృద్ధి పథమందు నిర్భయంగా మనల నడవనీయ జాలదు. అంతేకాదు సాహిత్యము మానవునిలో అనైతిక ప్రవృత్తినే పోషించునని ప్లేటో ఇట్లు తెలిపెను. కావ్య నాటకములన్ని దుష్టులు భోగభాగ్యములతో తులదూగు చున్నట్లు మరియు సజ్జనులు తమ సద్ప్రవర్తనచే తమకు తామే చెడిపోనుచున్నారను నీతిని ప్రదర్శించును ఇది అనంతగ మనుటకు వీలు లేదు. సాహిత్య ప్రక్రియ ఏదియైనను అరాచక, అనైతిక ప్రవృత్తినే తనివి తీర వర్ణించి చివరిక్షణాల్లో అప్రవృత్తి వీగిపోయినట్లు ప్రదర్శించును; నైతిక ప్రవృత్తియే విజయమును కాంచినట్లు సారాంశము తేల్చును అధిక కాలము అనైతిక ప్రవృత్తియందే రమించిన సామాజికుని మనస్సు చివరి క్షణాల్లో నైతికము వైపు మరలినదని, ప్రజా సంక్షేమమునకై దీక్షవహించినదని తలంచుట మన భ్రమ యగునే కాని వాస్తవం మాత్రం కాదు. ఇట్లు సాహిత్యము నియంత్రింప దగిన భావములనే పోషించి వానిచేతనే శాసింప బడుచున్నదని తెలిపిన ప్లేటో విమర్శయందు సత్యము లేదని అనజాలము.

కావ్యానందము అది నైతికమైనను అనైతికమైనను–దుఃఖాత్మకమైన, సుఖాత్మకమైనను భావోత్తేజన ద్వారా కలుగునను సార్వకాలీన సాహిత్య సత్యమును వెల్లడించిన ప్రథమ సాహితీవేత్త ప్లేటో. అతనికి పూర్వము కావ్యనందము ఒక వంచన యని అది కళాచమత్కార జన్యమను అభిప్రాయము ప్రబలి యుండెను. ఈ దురభిప్రాయమును ప్లేటో పరాస్తము కావించి సాహిత్యానంద విషయమున భావితరము వారిని గంభీరముగా ఆలోచింప జేసెను. కావ్యభాషా శైలిని నిరూపించెను. ఈ విధముగా ప్లేటో కావంశాస్త్రమునకు సంబంధించిన వివిధాంగములను

వివేచించెనని గ్రహింపగలము.

ప్లేటో కావ్య/కళా వస్తువునే వివేచించి కావ్యకళారూపము నుపేక్షించెననుటకు వీలులేదు. అయన నిజమైన కళాకారుని వలె కళాపరిభావాన్వితిని సమర్థించెను; కళాకృతిని విభిన్నాంగములతో సువ్యవస్థితమైన ప్రాణిగా భావించెను. సౌందర్యవంతమైన కళా స్వరూపమును గురించి అయన ఇట్లు తెలిపెను.

> 'కళాకృతి రచన సజీవప్రాణి రచనతో సమానమై యుండ వలయును. అది స్వీయ శిరము, పాదములు కల శరీరమును కలిగి యుండవలయును. అది మధ్యాంతములను కలిగి యుండవలయును అంగములన్ని ఒక వానితో మరి యొకటి సంబంధితమై సంపూర్ణాకృతిలో సంగతమై యుండవలయును. 32.

కావున–'కళాత్మక దృష్టితో ప్లేటో వాస్తవముగా విశుద్ధ సౌందర్యోపాసకుడు కళను గురించి సదభిప్రాయము కలవాడు. ఎవరేని కళాప్రయోజనమును నిరూపించి, అది ధర్మ రాజ్య సంస్థాపన మందు సముచిత కార్యమును నిర్వహింపగలదని ఋజువు పరచినచో తాను సంతోషించెదనని అయన రిపబ్లిక్ నందు స్పష్టముగా వచించెను. 33 ప్లేటో సాహిత్యము నధిక్షేపించెనని అతని సాహిత్య చింతనను నిరసించుటకు వీలు లేదు. వాస్తవముగా అయన ఆశించినది ఉదాత్త సాహిత్యము; అది పారమార్థిక సత్య సమన్వితమై మానవ నడతను సంస్కరించి దేశసంక్షేమమును చేకూర్చును ప్లేటో దృష్టియందు ఉదాత్త సాహిత్యము ఈ క్రింది లక్షణములను కలిగి యుండవలయును.

1 కవి ఒక అదర్శ సృష్టి కర్త. 2. కావ్యప్రేరణ దివ్యము. 3 కావ్యము సార్వజనీన సత్యమును వ్యక్తి పరచ వలయును. 4. భావములను పరిష్కరించి నైతికతను పెంపొందింప వలయును. 5. ప్రయోజనవంతమైన ఆనందమును ప్రసాదింప వలయును. 6, కవి సంస్తవనీయ వ్యక్తిత్వమును కలిగి యుండ వలయును.

ప్లేటో తన విమర్శనాత్మక దృక్పథమును ప్రదర్శించి కావ్యశాస్త్ర రచనకు మూల పురుషుడయ్యెను. అతని నుండియే కావ్య దర్శనము, కావ్యమునకు

జీవితముతో కల సంబంధము మరియు కావ్య ప్రయోజనమును గురించిన సమీక్ష ప్రారంభమగుచున్నది.

"ప్లేటో ప్రతిభావంతుడైన గొప్ప రచయిత. సాహిత్యమును సాహితశీ సందర్భ మందే పరీక్షింప యత్నించిన ప్రథమ వ్యక్తి ఆయనయే. ఈ దిశయందు అతని కృషి ప్రథను ప్రయాసమగుటచే మరియు నైతికతక తను లక్షించి యున్నందున ఆయన వస్తు వివేచనమందే తల్లీనుడగుట స్వాభావికము. వాస్తవముగా ఆయన వస్తు వివేచనకే ప్రాధాన్యమొసంగి సాహిత్యమునకు ప్రధానములైన ఇతర రెండు తత్త్వములను - శిల్పము మరియు రసానుభూతిని సర్వదా ఉపేక్షించెనని చెప్పవచ్చును. ఆయన సామాన్యముగా సాహిత్యము మరియు కళాకృతులన్నింటి మూల్యాంకన మునకై ఏ ప్రమాణముల ప్రతిపాదించెనో అవి చాలా వరకు సాహిత్య కృతులందు వర్ణితములై మరియు నిరూపితములైన వస్తు సత్యము ద్వారా ప్రేరితములై వాని ఆధారముగా నిర్ణీతములై యుండును. ఆయన కళ మరియు నైతికత అన్యోన్యాశ్రితములని చాటెను ...... నైతిక విలువలు మరియు కళాకృతుల అన్యోన్యాశ్రయితను కళాసృజనకు మూలసిద్ధాంత ముగా అంగీకరించడం మరియు కవులు మరియు కళాకారుల రచనలకు సత్యమునే పరమ లక్ష్యముగా నిర్ధారించడం — ఈ రెండు విషయములు ఆధునిక చింతనకు సమగ్రముగా అన్వయించును" 34.

— డబ్ల్యు. బి వర్స్ఫోల్డ్.

"కావ్యమును నిషేధించియు కూడా ప్రకారాంతరముగ ప్లేటో రెండు మూల భూత తత్త్వములను శాశ్వతముగా ప్రతిష్ఠించి యున్నాడు. ఆ రెండు తత్త్వములు కావ్యమందు సత్య ప్రతిపాదనము మరియు లోకశ్రేయ సంస్థాపనము. ఇవియే కాక ప్రసిద్ధమైన మూడవ ప్రతిపాదనము. అది ప్లేటో తెలిపిన కావ్య సృజన కవి యొక్క మనః విక్షేపము ద్వారా మాత్రమే సంభవము. ఈ విక్షేపము ఒక విధమున దైవిక ప్రేరణకు పరి ణామము యగును. ఈ మూడు తత్త్వములను ఎవరేని ఏ రూపముననైన

వ్యాఖ్యానించినను వీని మహత్వమందు ప్లేటో కాలమునుండి నేటివరకు అణుమాత్రి అంతరమైన కానరాక యున్నది' 35.

— డా॥ నగేంద్ర.

# భారతీయ దృక్పథము-Indian View.

సుప్రసిద్ధ దార్శనికుడైన ప్లేటో సాహిత్య చింతన వివరింపబడినది. అతని కావ్యచింతన భారతీయ కావ్య దృక్పథమున కెంతవరకు సరిపడి యున్నదో పరిశీలింతము.

## మనువు-Manu.

గ్రీసు దేశమందు ప్లేటో వలె భారతదేశమందు మనువు కొన్ని నిర్దిష్ట కళలను మరియు మనోరంజక కార్యకలాపములను నిషేధించెను. వేట, జూదము సురాపానము స్వేచ్ఛా విహారము, నిందారోపణ, పగటి నిద్ర మరియు పరస్త్రీ సంపర్కముతో పాటు గాన, సంగీత, నాట్యకళలను నిషేధించెను. ఆ స్మృతికర్త వీనిని దశవిధ పాతకములుగా పరిగణించెను. ఇవి మొదట ఆనంద దాయకములే యైనను తుదకు అత్యంత బాధాకరములై మానవుని మత సంస్కారము నుండి మరియు సన్మార్గమునుండి మరల్చి భ్రష్ఠుని కావించునని మనువు తెలిపెను. అవి బహిష్కరణీయము లనెను. తన శిష్యులకు ఆయన నాట్య-సంగీతముల అభ్యాసమును నిషేధించెను అవి గృహస్తునకు మరియు నృపతికి సర్వదా వర్జనీయములని తెలిపెను. నటుడు సమర్పించు ఆహార పానీయములను ద్విజుడు స్పర్శింప రాదనెను. నటుని బ్రాహ్మణజాతికి చెందని హీనునిగా ఆ ముని నిరసించెను అందువలన పితరుల శ్రాద్ధ కర్మల సందర్భములందు మరియు పంక్తి భోజనమునకు నటుని పిలువరాదని మనువు కఠినముగా శాసించెను. నాట్యమును ఉపపాతకముగా గుర్తించి మరణానంతరము నటుడు యమయాతనలకు గురి యగునని ఆ మహర్షి తెలిపెను'' 36

కావున మనువు దృష్టియందు నటుడు నింద్యుడు. అట్లే కవియుకూడా. కారణమేమన నటుని అభినయము స్వకల్పితము కానేరక నాటక కర్త రచనకు

ఆశ్రితమై యున్నది. కొన్ని సందర్భములందు నాటక కర్తయే స్వయముగా అభినయించుట కూడా జరుగును. అందువలన నటుని కన్న నాటక కర్తయే ఈ దృష్టితో అత్యధికముగా నింద్యు డగుచున్నాడు. ఈ తీరున భారత దేశమునందు సైతము ప్రాచీన కాలమున కవి సమాజమునుండి వెలివేయబడియే యున్నాడు. ప్లేటో వలె మనువు సుప్రసిద్ధ దార్శనికుడు.

## కుకవి నింద Censure of poetaster.

భారతీయాలంకారికుల దృష్టి యందు కూడా అశ్లీల సాహిత్య రచయిత సమాజమునుండి బహిష్కృతుడైయున్నాడు. కుకవి నింద ప్రథమ భారతీయ కావ్యశాస్త్రమందు స్పష్టముగా కానవచ్చును భారతీయాలంకారికులలో సర్వప్రథముడైన భామహుడు ప్లేటోవలె కుకవి నిట్లు తీవ్రముగా నిరసించెను —

> 'దరిద్రుడు దాత కానేరని విధమున, నపుంసకుని యందు శస్త్రకౌశలము మరియు అవివేకుని యందు నైపుణ్యము ఉండనేరనట్లు, కుకవి శాస్త్రజ్ఞుడు కూడా కానేరడు....కవి కాకపోవుట వలన ఎట్టి అధర్మము లేక పాపము సంభవింపదు. మనిషి మరణించడు; రాజాదుల వలన దండనము రాదు. కాని కుకవి యగుట కెవలము మరణమే'' 37.

భామహుని దృష్టియందు కవి శాస్త్రజ్ఞుని కన్న గొప్పవాడు. ఉదాత్తచింతనాపరుడు. ఇట్టి మహత్తర వ్యక్తిత్వ సంపన్నుడైన కవియే దేశసంక్షోభమునకు కారకములైన రచనల సలిపినపుడు అతనిని క్షమించు వారెవరు? అతడు రాజశిక్షను తప్పక అనుభవించును. అందువలన కుకవి యగుట కన్న అనగా అధమ కావ్య రచయిత యగుట కన్న మరణమే మేలు. కుకవిని దేశమునుండి బహిష్కరించినను లాభములేదు. కారణమేమన అతడు పరదేశము లందు అశ్లీల సాహిత్యమును రచింప జాల డనుటకు ప్రమాణ మేదియును కానరాదు. కనుక కుకవిగా మనుట కన్న మానవుడు మరణించుటయే మేలని భామహుడు కుకవిని ప్లేటో కన్న కఠినతరముగా శాసించెనని ఇట స్పష్టము

వామనాచార్యుడు ప్లేటో వలె కవులను రెండు భాగములందు విభజించెను. అరోచకి (వివేకి) మరియు సతృణాభ్యవహారీ (అవివేకి) . అవివేకి కావ్యమునకు

అధికారి కానేరడు. కారణమేమన శాస్త్రము చదివినను ఆతని అవివేకము దూరము కాజాలదు. శాస్త్రము వివేకవంతునకే తగును; అది అందరికి సాధ్యము కాదు.38. ఆయన కావ్యము శాస్త్రము కన్న భవ్యతరమని, తత్ రచన వివేకియైన కవికే సాధ్యమగునను అభిప్రాయమును వ్యక్తపరచెను. కావున వామనాచార్యుని మత మందు అవివేకులైన కుకవు లందరు దూషితులే.

ఆనందవర్ధనాచార్యు లట్లు తెలిపిరి– 'ఈ ప్రతీయమానార్థము లేదా కావ్య తత్త్వము శబ్దశాస్త్రము (వ్యాకరణ శాస్త్రము) మరియు అర్థశాస్త్ర (కోశాదుల) జ్ఞానము వలన మాత్రమున అవగతము కానేరదు. అది కావ్యతత్త్వ మర్మజ్ఞులకు మాత్రమే స్ఫురించును"39 ఆతన దృష్టియందు కావ్యతత్త్వము శబ్దార్థముల కతీతమైనది. ఈ తత్త్వమును గ్రహించియే కవులు కావ్యములను రచింప వల యును. అన్యథా వారి రచనలు ఉత్తమ సాహిత్యముగా పరిగణింపబడ జాలవు. కనుక ఆనందవర్ధనాచార్యుల మతమందు కావ్యతత్త్వము నెరుంగకయే కావ్య రచన సలుపు వారలు కుకవులు, నింద్యులు.

రాజశేఖరుడు కవులను మూడు తరగతులుగా విభజించెను. శాస్త్రకవి కావ్య కవి, ఉభయకవి. ఉభయకవియే ఉత్తముడైన విద్వత్కవి. మిగిలిన వారందరు కవులు విద్వత్కవయః కవయః, కేవల కవయస్తు కేవల కవయః శాస్త్ర, కావ్యకవులు తమ తమ ప్రత్యేక పరిధులలో తుల్య ప్రాధాన్యము కలవారు. శాస్త్ర గాంభీర్యముతో కావ్యమును రసమయముగా తీర్చి దిద్దు కవి శాస్త్ర కవి. శాస్త్ర కవులు ముప్విధ ములు-- 1. శాస్త్ర నిర్మాత 2. శాస్త్ర మందు కావ్య నివేశము కల్పించు కవి 3. కావ్యమందు శాస్త్రార్థములను నిబంధించు కవి. క్లిష్టములైన శాస్త్ర విషయము లను రసమయముగా, ఆస్వాదనీయముగా తీర్చి దిద్దు కవి కావ్యకవి. వీరు (8) రకములు, రచనాకవి. అర్థకవి, అలంకార కవి, ఉక్తికవి, రసకవి, మార్గకవి శబ్దకవి, మరియు శాస్త్రార్థకవి. రచనాకవి వీనుల విందుగ శబ్దములను సంయోజిం చుట యందు ప్రవీణుడై యుండునే కాని శబ్దముల ద్వారా మహనీయార్థమును ధ్వనింప జేయు సామర్థ్యమును కలిగి యుండడు. అనగా శబ్ద గాంభీర్యమే కాని అర్థగాంభీర్యము ఉండదు''40. ప్లేటో నిందించిన కుకవులను రచనాకవులలో చేర్చ వచ్చును. అంతేకాదు రాజశేఖరుడు కుకవులను చోరులని కూడా నిందిం చెను-నాన్యత్యచోరః కవిజనో నాస్యత్య చోరో వణిగ్జనః''

అనుకరణమును ప్రాతిపదికగా గ్రహించి శారదాతనయుడు 'గంగావతరణ' మందు కుకవుల నిట్లు నిరసించెను-'ఇతరుల ననుకరించు కవులు నిజముగా అంధులు. సుకవులు స్వయముగా తమ కావ్య మార్గముల నేర్పరచు కొందురు" 41.

భారతీయ కావ్యశాస్త్రమందు కుకవి సర్వదా నిందితుడైయున్నాడని పై వివరణము ద్వారా స్పష్టము. ప్లేటో వలె భారతీయాచార్యులు కావ్య వస్తుపరముగా కవిని నిరసింపక, శబ్దార్థపరముగా, కావ్య దోష నిరూపణమందు కుకవిని బహిష్కరించి యున్నారు.

## కవి మహనీయత-The Greatness of Poet.

కవి మహనీయతను ప్లేటో ఆశించెను. భారతీయాలంకారికులు కవి మహనీయతను వేనోళ్ల కీర్తించిరి. భామహాచార్యుడు కవి కర్తవ్యమును నిరూపించి కవి మహనీయత నిట్లు కీర్తించెను. 'కావ్య రస లో అంతర్లీనముగా శాస్త్రము ఉపదిష్టమైనను అట్టి కావ్యము ఆమోదకరమేయగును. జనులు మొదట తేనె రుచిని చూచి ఔషధమును సేవింతురు. కావ్యమునకు అంగము కాని ఏ శబ్దమును, ఏ అర్థమును, ఏ న్యాయమును లేదా కళయును లేదు. అహో! కవిపై ఎంతటి మహత్తర భారము కలదు. 42.

అగ్నిపురాణ మందిట్లు చెప్ప బడినది 'నీరసమగు వాణి ప్రకాశింప నేరదు. కనుక రసము అత్యంతావశ్యకము. జ్యోతి స్వరూపము అద్వైత బ్రహ్మ సహజ స్వభావము ఆనందము. ఈ ఆనందము చైతన్య చమత్కార మగు రస రూపమున వ్యక్తమగును. కావ్య జగత్తునకు కవియే ప్రజాపతి. అందుచే అతనికి ఏది ఇష్టమో దాని నాతడు సృజించును. 43.

ఆనంద వర్ధనుడు కవి మహనీయత నిట్లు కీర్తించెను.- 'మహా కవుల వాక్కులలో వాచ్యార్థము కన్న భిన్నమైన ప్రతీయ మానార్థము ఉన్నది. ప్రతీయమానార్థమే కావ్యాత్మ అలౌకికమగు ప్రతిభా విశేషము మహాకావ్యమున స్ఫురించును. ఇట్టి స్ఫురణగల కావ్యములు కొద్ది మహాకవులు కూడా కొలది మందియే'' 44.

తౌతభట్టు కవి వ్యక్తిత్వ మహనీయత నిట్లు ఉడిగ్గంచెను- 'ఋషికాని వాడు కవి కాజాలడు. కవి యగుటకు ముందు ఋషిత్వము రావలెను. సాక్షాత్కృత ధర్మము కలవాడు ఋషి యని యాస్క వచనము. తత్త్వమును దర్శించినవాడు ఋషి. ఈ దర్శనమును వర్ణింప దలచినపుడు ఋషి కవియే యగుచున్నాడు. విచిత్ర భావములను అంశలను వ్యక్తముచేయు తత్త్వప్రిఖ్యయే దర్శనము తత్త్వ దర్శనము కవికి ఉండవలసిన మొదటి లక్షణము. వాల్మీకికి తత్త్వ దర్శనమున్న ప్పటికిని. వర్ణన అయనకు రానంతవరకు లౌకిక వాఙ్మయమున అది కావ్యము ఉద్భవింప లేదు. 45.

> మమ్మటుడు కావ్యప్రకాశ మందు కవి వాణి నిట్లు కీర్తించెను-'కవి భారతికి జయ మగు గాక। కవి-భారతి రచన బ్రహ్మయొక్క ఈ సృష్టికన్న విలక్షణ మైనది. అది నియతి నియమముల నుండి విముక్తమైనది. అది శృంగా రాది నవరస యుక్తమై ఆహ్లాదకారిణి యగుచున్నది. 46

> సంస్కృత సాహిత్యమందు కవి మహనీయత ఎల్లెడల ప్రశంసింప బడినది. 'సుకవి హృదయము చైతన్యవంతము. అందువలన అతడు అచేతనము లకు చేతనా రూపమును, చేతనములకు అచేతనా రూపములను కల్పించి కావ్యమును రస రమ్యముగా రచించును. 47.

> 'రస సిద్ధులైన కవులు సత్కావ్యములను రచించి సంస్తవనీయు లగుచున్నారు వారి యశః కాయమునకు జరామరణజ భయము లేదు. అనగావారి కీర్తి ఆచంద్రార్కము. 48.

ప్లేటో కవి మహనీయతను అహ్వానించెను. భారతీయాచార్యులు సుకవి మహనీయతను ప్రత్యక్షముగా కీర్తించి యున్నారనుట ఉపర్యుక్త వివరణద్వార స్పష్టము.

## కావ్య సృజన-Poetic creation.

ఇక కావ్య సృజనాత్మకతను పరిశీలింతము. ప్లేటో దృష్టియందు కవి అలౌ కిక దివ్యప్రతిభాశాలి. వాగ్దేవతానుగ్రహమున కవి దివ్యావేశమునకు లోనై కావ

మును రచించును. దైవదత్తమైన కవి ప్రతిభాప్రభావము కవి నుండి నటకునకు గాయకునకు, అటనుండి ప్రేక్షకుని/సామాజికుని వరకు పరివ్యాప్తమైయుండును. ప్లేటో ప్రతిపాదించిన కావ్యసృజనాత్మక ప్రక్రియను భారతీయ కావ్య దృష్టితో వివేచించి సామ్య-భేదములను తెలిసికొందము.

భారతీయ కావ్యశాస్త్ర ప్రవర్తకుడైన భామహాచార్యు డిట్లు తెలిపెను– 'గురూపదేశమున జడబుద్ధి సైతము శాస్త్రము నభ్యసించు వీలు కలదు. కాని కావ్యము మాత్రము ప్రతిభావంతుని నుండి మాత్రమే ఆవిర్భవించునది. శబ్దార్థ జ్ఞానమును తెలిసికొని, నిరంతరాభ్యాసము ద్వారా ఉపాసించుట వలన మరియు అన్యుల కావ్య నిబంధనముల అధ్యయనముద్వారా కావ్యరచన సంపన్నమగును 49 కావున భామహుని మతమందు కవి ప్రతిభ కావ్యరచనకు ప్రధాన హేతువు. దానితో పాటు అభ్యాసము అవశ్యకము.

దండియను ఆలంకారికుడు కావ్యరచనాత్మకతను ఇట్లు వివరించెను– 'నైసర్గికమైన ప్రతిభ, పరిపూర్ణలోక జ్ఞానము వ్యుత్పత్తి), అభ్యాసము- ఈ మూడును కావ్యరచనకు హేతువగును. ప్రతిభ జన్మజన్మాంతర సంస్కార రూప అద్భుత శక్తియే యైనను, శాస్త్రజ్ఞానము మరియు అభ్యాసము– ఈ రెండింటి సాధనద్వారా సరస్వతి నుపాసించి కవి ఆమె కరుణాకటాక్షములకు పాత్రుడు కావచ్చును. కనుక కవి సోమరితనమును విడిచి క్రమానుగతముగా, సరస్వతిని తప్పకుండ నిరంతరము ఉపాసింప వలెను'' 50. కనుక దండి మత మందు కూడా కావ్య రచనకు కవి ప్రతిభ అవశ్యకము. ఆ ప్రతిభ కవికి పూర్వజన్మ సుకృత ఫలవిశేషము. ఐనప్పటికిని సరస్వతీ ఉపాసన కవికి అవశ్యకము. ఇది కవి యందు కావ్య రచనాభ్యాస రూపమున నెలకొని యుండును. ఇట్లు ప్లేటో వలె దండి దైవ దత్త ప్రతిభను, వాగ్దేవతానుగ్రహమును సమర్థించి యున్నాడనుట స్పష్టము.

రుద్రటుడను ఆలంకారికుడు కవి ప్రతిభ నిట్లు విస్తరించి తెలిపెను– 'తన ఏకాంత మానసమందు స్ఫురితములగు బహువిధ కావ్య విషయములను సముచిత పదములందు సహజముగనే కవి ఏ శక్తిద్వారా వ్యక్తపరచ గలడో ఆశక్తియే ప్రతిభ ఈ ప్రతిభ సహజము మరియు ఉత్పాజము అని రెండు విధములు. శాస్త్ర జ్ఞానము మరియు అభ్యాసము ద్వారా సముపార్జిత మగునది ఉత్పాజము.

సహజ ప్రతిభయే శ్రేష్టమైనది 51.

వామనుడు ప్రతిభను కావ్యసాధనములలో చేర్చి ఇట్లు తెలిపెను–

'లోకో, విద్యా, ప్రకీర్ణశ్చ కావ్యాంగాని-- అనగా
లోకము = స్థావర జంగమ జగత్తు జ్ఞానము.
విద్య = శబ్దము, స్మృతి, ఛందము, శాస్త్రము, రాజనీతి మున్నగునవి.
ప్రకీర్ణముల నిట్లు తెలిపెను —లక్ష్యజ్ఞత్వ మభియోగో వృద్ధసేవావే
క్షణమ్. ప్రతిభాన మవధానశ్చ ప్రకీర్ణమ్-- అనగా
లక్ష్యజ్ఞత్వము = కావ్యజ్ఞాన వ్యుత్పత్తి అభియోగము = అభ్యాసము
వృద్ధసేవా సత్సంగమ్ = వృద్ధుల సేవ, సత్సంగము అనగా ప్రేరణ
అవేక్షణమ్ = పదప్రయోగము, ప్రతిభ మరియు అవధానము.

పై అలంకారికుల దృక్పథము నిట్లు క్రోడీకరింప వచ్చును.

1. కావ్యరచనకు ప్రధాన హేతువు ప్రతిభ. ఇది జన్మజన్మాంతర సంస్కార విశేషము. నవనవోన్మేషశాలిని; కవికి సరస్వతీ అనుగ్రహము అవశ్యకము
2. వ్యుత్పత్తి మరియు అభ్యాసము—వీని వలన రచనా కౌశల మలవడును.
3. కావ్య ప్రేరణను కవి జీవనము నుండి గ్రహించును.

ఆనందవర్ధనుడు ప్రతిభ మహనీయత నిట్లు వివరించెను —

'అది (ప్రతిభ) యున్నచో ప్రాచీన మహాకవుల ప్రబంధము లెన్ని యు నన్ను కావ్యార్థములకు విరామమే యుండదు. అదియే లేకుండినచో రస పుష్టిని కవి దేని ఆధారముగా జేయ గలడు. అర్థాంతరముతో ప్రసక్తి లేని ఒక రకమైన అక్షరముల కూర్పునే బంధచ్ఛాయగా తలంచుటెట్లు? అది సహృదయ సమ్మతము కానేరదు అట్లయినచో చమత్కార వంతము లును అయిన వచనముల రచన మాత్రమే కావ్యము కావలసి వచ్చును....వసంత ఋతువు నందలి వృక్షముల వలె మొదట గ్రహింపబడిన అర్థము రస పరి గ్రహణము ద్వారా నవ నవత్వముతో శోభిల్లును.... భగవతి యగు సర స్వతీయే యాసుకృతుల కభిమతమగు నర్థమును వారికై తనంతట తానా

విర్భవింప జేయును. అట్లు సరస్వతీ దేవి యనుగ్రహ వశమున వర్ణములు తమంతట తాము స్ఫురించుటయే కదా మహాకవుల మహా కవిత్వము— అవ్యుత్పత్తి మూలమున సంభవించు దోషము లన్నింటిని ప్రతిభ కప్పి పుచ్చును. ప్రతిభా లోపమున వాటిల్లు దోషములు స్వయముగా బహిర్గత ము లగును. 53.

ప్లేటో వలె ఆనందవర్ధనుడు కావ్యప్రధాన హేతువైన ప్రతిభను సరసతీ అనుగ్రహ రూపముననే భావించెను. అట్లే ప్రతిభను సహృదయ పాఠకునకు కూడా నిర్ణయించెను—

'శబ్దశాస్త్రములను పఠించిన మాత్రమున ఎవరును కావ్యార్థమును భావింప జాలరు కావ్యమర్మజ్ఞత కలవారే మహాకవుల వాక్కుల ద్వారా స్రవించు రస ధారలను గ్రోలు సమర్థు లగుదురు, 54,

అభినవగుప్తుని గురువైన తౌతభట్టు కావ్యకౌతుక మందు ప్లేటో వలె కవి ప్రతిభా ప్రభావము కవి నుండి నటకునకు మరి అటనుండి సామాజికుని వరకు అనుస్యూతమై యుండునని తెలిపెను—'వర్ణింపబడిన వస్తువు కన్నులకు కట్టినట్లు భాసించి నపుడే రసప్రతీతి కలదు. ఈ రసప్రతీతి కవికి. నటునకు, సామాజికు నకు కూడా ఉన్నది వీరి అందరి ప్రతీతులు తుల్యమైనవి. ఇట్టి ప్రతీతిని ఇచ్చు టకు కవికి ప్రతిభ అవసరము నవనవోన్మేష శాలిని యగు ప్రతిభయే ప్రజ్ఞ.55.

రాజశేఖరుడు ప్లేటో వలె కవి అలౌకిక వ్యక్తిత్వము నిట్లు ప్రతిపాదించెను 'కవికి అంతర ప్రయత్న మగు సమాధి బాహ్యప్రయత్నమగు అభ్యాసము అవ సరము. కవిత్వబీజ మగు వాసనలను ఉత్తేజింప జేయు శక్తిని ఈ సమాధి, అభ్యా సము మేల్కొలుపునవి. ఈ శక్తిని ప్రతిభావ్యుత్పత్తులు వృద్ధి పొందింప జేయు నవి. ప్రతిభగలవానికి ఎదుట లేనిది కూడ ప్రత్యక్షమగును. ఆయన కావ్యరచ నాత్మక ప్రతిభను దైవదత్తముగా కూడా పేర్కొనెను — 'ఇట్టి ప్రతిభను కార యిత్రి అని, భావయిత్రి యని రెండు విధ ములు. కావ్య కర్మకు సాయము చేయు నది కారయిత్రి. ఇది ముత్తెరగులు. జన్మాంతర సంస్కార వశమున వచ్చునది సహజమగు కారయిత్రి. ఈ జన్మలోని సంస్కారవశమున వచ్చునది ఆహార్య

మగు కారయిత్రి. మంత్రి. తంత్రి ఉపదేశాదుల ద్వారా కలుగునది ఔపదేశికి యగు కారయిత్రి, మూడు విధములలో కన్పించు కారయిత్రి వలన వరుసగా సారస్వత. అభ్యాసిక, ఔపదేశిక కవులు రాగలరు. ఆనందవర్ధనునివలె రాజ శేఖరుడు సహృదయుని యందు సైతము ప్రతిభాస్థితిని తెలిపెను — 'సహృదయు డగు భావకునకు ఉపకరించు ప్రతిభను భావయిత్రి అందురు. శబ్దయోజనలో కలుగు శ్రమలోను, అభిప్రాయమును వ్యక్తము చేయుటలోను ఉపకరించునది భావయిత్రి. ఇది లేనిచో కవి వ్యాపారము నిష్ఫల మగును' 56.

రుయ్యకాచార్యుడు ప్లేటో వలె కవి అతీంద్రియాపస్థను సూచించెను- 'కడ చిన దనిని, రాబోవుదానిని ప్రత్యక్షముగా చూపుటను భావికమను అలంకార మందురు. భావనా వ్యాపారము దీనిలో ప్రధానము. ఈ భావనా వ్యాపారము కవిత్వమునకు ముఖ్యమైనది ఇది కావ్యమునకు స్వాభావికముగా నున్న ధర్మము భావన ద్వారా అతీంద్రియార్థ దర్శనము. 57.

అభినవగుప్తుడు ప్రతిభను అపూర్వవస్తు నిర్మాణ క్షమ ప్రజ్ఞగా వివరించి తద్వారా కావ్యసౌందర్యము పోషింపబడు ననెను. అంతేకాక ఆయన అన్యుల నుండి అభ్యసించిన నేర్పు వలన కానేరక స్వీయ ప్రతిభాగుణము వలన ఉత్పన్న మైనదే కావ్యార్థమనెను ప్రతిభా అపూర్వ వస్తునిర్మాణ క్షమా ప్రజ్ఞా తస్యాః విశేషోరసావేశ వైశద్య సౌందర్య కావ్య నిర్మాణ క్షమత్వమ్ (ప్రథమ) ... తద్య త్పరకీయ శిక్షానపేక్ష నిజప్రతిభాగుణ నిష్యంద భూతః కావ్యార్థ ఇవి భవ (చతు ర్థోద్యోతము)

మమ్మటుడు ప్రతిభ, అభ్యాసము, వ్యుత్పత్తి - వీనిని ఏకముగా కావ్యహేతువుగా పేర్కొన్నను ప్రతిభను (శక్తిని) అనివార్య కావ్యహేతువుగా నిర్ణయించెను. అది కవిత్వ నిర్మాణమునకు బీజ రూపమైన శక్తి తదాభావము వలన కావ్యరచన సంభవము కానేరదు. ఎవరేని అట్లు యత్నించినను. హాస్యా స్పదు లగుదురు. ఈ సువిశాల జగత్తు నవలోకించి పరిశీలించుట వలన నైపుణ్య మలవడును. కావ్యశాస్త్ర విదుల వద్ద ఉచిత శిక్షణను గ్రహించుట వలన అభ్యాస మేర్పడును శక్తి-అభ్యాసము, నైపుణ్యము-ఈ మూడును సమవేత రూపమున కావ్యహేతువు లగును ఆశయ మేమన ఉత్తమ కావ్యరచనకు పై మూడు హేతు

వులు అవశ్యకములే ఈ మూడింటిలో మొదటిది ప్రేరణా స్రోతము. మిగిలిన రెండు దానిని కళావంతముగా తీర్చి దిద్దు సాధనములు. 58.

సంస్కృత సాహిత్యశాస్త్రమునకు అంతిమ ఆచార్యుడైన పండితరాయలు జగన్నాథుడు కావ్యరచనకు ప్రతిభను ప్రధాన హేతువుగా తెలిపెను— 'తస్య చ కారణం కవిగతా కేవల ప్రతిభా సాచ కావ్య ఘటనానుకూల శబ్దార్థోప స్థితిః. ఆయన ప్రతిభను రెండు రకములుగా తెలిపెను. 1. ప్రారబ్ధ వశమున దేవతల లేక మహాపురుషుల అనుగ్రహరూపమున ప్రాప్తమగునది. 2. వ్యుత్పత్తిమరియు అభ్యాసము ద్వారా సిద్ధించునది. వీనిని ఆయన ఇట్లు వివరించెను. ఒకానొకడు తొల్త ప్రతిభాహీనుడైనను పాండిత్యము సంపాదించిన పిమ్మట ప్రతిభాశాలియై కావ్య రచన కావింప జాలును. ఒకానొకడు వ్యుత్పన్నుడు కాకపోయినను దేవతాను గ్రహమువలన అపూర్వమైన ప్రతిభకు తావలమై మహాకావ్య రచనా దక్షుడగుచున్నాడు ' కాళిదాసాదులను గూర్చి లోకమున ప్రచారములో నున్న కథలు ఇందుకు తార్కాణములు ఇచ్చట ప్రతిభ దేవతా ప్రసాద లబ్ధమైనది.

ఆధునిక భారతీయ సాహిత్యాచార్యులు పాశ్చాత్య దేశములందు అత్యధిక ప్రచారములో నున్న కల్పనా సిద్ధాంతమును దృష్టియందుచుకొని ప్రతిభను వివేచించి యున్నారు. ప్రముఖులైన వారి దృక్పథ మీ తీరున నున్నది.

'భావోద్రేకమునకు మరియు కల్పనకు ఘనిష్ఠ సంబంధము కలదు. భారతీయ రసవాదు లందరు కల్పనకు అధిక ప్రాధాన్య మీయక భావయోగమందే దానిని అంతర్భవింప జేసిరి. పాశ్చాత్య మీమాంసకులు కల్పనకు అధిక ప్రాముఖ్యత నొసంగిరి అది సాహిత్య సృజనయందు అనివార్యమే. ఐనను అది సాధనమేకాని సాధ్యము కానేరదు. ఇది రెండు విధములు. 1. రూపాత్మకము (కారయిత్రి) 2. గ్రహణాత్మకము (బావయిత్రి) 59

—ఆచార్య రామచంద్ర శుక్ల.

'ప్రతిభ యను శబ్దము ప్రతీక పరముగ, దర్శన పరముగ, మత పరముగ శాస్త్ర పరముగ మరియు మానసిక పరముగ విభిన్నార్థములతో ప్రయోగింపబడినది. ఐనను వీని యన్నింటి యందు ఒక సామాన్య సూత్రము అనుస్యూతముగా వెలసి యున్నది— ఏదేని సౌందర్య వస్తువు యొక్క విస్పష్ట

అంతర్దర్శనమునుగ కావింప జేయు శక్తియే ప్రతిభ' 60.

— కాంతిచంద్ పాండే

'వర్ణనీయ కావ్య వస్తువును నిత్య నూతనము చిత్రించు లేదా భావనా చి
ముగా సాక్షాత్కరింప జేయు మానసిక ప్రజ్ఞ ప్రతిభ' 61.

— పి.వి. కాణె

ప్లేటో ప్రతిపాదించిన దైవదత్త ప్రతిభ, దివ్యావేశము, అభ్యాసముయను మూడు కావ్యరచనా కారణములను భారతీయాలంకారికులు ప్రతిభ, వ్యుత్పత్తి అభ్యాసము యను మూడు కావ్యహేతువుల రూపమున వివరించి యున్నారు. కవికి వాగ్దేవతారాధనావశ్యకతను ప్లేటో వలె భారతీయాచార్యులు సమర్థించి యున్నారు. కనుక కావ్యసృజనాత్మక ప్రక్రియా వివేచనమందు భారతీయ పాశ్చాత్య ఆచార్యులందు భేదము కానరాదు.

## అనుకరణ దృక్పథము-Concept of Imitation.

ప్లేటో కావ్యమును ప్రకృతికి అనుకృతిగా నిరూపించెను. కాని భారతీయ సాహిత్యాచార్యు లెవ్వరును కావ్యస్వరూపమును ప్లేటో వలె మిధ్యాజగత్తునకు అనుకృతిగా భావింపను లేదు; నిర్వచింపను లేదు. ఐనను అనుకరణ పదమును భారతీయాచార్యులు సర్వదా పరిత్యజించి నారనుటకు వీలులేదు. ప్రాచీన కాలమందు భారతీయులు అనుకరణమును శబ్దార్థసంబంధిత జ్ఞానమునకు ఉపకరించునదిగా గుర్తించి యున్నారు. భాషాశక్తి అవగాహనకై అనగా అర్థ బోధకై ప్రా
నులు ఎనిమిది మార్గముల నేర్పరచిరి. అవి-వ్యాకరణము ఉపమానము, శబ్దకో
శము, ఆప్తవచనము। వ్యవహారము, వాక్యశేషము, వివృత్తి, పదసాన్నిధ్యశ

'శక్తిగ్రహణం వ్యాకరణోపమాన కోశపద వాక్యాద్వ్యవహార తశ్చ
వాక్యస్య శేషాత్ వివృతైర్వదంతి సాన్నిధ్యతః సిద్ధపదస్య వృద్ధా'

వ్యవహారము వస్తుబోధకు సహకరించును. ఉదాహరణముగా 'గోవు
అను శబ్దము యొక్క అర్థబోధను బాలునికి కల్గించుటకై వృద్ధుడు 'గోవునుతెమ్ము
అను వాక్యము నుచ్చరించును. మూడవ వ్యక్తి గోవును తెచ్చును. ఈ వ్యవహా

మను చూచుచున్న బాలుడు గోవు, తెచ్చుట యను శబ్దములకు అర్థములను వ్యవహారము ననుకరించి తెలిసి కొనును. అట్లే సందర్భానుసారముగా ఇతర శబ్దము లేయే అర్థములను బోధించునో ఆయా సందర్భవ్యవహారముల ననుకరించి తెలిసి కొనును. ఇట్లు అనుకరణము భాషా జ్ఞానమునకు తోడ్పడునని ప్రాచీనులు నిర్ణయించిరి. కావ్య-నాటకములు భాషామాధ్యమముననే రూపములను సంతరించు కొనినవైనందున భారతీయాచార్యులు ఏదో యొక రూపమున అనుకరణ ప్రభావ మును గుర్తించియే యున్నారు. ఆద్యాచార్యుడైన భరతుడు నాట్యశాస్త్రమందు అనుకరణ పదము నుపయోగించెను. నానాభావ సంపన్నమును నానావస్థ సమ న్వితమునైన లోకవృత్తము ననుకరించునది నాట్యము....సుఖ దుఃఖాత్మకమైన లోక స్వభావమును ఆంగికాద భినయము ద్వారా అనుకరించునది నాట్యము.... ఇది (నాట్యము) ముల్లోక భావములకు అనుకీర్తన మగును' 62.

అనుకరణ పదమును భరతుడు నాట్యము లేదా నాట్యకళా పరముగనేవాడె ననుట పై వాక్యముల ద్వారా స్పష్టము. మరి నాట్యము సుఖ దుఃఖాత్మకమైన లోకస్వభావము ననుకరించుననుటలో భరతుని ఆశయమేమై యుండును? అట్లే ఆయన అనుకరణమును నాటక కళ వరకే పరిమిత మేల కావించెను? సమగ్ర నాటక రచనకు అనుకరణము నేల అన్వయింప లేదు? ఈ ప్రశ్నలకు సమాధాన మును భరతుని ఈ క్రింది వాక్యముల నుండి గ్రహింప వచ్చును.

—కావ్యమున కాని నాట్యమున కాని గల రసభావాదులు కేవలము లోకవృత్తా నుకరణములని గ్రహింప రాదు అందుచే లోకధర్మియని, నాట్య దర్మియని ధర్మ ద్వయము కలదు. లోకప్రసిద్ధమైన వృత్తాంతమును ఉన్నదున్నట్లుగా నాట్యమున కావ్యమున చూపుటలో లోకధర్మికలదు. నర్తనాది నాట్యప్రక్రియలచట కన్పిం పవు. కల్పితములైన వాక్యాదుల ద్వారా ఉత్పన్నమగు కవి ప్రవృత్తి. కవి కల్పించిన చిత్తవృత్తిని అంగ హారాది రూపమున ప్రదర్శించుట, సర్వాలంకార ములతో కూడిన ప్రయోగము మొదలగునవి నాట్య ధర్మిని తెలుపునవి. వాస్తవ జీవితమును యథాతథముగా చూపక కావ్యజగత్తున కావ్యస్వరూపమునకు అను గుణముగా జీవితమును చిత్రించుటలో నాట్య ధర్మికలదు రంగ స్థలమున ఇద్దరు పాత్రలు ఒకరితో నొకరు మాట్లాడుకొను చున్నను అది మూడవ వ్యక్తికి వినబడక పోవుట లోక విరుద్ధ మైనను నాట్య సమ్మతమే" 63.

పై వాక్యముల ద్వారా బోధపడు సారాంశమిది-

1. లోక వృత్తాంతమును లేదా లోకస్వభావమును ఉన్నదున్నట్లుగా చూపుట లోక ధర్మము. ఇది అభినయమునకు యోగ్యము కానేరదు.

2. నాటక స్వరూపమున కనుగుణముగా కవి చిత్రించిన లేదా కల్పించినలోక స్వభావము నాట్య ధర్మి. ఇది అభినయమునకు యోగ్యమగును.

3. నటుడు యథార్థమైన లోకవృత్తాంతము ననుకరింపక నాటక కర్త కల్పించిన లోకస్వభావము ననుకరించును.

4 కావున నాట్యము కవి కల్పించిన లోకస్వభావమునకు అనుకృతియగును.

## కవి చిత్తవృత్తి-Mentality of Poet.

నాటకము అభినయము ద్వారా ఇతివృత్తమును ప్రదర్శించు నని భరతుడు తెలిపెను. నటుడు అభినయమునకై కవి కల్పిత లోకస్వభావము ననుకరించుట వలన నాటకము ప్రదర్శించునది యదార్థమైన లోకవృత్తాంతము కానేరక నాటక కర్త ఊహించిన లోక స్వభావమే యగును. మరి నాటకము ప్రదర్శించు లోక స్వభావమునకు ఆధారమేదియై యుండును? నాటక కర్తయొక్క భావన లేక చిత్త వృత్తియే నాటక ఇతివృత్తముగా అభినయము మాధ్యమమున ప్రదర్శిత మగు ననుట స్పష్టము. కనుక నాటకము ప్రదర్శించు ఇతి వృత్తము కవి చిత్తవృత్తికి అధీనమై యున్నందున అతని భావన కనుగుణముగా వాక్యాదుల ద్వారా కల్పిత ములైన పాత్రలు, సన్నివేశములు మున్నగు వాని ననుకరించుట నాట్య మని భరతుని మతము. అందువలన నాటక ఇతివృత్తము లోకవృత్తమునకు అనుకార్య ము కానేరదని, అట్లే నాట్యము లోకస్వభావమునకు, అవస్థలకు అనుకృతి కానే రక నాటక కర్తయొక్క చిత్తవృత్తికి అనుకృతి యని బోధపడును.

శంకుకభట్టు అనుకరణప్రక్రియను ప్రేక్షకుని నాటకరసాస్వాదన వరకు ఇట్లు విస్తరించెను-- 'నటుడు నాటకములోని పాత్రల ననుకరించును--. విభావ ముల ద్వారా రసజ్ఞానము అనుమానికముగా సిద్ధించు నట్లు, నటుని అభినయము

ద్వారా ముఖ్యపాత్రలో గల రసము అనుమానికముగా తెలియబడుచున్నది. ముఖ్య పాత్రలకు చెందిన స్థాయికి అనుకరణ రూపమై, అనుకరణ రూపమను లక్షణము గల రసము అను వేరొక పేరును స్థాయిభావమే పొందుచున్నది ... ఒకని స్థాయి భావమును ఇతరుడు అనుకరించ గలడు ఈ అనుకరణను హేతువుగా గ్రహించి, అనుమాన ప్రమాణము ద్వారా మొదటి వానికి గల స్థాయి భావమును తెలిసికొన గలము, స్థాయి భావము కంటె విలక్షణమైన రసము వేరొకటి లేదు'' 64.

స్థాయి భావము అనుకరణ మాధ్యమముగా ప్రేక్షకుని మానసమందు పర్యవసిత మగునని శంకుకుడు తెలిపెను. ఇట్లు ఆయన నాటకానందమందు అనుకరణ ప్రాధాన్యత నంగీకరించెను. ఈ అనుకరణ ప్రక్రియ యథార్థ లోకవృత్తాంతమునకు సంబంధింతము కానేరదని నాటక వస్తువు కుపయుక్తంగానున్న స్థాయిభావమునకు సంబంధితమై యున్నదని తెలిపెను. నాటక స్థాయి భావము కవి చిత్తవృత్తికి అధీనమై యుండుట వలననే అది అనుకరణము ద్వారా రసమందు పర్యవసిత మగుచున్నది కవి చిత్తవృత్తికి అధీనము కాకయున్న సామాన్యమైన భావములకు నిలయమైయున్న లోకవృత్తాంతము యొక్క అనుకరణము ద్వారా సామాజికుడు రసానుభూతి ననుభవించ జాలక సామాన్యమైన ఆనందమును మాత్రమే పొంద గలడు. కనుక స్థాయిభావ రూపమున శంకుక భట్టు కవి లేక నాటక కర్త యొక్క చిత్తవృత్తినే సమర్థించెనని ఇట స్పష్టము.

అభినవగుప్తుడు కవిచిత్తవృత్తికి అనుకరణముతో కల సంబంధము నిట్లు తెలిపెను— 'లోకధర్మిలో వాస్తవములైన చిత్తవృత్తులే అనుభావములోగాని, బాహ్యకృతిలో గాని కన్పించ వచ్చును. నాట్యోపయోగమునకు మూలమగు కైశికీ మొదలైన వృత్తుల ద్వారా అలౌకిక శోభ బయలు దేదినచో అది నాట్య ధర్మిని తెలుపునది. కొన్ని సన్నివేశములలో ఈ రెండును కలిసియుండ వీలున్నది. కావ్యముగాని, నాట్యముగాని లోకమును అనుసరించుట లేక వైచిత్ర్యమును చూపుట అనునవి ధర్మములని పిలుపబడునవి. 65.

అభినవగుప్తుని దృష్టియందు నాట్యమందు కవిచిత్తవృత్తితో పాటు లోకవృత్తము అనుకృత మగును. ఇట్టి అనుకరణము నాయన నాట్య ధర్మముగా పరి

గణించెను. కనుక నటుడు నాటక కర్త చిత్రించిన పాత్రలు సన్నివేశములతో పాటు లోకవ్యవహారము ననుకరించును. అందువలన నటకర్మయందు లోకవృత్తానుకరణము ఇమిడి యున్నదని భావము. ఈ తీరున కవికల్పిత నాటక ఇతివృత్త రచనయందు లోకవృత్తానుకరణమునకు స్థానము కల్పింపబడినదని బోధపడును. అట్లుకానియెడల నటునకు లోకము ననుసరించు అవకాశ మెక్కడిది? సారాంశముగా నాటకకర్త లోకము ననుకరించును. తద్వారా నాటక స్వరూపమున కనుగుణమైన చిత్తవృత్తి నేర్పరచుకొనును. కావున నాటకమందు లోకవృత్తాంతము అనుకృత మగుట నాట్యధర్మమగుచున్నది.

నాట్యమందు అనుకరణ ప్రాధాన్యతను ధనంజయు డిట్లు తెలిపెను- 'నాట్యమన అవస్థ ననుకరించుట. కావ్యనిబద్ధ లేక వర్ణిత ధీరోదాత్త, ధీరలలిత' ధీరోద్ధత, ధీరప్రశాంత, ధీరలలిత స్వభావములను కలిగియున్న నాయకులను (ఆయా స్వభావములను కలిగియున్న నాయికలను మరియు పాత్రలను) ఆంగిక వాచిక, అహార్య సాత్వికములను నాలుగు రకములైన అభినయము ద్వారావారి అవస్థల ననుకరించుట యగును. ఈ అనుకరణము వలన నటుడు మరియు మూల పాత్రమధ్య గల భేదము కానరాక యుండును. అందువలన నాట్యరూపమే రూపక మగుచున్నది. ఏలన నాట్యమందు రామాది పాత్రల రూపము నటునియందు ఆరోపిత మగుచున్నది.' 66.

ధనంజయుడు కావ్యనిబద్ధ పాత్రయొక్క అవస్థను అనుకరించుటను నాట్యముగా తెలిపెను. నాటక నిబద్ధ పాత్ర నాటక కర్తయొక్క భావనాశక్తి నుండి మాత్రమే ఉద్భూతమగును. ఈ విధముగా ధనంజయుడు అవస్థానుకరణముద్వారా కవి చిత్తవృత్తినే సమర్థించిన వాడయ్యెను.

భట్ట నాయకుడు నాటక ఇతివృత్త రచన యందు కవి చిత్తవృత్తి ప్రాధాన్యత నిట్లు వివరించెను —'శబ్దార్థములు గుణీభూతములు వ్యాపారమే ప్రధానమైనది అందువలన కావ్యము శాస్త్రేతిహాసముల కన్న భిన్న మగుచున్నది. వ్యాపారమన కవి వ్యాపారము. కవి వ్యాపారమందు కవి యొక్క చిత్తవృత్తియే ప్రధానముగా నుండును. శబ్దము, అర్థము ఆ చిత్తవృత్తిని వ్యక్తముచేయు సాధనములు కనుక అవి అప్రధానములు. 67.

పైన తెలుపబడిన ఆచార్యుల అభిప్రాయముల నిట్లు క్రోడీకరింప వచ్చును

1. కవి చిత్తవృత్తి యనగా కవి మానసిన వ్యాపారము లేక కవి సృష్టించిన పాత్రలు సన్నివేశములు మున్నగు వానికి నిలయమైన నాటక ఇతివృత్త రచనకు మూలముగా నున్న కవి మానసిక స్థితి. తత్ ప్రదర్శనార్థము నటుడు నలువు ఆంగికాద్యభినయము నాట్యము ద్వారా సంపన్నమగును. కనుక నాట్య మన కవి చిత్తవృత్తి ననుకరించు నట కర్మ. నట కర్మ యందు కవిచిత్తవృత్తితో పాటు లోకానుకరణము ఇమిడి యున్నది.

2. కవి మానసిక వ్యాపారమునకు సాధనములైన శబ్దార్థములు కావ్య/నాటక ములందలి ఇతివృత్తమునకు రూపమును కల్పించును. కావ్య/నాటకము లందు శబ్దార్థ రూపమున నున్న ఇతివృత్తము ప్రధానము కాదు: దాని నుండి అవిర్భూతమై పాత్రలు, సన్నివేశములు మున్నగు వాని రూపమున నాటక మందు నెలకొని యున్న కవి చిత్తవృత్తియే ప్రధానము. కనుక భావనామయమైన కవి చిత్తవృత్తి యందు లోకవ త్తానుకరణము లేక అను సరణము ఇమిడి యుండు ననుటలో సందేహం లేదు. భౌతిక శాస్త్రవేత్తకు ప్రకృతి ముడి పదార్థమెట్లో అట్లే సాహిత్య కారునకు లోకవృత్తము మూ దవ్యము.

3. కథారచనయందు నాటక కర్తకు లోకానుసరణము అవశ్యక మెట్లో నటు నకు కథావస్తు రూపమున నున్న నాటక కర్త యొక్క చిత్తవృత్తిననుకరిం చుట ఆవశ్యకమగును. కనుక లోకవృత్తానుకరణము మరియు కవి చిత్తవృత్తి యొక్క అనుకరణము–ఇవి రెండును దృశ్యకావ్యమునకు ధర్మ ములగును.

## శబ్దార్థ సూక్ష్మపరిశీలన-Probe into word and meaning.

నాటక పరముగా అనుకరణము వివరింప బడినది ఇక కావ్యపరముగా అనుకరణ ప్రాధాన్యతను పరిశీలింతము.

భారతీయ కావ్యశాస్త్ర వికాసమునకు భరతుని నాట్యశాస్త్రమే మాతృక. నాట్య శాస్త్రమును ఆధారముగా గ్రహించి ప్రప్రథమము భామహుడు కావ్యరచ

నను, కావ్యనందమును గురించి గంభీరముగా పరిశీలించెను. ఆతని అధ్యయనమునకు పరిణామమే అలంకార సంప్రదాయము భామహుడు కావ్యశాస్త్రమును నాట్యశాస్త్రము నుండి వేరుపరచి దానికి ప్రత్యేక ప్రతిపత్తిని కల్పించెను. తదనంతరం భామహుని నుండి ప్రేరణను గ్రహించి ఆచార్యులు కావ్యశాస్త్ర వికాసమునకై ప్రశంసాత్మక కృషిని సలిపి వివిధ కావ్యసంప్రదాయములను స్థాపించిరి. కావున భారతీయ కావ్యశాస్త్ర ప్రవర్తకునిగా భామహాచార్యుడు చిరప్రసిద్ధుడు.

భరతుడు ఇతివృత్తమును కావ్య / నాటక శరీరముగా తెలిపెను– 'ఇతివృత్తంతు కావ్యస్య శరీరమ్ పరికీర్తితమ్– 'ఈతని (భరతుని) మతమున కావ్యశరీరము ఇతివృత్తము. దీని సౌందర్య హేతువు రసము 60. 'కావ్య శరీరమని కంఠోక్తిగా చెప్పక పోయినను ఇతివృత్తమే (కావ్యములకు) రూపకములకుశరీరమని యాతడు చెప్పియుండెను 61. ఇతివృత్తమన నాటకకర్త కల్పించిన పాత్రలు. సన్నివేశములు మున్నగు వానికి మూలముగా నిలిచియున్న లోకవృత్తము. నటుడు కవి కల్పించిన పాత్రలు, సన్నివేశాదులను అనుకరించి అభినయించుట వలన ప్రేక్షకుడు ఆనందము ననుభవించును. అభినయావశ్యకత లేకుండా కేవల పఠనమాత్రమున కూడా సామాజికుడు నాటకానందము ననుభవించును. కావ్యానందము కూడా అభినయము నవేక్షింపదు. ఇట్లు ఆనందానుభూతికి అభినయము అపరిహార్యము కాకయున్నది కారణమేమై యుండును? నాటకానందమునకు అభినయము వలె కావ్యము లేక అప్రదర్శనీయ నాటకము ద్వారా కలుగు ఆనందమునకు అభినయము వంటి సౌందర్య తత్త్వము యుండవలయును. ఈ దృష్టితో భామహుడు ప్రసిద్ధ కావ్యములను పరిశీలించెను.

నాటకమునకువలె కావ్యమునకుకూడా ఇతివృత్తమే శరీరము. ఇది శబ్దార్థ రూపమున దృశ్య, శ్రవ్యములకు అన్వితమై యున్నది. కవి లేక నాటకకర్త చిత్తవృత్తికి పరిణామములుగా కావ్య, నాటకములందు చిత్రితములై యున్న పాత్రలు, సన్నివేశాదులన్నియు శబ్దార్థ రూపములే ఎట్లన ప్రపంచమందలి సమస్త విద్యలన్నియు శబ్దోద్భవములే సమస్త కళలు, శాస్త్రము లన్నియు శబ్ద చమత్కారమునకు నిలయములు. ఈ దృష్టితో భామహుడు కావ్యమును శబ్దార్థ సంయోగముగా నిర్వచించెను--శబ్దార్థౌ సహితౌ కావ్యమ్. శబ్దార్థములే దృశ్య, కావ్య స్వరూపముల నేర్పరచుని భామహుడు భరతుని వాక్యమునకు సమగ్రతను చేకూర్చెను. నాటకమందు శబ్దార్థరూపమున నున్న కవి చిత్తవృత్తి అభినయము

ద్వారా ప్రదర్శితమగుట వలన సామాజికునకు ఆనందము కలుగుచున్నది. కాని కావ్యమునకు కవి చిత్తవృత్తిని అభినయము ద్వారా ప్రదర్శించు అవకాశములేదు ఐనను అది ఆనందదాయక మగుటకు కల హేతువు కవి ప్రయుక్త భాషకు సంబంధితమై యున్నదని భామహుడు గ్రహించెను. కవి చిత్తవృత్తి రమణీయ భాషా మాధ్యమమున అభివ్యక్తమగుట వలన కావ్యానందము సిద్ధించుచున్నది. కావున కావ్యభాష సామాన్య భాషకన్న రమణీయమై భాసించుట అత్యంతావశ్యకము. అన్యథా కావ్యానందము సిద్ధింపదు. ఇట్లు నాటకమందలి కవి చిత్తవృత్తి అభినయము ద్వారా ప్రదర్శితముగునట్లు కావ్యమందలి కవి చిత్తవృత్తి రమణీయ భాష ద్వారా అభివ్యక్తమగును.

కావ్యభాషకు రమణీయత కవి తన ప్రతిభాశక్తిచే సాధించిన శబ్దార్థముల వక్రత ద్వారా సిద్ధించునని భామహుడు తెలిపెను. అందువలన కవి వాక్కు రమణీయమై అందరికి ఆహ్లాదకారి యగుచున్నది. కనుక వక్రమైన ఉక్తికి (వక్రోక్తి) నిలయమైనదే కావ్య భాష భామహుని మతమందు వక్రోక్తియన లోక విలక్షణమైన ఉక్తి. అనగా సామాన్య కథనము కన్న భిన్నమైన వాగ్వ్యవహారము ఇదియే అతిశయోక్తియని, అలంకార జననియని అయన వక్రోక్తి ప్రాధాన్యత నిట్లు వివరించెను- ఇది అంతయు వక్రోక్తియే. (కావ్యాలంకారము లన్నింటికి వక్రోక్తియే మూలము) ఇది అర్థమును చమత్కృత మొనర్చును. కవులు ఇందు విశేషముగా పరిశ్రమింప వలయును. ఇది లేని అలంకార మేమున్నది .. కావ్యసిద్ధి కేవలము అర్థాలంకారములందు కాని శబ్దాలంకారమందు కాని అధివసింపదు. అది ఉభయనిష్ఠము. అలంకార విహీనమైన వనితా ముఖము శోభింపని విధమున రూపకాద్యలంకారములతో అలంకృతము కాని కావ్యము ప్రకాశింప నేరదు. 70.

అలంకార మన శబ్దార్థ వైచిత్ర్యము-వక్రాభిధేయ శబ్దోక్తిరిష్టా వాచామలంకృతా-అలంకార విహీనమైన రచన కావ్యము కానేరదు. ఉదాహరణముగా సూర్యుడస్తమించెను. పక్షులు తమ గూళ్లను చేరినవి. ఇది కావ్యమగునా? ఇది వార్త. (లోకవృత్తము). కావ్యత్వ మిందు లేదు. కనుక వక్రత-శబ్దార్థవైచిత్ర్యమే-కావ్య సర్వస్వము. వనితాముఖము అలంకారములచే శోభించునట్లు, అర్థమర్మజ్ఞుల వాక్కు అలంకారయుక్తమైనందుననే ప్రకాశమానమగును. కావున భామహుని మతమందు శబ్దార్థ వక్రత ద్వారా సిద్ధించు సౌందర్యమే కావ్యానందము

నకు హేతువు. అనగా నాటకానందమునకు అభినయము ప్రధానమైనట్లు కావ్యా నందమునకు కావ్యాలంకారములు ప్రధానములు.

## ఆలంకారిక భాష-Metaphorical Language

పై విధముగా శబ్దార్థముల సౌందర్యమును భామహుడు కావ్య సౌందర్యముగా ప్రతిపాదించెను. అదియే భాషా సౌందర్యము. భాష యన పతంజలి వచించినట్లు శబ్దార్థముల సమాహారస్థితి. నిత్యోహ్యర్థవతా మర్థైరభి సంబంధః- "కావ్యమే స్వయముగా భాషనుండి ఆవిర్భవించింది....స్థానవిశేషము మరియు ముద్రావిశేషములందు తీయబడిన ఛాయాచిత్రములవలె రచయిత తన అనుభవ విశేషమునకు అభివ్యక్తి విశేషమును కల్పించుటకు విశేష మానసికస్థితి నవలంబింప వలసి యుండును" 71. ఆ విశేష మానసికస్థితి కావ్యమందు శబ్దార్థముల వక్రతా రూపమున విద్యమానమై యుండును తద్వారా రమణీయార్థము స్ఫురించును. ఆ అర్థమే సామాజికుని ఆకట్టుకొను సౌందర్యము. సౌందర్యము సాహిత్య శాశ్వత ధర్మము.

రాత్రేవం వ్యారామసీత్ = సరస సల్లాపాలతో రాత్రి గడిచిపోయెను.
రాత్రేవ వ్యారామసీత్ = సరస సల్లాపాలతోనే రాత్రి గడచిపోయెను.

పై వాక్యము లందలి రెండవ అర్థమే అత్యంత రమణీయము. కావున కవి వస్తు స్వభావమును గురించి ప్రచలితములై యున్న విభిన్నాభిప్రాయాలను చర్చించుకొని తదాంతరిక తత్త్వము నన్వేషింప వలయును. అనగా క్రాంతదర్శి కావలయును. బాహ్య రూపములతో పోల్చి చూచినపుడు ఉపమానోపమేయములు సమానముగా నుండ నేరవు. వాని స్వభావ గుణవిశేషముల ననుసరించి అవి తులనయోగితము లగును కవి వస్తు స్వభావమునకు అధీనుడు కానేరడు. కావ్యమందు వర్ణితములై యున్న వస్తువుల గుణ-దోషములు కవి ఇష్టముపై ఆధారపడి యున్నవి. అతడు తన ఇష్టము, ఆవశ్యకతకు అనుగుణంగా చంద్రుని ఒకపరి అమృతాంశునిగా చిత్రింప వచ్చును; మరొకపరి దోషాకరునిగా వర్ణింప వచ్చు. ఇట్లు కవి వర్ణిత పాత్రలు సంఘటనలు లోక స్వభావమునకు యథాతథానుకృతులు కానేరక కవి ప్రతిభా ప్రసూనము లగుచున్నవి. ఇది యంతయు శబ్దార్థ

వక్రతా రూపమున భాసించి కావ్యానందమునకు హేతువగు చున్నది.

భామహుడు స్థాపించిన అలంకార సంప్రదాయమే తరువాత శబ్దాలంకార అర్థాలంకార రూపముల వికసించెను. ఆనందివర్ధనుడు వక్రోక్తి మాహాత్మ్యమును గుర్తించి అర్థ ప్రాధాన్యత ఆధారముగా ధ్వని సిద్ధాంతమును ప్రతిపాదించెను. ధ్వనియే కావ్యాత్మ యని సిద్ధాంతము చేసెను. ఆయన ధ్వని స్వరూపము నిట్లు వరించెను.

'ఎచ్చట శబ్దము తన అర్థమును, అర్థము తనను అప్రధాన పరచుకొని వ్యంగ్యార్థమును బోధించునో అట్టి కావ్య విశేషము ధ్వని ... అలంకృతములగు వయవముల కన్న వేరుగా గుణాలంకారాద్యువస్కృత మగు వాచ్యము కన్న వేరు నే లావణ్యము చక్కని వనితలందే లోచనామృత మగునట్లు, ప్రతీయమానార్థ మను మహాకవుల పలుకులలోనే సహృదయుల కెరుగ వచ్చును. ఆ అర్థమే వ్యాత్మ. ప్రాచీన కాలమున క్రౌంచ ద్వంద్వ వియోగోత్పన్న ఆదికవి శోకము కిని ద్వారా) ఈ యర్థ ప్రభావమున శ్లోకముగా పరిణమించినది'' 72.

ఆనందవర్థనాచార్యుల ధ్వని సిద్ధాంతము సాహిత్య ప్రక్రియ లన్నింటికి న్వయించు ఏకైక సిద్ధాంతముగా ప్రసిద్ధి నందినది. తరువాతి సాహిత్యాచార్య ందరు ధ్వని సిద్ధాంతమును సమర్థించి అర్థపరముగా కావ్యమును నిర్వచించిరి పండిత రాయలు జగన్నాథుడు కావ్యమును రమణీయమైన అర్థమును ప్రతిపాదించు బ్దముగా నిర్వచించెను- రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్. పై విధముగా భారతీయ కావ్య శాస్త్ర మందు కావ్య స్వరూపము శబ్దార్థ పరమైన వక్రోక్తి ఆధారముగా నిర్ధారింపబడినది; అనుకరణ పరముగా కాదు యనుట ఇట స్పష్టము. వక్రోక్తి కావ్యసంప్రదాయ ప్రవర్తకుడైన కుంతకుడు శబ్దార్థ వక్రతయే కావ్య మని తెలిపెను.

> ''సహృదయు నాహ్లాదపరచు కవి యొక్క వక్ర వ్యాపారయుక్తమైన రచన వ్యవ స్థితములైన శబ్దము మరియు అర్థముల సార్థక సంబంధంతో సము ద్భూతమై కావ్యముగా వ్యవహృత మగును'' 73.

## అనుకరణ/ప్రతిభ-Imitation/Genius.

పాశ్చాత్య కావ్యశాస్త్రమందు ప్రధాన కావ్య సిద్ధాంతముగా స్థిరపడిన అను కరణముతో భారతీయాచార్యులు ప్రతిపాదించిన శబ్దార్థవక్రతకు కల సంబంధ మును వివేచించి చూడవలసి యున్నది. కావ్యమును ప్లేటో ప్రకృతికి అనుకృతి గా తెలిపెను. ప్రకృతి యన జగత్తు, ఇది మిథ్య, లోకవృత్తము ఈ మిథ్యా జగ త్తునకు సంబంధితమై యున్నది. కనుక ప్లేటో దృష్టియందు ప్రకృతిని అనుకరిం చుట యనగా లోకవృత్తమును అనుకరించుటే యగుచున్నది భారతీయులు లోక వృత్తమును శబ్దార్థ రూపమున భావించిరి. కావ్యము శబ్దార్థసహితమగుట వలన ప్లేటో దృష్టియందు కూడా కవి నుకరణము శబ్దార్థ రూపమైన భాషా మాధ్యమ మున నే జరుగును. భాషకు మించిన వేరే మాధ్యమము కావ్యమున కేదియును లేదు. ఈ దృష్టితో ఆలోచించినపుడు ప్లేటో తెలిపిన కావ్య స్వరూపము ఈ తీరున భావిత మగును- శబ్దార్థరూపమున నున్న లోకవృత్తమునకు కావ్యము అనుకృతి లేదా భాషారూపమున కావ్యము ప్రకృతికి అనుకృతి కాని భారతీయాచార్యుల వలె ప్లేటో రమణీయార్థమును ప్రతిపాదింప లేదు అట్లు తెలిపియే యున్నచో ఆతని దృష్టి యందు కావ్యము ప్రకృతికి రమణీయ అనుకృతియై యుండెడిది. ప్లేటో అట్లు భావింపక కావ్యమును కేవలము లోకవృత్తము లేదా ప్రకృతికి అనుకృతి గనే తెలిపెను. తద్వారా అనుభూతమగు ఆనందము రమణీయము కానేరక అను కృతమైన లేదా కృత్రిమమైన ఆనందమే యగును. అందువలన కావ్యము సహృ దయా వర్జకము కానేర కున్నదని ప్లేటో ఆవేదనను వ్యక్తపరచెను.

సుప్రసిద్ధ హిందీ సాహిత్య విమర్శకుడైన డా. నగేంద్రగారు అనుకరణ విషయమున తమ అభిప్రాయము నిట్లు వ్యక్త పరచిరి-

> ''నాటక మందలి అనుకరణ వ్యవస్థ నట-కర్మను సంబంధితమైయున్నది" కవి-కర్మకు కాదు. అట (పాశ్చాత్యదేశములందు) కవి కర్మ (కవి-నిబద్ధ ధీరోదాత్తాది పాత్రల వ్యవస్థ) అనుకృతికి విషయము. అనగా అనుకార్య మే యగును. భారతీయ కావ్యశాస్త్రమందు అనుకరణమునకు సామాన్య ముగా ఈ అర్థమే మాన్యమగుచు వచ్చినది. 74.

కావ్యము అభినయాత్మకము కానందున కావ్యశాస్త్రాచార్యులు నాట్యపర మైన అనుకరణ శబ్దమును కావ్యస్వరూప వివేచనమందు ఉపయుక్తము కాదని భావించి యుందురు. అనగా కావ్య రచనా ప్రక్రియ యందు వారు కవి అనుక రణకు ప్రాధాన్యమీయ లేదు.

> "భారత దేశమందు నటుని కన్న కవియే అధికతరముగా సమ్మానితుడై యున్నాడు మరియు అభినయము కన్న కావ్యమే (అధిక రమణీయము). కావ్యము ఇట్లు అధిక ఆదరణీయమైనందున "అనుకరణము" వంటి అల్ప తర శబ్దము కావ్యపరముగా ప్రయోగింపబడక కళాపరముగా (అభినయము నృత్తము, చిత్రము మున్నగువానికి) ఉపయోగితమైనది" 75.

ఐనపుడు నటుని అనుకార్యమందు అనగా కావ్య/నాటక పాత్ర, సన్నివేశా దులకు నిలయమైన కథావస్తు రచన యందు కవి అనుకరణ కార్యమేతీరుననుండునో పరిశీలించినయెడల భారతీయ కావ్యశాస్త్రానుసారము అనుకరణము నిర్వహించు పాత్ర బోధపడును. తద్వారా భారతీయ కావ్య దృష్టితో ప్లేటో కావ్య దృక్పథము ఎంతవరకు సరిపడి యున్నదో అవగతము కాగలదు ఈ విషయమును సాంగో పాంగముగా చర్చించి డా॥ నగేంద్రగారు సారాంశము నిట్లు తేల్చరి–

> "భారతీయ కావ్యశాస్త్రమందు కవి కవర్తృత్వము రెండు విధములుగా అంగీకృతమై యున్నది. 1. అంతరంగము = వస్తు రహస్య దర్శనము. 2. బహిరంగము = దానిని శబ్దముల ద్వారా ప్రదర్శించుట. ఈ రెండు భేదములు కేవలము వ్యావహారిక దృష్టితో ఏర్పడినవి. తాత్త్విక దృష్టితో ఇవి రెండును అభిన్న రూపమున సమన్వితములు. అనగా కావ్యము ఈ రెండింటికి సమన్విత క్రియాత్మక రూపము. కనుక అది అనుకృతి కానేరదు. శాబ్దిక అర్థము నందు కాని తాత్త్విక అర్థమునందు కాని .. వీని అన్నింటికి మూలమైన అర్థమొకటే. అదే మన కవి వస్తువు యొక్క స్థూల రూపము ననుకరించడు. అట్లే ఏదేని అభూత వస్తువును సృష్టింప లేడు. అతడు తన ప్రతిభాశక్తిచే లౌకిక జగత్తునందలి మార్మిక రూపమును ఉద్ఘాటించును. కవి ప్రతిభ యన రసాత్మక రూపముల నున్మేషింప జేయు శక్తి" 76.

లోకస్వభావము/లోకవృత్తాంతము నందలి మార్మిక ఘట్టములను రమణీయార్థ ప్రతిపాదక శబ్దముల మాధ్యమమున వ్యంజిత మొనర్చుట కవి కర్తవ్యమని పై వాక్యముల ద్వారా స్పష్టము. ఈ గురుతర కార్య నిర్వహణమందు కవికి స్వీయ ప్రతిభా సహకారము అనివార్యముగా అపేక్షితము. ఐనను అది ఆకస్మాత్ సంభవం కానేరదు. లోకవృత్త పరిశీలన, మార్మిక ఘట్టముల భావన మరియు రమణీయ భాషా మాధ్యమమున అభివ్యక్తి-యను మూడు దశల యందు వికసితమై కవి-కర్మ లక్ష్య సిద్ధిని పొందును. కనుక కవి ప్రతిభ కావ్యరచనయందు మూడు రూపముల ప్రయత్నశీలయై యుండును.

1. అనుకరణ రూపము - Imitative form.
2. భావనా రూపము -Imaginative form.
3. భాషారూపము - Linguistic form.

మొదటి దశయందు కవి ప్రతిభ సామాన్యమైన అనుకరణ రూపమున లోకవృత్తాంతమును పరిశీలించును. ఇది ఒకరకమున వస్తుస్వభావమును ఉన్నది యున్నట్లుగా పరిశీలించుట యగును. పరిశీలన జరుగనిదే వస్తువు యొక్క ఆంతరిక తత్త్వావగాహన కుదురదు. పరిశీలన దశయందు కవి ప్రతిభ యథాతథానుకరణ రూపమున నుండును. తదనంతరం ప్రతిభ వస్తు పరిశోధన కాయత్తమగును. ఈ రెండవ దశయందు కవి ప్రతిభ వస్తు తత్త్వావగాహన నిమిత్తం భావనా రూపమున వస్తువు యొక్క అంతర్జగత్తున ప్రవేశించును. ఇది భావనా రూపమున మాత్రమే సాధ్యము. ఈ దశయందు మొదట గ్రహింపబడిన వస్తువు యొక్క అస్తవ్యస్తముగా నున్న అనుకరణాత్మక రూపము అవాస్తవికముగా, అవిశ్వసనీయముగా పరిణమించును. అందువలన ప్రతిభ భావనారూపమున మొదటిదాని కన్నభిన్నమైన వక్రమార్గమున వస్తు అంతర్జగత్తును, పరిశోధించును. ఇది యొకరకమున సత్యమును రాబట్టుకై న్యాయాధికారి వక్రమార్గమున (Cross examination) దోషి మానసిక స్థితిని పరీక్షించు వంటిదగును. తత్పరిణామముగా లోకవృత్తము అనుకరణ రూపము కన్న భిన్నముగా, సార్వజనీన రూపమున కవి భావనయందు సాక్షాత్కరించును. ఈ పరిశోధనా కార్యము భావనారూపమున ప్రతీయమానమైన ప్రతిభ ద్వారా సంపన్నమగును. భావనారూపమున నున్న వస్తు సత్యమునకు భాషారూపమును కల్పించుటకై కవి

ప్రతిభ వస్తుసత్య పరిశోధనమందు వహించిన క్రాంతదృష్టినే అవలంబించి ఉప యుక్తభాషా రూపమును శబ్దార్థవక్రత ద్వారా సాధించును. ఆ భాషాభివ్యంజక రూపమే కావ్యము. ఈ మూడవ దశయందు కవి ప్రతిభ అభివ్యంజనా రూపమున ప్రతీయమానమై లక్ష్యమును చేరుకొనును. పై విధముగా కావ్యరచన అనుకరణ రూపమున ఆరంభమై, భావనా రూపమున ప్రతీయమానమై, భాషారూపమున సంపన్నమగును.

## అనుకరణము/వక్రోక్తి-Imitation/Evasive Speech.

ఉపర్యుక్త వివేచన ఆధారముగా కావ రచనా ప్రక్రియ శబ్దార్థ వక్రతా వ్యాపార మనుట స్పష్టము. అదియే లోకోత్తరమైన కవి కర్మ ఏలన కవి కర్మకు ఫలమైన కావ్యము శబ్దార్థ వక్రతా రూపమున భాసమానమైన భాషయేయగును ఈ క్రమమున కవి-కర్మ వికసించి కావ్యరూపమున అవతరించును—

లోకవృత్తము ≫ అనుకరణము ≫ బావవక్రత ≫ భాషావక్రత = వక్రోక్తి (కావ్యము)
Nature ≫ Imitation ≫ evasion of ≫ evasion of = Evasive Speech Poetry)
Ideas language

కావున వక్రోక్తియేకావ్యము. పై నిరూపణము ఆచార్యకుంతకుని వక్రోక్తిసిద్ధాంతమునకుభిన్నముకాదు—శబ్దార్థముల కలయిక కావ్యము శబ్దము, అర్థము అనునవి రెండుగా నుండక ఏక రూపమున కన్పించుటయే విచిత్రమగు కావ్యోక్తి. అందుచే శబ్దమునే కావ్యమని, అర్థమునే కావ్యమని ఎంచువారు సరియైన లక్షణము నీయలేరు. ఏకత్వ బంధమే ఆహ్లాదకారి. ఈ ఏకత్వము వక్రోక్తి ద్వారావచ్చునది శబ్దార్థముల సమ్మేళనమే సాహిత్యము....కవి-కర్మ కౌశలమగు మార్గమున శబ్దార్థములను యోజించుట వక్రోక్తి. ఇది విచిత్రమగు అభిధ. దీనినే అసాధారణమైన శైలి అందురు. ఈ విచిత్రాభిధలో అంతర్లీనముగా వక్రత్వ మనబడు వక్రభావమును వైచిత్ర్య మనవచ్చును దీనిని "శాస్త్రాది ప్రసిద్ధ శబ్దార్థోపనిబంధ వ్యతిరేకి'' అని ప్రసిద్ధ ప్రస్థాన వ్యతిరేకి'' అని అతిక్రాంత ప్రసిద్ధ వ్యవహార సరణి'' అని కూడా చెప్పినాడు" సామాన్య వ్యవహారమున కన్పించు ప్రయోగ

సరణికన్న భిన్నమైన దిది. వక్రోక్తి తెచ్చు వైచిత్ర్యమే కావ్యమున గల కావ
త్వము. ఇది కవి ప్రతిభ వలన వచ్చు విశిష్ట శబ్దార్థ రచనలో కన్పించు విశేషవ
కనుక వక్రత కవి వ్యాపారము కాక కవి వ్యాపార వక్రత్వము అనునది కవిత
హేతువు" 77.

కావున కావ్యము ఇతివృత్త రూపేణ, భాషా రూపేణ వక్రోక్తియగును
అట్లు కానియెడల లోకవృత్తము లేదా ఇతివృత్తమునకే భాషారూపమును కల్పిం
చుట వలన కలిగెడి ప్రయోజన మేమి?— నహికవే ఇతివృత్త మాత్ర నిర్వహే
కించిత్ ప్రయోజనమ్-(ఆనందవర్ధనుడు) ఆనందవర్ధనుడు శబ్దార్థ వక్రతను మూ
ముగా గ్రహించి ధ్వని సిద్ధాంతమును స్థాపించెను. రమణీయమైన ప్రతీయమా
మే ధ్వని; అదియే కావ్యాత్మయని ఆయని సిద్ధాంత మొనర్చెను. రమణీయా
ప్రతీయమానమునకు మూలము శబ్దార్థ వక్రతయే. జగన్నాథుడు రమణీయ
అర్థమును ప్రతిపాదించు శబ్దమునే కావ్యముగా నిర్వచించెను ఇట్లు కావ్యము లోక
వృత్తమునకు రమణీయమైన వక్రోక్తి రూపమున హృదయాహ్లాద కారి యగ
చున్నది.

ఇక కావ్యసత్యమును ఇంచుక పరిశీలింతము. కావ్యము ప్రదర్శించు కథా
వస్తువు, పాత్రలు. సన్నివేశములు మున్నగునవి అసత్యములు కావు అవి అను
కృతికి వక్రోక్తి యైనందున సత్యములు కూడా కానేరవు. ఐనను అవి రమణీయ
భాషా రూపమున అనగా వక్రోక్తి రూపమున వాస్తవికములుగా మనకు విశ్వసనీ
యము లగుచున్నవి. కారణం అవి లోకవృత్తమునకు అనుకృతములై యుండియు
వక్రతా వ్యాపారమున ఆ పరిధి నధిగమించి వక్రోక్తి రూపమున సార్వజనీనము
లగును. రాజశేఖరుడు కావ్యమీమాంస యందిట్లు తెలిపెను—"కావ్యమున విషయ
ములు ఉన్నవి ఉన్నట్లు చెప్పబడుట లేవు. కవి ప్రతిభా నిబంధనమైన విషయ
ములే ఇచట గలవు కవి భావన, రచనా విన్యాసము అనునవి ఒకే విషయమును
అనేక విధముల చూపగలవు. చంద్రుని పొగడ దలచినపుడు అమృతాంశుడని,
దూషించునపుడు దోషాకరుడని కవి అనగలడు" 78. కనుక కావ్యమున ఇది
సత్యము అది అసత్యము అనుటకు వీలు లేదు. సారాంశముగా కావ్యము లోక
వృత్తానుకరణము నధిగమించిన వక్రోక్తి రూపము. అనుకరణ పరిధి నధిగమించి

నందున వక్రోక్తి రూపము సత్యాసత్యముల కతీతముగా సౌందర్యశాలియై విరాజిల్లును.

పరంపరాగతమైన అనుకరణ సిద్ధాంతమునే ప్లేటో కావ్యమున కన్వయించెను. ఆయన కావ్యమును ప్రకృతికి అనుకృతిగా ప్రతిపాదించెను. అతని దృష్టియందు కూడా కావ్య రచనాప్రక్రియ భారతీయ కావ్య దృక్పథమునే పోలియున్నది.

ప్రకృతి> అనుకరణము> భావానుకరణము> భాషానుకరణము = అనుకరణోక్తి (కావ్యము)

Nature> Imitation> Imitation of Ideas> Imitation of Language = Imitative spech (Poetry)

ప్లేటో దృష్టియందు కావ్యము ప్రకృతికి నకలు (Copy). నీటి యందలి ప్రతిబింబమువలె, అద్దములోని నీడవలె కావ్యము ప్రకృతిని లేక లోకవృత్తమును కుడిని ఎడమగా, ఎడమను కుడిగా ప్రదర్శించి సామాజికునిలో భ్రాంతిని సృష్టించును. తద్వారా సామాజికు డనుభవించు ఆనందము లోకవ్యవహారమునకు భిన్నమై మానవతకు శ్రేయము కాకయున్నది. అనుకృతి మూల రూపముకన్న నవ్యమై రాణించినపుడే ఆదరణీయ మగును; ఆనందదాయక మగును. అనుకృతియైన కావ్యముము లోకవృత్తముకన్న రమణీయతరముగా భాసించి హృదయావర్జకముగా నుండవలయును; కాని అట్లుకానేరక అపనవ్యముగను, విపరీతముగను యున్నది. కావ్యభాష సైతము లోకవ్యవహారమునకు భిన్నముగా ప్రయోగితమై సామాజికునిలో భ్రాంతినే సృష్టించును. ఇట్లు కావ్య వస్తువు మరియు కావ్యభాష-రెండును లోకవత్తమునకు రమణీయా కృతిని కల్పింప లేక ఆదరపాత్రములు కాజాలకున్నవి. అందువలన కావ్యము అనుకృతిగా (అనుకరణోక్తిగా) మాత్రమే పరిగణింప బడును. వాస్తవంగా కావ్యము వస్తువు యొక్క స్వరూప నిరూపణకు మాత్రమే పరిమితము కానేరక వస్తువు యొక్క స్వరూప నిరూపణకు సౌందర్యాత్మక భాషారూపము కావలయును. అపుడే అది స్వర్లోకమును మనముందు సాక్షాత్కరింప జేయును. అట్టి ఉదాత్త కావ్య రచనకై ప్రతిభా సంపన్నుడైన కవిని ప్లేటో ఆహ్వానించెను. అతడే సహృదయావర్జకముగా కావ్యకృతులను వెలయించి దేశ సంక్షేమమునకు పాటుబడ గలడు. సారాంశముగా ప్రకృతి లేదా లోకవృత్తానుకరణమందు

కవియొక్క దివ్య ప్రతిభను ప్లేటో అపేక్షించెను.

ఇట్టి మహదాశయమును కలిగి యుండియు ప్లేటో అనుకరణమను అల్పతర పదమును కావ్యపరముగా ఏల వాడెను? యను సంశయము కలుగక మానదు. అనుకరణ పదప్రయోగయు ప్లేటో మౌలికము కాదు ప్రాచీన గ్రీకు సారస్వత మందు ప్రధాన సిద్ధాంతముగా స్థిరపడియున్న. మిమెసిస్ Mimesis – పదమునే ప్లేటో కావ్యమున కన్వయించెను. కనుక కావ్యపరముగా అనుకరణపదము అవాం ఛనీయ మనుటకు వీలు లేదు. నేడు పాశ్చాత్య దేశములందు 'మిమెసిస్'కు అను కరణము పర్యాయపదముగా వాడబడుచున్నది. అసలు 'ఇమిటేషన్' మిమెసిస్‌కు పర్యాయము కానేరదని, అంతటి అర్థమును బోధించు క్షమత ఇమిటేషన్‌కు లేదని పాశ్చాత్య విదుల అభిప్రాయము. ఏది యెట్లున్నను అరిస్టాటిల్ కావ్యశాస్త్ర మును రచించి గురువైన ప్లేటో కావ్యాశయమును ఫలవంతము కావించెను; మిమె సిస్‌కు నూతన తేజమును ప్రసాదించెను.

ఇక అనుకరణమును వివేచించిన ప్రముఖ భారతీయ సాహిత్యాచార్యుల అభిప్రాయములను తెలిసి కొందము.

''సాహిత్యమందు కానవచ్చునది ప్రాకృతికమే యైనను అది మనకు ప్రత్య క్షము కానేరదు. ప్రకృతి యందలి ఈ లోపమును పూరించు అవసరము సాహి త్యమునకు కలదు. అందు వలన సాహిత్యము ప్రకృతికి ప్రతిబింబము కానేరదు ఒక్క సాహిత్యమే కాదు ఏ కళ యైనను ప్రకృతిని ఉన్నది యున్నట్లు అనుకరిం పదు'' 79

—రవీంద్రుడు.

''అనుకరణ మనగా ఆదర్శీకరణము. అది వస్తువు లెట్లున్నవని కాదు; ఏ తీరున నుండ వలయును? ఇంద్రియముల కేతీరున ప్రతీతము లయ్యె ననుటకాదు; ప్రతిభ ద్వారా అవి ఏ తీరున సంభావ్యము లగును? మరియు బాహ్య జగత్తున వాని స్వభావ మిట్లున్నదనియు కూడా కాదు; భావనా జగత్తున వాని రూప మేతీ రున నున్నదో అనుకరణము నిరూపించును'' 80.

—కె.సి. పాండే.

సారాంశముగా కావ్య స్వరూప నిర్ణయమందు ప్లేటో మరియు భారతీ యాలంకారికుల దృక్పథముల నిట్లు క్రోడీకరింప వచ్చును–

1. ప్లేటో అనుకరణమును కావ్య అనివార్య తత్త్వముగా ప్రతిపాదించెను. భారతీయాచార్యులు అనుకరణమును నాట్య పరముగా సమర్థించిరి. కావ్య/నాటక రచనయందు అనుకరణ ప్రభావము గుర్తింపబడినది.

2. అనుకరణము ద్వారా ప్లేటో ఉదాత్త కావ్యానుభూతి నాశించెను. భారతీయాచార్యులు వక్రోక్తి ద్వారా కావ్య రసానందమును నిరూపించిరి.

3. ప్లేటో దృష్టియందు కావ్యము అనుకృతి; భారతీయాలంకారికుల మతమందు కావ్యము వక్రోక్తి.

4. అనుకరణమందు కవి ప్రతిభా నివేశనమును ప్లేటో ఆశించెను; వక్రోక్తియందు కవి ప్రతిభా నివేశనమును భారతీయాలంకారికులు సాధించిచూపిరి.

5. అనుకృతి యైనందున ప్లేటో దృష్టి యందు కావ్యము అసత్యము, అవిశ్వసనీయము; వక్రోక్తియైనందున భారతీయాలంకారికుల మతమందు కావ్యము సత్యము, విశ్వసనీయము.

## అనుపయుక్త నిషేధము–Prohibition of Unfit.

కవి–కర్మకు సామాజికుడే లక్ష్యము. కావ్యము సామాజికునిపై నెరపు ప్రభావమే కావ్యప్రయోజనము. కావ్య రచనానంతరం కవి స్వయముగా ప్రభావితు డగుట సహజం. ఐనప్పటికిని కవి పొందు అనుభవము కన్న సామాజికుని అనుభూతియే కావ్య ప్రధాన ప్రయోజనముగా పరిగణింప బడును. కారణమేమన సామాజికులే నిజమైన కావ్య భోక్తలు; మరియు వారి అనుభూతియే సమాజమందు ప్రతిఫలించును కావ్యము సామాజికునిలో కల్గించు భావోద్వేలన ఆధారముగా సమకాలీన సాహిత్యముచే దుష్ప్రభావితమైన సామాజిక స్థితిగతులను దృష్టియందుంచుకొని ప్లేటో సాహిత్య నిష్ప్రయోజకతను నిరసించెను. సాహిత్యము సామాజికునిలో అనైతిక భావముల నుద్రేకపరచి దేశసంక్షోభమునకు కారక మగుచున్నదని ప్లేటో అశ్లీల సాహిత్యమును నిషేధించెను. ఆయన వ్యక్తపరచిన సాహిత్య దృక్పథము భారతీయాచార్యుల కన్న భిన్నంగా కానరాదు. భారతీయ సాహిత్యా

చార్యులు సైతం క్షుద్రసాహిత్య పరంగా అశ్లీల సాహిత్యమును నిషేధించియే యున్నారు. తద్పరిణామమే "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" యనెడి ప్రచండ శాసనము యొక్క ఉత్పత్తి. కావ్యములు ధర్మ-మోక్షములను త్రోసిపుచ్చి అర్థ-కామములే జీవన సర్వస్వమను నీతిని బోధించును కనుక కావ్యాలాపములను విన రాదని భావము.

అద్యాచార్యుడైన భరతుడు నాటకమునకు నీచప్రవృత్తుల, స్వారస్య రహితుల జీవన చరితలు ఉపాదేయములు కానేరవని తెలిపెను. అట్టి నాటకములు ప్రేక్షకులకు ఇంద్రియానందమును మాత్రమే కల్గించును; వారి నైతిక ప్రవృత్తినిభంగ పరచును. భామహాచార్యుడు అట్టి దృక్పథమునే ప్రకటించెను-దేశ, కాల, కళ, (సంగీత, చిత్ర, శిల్పాదులు) లోకన్యాయము (రాజనీతి) అగమము (ధర్మము) మున్నగువానికి విరోధములైన ప్రసంగములను కావ్యము నుండి పరిహరింప వల యును. అప్రియుక్తమైన దానిని వర్ణింప రాదు. ఏలన అది మనల మోహావలయ మున పడవేయును 81. దండ్యాచార్యుడు అప్రయుక్తమును దోషముగా పరి గణించి అది కావ్యమునకు శ్రేయస్కరము కాదని తెలిపెను. కనుక కవిపుంగవులు వానిని పరిహరింప వలయును. కవి ప్రమాద వశాత్తు ప్రసిద్ధికి వ్యతిరేకముగా వర్ణించినచో అది దేశ, కాల విరోధము కాగలదు. కావున కావ్యమున నల్పమైన దోషమును కూడా ఉపేక్షింప రాదు శరీరమెంత సుందరముగా నున్నను చిన్న బొల్లిమచ్చ (శ్వేత కుష్ఠము)ఉన్నచో నసహ్యముగా నుండును. 82.

తరువాత ఆచార్యుల దృష్టి కావ్య భాషాసౌందర్య నిరూపణ మందు లగ్నమై యున్నందున వారు శబ్దార్థ పరముగా కావ్య దోషములను నిరూపించిరి. ఆ దోషములు నేరుగా కావ్య వస్తుగత దోషములుగా కన్పట్ట కున్నను పరోక్షముగా అసభ్య, అశ్లీల, జుగుప్సాకర సన్నివేశములు కావ్యము నుండి సర్వదా పరిహార్యములను భావమునే సూచించును. ఉదాహరణముగా— అప్రతీతి, అనర్థకము, గూఢార్థము, వ్యర్థము, విద్యావిరుద్ధము మున్నగునవి. కావ్యమందు కథావస్తువు వర్ణిత మగును. కావ్య కథాశ్రేష్ఠతకు అసభ్య, అనైతిక వర్ణనలు తగవని పూర్వాచార్యులు హెచ్చరించియే యున్నారు. అట్టి వర్ణనలతో నిండియున్న కావ్యము సహృదయుల నలరించ జాలదనివారి దృఢమైన అభిప్రాయము.

భారతీయాలంకారికులు నిరూపించిన కావ్య దోషములన్నింటిని నాలుగు రకములుగా విభజింప వచ్చును. శబ్ద, రస, అర్థ, వర్ణనా దోషములు. వర్ణనా దోషములే కావ్య వస్తువుకు సన్నిహితంగా సంబంధితములు. అవియే కావ్యవస్తు స్వభావమును నిరూపించునవి. వర్ణనా దోషము లిట్లు తెలుప బడినవి-పూర్వాపర విరోధములు, ప్రకృతి విరోధములు, అర్థ (భావ) విరోధములు, స్వభావ విరోధములు. ఈ దోషములను కలిగియున్న కావ్యము సామాజికుని రసానందమునకు దోహదము కానేరక కేవలము వారికి ఇంద్రియ పరితోషమును మాత్రమే కల్గింపనని వారి తలంపు. ప్లేటో సైతము అల్పతర కథావస్తు వర్ణనను దృష్టి యందుంచు కొనియే కావ్య ప్రభావము సమాజమునకు హానిప్రదమనెను.

భారతీయాలంకారికులలో ఆనందవర్ధనుడే కావ్య కథావస్తు రచనయందు అధిక శ్రద్ధ వహించెను అతని మతమందు కావ్యరసానుభూతి కావ్యకథావస్తువుతో సనిష్ఠముగా సంబంధితమై యున్నది. వస్తువు దోషయుక్తమై అశ్లీల వర్ణనాదులకు నిలయమైనపుడు సహృదయము విశ్రమింప జాలదు. ఇంద్రియములకు మాత్రమే తృప్తి నొసంగును ఆయన అనౌచిత్యమునకు మించిన వేరే రసభంగకర దోషము లేదని తెలిపెను. రసవంతమైన కథావస్తు రచనయందు కవి పాటింప వలసిన ఆవశ్యక నియమములను సైతము నిర్దేశించెను. ఆయన కావ్యము ద్వారా సహృదయునకు కలుగు అర్థబోధను [ధ్వని] ప్రాతిపదికగా గ్రహించి సమగ్ర కావ్య ప్రపంచమును మూడుశ్రేణులుగా విభజించెను. వస్తుధ్వని కావ్యము, అలంకార ధ్వని కావ్యము, రసధ్వని కావ్యము. రసధ్వని కావ్యము పరమార్థ ప్రతిపాదక మగుట వలన ఉత్తమము. తద్వారా అనుభూతమగు ఆనందమే రసానుభూతి. వస్తుధ్వని కావ్యము సామాన్య అర్థమునే ప్రతిపాదించునది యగుట వలన ఇంద్రియానందమునే కల్గించును, కనుక అది అధమకావ్యము. అలంకారధ్వని కావ్యము మధ్యమము. కుకవుల రచనలు వస్తువునే ధ్వనింప జేయును. కాని రసమును కాదు. అందువలన అది నైతిక సంక్షోభమునకు కారక మగును.

క్షేమేంద్రుడను అలంకారికుడు ఔచిత్యమను ప్రత్యేక కావ్య సంప్రదాయమును స్థాపించెను. ఆయన ఉచితమైన భావమును ఔచిత్యముగా తెలిపెను ఉచితస్య భావః ఔచిత్యమ్. అనగా కావ్యాంగములన్ని సరియైన పద్ధతిలో సమకూర్పబడుట. ఆయన ఔచిత్యమునే కావ్యజీవితముగా తెలిపెను. ఔచిత్యవంతములు

కాని రచనలన్నియు దోషభూయిష్ఠములే వాని ద్వారా కలుగు అనుభూతి సమ మునకు హానికారక మగును. అనౌచిత్యమును భారతీయాచార్యులు రసాభాస లుగా పేర్కొనిరి. రసభావము అనౌచిత్యమున బ్రివర్తిల్లినచో క్రమము రసాభాస, భావాభాసములగును అనౌచిత్య ప్రవృత్తత్వే త్వాభాసో రసభావయో (విశ్వనాథుడు), అనౌచిత్యమును జగన్నాథుడు లోక మర్యాద తిక్రమణ తెలిపెను. ఏ విభావమున ననుచిత రత్యాదులు కలుగునో యది రసాభాసము- అనుచిత విభావలంబనత్వం రసాభాసత్వం.

పై విధముగా భారతీయాలంకారికులు కావ్య దోషములను, రసాభాస భావాభాసములను క్షుద్రకావ్యపరముగా నిర్ణయించి అట్టి కావ్యము సహృదయ సమాజమునకు తగదని హెచ్చరించిరి అల్పతర కావ్యవస్తువు సర్వదా పరిహార్య మని విద్యానాథుడు స్పష్టముగా తెలిపెను—

> "యత్ర పునరుత్తమ చరితం ననిబధ్యతే తత్కావ్యం పరిత్యాజ్య మేవ తద్విషయాచ స్మృతిః" కావ్యా లాపాంశ్చ వర్జయేత్
> —ఏ కావ్యమున నుత్తము పురుష చరిత్రము నిబద్ధము కాదోయా కావ్యము పరిత్యాజ్యమే. కావ్యాలాపములను విడువ వలె నను స్మృతి వచనము దాని విషయమే.

విద్యానాథుని వాక్యములు ప్లేటో కావ్య దృక్పథమును తలపింప జేయ- నేరవని ఎట్లన గలము?

## విశిష్ట ప్రయోజనము - Sublime Function

దేశ శ్రేయస్సును చేకూర్చు ఉదాత్త కావ్యమును ప్లేటో ఆదరించెను. నీతిని పోషించి, ధర్మనిరతిని పెంపొందించి, దేశాభ్యుదయమునకు పాటుబడు ఆదర్శ నాగరికునిగా మానవుని నడవడిని సంస్కరించునదే ఉత్తమ కావ్యము ఇట్టి గురుతర బాధ్యతను నిర్వహింప వలయునన్న కావ్యము జ్ఞానోపదేశాత్మక ప్రయో జనమును కలిగియుండి భావోద్వేలన ద్వారా సామాజికుని ఉదాత్తానందానుభూతికి తోడ్పడవలయును. అట్టి అనుభూతియే ప్లేటో దృష్టియందు దివ్యానందము [Bliss) కావున కావ్యము రెండు ప్రధాన ప్రయోజనములను కలిగి యుండవలయునని

బోధ పడును. 1. జ్ఞానోపదేశము–Instruction 2. ఆనందాత్మకము–Deligth ప్లేటో మతమందు ఉపయోగవంతమైనదే ఆనందదాయకము. ఈ రెండింటి సమన్వయాత్మకతను దివ్యానందముగా. రసానుభూతిగా పేర్కొనవచ్చును. ఐనను ధర్మరాజ్య సంస్థాపనా దృష్టిలో ప్లేటో జ్ఞానోపదేశాత్మకతకే అధిక ప్రాధాన్యత నిచ్చెను. భారతీయాచార్యుల దృష్టి కూడా ప్లేటో దృక్పథమునే పోలియున్నది. కావ్యానంద ప్రకియా నిరూపణమందు అంతగా అంతరము కానరాదు.

భరతుడు నాటక ప్రయోజనము నిట్లు వివరించెను—

" నాటకము మానవులందరకు వారువారు చేయవలసిన విధులను పనులను తెలుపును: హితమునుపదేశించును: ధర్మమునకు విరుద్ధము కానిది లోకములో ప్రసిద్ధి చెందుటకు కారణమైన దానిని చూపును; ఆయుర్వృద్ధికరము, హితకర్ముమునై బుద్ధిని వికసింపజేయును .. నాటకమందు ప్రదర్శింపబడు విభావానుభావ సంచారి భావముల సంయోగము వలన రసము నిష్పన్నమగును. బెల్లము మొదలగు పదార్థములతోను, వ్యంజన ద్రవ్యములతోడను రుచులు బయలుదేరునట్లు నానాభావోపగతములగు స్థాయిభావములు రసములుగా పరిణమించును.అందు వలన నాటకము దుఃఖ, శోక శ్రమ వలన క్షోభజెందిన వారికి, తపస్సుజేసికొను వారికి విశ్రాంతి నొసంగును" 83.

పై వాక్యముల ద్వారా బోధపడు అంశములు రెండు–

1. నాటకము హితము (పరమార్థము) నుపదేశించును.
2. నాటకము రసము అను ఆనందమును కల్గించును.

తరువాతి ఆచార్యులందరు పై ప్రయోజనములను దృష్టి యందుంచుకొని అన్య ప్రయోజనముల నిట్లు విస్తరించిరి–

"సత్కావ్యము వల్ల పురుషార్థముల ప్రాప్తి కళలయందు వివేకము కలుగుటయే కాక కీర్తియు, ప్రీతియు కలుగును" 84 — భామహుడు

"కావ్య ప్రయోజనము త్రివర్గ సాధనము. అనగా ధర్మార్థకామములు 85.

—అగ్ని పురాణము.

"కావ్యము ద్వారా దృష్టమను ఆనందము మరియు అదృష్టమను కీర్తియనెడి రెండు ప్రయోజనములు సమకూడును 86– వామనుడు.

"చతుర్వర్గ ఫలప్రాప్తితో పాటు కావ్యము ద్వారాన మకూరు అన్యప్రయోజనము — అర్థోపశమనము, అపన్నివారణము, రోగవిముక్తి మరియు అభిమతవర ప్రాప్తి" 87.– రుద్రటుడు.

"చతుర్వర్గ ఫలప్రాప్తితో పాటు వ్యవహార జ్ఞానము మరియు అంతశ్చమత్కారవ యనుఇతరరెండుప్రయోజనములు కావ్యము ద్వారా సమకూరును" 88కుంతకుడ

'కావ్య ప్రయోజనములివి– యశస్సు, ధనప్రాప్తి, వ్యవహార జ్ఞానము. అమంగ నాశము. సత్వరానందము మరియు కాంతాసమ్మిత ఉపదేశము''89–మమ్మటుడ

పైన ఉల్లేఖింపబడిన ప్రయోజనములను మూడుగా విభజింపవచ్చును.

1. కవి పరములు– యశస్సు, ధనప్రాప్తి, రోగముక్తి, వరప్రాప్తి.
2. పరమార్థ పరములు– ధర్మము, మోక్షము, అనర్థోపశమనము. అపన్నివారణము, వ్యవహారజ్ఞానము, అమంగళనాశనము.
3. ఆనందపరములు– సత్వరానందప్రాప్తి, కాంతాసమ్మిత ఉపదేశము.
4. సామాజికపరములు– పరమార్థజ్ఞానప్రాప్తి, ఆనందప్రాప్తి.

భారతీయాచార్యులు పరమార్థమును ఆనందమందు మేళవించి సాహిత్యా-ందమును రసానుభూతిగా సిద్ధాంతీకరించిరి పరమార్థమును శాస్త్రములు ప్రభువు లె శాసించునని, పురాణములు మిత్రుని వలె బోధించునని, కావ్యనాటకములు ్రియకాంత వలె ఉపదేశించునని భారతీయాచార్యులు నిర్ణయించియున్నారు. ందువలన శాస్త్రములు ప్రభుసమ్మితములుగా, పురాణములు మిత్రసమ్మితములుగా వ్యనాటకాదులు కాంతాసమ్మితములుగా పరిగణింపబడినవి. ఇట్లు భారతీయా-ంకారికుల దృష్టి యందు సామాజికుని రసానందమే ప్రధాన కావ్యప్రయోజనము వ్య రసానందమును ఆచార్యులు నవరసములుగా ఆచార్యులు విభజించి యున్నారు –శృంగార, హాస్య. కరుణ రౌద్ర, భయానక, అద్భుత, భీభత్స, వీరములు-ందవర్ధనుడే ప్రప్రథమము రసములను గురించిన గంభీర చింతనను ప్రక చెను ల క్రశ్రేయస్సును, మానవ స క్షేమమును దృష్టియందుచుకొని అయన డు రసములను కావ్యమందు ప్రధానములుగా నుండవలయునని ప్రతిపాదించెను –కరుణము మరియు శాంతము. కరుణరసము పూర్వాచార్యులచే వివరింప ది. ఐనను వారుదానికి ప్రాధాన్యత నంగీకరింపలేదు. కరుణ ప్రాధాన్యతను

ఆనందవర్ధనుడు వివరించెను శాంతము యను నూతన రసమును ప్రతిపాదించి రస సంఖ్యను తొమ్మిదిగా నిర్ణయించెను

## కరుణ-శాంతముల ప్రాధాన్యత :
## Importance of Karuna and Santa.

ఆనందవర్ధనుడు కరుణ రస ప్రాధాన్యత నిట్లు వివరించెను కరుణమునకు ... ాయి భావము శోకము. శోకభావమే కవితావిర్భావమునకు మూలము. ప్రాచీన ...లమందు క్రౌంచ ద్వంద్వ వియోగముద్వారా ఉత్పన్నమైన ఆదికవి (వాల్మీకి) ...కమే శ్లోకముగా అవతరించింది. 90. ఇట్లు ఆది కావ్యమైన రామాయణము ...రుణ రస ప్రధానమైనది కిరాతకుని కిరాతకృత్యమునకు ప్రతిక్రియా రూపమున ...వతరించిన రామాయణము మానవ నడవడిని తీర్చిదిద్దుటకు ఉద్దేశింపబడినది, ...క శ్రేయస్సును కాంక్షించింది. కనుక దేశ హితైక దృష్టితో రామాయణమున ...న్నంత ప్రాధాన్యత వేరొక కావ్యమునకు లేదు. మానవులను రామరాజ్యము ...పు ప్రేరేపించి ధర్మ నిరతులుగా మార్చు రామాయణము కరుణరస ప్రధానము ...ి భావము, దీనులయెడ జాలి, అనైతిక విరోధము, ధర్మ సంస్థాపనము ...న్న గు కళ్యాణప్రదములైన భావముల ఉద్దీప్తి కరుణరసము ద్వారా మాత్రమే ...భవము. కావున కరుణరసము శివత్వ సాధకము. హృదయమును ద్రవీకరించి, ...తిక జగత్తునందలి ఆసక్తిని తగ్గించి అవ్యాజ ప్రేమను పోషించు ప్రబలశక్తి కరు...ునకే కలదు. ఇట్లు కరుణము దేశకళ్యాణకారక మగుచున్నది; అవ్యాజప్రేమా...భూతిని సమర్థించి జీవన పరమార్థమునకు సాధక మగుచున్నది.

శాంతరస ప్రాధాన్యతను ఆనందవర్ధను డిట్లు వివరించెను. దీనిని (భారత...ను) జదివిన వెంటనే పాఠకుని హృదయమున వైరాగ్యమొదవక తీరదు. ఎన్ని ...పదలున్న నేమి ? ఎంత బలమున్న నేమి? ఏదియైనా వెంటవచ్చునా? ఏదియైనా ...మకైనా అవసానకాలమున నుపయోగించునా? అన్నియు నశాశ్వతములే; మూ...ళ్ల ముచ్చటయే యంతయు ఎవరి గతి యెట్లున్నదో? అను బుద్ధి తప్పక కలిగి...ను. ఇదియే కదా వైరాగ్యము. వైరాగ్యాను బంధియగు పురుషార్థము ...క్షము. రసము శాంతము.

అభినవగుప్తుడు ఈ సందర్భము నిట్లు వ్యాఖ్యానించెను. 'నిజమునకు మో
ఫలకమగు నీశాంత రసము పరమ పురుషార్థ ప్రపంచము. కావున నన్ని రసమ
కన్నను మిక్కిలి ప్రధానము. అట్టిది అధికారికముగా నుండదనుట అనుపయు
ము. ఈ విషయమున కావ్యకౌతుకమున మా యుపాధ్యాయులగు భట్టతౌతులు,
దాని వివరణమున మేమును పూర్వపక్ష సిద్ధాంతముగా వివరించియున్నాము'9

పై విధముగా ఆనందవర్ధనుడు కరుణరసము ద్వారా లోక శ్రేయస్సు
శాంతరసము ద్వారా పరమార్థ ప్రాప్తిని సమర్థించెను. లోక శ్రేయస్సు, పర
ర్థ ప్రాప్తి– ఈ రెండింటికి మించిన సార్వభౌమిక జ్ఞానముకాని, సార్వజనీన స
ముకాని వేరొకటి యుండదనుటలో సందేహం లేదు. రామాయణము లోక కళ
ణము ద్వారా సత్య మార్గము నేర్పరచును. ఇది కరుణరసము ద్వారా మాత్రి
సంభవం. వీరరసము ద్వారా లోకశ్రేయస్సు ఒనగూడు ననుటలో అభ్యంతర
లేదు. కాని అది దేశ కాలాదులకు పరిమితమైయున్నది. కరుణమున కున్నంత వి
రత దానికి లేదు. దేశ కాలాదులకు పరిమితము కాకుండా అనాది కాలము నుం
మానవుల నలరింపజేయుచు అవ్యాజ ప్రేమానురాగముల పోషించు కరుణమ
మానవ నైతికతకు దేశ సమైక్యతకు తోడ్పడుననుటలో విప్రతిపత్తి లేదు. కను
కరుణము మానవుని మోక్షమున కాయత్తపరచును. ఆ మానసిక స్థితికి పర్యవసి
మైన ఆనందస్థితియే శాంతరసము. శాంత రసాస్వాదన ద్వారా సహృదయుం
మోక్షప్రాప్తికి అనురూపమైన దివ్యానందము ననుభవించును. ఇట్లు కావ్యప్రయో
జన నిరూపణ మందు ప్లేటో మరియు ఆనందవర్ధనుని మధ్య విశేష అంతరమ
కానరాదు. ఇరువురును సాహిత్యము ద్వారా మానవ శ్రేయస్సును, దివ్యానం
మును అపేక్షించిరి

రసములన్నియు ఆనందాత్మకములే. ఐనను అవి కల్గించు ఆనందానుభూ
యందు మాత్రము స్పష్టంగా అంతరం కానవచ్చును. వాని స్వభావము మాన
నడవడికలో, జీవితంలో కానవచ్చుట సహజము. ఇది అనుభవ సిద్ధము. అంద
వల్లనే రసములందు అవి నెరపు ప్రభావముల కనుగుణంగా భేదము లేర్పడినవి.
రస సమీకరణ వాదములెన్నైనాయుండవచ్చు కరుణమున కున్నంత శక్తి వేరొక
దానికి లేదు. శృంగారమును రసరాజముగా సమర్థించు ఆచార్యులు విప్రలం

శృంగారమునే పరమాహ్లాదకారిగా ప్రశంసించుటలోని అంతరార్థమేమి ? అసలు వియోగ శృంగార మంతయు కరుణాత్మకమే కాదా? కరుణావస్థ నుండి విరహిత మైన సంభోగ శృంగార మెంతవరకు మనగలదు? మానవుడు దానినెంత కాలమ నునుభవింపగలడు? అట్లే శాంతమున కున్నంత పరమార్థ భావన వేరే రసమందు లేదు. ఇంద్రియ నిగ్రహము, సదాచారము, వైరాగ్యము మున్నగు హితకర భావముల కది నిలయమగుట వలనే శాంత రసము దివ్యానందముగా భావింపబడి నది. మానవ జీవన లక్ష్యమైన మోక్షసాధనకు శాంతము వినా వేరే రసము సమర్థ వంతము కానేరదు. ఈ రెండునూ– కరుణ, శాంతములు– లోక హితైక దృష్టితో మరియు పారమార్థిక దృష్టితో సర్వదా సమర్థనీయములు. ఇవి కవి యొక్క య థార్థ దృక్పథమునకు వాచ్యములై పరమార్థాభివ్యంజకము లగుచున్నవి నిస్సం దేహముగా ఆనంద వర్ధనాచార్యులు కరుణ–శాంతములను సమర్థించి రస సిద్ధాంత మును అత్యున్నత స్థానము నందధివసింప జేసెను.

సుప్రసిద్ధ హిందీ సాహిత్య విమర్శకుడు ఆచార్య రామచంద్ర శుక్ల సాహిత్య ప్రయోజన విశిష్టత నిట్లు వివరించిరి భావములన్నింటిని పరిశోధించి చూడగా మంగళప్రదములైన భావములు రెండే మిగులును. కరుణము మరియు ప్రేమ– కరుణము సంరక్షణము వైపు పురోగమించును. ప్రేమ ఆనందము వైపు. లోక మందు ప్రథమ సాధ్యము సంరక్షణము. ఆనందముయొక్క స్థానము తరువాతిది. అందువల్ల సాధనావస్థ లేక ప్రయత్నావస్థను లక్ష్యంగా కలిగిన కావ్యాలకు కరు ణము బీజ భావము, భవభూతి కరుణమును ఒకేఒక రసముగా భావించెను. రామ యణానికి కరుణమే బీజభావం. రావణునిపై రామునికి కలిగే లోకోత్తర సౌందర్యా త్మకమైన క్రోధ భావమునకు కారణం ఆత్మగౌరవం కాని దాంపత్య ప్రేమ కాని కానేరదు పీడిత ప్రజానీకంపై కలకరుణ భావం. లోకమును గురించిన కరుణ సఫల మైనపుడు లోకము పీడ నుండి, విఘ్న బాధల నుండి విముక్తవుతుంది. అపుడు రామరాజ్యంలో లోకాన్ని గురించిన ప్రేమ ప్రవర్ధనకూ, ప్రజారంజనకూ దాని అధికాధిక సుఖ విధానానికి అవకాశం కలుగుతుంది' 92

పై వాక్యములందు శుక్లగారు కరుణ ప్రాశస్త్యమును వివరించినారు. మా నవ జీవన సౌభాగ్యానికి, లోక క్షేమానికి కరుణభావ విస్తారత అత్యంతావశ్యకం.

మానవత్వ పరీక్షకు కరుణమే గీటురాయి. దీనిలోనే లోకసంరక్షణా భావం ఇమి యుంది. ఆనంద భోగావస్థ దీని తరువాత సిద్ధిస్తుంది. ఈ దృష్టితో ఆచార్య శు గారు సమగ్ర కావ్య ప్రపంచమును రెండుగా విభజించి చూపినారు. 1 సాధన స్థాపరములు- రామాయణాదులు 2. భోగావస్థాపరములు- భాగవతాదులు. కన శుక్లగారు ప్లేటో తెలిపిన కావ్యప్రయోజనముల రెండింటిని సమర్థించి వారైనారు.

విశ్వనాథుడు సాహిత్య దర్పణమందు కావ్య ప్రయోజనము నిట్లు నిరూపి చెను- "భగవానుడు నారాయణుని చరణారవింద స్తుతి వలన కావ్యము ద్వార ధర్మ సంస్థాపనము సుప్రసిద్ధము. ఇది కావ్యము ద్వారా ప్రాప్తమగు సాక్షాత్క రణము. కనుక ఒక శబ్దమైనను సప్రయోగితమైనచో అనగా రసవంజక సౌందర రీతిలో నివేశితమైయున్నచో లేదా సముచిత రీతిలో జ్ఞాతమైనచో లేక కావ్యాను శీలన సమయమందు భావనద్వారా యధావత్ రసమునకు వ్యంజకమని భావిం బడినచో అది ఇహలోకమందును, పరలోకమందును కామధేనువై మనోరథమున సిద్ధింపజేయునది యగును అందువలన కావ్యరచన మరియు కావ్యానుశీలనము. రెండునూ ధర్మోత్పాదకము లగును; కామధేనువులగును మరియు వేదానుమోది తము లగును"

విశ్వనాథుడు సప్రయుక్త శబ్దము ద్వారా ధర్మమును, మరియు పరమార్థ ప్రాప్తిని ప్రయోజనముగా తెలిపెను. ప్లేటో సైతము కావ్యమునుండి దేశహితమును మరియు దివ్యానందమును ఆశించెను. కావున కావ్య ప్రయోజన నిరూపణమందు ప్లేటో మరియు భారతీయాలంకారికులలో విశేష వ్యత్యాసము కానరాదు.

## శైలి - Style

ఇక శైలిని గురించి పరిశీలింతము.

కావ్యశైలిని భారతీయాలంకారికులు 'రీతి'గా పేర్కొనిరి. భరతుడు నాట్య శాస్త్రమందు తెలిపిన నాట్య ప్రవృత్తులు కావ్యమున కన్వయింపబడి రీతులుగా వెల సినవి. కుంతకుడు వైజ్ఞానికముగా రీతుల భేదములను వివేచించెను. దేశ విభాగ ములను బట్టి రీతులు చెల్లనేరవని, అవి కవి స్వభావము ననుసరించి ఏర్పడునని, అవి మూడు రకములని తెలిపెను.

1. సుకుమార మార్గము (శైలి)– ఇది రస ప్రధానశైలి. కవి ప్రతిభ ఈ శైలి యందు ఎల్లెడల వ్యాపించి యుండును– ప్లేటో తెలిపిన నాటకీయ– కథనాత్మక శైలి (mixed Style) ఈ శైలిని పోలియున్నది.

2. విచిత్ర మార్గము– ఇది హృదయం కన్న బుద్ధినే ప్రభావిత మొనర్చును. ప్లేటో తెలిపిన అనుకరణాత్మకశైలి (Imitative Style) ఈశైలికి అన్వయింపగలదు.

3. మధ్యమ మార్గము– ఉక్తివైచిత్యము ద్వారా విషయమును చమత్కారవంతముగా నొనర్చును. ప్లేటో తెలిపిన అఖ్యానాత్మకశైలి (Narrative Style) ని ఈ మార్గమందు చేర్చవచ్చును.

ఇక కావ్య గుణములను పరిశీలింతము.

భరతుడు నాట్యశాస్త్రమందు దశ గుణములను తెలిపెను. అవి- శ్లేష, ప్రసాద, సమత, సమాధి, మాధుర్య, ఓజ, సౌకుమార్య, అర్థ వ్యక్తి, ఉదారత, కాంతి. తరువాత భామహుడు ఈ దశ గుణములను జూపి మాధుర్య, ఓజ, ప్రసాదములను మూడు గుణములే ప్రధానములని తెలిపెను. ఆనందవర్ధనుడు ఈ మూడింటినే సమర్థించెను. తదనంతరం మమ్మటాదులు వీనినే అంగీకరించిరి. భారతీయ కావ్యశాస్త్రమందు ప్రధానములుగా స్థిరపడిన మూడు గుణములను ప్లేటో తెలిపిన మూడు కావ్యగుణములతో ఇట్లు అన్వయింప వచ్చును.

మాధుర్య గుణము– Sweetness = లయాత్మకత – Rhythm
ఓజో గుణము – Floridity = భవ్యత – Grace
ప్రసాద గుణము – Perspicuty = సమరసత – Harmony

ప్లేటో కావ్య దృక్పధము భారతీయ కావ్యదృక్పధముతో ఎంత వరకు సరిపోయి యున్నదో వివరింపబడినది. ఈ తులనాత్మక అధ్యయనము ద్వారా మనకు బోధపడు సారాంశము నిట్లు తెలుపగలము. ప్లేటో తెలిపిన సృజనాత్మకత, దివ్య ప్రేరణ, దైవదత్త ప్రతిభ, పారమార్థిక సత్య ప్రతిపాదనము, నైతికత, ఉదాత్తానందానుభూతి, కవి మహనీయత యను ఉదాత్త సాహిత్య లక్షణమున్నియు భారతీయాలంకారికుల కావ్యదృక్పధమునకు భిన్నములు కావు, తాత్త్విక దృష్టితో అంతరము కానరాదు.

## అధోజ్ఞాపికలు - Foot Notes

1. "A dung basket, if well made, is beautiful; a golden shield if not well made, is ugly the beautiful may be that which is beneficially pleasureable through senses of sight anc hearing."

2. "The soul which has seen most of truth shall come to the birth as a philosopher or artist, or some musical and loving nature, that which has seen truth in the second degree shal be some righteous king or chief. The soul which is of the third class shall be a politician or economist or trader, the fourth shall be the lover of gymnastics or a trader, the fifth shall live the life of a prophet heirophant; to the sixth the character of a poet or some other imitative artist will be assigned"

—Phaedrus.

3. "Then we must assume a control over the writers of this class of tales as well as over the other, and beg them not simply to revile, bnt rather to command the world below, intimating them that their descriptions are untrue and will do harm to our future worriors. Even poets of the calibre of Homer or Hesiod should not be allowed to corrupt the youth, because of adverse impact of their poetry. These poets draw unreal picture of gods, portray them as lustful, revengeful and cruel. Hence they are to be banished".

—Phaedrus.

4. "And therefore when any one of the these pantomimic gentleman comes to us, and makes a proposal to exhibit himself ahd his poetry, we will faill down and worship him as a sweet and holy and wonderful being; But we must also inform him that in our state such as he is not permitted to exist; the law will not allow them. And so when we have anointed him with mirth and set a garland of wool upon his head, we shall send him away to other city."

—Phaedrus.

మును ఆధారముగా గ్రహింతుము. అంతేకాక మనమిట్లు తలంతుము. అపుడపుడు సంభావ్యత వివేకమును అతిక్రమింప జాలదు. ఎట్లన ఎదేని సంఘటన సంభావ్యతకు ప్రతికూలముగా జరుగుట సంభవమే యగును''—Ch 25

అసంభవ సంఘటనల సంభవ నిరూపణము ద్వారా సామాజికుని మానసము సంతృప్తమగుననుటలో సందేహము లేదు. అసంభవము సంభవముగా మారుట ప్రకృతి నియమానుసారము సరియైనదే. యుగ యుగములనుండి వికాసమానమగుచున్న మానవ జీవనము ఇందుకు నిదర్శనము. కాని దీనికి విరుద్ధముగా పరిణామము పరిణమించినపుడు తద్ప్రభావముచే ప్రేరితుడై వ్యక్తి చింతనకు లోనగును; నీడ వలె వెంటాడుచు, అందీ అందక యున్న పరమ రహస్య పరిశోధన యందు నిమగ్నుడగును. మరొక రకమున వ్యక్తి పరమ తత్త్వము వైపు ప్రేరేపింపబడును. ఇట్టి సంభావ్య అసంభావ్యత వలన కావ్యము అత్యంత రహస్యాత్మకముగను, రమ్యముగను భాసించి సామాజికుని ఆనందమును విశిష్టముగా మార్చును.

అరిస్టాటిల్ ప్రతిపాదించిన కావ్య సత్యమందలి ముఖ్యాంశములివి

కావ్య సత్యము యథార్థ రూపముననైనా లేదా ఆదర్శ రూపముననైనా యుండవచ్చును.

కావ్య సత్యము చారిత్రిక తథ్యముకన్న భవ్యతరముగా నుండును.

3 కావ్య సత్యము సార్వకాలీనమును, సార్వజనీనము యగును.

4 అవాస్తవిక సంఘటనలైన లోకవాదుక, పరంపరాగత విశ్వాసము అలౌకిక సంఘటనలు మున్నగునవి కావ్య సత్యమందు చేరును.

5 సంభావ్య సత్యముకన్న అసంభావ్య సత్యమును కావ్యము నిరూపించుట వలన అధిక దార్శనికమగును.

6 కావ్య సత్యము భవ్యతరముగా నుండును.

7 కావ్య సత్యము సమగ్ర జీవనమునకు పరిణామముగా నుండును.

8 కావ్య సత్యము సామాన్యమగుట వలన విశ్వసనీయమగును.

9 కావ్య సత్యమే త్రికాల సత్యము.

# కావ్య శైలి - Poetic Style.

కావ్యశైలికిని వక్తృత్వ శాస్త్రమునకు (Rhetorics) సన్నిహిత సంబంధము కలదు. కారణమేమన ఇవి రెండును భాషను మాధ్యమముగా గ్రహించి సామాజికునిపై ఉద్దిష్ట ప్రబావమును నెరవుటను లక్షించి యున్నవి అరిస్టాటిల్ రచించిన వక్తృత్వశాస్త్రము కావ్యశైలీ నిరూపణకు తోడ్పడును. ఆయన వక్తృత్వ శాస్త్రమందు వక్త అనుసరింపదగిన భాషాశైలిని గురించి ఇట్లు తెలిపెను.

''ఎవరెన్ని రకములుగా మాటాడెదరో మనము చెప్పజాలము ఐనను ఏ విధానము ననుసరించి మాటాడవలయునో మనము తెలుసుకొని యుండవలయును. ఈ విషయము చాలావరకు బాష యొక్క వ్యక్తిత్వ గుణములను నిరూపించును . కనుక శైలి యనునది అభివ్యక్తి విశేషము. ఒక విషయమును అవగాహనకు తేవలయునన్న మనమేదో యొక విధమున దానిని వివరింపవలసియే యుండును. ఇందు కానవచ్చు అంతరము అంత భేదముగా తోచదు. ఈ పద్ధతులన్ని శ్రోతృ హృదయమునకు ఆనందమును కల్గించుటకే కాని ఎవరును క్షేత్రగణితమును ఈ శైలియందు బోధింపలేరు''

పై వాక్యములు అరిస్టాటిల్ కావ్యశైలీ దృక్పథమును గ్రహించుటలో తోడ్పడును. ఇక ఆయన కావ్యశాస్త్రమందు వివరించిన శైలీ విశేషములను పరిశీలింతము. ''ఇక భాష మరియు చింతనను గురించి వివేచింపవలసి యున్నది. చింతన విషయమున నేను వక్తృత్వశాస్త్రమందు నిర్దేశించినవే పాటింపబడ వలయును. ఈ విషయ వివేచన ప్రధానముగా దానికే సంబంధించి యున్నది. వాక్కు ద్వారా సృజింపబడు ప్రభావము చింతన యందే చేరును దీని ఉప భాగములు- ప్రమాణము మరియు ప్రతివాదము, కరుణ, త్రాస, క్రోధాది భావముల ఉత్తేజన, అతి మూల్యనము మరియు అవమూల్యనము. ఇపుడిది స్పష్టము. కరుణ భావమును, త్రాస ప్రాధాన్యత లేక సంభావ్యతను జాగృత పరచవలయునన్నచో నాట్య సంవాదముల దృష్టినే నాట్య సన్నివేశములు పాటింప బడినవిగా నుండవలయును. ఇందలి భేదమింతే అదేమన శాబ్దిక వ్యాఖ్యానము లేకుండనే సంఘటనలు స్వయముగా స్పష్టములు కావలయును అదియును వాక్కునకు పరిణామముగా ఒక వేళ చింతన వ్యక్తి కథనమునుండి పూర్తిగా నిరపేక్షితమై యున్నచో ఇక వక్తి

కార్యమేమై యుండును?-Ch 19''

పై వాక్యములందు వాక్‌శక్తి వివరింపబడినది. వక్తయొక్క ఉపన్యాసము కేవలము శబ్ద విన్యాసమునకే పరిమితము కాకుండా సామాజికుని హృదయమును చూరగొను సమర్థతను కలిగి యుండవలయును. ఇతరుల వ్యాఖ్యానమవసరము లేకుండనే సామాజికునిలో కరుణాది భావముల నుద్వేలన పరచునదిగా నుండవల యును. వక్త ఉపన్యాసము వినుచున్నంత కాలము సామాజికుడు వక్త ఉపన్యా సమునకు సంబంధించిన సన్నివేశములను నాట్య సన్నివేశముల వలె తనయెదుట సాక్షాత్కరించుకొన్నట్లు తన్మయత్వమును చెందవలయును. కనుక వక్త ముఖము నుండి వెలువడు ప్రతి శబ్దము శ్రోతృ హృదయమును స్పర్శించునదిగా నుండ వలయును వక్త అనుసరింప దగిన మార్గములే కవికి అన్వయించును కనుక కవి ఉపయోగించు పదజాలము పాఠకునిలో భావోత్తేజనను కల్గించు సామర్థ్యమును కలిగి యుండవలయును అపుడే కవి యొక్క కావ్యశైలి రమణీయమగును.

కావ్యభాష సామాన్య భాషకన్న భిన్నమై అర్థగర్భితముగా నుండునని అరిస్టాటిల్ తెలిపెను. ''ఇక భాషను పరిశీలింతము. దీని వివేచనమందలి ఒక భాగము పలుకుబడి రీతులకు సంబంధించి యున్నది. కాని ఈ జ్ఞానక్షేత్రము వక్తృత్వ కళ మరియు వక్తృత్వ శాస్త్ర పండితులది ఉదాహరణముగా ఆదేశము (ప్రార్థన. నివేదన బెదిరింపు ప్రశ్న, జవాబు మున్నగు వాని స్వరూపమేమి? యనునవి దీనికి అంతర్గతములు. ఈ విషయములు తెలిసియున్నను తెలియకయు న్నను కవి కళపైఎట్టి గంభీర ఆక్షేపణ యుండదు. ఎట్లన ప్రోటోగోరస్ యొక్క దోషారోపణము నెవరంగీకరింతురు? దేవి రౌద్రగానము నాలాపింపుము యను వాక్యమందు కవి భావన ప్రార్థనా గర్భితమై యుండ ఆదేశ స్వర భరితమైయున్న దనుట- అతని తర్కమేమన ఎవరితోనైనా పని చేయుము లేక చేయకుము అనుట ఆదేశము అజ్ఞాపించుట) యగును కనుక దీని నిట ఆపెదము. ఎలన దీని సం బంధము వేరే కళతో కలదు. కావ్యముతో కాదు''-Ch 19.

భాషకు రూపము నేర్పరచి, అర్థ బోధనా సామర్థ్యమును కల్గించు పదస మూహమును అరిస్టాటిల్ రెండు ప్రధాన విభాగములందు విభజించెను.

1 రూప నిష్పాదనము-దీనిననుసరించి పదములు రెండు విధములు-

సరళములు మరియు యౌగికములు

· అర్థభేదము–దీనిననుసరించి పదములు ఆరు విధములు
వ్యావహారికములు, అన్యదేశీయములు, లాక్షణికములు, రూపాంతరితములు, నవ్య నిర్మితములు మరియు ఆలంకారికములు.

కావ్యబాష యందలి వాక్యాన్వితిని అరిస్టాటిల్ రెండు రకములుగా తెలి పెను. 1. ఒక ప్రత్యేక అర్థమునకు ద్యోతకమగుట వలన 2. పరస్పర ంబధితములైన విభిన్నాంగముల సంఘటన ద్వారా. ఈ తీరున "ఈలియడ్' ండు విధములైన అన్వితిని కలిగి యున్నది. ఒకటి మానవ నిర్వచనము అను ్రత్యేక అర్థమునకు ద్యోతక మగుటవలన. రెండు భిన్నాంగముల సంయోగము ్వారా కనుక కావ్య సౌందర్యము ఒక సముచిత విస్తారము మరియు క్రమము ఆధారపడి యున్నది. పద, అలంకార ప్రయోగము ద్వారా మాత్రమే అది మకూరదు వాక్యము ఒకప్పుడు ఒకే అర్థమును బోధింపవచ్చును. ఒకే అర్థము న్ని వాక్యముల ద్వారా బోధపడవచ్చును. కనుక కవి రచన యందు అది ద్యమైనను, పద్యమైనను ప్రయోగింపబడిన పదజాలము పైన తెలుపబడిన ఆరు భాగములకు అన్వయించి యుండునని అరిస్టాటిల్ తెలిపెను. ఇంకను అనేక కములుగా పదముల నుపయోగించు అధికారము కవికి కలదని కూడా ఆయన లిపెను.

కావ్య శాస్త్రమందు అరిస్టాటిల్ అలంకారములను వివరించి యుండవచ్చు ు కాని ఆ భాగము అనుపలబ్ధము. వక్తృత్వ శాస్త్రమందు ఆయన ఇట్లు తెలి ను. "ఏదేని వస్తువును గురించి ఆలోచించినను లేదా ఆకాంక్షించినను మానస ందు ఏదో యొక చిత్రము లేదా బింబము అవశ్యముగా ఏర్పడి యుండును', ాజనీతి యందిట్లు వచించెను- చిత్రములు, వర్ణములు అనుకృతులు కానేరవు; అవి ్తిక పరివర్తనకు ప్రతీకములు. పై రెండు కథనముల ద్వారా అరిస్టాటిల్ రూపింప దలచిన అలంకారములు రెండు
బింబము (Image) 2 ప్రతీకము (Symbol.)

లాక్షణిక పదములందే అరిస్టాటిల్ రూపకమును వివరించెను సంబంధ ామ్యత ననుసరించి ఏదేని వస్తువుపై ఇతర సంజ్ఞను ఆరోపించుటను అరిస్టాటిల్ ూపకముగా తెలిపెను. రూపకాలంకారము నాలుగు రకములుగా ఏర్పడునని

ఆయన కావ్యశాస్త్రమందు తెలిపెను.

1. జాతి గుణమును ప్రజాతిపై ఆరోపించుట. 2. ప్రజాతి గుణమును జాతిపై ఆరోపించుట 3. ప్రజాతి గుణమును ప్రజాతిపై ఆరోపించుట 4. సామ్యత ననుసరించి ఒక అర్థమునందు వేరొక అర్థమును ఆరోపించుట.

కావ్యశైలిని గురించి అరిస్టాటిల్ ఇట్లు వివరించెను- "అసామాన్య పద ప్రయోగము ద్వారా శైలికి అసామాన్యమును, ఉదాత్తమునైన గుణము చేకూ రును. అన్యదేశీయములు, ఔపచారికములు, వ్యాకోచితములును యగు పదము లను ప్రయోగితములుగా కలది అసామాన్యమని నా అభిప్రాయము. సాంగం ముగా సామాన్య లోకోక్తుల కన్న భిన్నమైనదని చెప్ప వచ్చును'' -Ch 22 సారాంశముగా కావ్యశైలి సామాన్యము కన్న భిన్నమై రమణీయముగా నుండును

శైలికి ఆవశ్యకములుగా అరిస్టాటిల్ రెండు గుణములను నిర్ధారించెను 1. స్పష్టత-Perspicuity 2. ఔచిత్యము-Propriety-ఈ రెండింటి ద్వారా శైలికి పరిపూర్ణత సిద్ధించును. స్పష్టత కేవలము సామాన్యపద ప్రయోగము ద్వారా మాత్రమే ఏర్పడునని భావింపరాదు. అసామాన్య పదములను సైతము స్పష్టతకై వాడవలయును. ఔచిత్యము విభిన్న పదములను సమరసతా పూర్వ కంగా సమకూర్చి శైలికి రమణీయ రూపము నేర్పరచును ఈ గుణము లేనప్పు కావ్యము నీరసమగును, సమాస పదముల, అవ్యవహారికముల, అనుమానాస్పద పదముల, దీర్ఘములును అనుపయుక్తములునైన విశేషణముల మరియు క్లిష్టము న రూపకముల ప్రయోగ బాహుళ్యత వలన శైలి క్లిష్టమై అస్పష్టముగా మారు

కావ్య దోషములను అరిస్టాటిల్ ఇట్లు వివరించెను-

"కావ్యకళ రెండు రకములైన దోషములను కలిగి యుండును. తాత్త్వి కము మరియు సాంయోగికము. ఒకవేళ కవి ఏదేని వస్తువును ఎంచుకొని సామర్థ్య లోపముచే దానిని విశుద్ధముగా అనుకరింప జాలనిచో అది కావ్య తత్త్వమున సంబంధించిన దోషమగును. కాని అనుపయుక్తమైన విషయమును ఎంచుకొనుట వలన అసఫలీకృతుడైనచో అది కావ్య తత్త్వ దోషము కానేరదు. ఉదాహరణ ముగా- అతడు ఒక గుఱ్ఱము తన కుడికాళ్లను రెండింటిని ఒకేసారి రువ్వినట్లు

చూపించెను; లేదా వైద్యశాస్త్రమందు కాని ఇతర శాస్త్రమందు కానిలేక ఇతర కళలయందు సాంకేతికమైన తప్పులనుచేసెను''— Ch 25. పైన తెలుపబడిన దోషములలో ప్రతిభ లేక సామర్థ్య లోపమున సంభవించునవి తాత్త్వికములు. ఇవి పరిహరింపబడవు అసంపూర్ణ జ్ఞానము వలన కలుగునవి సాంయోగికములు ఇవి ప్రతిభ ద్వారా పరిహరింప బడవచ్చును. కనుక కవి ప్రతిభావంతుడై యుండుట అవశ్యకము. భారతీయాచార్యులవలె అరిస్టాటిల్ కవి ప్రతిభనే కావ్య రచనకు పరమ ప్రమాణముగా గుర్తించెను.

కావ్యశైలీ రామణీయకమునకు ఛందము ఆవశ్యకమని ప్రాచీనాచార్యులు భావించి వివిధ ఛందోరీతులను వెలయించిరి. పాశ్చాత్య సాహిత్య లోకమందు కావ్యము మరియు ఛందస్సుకు కల పారస్పరిక సంబంధమును గురించి వాదోప వాదములు కలవు. అరిస్టాటిల్‌కు పూర్వము ఛందస్సు కావ్యమునకు అనివార్య అంగముగా భావింపబడు చుండెడిది. ఛందము వినా కవితాకల్పన అసాధ్యముగా నుండెడిది. అరిస్టాటిల్ వినూత్న దృక్పథము నిట్లు ప్రకటించెను—

''జనులు సాధారణముగా ఛందము నామమునకే 'స్రష్ట' లేక 'కవి' యను పదమును చేర్చెదరు. మరియు కవిని ఏర్పరచునది అనుకరణము కానేరదని, ఛందమే వారిని కవి పదమునకు అధికారులుగా నొనర్చునట్లు లోకగీత కవులను మరియు మహాకావ్య కవులను వారు నిర్వివేక రూపమున చర్చిచెందరు"-Ch 1.

''కవి మరియు చరిత్రకారుడు-వీరు పరస్పరము భేదము నొందుట ఒకరు పద్యమందు, మరియొకరు గద్యమందు వ్రాయుట వలన కాదు. 'హెరోడోటస్' రచన పద్యమందు మార్చబడ వచ్చును. ఐనను అదియొక ఐతిహాసిక భేదమే యగును. ఛందము ఉన్నను లేకున్నను ఎట్టి భేదము ఉండనేరదు"-Ch 9.

''మరియొక కళ కలదు. అందు భాష మాత్రమే అనుకరణమునకు మాధ్యమముగా నుండును. అదియును గద్య మందైన లేక పద్యమందైనా'-Ch 1.

"ఇక ఛందమునకు సంబంధించిన విషయము. వీరఛందము అనుభవపరీక్ష యందు తన యోగ్యతను ఋజువు పరచుకొన్నది. ఒకవేళ ఇపుడెవరేని ఏదేని ఛందము నందు లేక అనేక ఛందములందు అఖ్యానాత్మక కావ్యమును రచించినచో అది

అసంగతమే యగును. వృత్తము లన్నింటిలో వీర వృత్తమే అన్నింటికన్న భవ్య మును గరిమామయము యగును'-Ch 22.

పై కథనముల ఆధారముగా అరిస్టాటిల్ దృక్పధము నిట్లు గ్రహింప వచ్చును. సామాన్యులు తలంచునట్లు ఛందమునందు రచించినంత మాత్రమున వ్యక్తి కవిగా రాణింప జాలడు అట్లే శాస్త్ర విషయము ఛందమునందు రచితమైనంత మాత్రమున అది కావ్యముగా పరిగణింపబడ జాలదు. కావ్యత్వము రచయిత యొక్క అనుకరణ ప్రక్రియ లేక భావప్రవణతపై ఆధారపడి యున్నది ఛందము నందు రచింపబడినను, లేకున్నను రచన భావానుభూతిని కల్గించుటలో సమర్థవంతమైనచో సాహిత్య ప్రక్రియల యందు చేరును కావున ఛందోప్రయోగము సాహిత్యమునకు అనివార్య అంగము కానేరదు. అది కవి యొక్క ఇష్టాయిష్టములకు ఆధారితము. ఆఖ్యానాత్మక కావ్యము వీరవృత్తమందు రచింపబడుటను సంప్రదాయము సమర్థించును.

కావ్యశైలిని గురించి అరిస్టాటిల్ ప్రకటించిన దృక్పధము క్లుప్తముగా తెలుపబడినది. (వివరణమునకు చూడగలరు. అరిస్టాటిల్ కావ్యశాస్త్రము). అతని దృక్పథ మిట్లు క్రోడికరింప వచ్చును.

కావ్యభాష సామానక భాషకన్న భవ్యముగా నుండును. అది లాక్షణిక పద ప్రయోగ భరితమై యుండును; సామాజికుని మానసము నాకర్షించుకొను శక్తిని కలిగి యుండును. కావున కావ్య సౌందర్యమున కావ్యశైలి రామణీయకము.

2. కవి వ్యక్తిత్వము ననుసరించి శైలి రూపమేర్పడు చుండును.
3. కవితాశైలి గద్యశైలి కన్న భిన్నమై రాగాత్మక గుణముతో శోభించును.
4. శైలికి ప్రధాన గుణములు రెండు-స్పష్టత మరియు ఔచిత్యము
5. గేయములకు అలంకారిక భాష, మహకావ్యమునకు అసామాన్య పదభరిత భాష, నాటకమునకు వ్యావహారోచితమైన లాక్షణిక భాష ఉపయుక్తమగును.
6. కావ్య రూపముల కనుగుణముగా కావ్యశైలీ రూపము మారుచుండును
7. కావ్యప్రక్రియలకు ఉపయుక్తములుగా నుండు ఛందములనే వాడవలయును.
8. ఛందస్సు సాహిత్యమునకు అనివార్య అంగము కాజాలదు. అట్లని దానిని సంపూర్ణముగా పరిహరింప జాలము.

9. కావ్యశైలికి రామణీయకతను చేకూర్చు ప్రధాన అలంకారములు–రూపకము, బింబము, ప్రతీకము.

10. కావ్యదోషములు రెండు రకములు–తాత్త్వికములు, సాంయోగికములు.

అరిస్టాటిల్ కావ్యశాస్త్రము రచించు నాటికి ప్రచారములో నున్న ప్రధాన రూపములు మూడు–గేయము, మహాకావ్యము, రూపకము. కావ్యశాస్త్రమందు ఆయన ప్రధానముగా రూపకమునే విస్తారముగా వివేచించి నాటక సిద్ధాంతములను ప్రతిపాదించెను, ఆయన ఆ సిద్ధాంతములనే మహాకావ్యమునకు అన్వయించెను. హాస్య రూపకమును సంగ్రహముగా తెలిపెను. గేయకావ్యములను చర్చించ లేదు.

## విషాద రూపకము – Tragedy

తన కాలము వరకు ఉపలబ్ధమైన సాహిత్యమును ఆధారముగా గ్రహించి అరిస్టాటిల్ విషాదరూపక స్వరూపము నిట్లు నిర్ధారించెను–

''గంభీరమును, స్వయంసంపూర్ణమును మరియు నిర్దిష్టమైన పరిమాణమును కలిగియున్న కార్యవ్యాపారమునకు విషాదరూపకము అనుకృతి యగును. నాటకమందలి భిన్న భిన్న భాగములందు విభిన్న రూపముల ప్రయోగితమగుచు నానావిధ కళాత్మక అలంకారములతో అలంకృతమైయున్న భాషను కలిగి యుండును. కథనాత్మక రూపమున నుండక కార్యవ్యాపార రూపమున నుండును. కరుణము మరియు త్రాసము నుత్తేజపరచి ఆ మనోవికారములను పరిష్కరించును. అలంకృతభాష యనగా లయ, సమరసత మరియు గీతయుక్తమైన భాషయని నా అభిప్రాయము. భిన్నభిన్న భాగములందు విభిన్న రూపముల అనగా కేవలము పద్యమే మాధ్యమముగా కొన్ని భాగములు పరిపుష్టి నొందును. ఇతరములు గీతముల తోడ్పాటుతో''–Ch 6.

పై వాక్యముల ననుసరించి విషాదరూపకమునకు ఐదు లక్షణము లేర్పడును విషాదరూపకము—1. ఘటన లేదా కార్యమునకు అనుకృతి. 2. కార్యము కథనాత్మకముగా నుండదు; ప్రదర్శనాత్మకముగా నుండును.–3. కార్యము స్వయం సంపూర్ణముగను, గంభీరముగను మరియు నిశ్చిత విస్తారమును కలిగియుండును.

4. కరుణ-త్రాస భావోద్దీపనము ద్వారా ప్రేక్షకుని అట్టి భావములను పరిష్కరించును. 5. భాష లయాన్వితమై, అలంకారికమై యుండును. ఈ ఐదు లక్షణములు నాటక సమగ్ర స్వరూపమును నిర్ధారించును. నాటకమున కిట్టి లక్షణముల నేర్పరచిన ప్రథమ పాశ్చాత్యాచార్యుడు అరిస్టాటిల్.

## తత్త్వములు – Elements.

విషాదరూపకమునకు అనివార్య అంగములుగా భావింపబడిన అంశములను ఆరింటిని అరిస్టాటిల్ నాటక తత్త్వములుగా ప్రతిపాదించెను. అవి-1. కథావస్తువు 2. పాత్రలు 3. పదరచన 4. ఉద్దేశ్యము 5. దృశ్యవిధానము 6. గీతము—Ch 6. కథా వస్తువు, పాత్రలు మరియు ఉద్దేశ్యము అను మూడు తత్త్వములు అనుకరణమునకు విషయము లగును. దృశ్య విధానము అనుకరణమునకు మాధ్యమమగును; మరియు పదరచన మరియు గీతము అనుకరణమునకు రీతి లేక పద్ధతి యగును. వీనిని పరిశీలింతము.

## I. కథా వస్తువు - Plot.

నాటకమందు కథావస్తు ప్రాధాన్యతను అరిస్టాటిల్ ఇట్లు వివరించెను-

''అన్నింటికన్న అతి ముఖ్యమైనది సంఘటనల రచన ఏలన విషాదరూపకము ఒక అనుకృతి యగును; వ్యక్తులకు కాదు; కార్యవ్యాపారమునకు మరియు జీవితమునకు. కార్యవ్యాపార మందే జీవనము పొసగి యుండును; మరియు దాని ప్రయోజనము ఒక రకముగా వ్యాపారమే యగును. గుణము కాదు. చారిత్ర్యము వ్యక్తుల గుణముల నిర్ధారించును. కాని వారి సుఖము మరియు దు:ఖము వారి వ్యాపారము పై కలదు. కనుక నాట్య వ్యాపార ఉద్దేశ్యము పాత్ర చిత్రణమును ప్రదర్శించుట కానేరదు. పాత్ర చిత్రణము కార్యవ్యాపారమునకు సహచరముగా సంభవ మగును. అందు వలన సంఘటనలు మరియు కథావస్తువు విషాదరూపకమునకు సాధ్యము లగును. మరియు సాధ్యము అన్నింటికన్న ప్రముఖ విషయమగును. కార్యవ్యాపారము లేకుండ విషాదరూపకము మనజాలదు; పాత్రచిత్రణ లేకుండా యుండ వచ్చును.....అట్లే చారిత్ర్యమును వ్యక్తపరచు అనేక ప్రసంగ

ములను నీవు సూత్రబద్ధము కావించిన యెడల అవి చింతన మరియు శైలి దృష్టితో పరిష్కృతములై యున్నను, ఈ అంశములందే కొరవడి యుండియు కథావస్తువు మరియు కళాత్మకములుగా రచితములైన సంఘటనలను కలిగియున్న నాటకము లకు సహజ సంభవమగు సారభూతమైన విషాదాత్మక అనుభూతిని అంతగా సృష్టిం ప జాలదు.... నవోదిత కళాకారుడు సఫల కథారచనకు పూర్వమే పరిష్కృత శైలియందు మరియు విస్పష్ట పాత్ర చిత్రణమందు దక్షుడై యుండును. అంతే కాక భావాభిరుచికి అత్యంత శక్తివంతములైన విపర్యాస మరియు అభిజ్ఞాన దృశ్య ములు కథావస్తువందలి భాగము లగును. అందువన కథావస్తువు ప్రముఖ తత్త్వ మగును. అది విషాదరూపకమునకు ఆత్మ వంటిది. పాత్ర చిత్రణము ద్వితీయ స్థానీయము. చిత్రకళ యందు కూడా ఈ విషయమే కానవచ్చును. అస్తవ్యస్త స్థితిలో వర్ణములు సైతము సుద్దపుముక్కతో గీయబడిన చిత్రము చేకూర్చునంతటి ఆనందమును కల్గింప జాలవు కావున విషాదరూపకము ఒక కార్యవ్యాపారమునకు మరియుకర్తలకు అనుకృతియగును ప్రధానముగా కార్యవ్యాపార దృష్టితో''-6.

పై వాక్యములందు అరిస్టాటిల్ కథావస్తు ప్రాధాన్యతను స్పష్టపరచెను. పాత్ర చిత్రణమెంత ఔచిత్యవంతముగా నున్నను కథావస్తువు సృష్టించు కారుణిక ప్రభావముతో సరితూగ జాలదని కూడా తెలిపెను. కనుక అతని దృష్టియందు కథావస్తువు నాటకము యొక్క ఆత్మ. హేతువుల నిట్లు గ్రహింపవచ్చును-

1. జీవన స్థితిగతులకు కార్యమే నిదర్శనము. జీవనము ననుకరించు నాటకము నకు కార్యరూపమైన కథావస్తువే ప్రధాన తత్త్వ మగును.
2. నాటకానుభూతి కథావస్తువు ద్వారా మాత్రమే ప్రభావంతంగా సిద్ధించును.
3. కార్యానుగుణంగా పాత్రపోషణ రూపొందును. కథావస్తువుకు అది ఆధారితము
4. నాటకమునకు రమ్యతను చేకూర్చు స్థితి విపర్యయము మరియు అభిజ్ఞానము- రెండును కథావస్తువుకు అంతర్భాగములే యగును.

నాటకము దృశ్య కావ్యము; అందలి సన్నివేశములన్నియు ప్రదర్శన యోగ్యము లుగా అందరిని అలరించునవిగా నుండ వలయును. శ్రవ్య కావ్య సన్నివేశ ములు ప్రదర్శనాత్మకములు కావు; వానికి కాలపరిమితి లేదు. అంతేకాక నాటక సన్నివేశములు రంగశాల నియమ నిబంధనలకులోనై యుండ వలయును. కళాత్మక

దృష్టితో నాటకమునకు కథావస్తువే ఆత్మ తత్త్వ మగును. పాత్ర చిత్రణ కన్న కథావస్తు రచన అధికతర క్లిష్టముగా నుండును. ఈ దృష్టితో అరిస్టాటిల్ నాటకమునకు కథావస్తువును ప్రాణతత్త్వముగా నిర్ధారించెను

అరిస్టాటిల్ మువ్విధములైన కాథావస్తువులను పేర్కొనెను–పౌరాణికములు ఉత్పాద్యములు. ఐతిహాసకములు, నాటక కర్త తన ప్రతిభ కనుగుణముగా ఏ రకమైన కథావస్తువు నైనను గ్రహింప వచ్చును ఐనను ప్రసిద్ధ కుటుంబముల నుండి కథావస్తువును గ్రహించుట ఉచితముగా నుండునని ఆయన తెలిపెను.

నాటక కథావస్తువు రెండు భేదములను కలిగియుండునని అరిస్టాటిల్ తెలిపెను. సామాన్యము – Simple, సంశ్లిష్టము – Compound. స్థితి విపర్యయము, అభిజ్ఞానముతో సమన్వితమైనది సంశ్లిష్ట కథావస్తువు. ఇదియే ప్రేక్షకులను అత్యంత ప్రభావితుల జేయును.

కథావస్తు వెట్టిదైనను ఒక నిశ్చిత ఆయామము (Size) ను కలిగియుండి ఆదిమధ్యావసాన యుక్తమై యుండవలయును. సూర్యుని ఒక పరిక్రమణము లేదా అంతకంటె కొంతఅధిక సమయంలో సమాప్తమగు కథావస్తువు విషాదరూపకమునకుపయుక్తముగా నుండునని అరిస్టాటిల్ తెలిపెను. కథావస్తువు ప్రధానంగా ఈ క్రింది లక్షణములను కలిగి యుండవలయును –

1. నాతి దీర్ఘమును నాతి సూక్ష్మమును అయి ఉండరాదు.
2. ప్రేక్షకుని మానసమునకు హత్తుకొను నట్లుండ వలయును.
3. సర్వాంగములు స్పష్టములుగా ప్రదర్శింపబడు నట్లుండ వలయును.
4. నాయకుని భాగ్య పరిణతికి సముచితమైన అవకాశమును కలిగియుండయుండ వలయును.

నాటక కథావస్తు రామణీయకతకు అరిస్టాటిల్ మూడు మార్గములను సూచించెను-

1. సంభావ్యత మరియు ఆవశ్యకత–Probability & Necessity:–లోకవృత్తము ననుకరించి కవి దాని నున్నది ఉన్నట్లుగా రచింపరాదు. దానివలన సమకూరు ప్రయోజన మేదియు నుండదు అందువలన కవి లోకవృత్తము నందలి సంఘటన

లందు తగు మార్పులను సందర్భాను సారముగా లేక అవశ్యకతాను సారముగా కావింప వలయును. కథావస్తువును జీవితమందు సంభవనీయముగా నొనర్చ వలయును. అపుడే నాటక కథావసువు ప్రేక్షక మానసిక స్థితికి సంభావ్యమానమై విశ్వసనీయముగా తోచును. ఏది సంభవించెనో దానిని వివరించుట కవి కర్మ కానేరదు. ఏది సంభావ్యతలేక ఆవశ్యకత నియమము ప్రకారము విశ్వసనీయమో దానిని నాటక కర్త ప్రదర్శింపవలయును అపుడే నాటకము సార్వజనీన స్థాయి నందుకొనునని అరిస్టాటిల్ తెలిపెను. కావున నాటక కర్త-

1. పరిస్థితికి అనుగుణముగా సన్నివేశములను కల్పింప వలయును.
2. చరిత్రవలె గతమును జరిగినది జరిగినట్లు వర్ణింపరాదు.
3. కథావస్తువును సార్వజనీన స్థాయికి చేర్చ వలయును.

సంభావ్యతకు సంబంధించిన మరొక మహత్తర విషయమును అరిస్టాటిల్ వెల్లడించెను ఆయన సంభావ్యతను రెండు రకములుగా విభజించెను.

a) సంభావ్య అసంభావ్యత– Probable impossibility– b) అసంభావ్య సంభావ్యత – Impossible probability – ఇట్లు జరుగునని ఊహించిన దానికి వ్యతిరేకముగా జరుగుట సంభావ్య అసంభావ్యత జరుగనేరదని అనుకొన్నది జరిగి తీరుట అసంభావ్య సంభావ్యత. రెండవ రకమైనదే అత్యంత రమణీయముగా నుండునని అరిస్టాటిల్ తెలిపెను. దానికే నాటక కర్త ఎక్కుడు ప్రాధాన్యత నీయ వలయుననెను. సామాజిక దృష్టితో ఇదియే అత్యంత కూతుహలవర్ధకమై రసానుభూతికి తోడ్పడును.

**2. స్థితి విపర్యాసము**–Reversal of Situation:– స్థితి విపర్యాసమన సామాజికుడు ఊహింపని రీతిలో నాయకుని భాగ్యనిర్ణయము వైపు కథ సాగిపోవుట ఇది స్వాభావిక గమనంతోనాయకుని విషమస్థితిని సూచించును. ఇది ప్రేక్షకుని ఊహకు అతీతమైనందున కూతూహల వర్ధకమై నాటకానుభూతికి తోడ్పడును.

**3. అభిజ్ఞానము** – Recognition:– విపర్యాసము వలె సంభావ్యతకు అధీనమై అభిజ్ఞానము కథా రామణీయకతకు తోడ్పడును. ప్రసిద్ధ నాటక కర్తల అభిజ్ఞాన సన్నివేశములు నాటకమునకు అధిక ప్రభావోత్పాదక శక్తిని చేకూర్చును. నాటకమందు అభిజ్ఞానము నానారకములుగా ప్రదర్శితములు కావచ్చును. ప్రధానము

లైన వానిని అరిస్టాటిల్ ఇట్లు తెలిపెను–1. స్థితి విపర్యాసముతో పాటే ప్రదర్శి తమగుట 2. చిహ్నముల ద్వారా ప్రదర్శించుట 3. స్మృతిజన్యముగా ప్రదర్శిత మగుట 4, తర్క-వితర్కముల ద్వారా సంభవమైనట్లు ప్రదర్శితమగుట 5. మిశ్ర మముగా ప్రదర్శిత మగుట 6. స్వాభావికముగా ప్రదర్శిత మగుట.

అరిస్టాటిల్ ఏర్పరచిన స్థితి విపర్యాసము, అభిజ్ఞానమును విమర్శకులు సంశ్లిష్ట కార్యవ్యాపారమునకు కీలకములుగా గుర్తించి యున్నారు.

**కథా వికాసము–Expansion of Plot:–** నాటక కార్యక్రమానుగత పరిణామమే కథావికాసము. నాయకుడు తన ఆశయసిద్ధికై సలుపు ప్రయత్న మంతయు కథా వికాస రూపమున పరిణమించును. అరిస్టాటిల్ సమగ్ర కథావస్తువును రెండుగా విభజించెను- సంవృతి మరియు వివృతి. సంవృతి యందు నాయకుని యత్న మంత యు ఫలసిద్ధికి ఉన్ముఖమై యుండును. వివృతి యందు నాయకుని ఫలాగమము ప్రదర్శిత మగును. వీనిని క్రమముగా పూర్వోత్తర భాగములుగా పేర్కొనవచ్చును.

**విషాదస్థితి–Tragic situation–** విషాదరూపకము అత్యంత గంభీరముగా నుండి ప్రేక్షకుని కరుణ-త్రాస భావములను పరిష్కరించునని అరిస్టాటిల్ తెలిపెను' కనుక నాటకము విషాదస్థితితో అంత మగుట సహజము. రూపక విషాదస్థితి నాయక వధ ద్వారా సమకూరునని ఆయన తెలుపలేదు. అతని కది అభిమతము కూడా కానేరదు. నాటకమందు ప్రదర్శింపబడు నాయకుని కార్యము దౌర్భాగ్యమందు పరిణమించుట వలన ప్రేక్షకుని మానసము సంక్షోభము జెందును; తద్వారా అ తడు భౌతిక నశ్వరతను గుర్తించి పారమార్థిక చింతనకు లోనగును. ఇట్టి ప్రభా వము సృష్టింపబడు నట్లు నాటక కథావస్తువు రచితమైనపుడు రూపకము విషాదా ంత మగును. కరుణోత్పాదకములైన అట్టి సన్నివేశములను కల్పించునపుడు ఈ క్రింది నియములను నాటక కర్త గుర్తుంచుకొన వలయునని అరిస్టాటిల్ సూచించెను

1. సన్నిహిత వ్యక్తుల లేదా బంధువుల మధ్య అనాలోచితముగా అకార్యము జరిగిపోవుట.
2. దారుణకృత్యము అజ్ఞాన వశాత్తు జరుగుట; తదనంతరం తత్సంబంధిత జ్ఞానము కలుగుట.
3. సంబంధిత జ్ఞానము ఉండియు, వీలు కలిగి యుండియు కార్యము జరుగక యుండుట.

4. అజ్ఞానవశాత్తు అకార్యము జరిగి యుండెడిదే కాని అంతకు పూర్వమే వస్తుస్థితి జ్ఞాత మగుట.

పై నాల్గింటిలో అజ్ఞానవశాత్తు సంభవించిన అకార్యమే అత్యంత ప్రభావ వంతమై ప్రేక్షకుని హృదయమును కరుణాంతరంగిత మొనర్చును.

II. పాత్రలు-Characters:- నాటకము ఒక కార్య విశేషమును ప్రదర్శించును ఆ కార్య నిర్వహణకు నామరూప ధారులైన వ్యక్తులు కావలసియుండును అ వ్యక్తులే పాత్రలు. వీరు నాటక కథా స్వభావము ననుసరించి తమ ప్రమేయ మున్నంత మేరకే రంగశాలయందు అభినయించెదరు. పాత్ర పోషణమందు నాటక కర్త పాటింపవలసిన నాలుగు నియమములను అరిస్టాటిల్ సూచించెను. అవి- 1. ఉదాత్తత- 2. ఔచిత్యము- 3. అనురూపత- 4. ఏకరూపత.

నాయకుడు నాటక కార్యమునకు కర్త మరియు భోక్తయగుట వలన అతడు ఆది నుండి అంతము వరకు రంగశాల యందు కార్యరతుడై యుండును. అతడు విశిష్ట గుణ సంపన్నుడైయుండియు ఏదో ఒక మానసిక లోపమును కలిగియుండు ను. ఈ లోపమే నాటక విషాదస్థితికి మూలము. అదియే నాయకుని పతనమునకు కారణమగును. దేవతల కోపము, పాప కార్యాచరణము మున్నగునవి నాయక పతనమునకు కారణములు కావచ్చును. ఐనను అవి వాస్తవిక దృష్టితో అంత బలీయ ములు కానేరవు. మానసిక లోపమే ప్రభావవంతంగా నుండును. ఈ స్వాభావిక లోపము 'హామెర్టియా'-Hamartia-గా పరిగణింప బడినది.

III. ఉద్దేశ్యము - Thought - రచయిత ఆశించినదే రచనకు ఉద్దేశ్య మగును. ఇది రెండు విధములుగా వ్యక్తమగును పాత్రల సంభాషణ ద్వారా మరియు సన్ని వేశ కల్పన ద్వారా. పాత్రల సంభాషణ ద్వారా ప్రకటింపబడిన రచయిత ఉద్దే శ్యము తర్కసమ్మతముగా నుండును. ఇది బుద్ధి తత్త్వమునకు సూచకము. సం దర్భానుసారముగా కవి తన ఉద్దేశ్యమును పాఠకునకు సూచింప వచ్చును. కాని నాటక కర్త కిట్టి అవకాశము ఉండదు. అందువలన అతడు తన ఉద్దేశ్యమున కను గుణముగా సన్నివేశములను కల్పించును. వాని ప్రదర్శన ద్వారా నాటక కర్త ఆశయము ప్రకటింపబడును. ఇది భావనాశక్తికి సూచకము. ఉత్కృష్ట ప్రక్రి యయైన విషాదరూపకము ఉదాత్త ఉద్దేశ్యమును కలిగియున్నందున నాటక కర్త

భౌద్ధిక, భావనాత్మక తత్త్వముల యొక్క సమరసతను పాటింపవలసి యుండును.

**IV. పదరచన– Diction:**– పదరచన నాటకమందు ప్రయుక్తమగు భాషాశైలికి సంబంధించినది. నాటక భాష లాక్షణికమై అలంకారయుక్తముగా నుండవలయునని అరిస్టాటిల్ తెలిపెను.

**V. గీతము-Song:**– సంగీతము నాటకమునకు అనివార్యతత్త్వము విషాదరూపకమందలి గీతముల ఆలాపన సంగీతయుక్తములై యుండవలయును. అపుడే సామాజికుడు సత్వర రసానుభూతికిలోను కాగలడు. భావోత్తేజనమునకు సంగీతము అధికముగా ఉపకరించునని రాజనీతి శాస్త్రమందు అరిస్టాటిల్ వివరించెను.

**VI. రంగవైభవము-Spectacle** – ఇది ప్రధానముగా రంగశిల్పికి సంబంధించిన విషయం. దీని వలన భావదీప్తి సుకరమగుననుట నిజమే కాని కావ్యశాస్త్ర దృష్టితో అంత ప్రధానం కానేరదని అరిస్టాటిల్ అభిప్రాయము. శ్రవ్యనాటక పరంపరను ఇందుకు నిదర్శనముగా గ్రహింపవచ్చును

**అంగములు– Parts:**- నాటక సమగ్ర కథా వస్తువు సూచ్యము, అసూచ్యమని రెండు విధములు. ప్రస్తావన, ఉపాఖ్యానము, ఉపసంహారము, బృందగానములు సూచ్యమునందు జేరునని అరిస్టాటిల్ తెలిపెను. సూచ్య కథా భాగము మువ్విధము లనెను,

1. నాటక కార్యారంభమునకు పూర్వమే జరిగిన వృత్తాంతము.
2. కార్యము జరుగక పూర్వమే సూచింపబడు కథా భాగము.
3. వధ, సమరము, మరణము మున్నగు హింసాత్మక కృత్యములు.

స్వగతములులేని ఆ కాలమున కథకు సంబంధించిన అంశములను నటకులే స్వయముగా ప్రేక్షకుల రూపమున రంగశాలను ప్రవేశించి ప్రేక్షకులకు బృందగానములద్వారా అప్రదర్శనీయకథా భాగమును సూచించెడివారు. అందువలన ఆ కాలమున బృందగానములు అధిక ప్రాచుర్యమును వహించినవి. బృందగానములు పూర్వోత్తరములని రెండువిధములు. నాటక కార్యారంభమునకు పూర్వమే జగిరిన వృత్తాంతమును సూచించునది పూర్వగానము. నాటక అంతిమగీతము ఉత్తర గానము. వీనిని అరిస్టాటిల్ ఇట్లు తెలిపెను– బృందగానమునకు మొదట నుండునది ప్రస్తావన. సంపూర్ణ బృందగానములకు మధ్యజరుగు కథా భాగము ఉపాఖ్యానము. అనంతరం బృందగానం లేనిది ఉప సంహారము.

# హాస్యరూపకము - Comedy.

హాస్య రూపకమును గురించి అరిస్టాటిల్ కావ్యశాస్త్రము నందిట్లు తెలిపెను- ''బైట నున్న గ్రామములను వీరు 'కోమాయి' యనియు, 'అథేనియనులు' 'డోమాయి'యని పిలుతురు. కామెడీ నామకరణము కోమ్డిజెయిన్; అనగా రాగభోగాలం తేలుట యను దాని అధారముగా జరుగలేదని. అవమానితులైనవారు నగరము నుండి వెలివేయబడి ఒక గ్రామము నుండి మరియొక గ్రామమునకు తిరుగాడు చుండుట వలన కలిగినదని వీరి కథనము''- Ch 3

''మరియొకటి (హాస్యరూపకము) నేటికిని అనేక నగరములందు ప్రచారములో నున్న వ్యంగ్యగేయముల ద్వారా ప్రవర్థిల్లెనని చెప్పవచును''- Ch.

గ్రీకు రూపమునకు మూల స్రోతస్సు డియోనిసస్ ఉత్సవములు. విషాద రూపకమునకు వలె హాస్య రూపకమునకు కూడా ఆనాటి నృత్యగేయములే తొలి రూపమని భావింపవచ్చును. తరువాత 'కామస్'యను ఒక తెగకు సంబంధించిన జనులు వానిని హాస్యపూరితములుగా అభినయించి యుందురు ఐనను వారి నృత్య గేయములు అధిక్షేపింపబడలేదు. ఉదాత్త భావనచే కొరవడి యున్నందున సమాజమునందు ఆదర పాత్రములు కాకుండా యుండవచ్చును

హాస్యరూపక వికాసమును అరిస్టాటిల్ ఇట్లు తెలిపెను- 'అతడే (హోమర్) వ్యక్తిపరమైన వ్యంగ్యరచనకు బదులుగా అభిహాస్య తత్త్వమును నాట్య రూపమున సమావేశపరచి ప్రప్రథమముగ హాస్య రూపకమునకు రూపురేఖల నిర్ధారించెను. ఈలియడ్ మరియు ఒడిస్సీకు విషాద రూపకముతో కల సంబంధమే అతని 'మార్గిటెస్'కు హాస్య రూపకముతో కలదు .. నాటకము ఉత్కృష్ట కళగా రూపొందుచున్న ఆ కాలమున విషాద రూపక రచయితలు హేళన కావ్యకర్తలను మరియు మహాకావ్య రచయితలను అధిగమించిరి .... కథా వస్తువు మాత్రము సిసిలీ నుండి దిగుమతియైనది. కాని ఏథెన్స్ రచయితలలో 'క్రెటస్' యను నతడు మొట్టమొదట ద్విమాత్రిక ఛందమును పరిత్యజించి విషయమును మరియు కథా వస్తువును సాధారణీకృత మొనర్చెను''- Ch 5.

సారాంశముగా ఇట్లు గ్రహింపవచ్చును. హోమర్ కావ్యములందే విషాద-హాస్య రూపక బీజము లిమిడి యున్నవి లోక శ్రేయస్సు దృష్ట్యా వీరగాథలను గ్రహించి విషాదరూపకము రచింపబడినది అందువలన అది ప్రసిద్ధి వహించినది. పేలవమైన హాస్యమును ప్రధాన రసముగా కల హాస్య రూపకమును గురించి ఎవరును శ్రద్ధ కనబరచలేదు.

అరిస్టాటిల్ విషాద రూపకమున కేర్పరచిన నాటక తత్త్వము అన్నియు హాస్య రూపకమునకు అన్వితములగును. కథావస్తు స్వభావ మందు ఈ రెండింటియందు విశేష అంతరము కలదు. హాస్య రూపకవస్తువు విషాద రూపకవస్తువు వలె అత్యంత గంభీరముగా నుండదు.

''నేను మొదటనే తెలిపినట్లు కామెడీయందు అల్పతర, మానవులు అనుకరింపబడెదరు. ఇట అల్ప మన దుష్టతయని భావము కాదు. ఏలన హాస్యము కురూప మందలి ఒక భాగమే యగును అందలి వికారము మరియు మోటు తనము హానిప్రదము కానేరదు. ఒక ఉదాహరణమును గమనించండి- కామెడీ యందు ప్రదర్శింపబడు వేషధారణ మోటుగా కనబడవచ్చును. కాని బాధకు హేతువు కానేరదు''- Ch. 5

కావున హాస్యరూపకము హాని ప్రదము కానేరదు. అనైతికతను పోషింపదు అది మానవునిలో కరడుకట్టుకొనియున్న అహంభావము, మూఢ నమ్మకము, అజ్ఞానత, ధౌర్బల్యము మున్నగు వానికి సంబంధితమైన కార్యమును ప్రదర్శించును కద్వారా హాస్యము ఉద్భూతమగును. ప్రేక్షకుడు తనలోని అజ్ఞానతకు తానే నవ్వుకొనును ఇట్లు అతని భావములు పరిష్కరి-పబడును; మనసు తేలిక యగును. ఈవిధముగా హాస్యరూపకము నాయకునిలో వివేకమును కల్గించి సుఖాంతమగును.

హాస్య రూపక పాత్రలు విషాదరూపక పాత్రలవలె గంభీర చింతనా పరులు కారు. స్వల్పవిషయమును గూర్చి తర్కించెదరు; వాదులాడెదరు. వారి ముందు మహత్తర లక్ష్యసాధన ఏదియు నుండదు నాయకుడు దుష్టుడు కానేరడు; అత్యుత్తముడు కూడా కాడు; సామాన్యుడు. అనేక లోపములను కప్పిపుచ్చుకొనియున్న వాడై నందున మోసగించుటలో నిష్ణాతుడైయుండును. ఐనను అతని ఉద్దేశ్యము లహీనతను రూపుమాపి వివేకమును కల్గించుట యగును. ఇందలి పాత్రలు పిచి

త్ర వేషధారులై యుందురు. సన్నివేశములు సైతము చిత్రవిచిత్రములుగా నుండును.

హాస్య రూపక మందు హాస్యరస పోషణ ప్రధానముగా నాలుగు అంశములపై ఆధారపడి యుండును. 1. హాస్యాస్పదమైన వక్రదేహము 2. విచిత్రమైన భాషా ప్రయోగము 3 మానవ దుర్బలతకు సంబంధించిన భావావేశము 4. అనపేక్షితములైన విచిత్ర సన్నివేశములు.

## మహా కావ్యము – Epic

ఆది కవియైన హోమర్ విరచిత ఈలియడ్, ఒడిస్సేయను రెండు మహాకా ్యములను లక్ష్యముగా గ్రహించి అరిస్టాటిల్ మహాకావ్య లక్షణముల నిట్లు నిర్ధా ంచెను– 1. ఉదాత్త పాత్ర పద్యబద్ధ అనుకృతి 2. విస్తార కథావస్తువు: జాతి జీన ప్రతీక. 3. కథనాత్మకము 4. ఏకఛందోవిరచితము 5. వివిధ సంఘటనల ు, అద్భుత సన్నివేశములకు నిలయము.

మహాకావ్యము గడచిన కథ. నాటకము కనుల ముందు జరుగు కథ ఈ ండింటిలో కల భేద మిదియే. గీతము మరియు ర గవైభవములను రెండు తత్త్వ ులను మినహాయించినచో మిగిలిన– కథావస్తువు, పాత్రలు, ఉద్దేశ్యము మరియు ౖలి – ఈ నాలుగు తత్త్వములు రెండింటిలో సమానము.

విషాద రూపక కథా రమణీయతకు నిర్దేశింపబడిన ఆవశ్యకత, సంభావ్యత భిజ్ఞానము, స్థితి విపర్యాసము, సంవృతి, వివృతి సమగ్ర కథా వికాసము మున్న న వస్తుయును మహాకావ్య కథావస్తువున కన్వయించును. ఐనను ఇది ప్రదర్శ త్మకము కానందున విషాద రూపకమునకు లేని కథా విస్తారతా స్వాతంత్ర్య ును కలిగియున్నది. ఉప కథల వైవిధ్యత, అతి ూననీయ సన్నివేశ కల్పన ందు కానవచ్చును. సామాజికుని మానసిక స్థితి నాకర్షించుకొను విధముగా ద్భుత రసాభి నివేశాన్వితమై యుండును.

పాత్రల సంఖ్య నాటకము నందు వలె పరిమితముగా నుండదు. జాతికి ్రతినిధులుగానున్న వారందరు అన్ని రకములైన రూప వేషాదులతో మహాకావ్య

మందు వర్ణింపబడెదరు. స్త్రీ పాత్రలకు సముచిత స్థానము కల్పింపబడును. మహ కావ్యనాయకుడు విషాద నాటక నాయకునివలె ప్రసిద్ధ రాజవంశమునకు లేద కుటుంబమునకు సంబంధించి యుండును. ఉదాత్త గుణభరితుడై సమగ్ర జాతి ప్రాతినిధ్యము వహించును.

మహాకావ్య ఉద్దేశ్యము సైతము మహనీయమును, భవ్యమునై యుండును సమగ్ర మానవ జీవనసౌభాగ్యమే మహాకావ్య ఉద్దేశ్యమై యుండును. అందువల్ల మహా కావ్యానందానుభూతి లోకోత్తరమై యుగయుగాల వరకు తరతరాల వరక దివ్యసందేశమును చాటు సామర్థ్యమును కలిగియుండును. సారాంశముగా సచ్చి తానంద స్వరూప ప్రతిపాదనమే మహాకావ్య లక్ష్యము.

మహాకావ్య భాషాశైలి వివిధాలంకార శోభితమై యుండును ఉదాత్త గుణ సమన్వితమైయుండును. అట నట నాటకీయశైలి కూడా ప్రసంగాను కూలముగా ప్రయోగితము కావచ్చును. తత్కాలీన నాట్య సాహిత్యముచే ప్రభావితుడై అరిస్టా టిల్ నాట్యశైలిని మహాకావ్య మందు సమర్థించెను. పరంపరాగతమైన వీర ఛంద ము మహాకావ్యమున కుపయుక్తముగా నుండునని తెలిపెను. అంతే కాక ఎవరేని ఇతర ఛందములందు మహాకావ్యమును రచించినతో అది అనుప యుక్తమని కూడా తెలిపెను.

మహాకావ్యము యుగప్రవర్తక గ్రంథము. మహాకవియే ఇట్టి ఉత్కృష్ట రచనను వెలువరించుటకు సమర్థుడగును.

## కావ్యప్రయోజనము - Poetic Function.

అరిస్టాటిల్ కావ్యమును అనుకరణాత్మక కళగా తెలిపెను. అనుకృత వస్తు వు నుండి ప్రాప్తమగు ఆనందము సార్వజనీన స్థాయికి తక్కువ కానేరదనెను. కవి అనుకరించును; సామాజికుడు దాని ననుభవించును. స్రష్టయైన కవికి మరియు భోక్తయైన సామాజికునకు- ఇరువురకు అనుకృత వస్తువు ద్వారా ఆనందము కలు గునని తేటపడును. కావ్యప్రయోజనము ప్రధానముగా సామాజికునకు సంబంధి తమైయున్నది. కావ్య, నాటకముల ద్వారా సామాజికునకు కలుగు ఆనంద ప్రక్రి యను అరిస్టాటిల్ ఇటు తెలిపెను.

## భావ పరిష్కారము - Katharsis

"విషాద రూపకము కరుణ-త్రాస భావముల నుత్తేజపరచి ఆ మనోవికారములను పరిష్కరించును. అదియే కావ్య ప్రయోజనము. కావ్య శాస్త్ర మందు భావ పరిష్కారమును అరిస్టాటిల్ లాక్షణికముగా తెలిపెను కాని దానిని వివరింపలేదు. ద్వితీయ భాగమందు వివరించెద ననెను. కాని అది అనుపలబ్ధము. అందువలన 'కెథార్సిస్' విభిన్నార్థములతో ఆచార్యులచే వ్యాఖ్యానింప బడినది.

వక్తృత్వ శాస్త్ర మందు అరిస్టాటిల్ త్రాస-కరుణ భావముల స్వభావముల నిట్లు తెలిపెను— మానసిక బాధకు లేక కల్లోలమునకు సంబంధించినది త్రాస భావము. ఇది సహజముగనే వినాశకరము లేక బాధాకరముగా నుండును. సంఘటన అత్యంత సన్నిహితమైనపుడు దానిని స్వయముగా మన మనుభవించినట్లు భావింతుము అట్టియెడ భయము కరుణముగా మారును కనుక అరిస్టాటిల్ దృష్టియందు త్రాసము అనాత్మిక భావము; కరుణము ఆత్మీయ భావము. ఒకటి వినాశకారి; మరొకటి మంగళకారి. ఇవి రెండును స్వతంత్ర భావములైనప్పటికిని పరస్పర సంబంధితములు. త్రాసము కరుణమునకు ప్రేరకము; కరుణము త్రాసమునకు పర్యవసిత రూపము. శిశువు మాతృ గర్భము నుండి వెలువడగనే భయముతో ఆక్రోశించును. శిశు రోదనము మాత యందు కరుణభావము నుద్రేకించును. శిశు రోదనమునకు మూలము అజ్ఞానము మాతృ ప్రేమకు మూలము జ్ఞానము. కనుక జ్ఞానోదయమునకు అజ్ఞానమే ప్రేరకము. ఇట్లు సామాజికుని జ్ఞాన పరిణతిని దృష్టియందుంచుకొని విషాద రూపకము ద్వారా సామాజికుని కరుణ-త్రాస భావోద్దీపనమును అరిస్టాటిల్ నిర్ధారించెను. తద్వారా ప్రేక్షకుని భావములు పరిష్కరింపబడగా అతడు స్వార్థభావ పరిధి నుండి విముక్తుడై పరమార్థము వైపు పురోగమించును. ఆ దశ యందాతనికి సార్వజనీన సత్యము స్ఫురించును. దివ్యమైన ఇట్టి స్ఫురణ ప్రేక్షకుని మానసమునకు ప్రశాంతతను చేకూర్చును; లోకమునకు శ్రేయస్సును సమకూర్చును.

రాజనీతి శాస్త్రమందు అరిస్టాటిల్ సంగీత ప్రభావము నిట్లు వివరించెను— సంగీత శాస్త్రము ఒకే కార్యక్షేత్రమునకు పరిమితము కాదు; నానా రకములైన లక్ష్యములను సిద్ధింపజేయుటకు అని నా అభిమతము. ఉపదేశించుటకు, పరిమా

ర్జనమునకు లేదా పరిశుద్ధ పరచుటకు. సంగీతముద్వారా బౌద్ధిక ఆనందము కూడా కలుగును. రహస్యాత్మకమైన భావము నుద్రేకపరచు ధార్మిక రాగములు వ్యక్తి ఆవేశమును శాంత పరచును; పరిశుద్ధ మొనర్చును అట్టి కల్లోలిత హృదయము శాంతించును, త్రాసముచే ఆవిష్టులైన భావుకులందరు ఇట్టి అనుభవమును పొందెదరు. ఇతరులు సైతం తమతమ సంవేదనాత్మక శక్తికనుగుణముగా ఇట్టి మానసిక పరిశుద్ధత ననుభవింతురు. వారి ఆత్మ విస్తారము నొందును; ప్రసన్నమగును. ఇట్టి పరిశుద్ధ రాగము మానవ సమాజమునకు నిరపాయకరమైన ఆనందమును ప్రసాందిచును- పై వాక్యములందు సంగీతముద్వారా నిరపాయకరమైన ఆనందము ఉపలబ్ధ మగునని అరిస్టాటిల్ తెలిపెను. అనగా దివ్యానందము. విషాద రూపక మండలి బృంద గానములు సంగీత సహాయమున ఆలాపింపబడుట వలన కరుణా-త్రాస భావోత్తేజన ద్వారా ప్రశాంతతను పొందిన ప్రేక్షకుని మానసమునకు సంగీతము అహ్లాదమును చేకూర్చునని తలంపవచ్చును. కాని అదియును సరికాదు. ఏలన సంగీత సహాయము నపేక్షింపని కావ్యములు సామాజికునకు ఆనందము నేతీరున కల్గించును ? సమాధానముగా రమణీయ భాష, అలంకార ప్రయోగము, ఛందస్సు మున్నగు కళాతత్త్వ అంగములను పేర్కొనవచ్చును. అదియును సమంజసంగా లేదు. కారణమేమనగా ఆంతరిక సౌందర్యముతో సమన్వితముకాని బాహ్య కళాతత్త్వరామణీయకము సమగ్ర సాహిత్యానందమును సమకూర్చజాలదు.

ఇక కెథార్సిస్ ప్రక్రియను అరిస్టాటిల్ దర్శనమున కనుగుణముగా పరిశీలించి చూతము. అరిస్టాటిల్ దర్శనము ననుసరించి సృష్టికి మూల తత్త్వములు రెండు- ద్రవ్యము (Matter). ఆకృతి (Manner or Form) ఈ రెండు పరస్పరము సమన్వయము నొందగా ఏర్పడినదే సృష్టి. కనుక వీని సమరసతయే సృష్టికి మూల హేతువు. వీనిలో ఏది లోపించినను లేదా హెచ్చుతగ్గులు కలిగియున్నను సృష్టి ఏర్పడదు. ఈ రెండింటి సమరసతద్వారా మూడవ రూప మేర్పడుచున్నది. సాహిత్యము సృష్టికి ప్రతి సృష్టి. దీని మూల తత్త్వములు రెండు- భావము మరియు కళ లేక శైలి. ఈ రెండింటి సమరసత ద్వారా మూడవ రూపమైన సాహిత్యము రూపొందుచున్నది. అందువలన సాహిత్యము సృష్టివలె వాస్తవికావాస్తవికముగా భాసించుచున్నది. మన మానసమును స్పందింపజేయుచున్నది. సార్వభౌమిక ఆనందానుభూతిని కల్గించుట దీని లక్ష్యము. సాహిత్యానందానుభూతి సృష్టి

వలె నిర్వచనమునకు అందకయున్నది; నిర్ధారింప బడజాలక యున్నది. అందు వలననే సాహిత్యము అందరిని ఒకే తీరున అలరింపజాలకున్నది కనుక అరిస్టాటిల్ దర్శనమున కనుగుణముగా పరిష్కృతములైన కరుణ-త్రాస భావముల సమరసత ద్వారా ప్రేక్షకుని యందు నెలకొను మానసికస్థితిని సాహిత్యానందానుభూతిగా భావింపవచ్చును. అట్టి మానసిక స్థితిని సామాజికునిలో కల్గించుటయే సాహిత్య ప్రయోజనము. ఐనను ఈ వివరణ సైతం కావ్యదృష్టితో సరిగాలేదు.

అరిస్టాటిల్ అనంతరం కెథార్సిస్ విభిన్నార్థములందు వ్యాఖ్యానింపబడి ది. వానిని ఐదు రకములుగా విభజింపవచ్చును. దార్శనికము, ధార్మికము, తికము, కళాత్మకము మరియు చికిత్సాపరము. (వివరణకు చూడుము- ''అరి టిల్ కావ్యశాస్త్రము'')

## రిస్టాటిల్ మహనీయత-
## he Greatness of Aristotle.

అరిస్టాటిల్ బహుముఖ ప్రతిభా సంపన్నుడు. చారిత్రికదృష్టితో ఆ మహ యుడు విశ్వసాహిత్య శాస్త్రమునకు ఆద్యాచార్యుడు. దర్శనము, రాజనీతి. ధర్మ ు మున్నగువాని ప్రభావమున అభిశంసకు పాల్పడిన సాహిత్యమును పునరుద్ధ ంచిన మహామేధావి అరిస్టాటిల్. ఈ ప్రతిభాశాలి విశ్వవ్యాప్త కీర్తిమంతుడు. వ్యశాస్త్ర దృష్టితో ఈ మహనీయుని కృషిని ప్రశంసించిన ఆధునిక పాశ్చాత్య, రతీయ ప్రముఖ సాహిత్యాచార్యుల వాక్యము లిట ఉదహరింపబడున్నవి-

"ప్లేటో తరువాత కళాత్మక మరియు సాహిత్య రచనా ప్రక్రియలను పరిశీలిం రెండవ గ్రీకు తత్త్వవేత్త అరిస్టాటిల్ ప్లేటో నిర్ధారించిన మూలాంశముల ్వరా లాభమును పొందే అవకాశము ఆయనకు లభించింది ఐనను అరిస్టాటిల్ యముగా గొప్ప ప్రతిభావంతుడు ఆయన మానవుడు మరియు ప్రకృతికి సం ధించిన అన్నిరకములైన అభివ్యక్తి రూపములను పరిశీలించుటకై ఏబృహత్తర ణాళికను రూపొందించెనో అందు కళాకృతులు మరియు రచనా ప్రక్రియల స కు ఆవశ్యకములైన ప్రాథమిక సూత్రములు నిర్ధారింప బడినవి. లలిత కళ సంబంధించిన కావ్యశాస్త్రము ప్రసిద్ధగ్రంథముగా సర్వవిదితము"

-జేమ్స్ వర్స్ఫోల్డ్.

''అరిస్టాటిల్ కావ్యశాస్త్రము అసంపూర్ణమును, రేఖా మాత్రమున నుండుట వల
అతని సిద్ధాంతములకు అది సోదాహరణ వ్యాఖ్య కాకయున్నది. ఐనను తరువా
కావ్య శాస్త్రము సమగ్ర రూపమున అతని సిద్ధాంతములకు, వ్యాఖ్యానముల
పునరాఖ్యాన రూపమున అపుడపుడు పెంచుట లేక త్రుంచుట యందు లేదా అ
పించుటయందు కేవలం వికసన మాత్రమున నున్నది'' —డేవిడ్ డచెస్.

''కావ్యాస్వాదనము మరియు భావపరిష్కారమందు వివేకసమ్మతమైన సామాన
హృదయమునే అరిస్టాటిల్ పరమ ప్రమాణముగా స్వీకరించెను శాస్త్రీయ రూ
తో ఆక్రాంతమైన ఆ యుగమందు ఇది గొప్ప సాహస కార్యము''—డా॥ నగేంద

''తన నాటికి ఉన్న కావ్యములనే లక్ష్యములుగా గ్రహించి అరిస్టాటిల్ సార్వ
లికము, ప్రామాణికము అగు లక్షణ గ్రంథమును రచింపగలిగెను. ఇది ఇప్ప
కిని సాహితీ వేత్తలకు శిరోధార్యమై ఒప్పారుచున్నది.''

—డా॥ దివాకర్ల వేంకటావధాని

''ఈ మూడు నాలుగు వందల సంవత్సరములలో పాశ్చాత్య వేత్తలు అరిస్టాటి
సిద్ధాంతములతో ఏకీభవింపక పోయినను అతని ప్రధాన సిద్ధాంతములను మా
ము అంగీకరించుచునే యున్నారు. నేటికిని అంతకంటె ప్రమాణకోటి నలంకరిం
గ్రంథ మింకొకటి లేదనుట అతిశయోక్తి కాదు.'' —నోరి నరసింహశాస్త్రి

'సేంట్స్బరి' యను ఆంగ్ల సాహిత్య విమర్శకుడు సమగ్ర పాశ్చాత్య సా
హిత్యశాస్త్ర మూల్యాంకనము కావించి అరిస్టాటిల్, లాంజినస్, కాలరిడ్జ్‌- ఈ
ఆచార్యత్రయమును మూలస్తంభములుగా నిర్ణయించెను. వీరు వెలయించిన సాహిత
శాస్త్రమే నిజమైనదని, మిగిలినదంతా ఉత్పన్నమైనను ఏలాంటి కొదవ యుండనే
దని తెలిపెను. ఈ ఆచార్యత్రయ మందు అరిస్టాటిల్‌దే ప్రథమ స్థాన మనుటలో
సందేహం లేదు

 

---

● అధోజ్ఞాపికలకు మరియు సమగ్ర వ్యాఖ్యానమునకు చూడుడు. తెలుగులో
మొదటి సారిగా ప్రచురింపబడిన ''అరిస్టాటిల్ కావ్యశాస్త్రము''.

# II

# లాంజినస్ - Longinus.

## ప్రస్తావన – Introduction.

సమాజముపై సాహిత్య ప్రభావమును దార్శనిక దృక్పథంతో వివేచించి ప్లేటో తన అభిప్రాయమును సిద్ధాంత రూపమున నిట్లు ప్రకటించెను–సాహిత్యము అసత్య మూలకము, కావ్య–నాటకాదులు సామాజకుని నుత్తేజపరచి అతని నైతిక పతనమునకు హేతువులగుచున్నవి; మరియు దేశమును అధోగతి పాలు చేయుచున్నవి. కనుక సత్యమును ప్రవచించి, నైతికతను పోషించి, దేశ సంక్షేమమును చేకూర్చు రచనలనే మనము ఆమోదింపవలయును. ప్లేటో శిష్యుడైన అరిస్టాటిల్ గురువుగారి సాహిత్య అధిక్షేపణము సరికాదని ఇట్లు నిరూపించెను– సాహిత్యము సార్వజనీన సత్యమును ప్రదర్శించును; సామాజికుని కరుణ–త్రాస భావములను పరిష్కరించి అతని నైతిక పోషణకు తోడ్పడును. ఇట్లు సాహిత్యము దేశ సంక్షేమమునే లక్షించి యున్నది. కనుక ఆమోద యోగ్యమే యగుచున్నది. ఈ గురు శిష్యుల సాహిత్య దృక్పథముల నిట్లు గ్రహింపవచ్చును-

"దేశ సంక్షేమ దృష్టితో నైతికతను పోషించి పారమార్థిక సత్యమును ప్రతిపాదించునది సాహిత్యము" - ప్లేటో.

"నైతిక పరిపోషణకై కరుణ-త్రాసములను పరిష్కరించి సార్వజనీన సత్యమును వ్యంజింపజేయునది సాహిత్యము" - అరిస్టాటిల్

లాంజినస్ యను గ్రీకు సాహిత్యాచార్యుడు ఆ యిరువురు ఆచార్యులతో ఏకీభవింప లేదు. ఉత్కృష్ట గ్రీకు రచనలుగా ప్రసిద్ధి జెందిన హోమర్ కావ్యములను, సఫూ మరియు పిండార్ గేయములను, ఎస్కైలిజ్ మరియు సోఫోక్లిజ్ విషాద రూపకములను మరియు డెమోస్తనీజ్ వాఖ్యానముల నాతడు కూలంకషంగా పరిశీలించెను. వాటి ఔన్నత్యమునకు వశీభూతుడై ఆయన సాహిత్యము నిట్లు ప్రతిపాదించెను - సాహిత్యము ఉపదేశించు నీతి లేదా ప్రతిపాదించు సత్యము సామాజిక మనోస్థితిని ఉదాత్తానుభూతి యందు పర్యవసింపజేయు లక్ష్యమును కలిగి యున్నది. అందువలన సాహిత్యము సామాజికుని మానసమును పరవశింపజేయును; హృదయమును కదలించును మరియు అతని భావాతిక్రమణ కావించి రసలోకమునకు కొనిపోవును. ఇట్టి ఉదాత్త లక్ష్యమును కలిగి యున్నందుననే సాహిత్యము హ్లాదైకమయి యగుచున్నదని లాంజినస్ "ఔదాత్యము" (Sublimity)ను సాహిత్య ప్రధాన తత్త్వముగా ప్రతిపాదించెను. ప్లేటో దృష్టి యందు నిరసన పాలై, అరిస్టాటిల్ మతమందు ఆమోద యోగ్యమైన సాహిత్యము లాంజినస్ ఔదాత్య ప్రతిపాదనతో అందరిని అలరింపజెయు వినూత్న తేజమును సంతరించు కొన్నది. సాహిత్య ఔన్నత్యము నిట్లు ప్రతిపాదించిన ప్రథమ పాశ్చాత్య సాహిత్యాచార్యునిగా లాంజినస్ సుప్రసిద్ధుడు. ఇతని రచన "పెరిఇప్సస్" యను ఆలంకారిక గ్రంథము.

## రచయిత - రచన-
## The writer and his writing.

'పెరిఇప్సస్' అనగా ఉన్నత పథమందు అని అర్థము. ఈ గ్రీకు పదవ ఆంగ్లమందు 'ఆన్ ద సబ్లాయిమ్' (On the Sublime) గా అనుదింపబడినది. ఆ పదము ద్వారా బోధపడు అర్థము ననుసరించి 'పెరిఇప్సస్' నందలి విషయం ఉదాత్త కళా ప్రేరణ, భావన, చింతన– వీనికి సంబంధించిన విశ్లేషణకు పరిమితమైనదిగా తోచును. కాని వాస్తవముగా లాంజినస్ ప్రతిపాదనము ఉదాత్తత వరకే పరిమితం కాదు; తద్వారా సమకాలీన వికృత సాహిత్యమును సంస్కరించు ఉద్దేశ మును కూడా కలిగియున్నది. ఇట్లు పెరిఇప్సస్ ధ్వనింపజేయు అర్థము 'సబ్లాయిమ్' కు సాధ్యము కానందున ఆ ఆంగ్ల పదము ఉపయుక్తమైనది కాదని కొందరు విమర్శకుల అభిప్రాయము. దీనితో పాటే కర్తృత్వమునకు సంబంధించిన వి

దము కూడా కలదు. ప్రప్రథమమున 'పెరిఇప్సున్' ఖండిత ప్రతిని వెలికితీసి క్రీ.శ. 1554 నందు ప్రచురించిన రోబర్టెలో (Robartello) యను ఇటాలియన్ సాహిత్యాచార్యుడు 'దియోన్యుసిస్ లాంజినస్' ను కృతికర్తగా నిర్ణయించెను. అదియే 19వ శతాబ్దారంభము వరకు మాన్యమగుచు వచ్చెను. తరువాత కొందరు సాహిత్య విమర్శకులు ఆతని మతమును త్రోసిపుచ్చిరి. క్రీ.శ. మూడవ శతాబ్ది యందు పాల్మీరా రాణియైన జెనోబియా కడ మంత్రిగా నుండి, రాణి సంక్షేమ మునకై అనువులబాసిన సుప్రసిద్ధ 'లాంజినస్'ను పెరిఇప్సున్ కర్తగా వారు నిర్ణ యించిరి. పెరిఇప్సున్ నందు ప్రతిఫలించిన నవ్యప్లేటో దృక్పథము ఆధారముగా స్కాట్జేమ్స్ మున్నగు సాహితీవేత్తలు పై మతమును సమర్థించిరి. కాని అంతః సాక్ష్యము ఇందుకు భిన్నంగావుంది పెరిఇప్సున్ మూడవ శతాబ్దికి చెందిన రచన కానేరదని, ప్రథమ శతాబ్దానికి సంబంధించినదని ఈ క్రింది హేతువుల ద్వారా నిరూపితమగును-

1. అత్యంత ప్రాచీన లిపి యందు దియోన్యుసిస్ పెరిఇప్సున్ కర్తగా పేర్కొ డియున్నాడు ఇతడు క్రీ. శ. ప్రథమ శతాబ్దియందు రోమ్ నగరంలో జీవి యున్న గ్రీకు ఆలంకారికుడు కాని ఇతని రచనలతో పెరిఇప్సున్‌కెట్టి సంబం కానరాదు. ఎట్టి సామ్యతకూడా లేదు. రచనాశైలి సైతం భిన్నంగా వుంది. కన పెరిఇప్సున్ రచయిత పైన పేర్కొనబడిన వ్యక్తులలో ఎవరునూ కానేరక లాం నస్ పేరుగల మూడవ అజ్ఞాత వ్యక్తియై యుండవచ్చును.

2. పెరిఇప్సున్‌నందు హోమర్ మొదలుకొని ప్రథమ శతాబ్దికి చెందిన కైకలియస్ వరకు రచింపబడిన సాహిత్య కృతులను గురించి చర్చింపబడినది. తరువాతి రచ నలు మరియు వానికి సంబంధించిన కావ్య విషయములు ప్రస్తావింపబడలేదు

3. కైకలియస్ విరచిత పెరిఇప్సున్‌తో రచయితయైన లాంజినస్ సంతృప్తి నొంద లేదని గ్రంథాది యందు తెలుపబడినది.

4. రచనాశైలి పెరిఇప్సున్ ప్రథమ శతాబ్ది రచన యని ధృవపరచును.

సాహిత్య జగత్తునందు సంచలనం కల్గించి చిరప్రసిద్ధుడైన పెరిఇప్సున్ రచ యిత నేటికిని అజ్ఞాత వ్యక్తిగానే మిగిలియున్నాడు.

పెరిఇప్సస్ గ్రీకు భాషయందు రచితమైన ఒక సంబోధనా గ్రంథము. రచయిత తన మిత్రుడైన పోస్తుమియస్ తోరోంతియెనస్‌ను సంబోధించి దీనిని రచించెను. ఈ రచన సమగ్రంగా లభించలేదు చాలా భాగము నష్టమైపోగా మిగిలిన చిన్నప్రతి యందు '44' చాలా చిన్న అధ్యాయములు కలవు. 8 అధ్యాయములు ప్రస్తావనా రూపమున కలవు. 7 అధ్యాయములందు ఉదాత్తచింతన వివేచింపబడినది. 3 అధ్యాయములందు ఉదాత్తపోషక తత్త్వములు చర్చించబడినవి. 9 అధ్యాయములందు ఆలంకారిక భాష వివేచింపబడినది. 2 అధ్యాయము లందు రచనాగరిమ స్పష్టపరచబడినది 3 అధ్యాయములందు ఔదాత్య బాధక తత్త్వములు నిరూపింపబడినవి. అంతిమ అధ్యాయమందు ఔదాత్య లోపమునకు సంబంధించిన కారణములు విశ్లేషింపబడినవి.

సమగ్రి పెరిఇప్సస్‌ను రెండు ప్రధాన భాగములుగా విభజింపవచ్చును. 1. సాహిత్య ఔదాత్య వివేచన 2. సామాన్య కళా సిద్ధాంత సమీక్ష. ఔదాత్య నిరూపణము ఈ రచన యందలి ప్రధాన ప్రతిపాద్యము. సాహిత్య ఔదాత్య సిద్ధికి రచయిత వ్యక్తిత్వమును మూలస్తంభముగా ప్రతిపాదించి లాంజినస్ గంభీర సాహిత్యాను శీలనమును మరియు మౌలిక ప్రతిభను ప్రదర్శించెను. సామాన్య కళా సిద్ధాంతము లంత ప్రధానములు కాకున్నను, కళ-ప్రకృతి, అనుకరణము, ప్రతిభ, శిల్ప సౌందర్యము, నైతికత మున్నగు వానిని లాంజినస్ వైజ్ఞానికముగా వివేచించి సార్వజనీన సాహిత్య దృక్పథమును ప్రదర్శించెను. అందువలన పెరిఇప్సస్ గ్రీకు సాహిత్య శాస్త్రమునకు వినూత్న కాంతిని ప్రసాదించిన ఆలంకారిక గ్రంథ రాజముగా ప్రశంసల నందుకొన్నది.

## ఔదాత్య మననేమి ? What is Sublimity ?

ఈ రచన యందలి ప్రధాన ప్రతిపాద్యము ఔదాత్యము. ఔదాత్యమును సాహిత్య ప్రధాన తత్త్వముగా, ఆత్మగా లాంజినస్ ప్రతిపాదించెను. ఐనను ఆయన ఔదాత్యమును స్పష్టముగా నిర్వచింపలేదు; దాని స్వరూప నిరూపణము నందు కూడా ఒక క్రమమును పాటించలేదు. ఆయన ఔదాత్యము నిట్లు వివరించెను-

''అభివ్యక్తీకరణ మందలి విశిష్టత మరియు చరమోత్కర్షత ఔదాత్యము.

మహాకవుల మరియు గద్య రచయితల ప్రతిష్టకు మరియు చిరయశస్సుకు మూల మిదియే యైయున్నది. ఇతరము లేవియును కానేరవు" 1.

'ఉదాత్త రచనా పరిభావము శ్రోతయొక్క తర్కయుక్తిని సమాధానించుటకాదు ఆతని భావాతిక్రమణ కావించుట'. 2.

'ఔదాత్యము ఒక దురతి క్రమణమైన ఆకర్షణీయ శక్తిగా పనిచేయుచు పాఠకు లందరిని వారి వారి ఇష్టాయిష్టములను లెక్కింపక ప్రభావితం చేయును'. 3.

'ఔదాత్యము సందర్భోచితంగా వెనువెంటనే ప్రకాశించును; విద్యుత్ శకలంవలె ముందున్న వస్తువులకు ప్రసరించును మరియు వక్తయొక్క వాగ్విలాసము నంతా క్షణంలో ధ్వనింపజేయును'. 4.

పై వాక్యముల ననుసరించి ఔదాత్యమునకు ఈ క్రింది లక్షణము లేర్పడును-

1. ఉత్కృష్ట అభివ్యక్తియగుట వలన ఔదాత్యము శైలీ విశేషము.
2. భావాతిక్రమణ కల్గించుట వలన ఔదాత్యము భావ విశేషము.
3. రసవాహక మగుట వలన ఔదాత్యము తత్త్వ విశేషము.
4. చమత్కార విశేషమగుట వలన ఔదాత్యము ఉదాత్త గుణ విశేషము.

పై లక్షణములు పరస్పర విరుద్ధములుగా తోచును. ఏలన అవి ఒకవైపు ఉదాత్త భావమునకు సంబంధితములు కాగా మరోవైపు ఉత్కృష్ట శైలికి. సాహిత్య పదావళి యందు అవి శబ్దము, అర్థములగును. అనగా శబ్దము బోధించు అర్థమే భావము; అర్థబోధ కేర్పడిన ధ్వని రూపమే శబ్దము. కావున ఔదాత్యము మహనీయమైన అర్థమైనా కావచ్చు లేదా శబ్దమైనా కావచ్చు. ఐనపుడు మహాకవుల చిరయశస్సుకు మూలమైన ఔదాత్యము అర్థపరమా? లేక శబ్దపరమా? లాంజినస్ ప్రతిపాదించిన ఔదాత్య సిద్ధాంతమును పరిశీలించిననే కాని మనకు సరియైన సమాధానము లభింపదు.

## ఔదాత్య తత్త్వములు-Elements of Sublimity.

లాంజినస్ ఔదాత్యమును కావ్యాత్మగా ప్రతిపాదించెను. అది కావ్యమందు ఐదు తత్త్వముల ద్వారా సిద్ధించుననెను అవి ఉదాత్త చింతన, ఉత్కట భావావేశము, సముచిత అలంకార ప్రయోగము, భాషా గరిమ, రచనా గరిమ. ఒకొక్కదానిని గురించి వివరంగా పరిశీలింతము.

## ఉదాత్త చింతన- Grandeur of Thought.

ఉదాత్తచింతనను లాంజినస్ సాహిత్య ఔదాత్య సిద్ధికి ప్రధాన తత్త్వముగా ప్రతిపాదించెను ఇది వినా ఔదాత్య సిద్ధి అసంభవం. సాహిత్యకారుని వ్యక్తిత్వము అతని రచనయందు ప్రతిఫలించుట సహజం కొన్నికొన్ని సందర్భములందు రచయిత తనకు తెలియకుండనే తన ఆలోచనా స్రవంతిని జాలువార్చుచుండును. కనుక రచయిత ఉదాత్తచింతనా పరుడైనపుడు మాత్రమే లోక కళ్యాణ ప్రదములైన రచనల సలిపి అఖండ కీర్తి నార్జించును. మహాకవుల మహాకావ్యములు ఔదాత్యవంతములైయుండుట వలననే నేటికిని పఠనీయము లగుచున్నవి. యుగయుగముల నుండి మానవతను తీర్చిదిద్దుచున్నవి. జీవన రహస్యమును పరిశోధించు దక్షత, ఉన్నతాశయము, సార్వకాలీన సత్య నిరూపణము మున్నగు మహనీయ కార్యము లన్నియు ఉదాత్త చింతనతో ముడివడి యున్నవి. కనుక ఉదాత్త చింతన సాహిత్య ఔదాత్య సిద్ధికి ప్రధాన తత్త్వమగును. కవి ఇట్టి మహోన్నత వ్యక్తిత్వమును కలిగియుండవలయునని లాంజినస్ ఇట్లు తెలిపెను-

'ఔదాత్యము ఆత్మ యొక్క మహనీయతకు ప్రతి రూపము........ఉదాత్తమును, గంభీరమైన చింతన కలవారి యందు మాత్రమే ఔదాత్యము అధివసించును. అల్పతరములును, సంకీర్ణములునైన ఆలోచనలతో మరియు దురభ్యాసములతో జీవితమును వ్యర్థపరచు కొనువారికి మానవతను ధ్వనింపజేయు మహాకావ్య రచన సాధ్యము కానేరదు. ఉదాత్త చింతనాపరులైన వారి నుండి మాత్రమే ఉదాత్త శబ్దములు నిసృతము లగును.' 5

కావున కావ్యమునకు కర్తయైన కవి జీవితము గంభీర చింతనతో ఆదర్శమై యుండవలయును. కర్త సామర్థ్యము ననుసరించి కార్యము సంపన్నమ

గునట్లు కవి వ్యక్తిత్వమున కనుగుణముగా కావ్యము రూపొందును. దృశ్యమాన సత్యజగత్తున కతీతంగా అదృశ్యమాన సత్యజగత్తును సందర్శించు గంభీరచింతనాశక్తిని కలిగియున్న కవినుండి అప్రయత్నంగా అమరవాణి ధ్వనితమగును. ఆ ధ్వననము దివ్య సందేశముగా అందరిని అలరింపజేయును. కావ్యవస్తువు నవ్యమై, భవ్యమై, గరిమావంతమై పాఠకు నాకట్టుకొని అనిర్వచనీయ రసలోకమునకు నడిపించును. మానవ జీవితమును మహోన్నతముగా తీర్చిదిద్దు మహనీయ తత్త్వమునుపదేశించి ఔదాత్య మందు తాదాత్మ్యము కావించును తద్వారా భౌతిక సౌఖ్యమందు రమించు మానవ జీవితము సంస్కరింపబడును. దేశమందు శాంతి సౌభాగ్యములు విలసిల్లగలవు. కనుక కవి పాఠక లోకము ముందు ఉదాత్త లోకమును సాక్షాత్కరింపజేయవలయును. ఆ సమయమున పాఠకుడు తన్నుతా మరచి, ఔదాత్యమునకు వశీభూతుడై, ఆనందవారాసిన తేలియాడగలడు లాంజినస్ ఈ సందర్భమున ఇట్లు తెలిపెను- మనకన్న దివ్యమును, భవ్యమునైన వస్తువుపై మనకు కూతూహలమును ప్రీతియును ఏర్పడును అది సహజం. కల్పన మరియు చింతన ఇవియే మానవ జీవితమందలి రెండు ప్రధాన శక్తులు సమగ్ర విశ్వము సైతవీనిని సంతృప్తి పరచజాలదు. కల్పన దిగంతముల కెగబ్రాకును. జీవిత మంఅంతరాంతములను పరిశీలించినపుడు అసామాన్యములును, మహోన్నతములు సౌందర్యవంతములైనవి మాత్రమే అత్యున్నత స్థాయికి చెందినవని బోధపడున సారాంశముగా ఈ విషయమును గురించి ఇంత మాత్రము వచింపగలను. మః ము ఆవశ్యకముగా, ఉపయోగవంతముగా తలచునదంత సామాన్యము. మన సంభ్రమాశ్చర్యములకు అధికారిణియైనదే అసామాన్యముగా భాసించును.

ఉదాత్త చింతనాభరితమైన కవి వ్యక్తిత్వమే సార్వజనీన తత్త్వమును పరిదర్శించి కావ్యమును ఔదాత్యవంతంగా తీర్చిదిద్దగలదని లాంజినస్ అభిప్రాయము. సామాన్యులు మహనీయముగా తలంచు భౌతిక సంపద ఉదాత్తవ్యక్తికి తృణప్రాయము. సామాన్యులు హీనముగా తృణీకరించు సామాన్య సత్యమే కవికి వనీయ సంపద. ఆ సామాన్య సత్య సందర్శనమే వారి జీవన లక్ష్యము. ఇట్లు క వ్యక్తిత్వము సామాన్య దృష్టితో సామాన్యముగనే అగుపించినను ఉదాత్తచింతనాగర్భితమైయుండును, ఇట్టి వ్యక్తిత్వమునే లాంజినస్ కవియందు అభిలషించెను. అనగా ఒక రకమున ఆయన కవిని ఋషి తుల్యునిగా కీర్తించెను అతని కృతిని రసలోక వాహకముగా విభూషించెను ఇట్లు ఉదాత్తతను ప్రతిపాదించి లాంజినస్

కవి వ్యక్తిత్వమును రాగద్వేష భరితమైన ఈ భౌతిక జగత్తునుండి విడదీసి భవ్య జగత్తునకు చేర్చెను. కవికిట్టి మహోన్నత గౌరవమును నిరూపించిన తొలి పాశ్చాత్య సాహిత్యాచార్యుడు లాంజినస్. ఇట్లు కావ్య పరీక్షకు ఆ కావ్యమందు ప్రతిఫలించిన కవి వ్యక్తిత్వమే పరమ ప్రమాణముగా లాంజినస్ భావించెను. ఇది వినా కావ్య సమీక్ష సమగ్రము కానేరదు. కవి వ్యక్తిత్వమును పరిగణింపని కావ్య విమర్శ అతిశయోక్తి భరితమే యగును. ఏలన కావ్యవస్తువు, కావ్యరూపము రెండును కవి వ్యక్తిత్వమున కనుగమనములై యుండును. అందువలన వస్తువు ఒకటేయైయున్నను కవులు తమతమ వ్యక్తిత్వముల కనుగుణముగా వివిధ రూపములను మన ముందు ప్రదర్శింతురు. లేనియెడల ఒకవిషయము లేదా వస్తువుపై ఒకే కావ్యము రచితమై యుండెడిది. సాహిత్యము వివిధ రూపముల నందనారామముగా భాసించి సహృదయ హృదయాహ్లాదకారి యగుటకు కారణం ఆ రూపములందు ప్రతిఫలించు సాహిత్యకారుల విభిన్న వ్యక్తిత్వము లనుటలో సందేహం లేదు. ఐనను సాహిత్యకారుల రచనలన్ని అందరిని అలరించి ప్రభావము నెరవనుటకు వీలులేదు. ఉదాత్త వ్యక్తిత్వ సంపన్నులైన కవుల రచనలు సమకాలముకు మాత్రమే పరిమితములు కావు; యుగ యుగాల వరకు తరతరాల వరకు మారుతున్న మానవ జీవనమున కనుగుణముగా మానవత నుపదేశించి మానవాళి నలరించు శక్తిని కలిగియుండును. అట్టి రచయితలే జరామరణజ భయములేని అపార యశస్సు నార్జింతురు. కావున ఉదాత్త చింతన సాహిత్యమునకు ప్రాణ తత్త్వము యగును.

లాంజినస్ ప్రతిపాదించిన ఉదాత్త చింతన ద్వారా బోధపడు ముఖ్యాంశలివి. ఉదాత్త చింతన—

1. ఉన్నత మానసిక స్థితిని సూచించును.
2. నైసర్గికమైన దివ్యప్రతిభకు సూచకము.
3. అమర కావ్యకృతికి నిదర్శనము.

ఉదాత్తశైలి యందే ధ్వనిత మగును.

కావ్యమును రసలోక వాహకముగా మార్చును.

## ఉత్కట భావావేశము-
## Capacity for strong emotion.

చింతన తద్సంబంధిత భావములను ప్రేరేపించును. భావములు బలీయములై వేగవంతములైనపుడు చింతన కార్య రూపము దాల్చును. కనుక కార్యసిద్ధికి చింతన మూలస్రోతము కాగా భావములు ప్రేరేపకములగును. కావ్యమందు కవి చింతన భావ రూపమున వ్యక్తమగును. అంతటితో దాని కార్యము పూర్తి కానేరదు. భాషారూపమున వ్యక్తమైన భావము శక్తివంతంగా పాఠకునిలో అట్టి భావములనే ఉద్రిక్తపరచవలయును; అట్టి అనుభూతినే కల్గింపవలయును. లేనిచో వ్యక్తరూపమున నున్న భావము శక్తిహీనమై నిరుపయోగమగును. ఇట్లు లాంజినస్ కావ్యమందు భావ తీవ్రత యొక్క అనివార్యతను ప్రతిపాదించెను. ఔదాత్య సిద్ధికి భావ తీవ్రత ప్రాధాన్యతను వెల్లడించెను. ఉదాత్త చింతనచే ప్రేరితమైన ఉత్కట భావావేగము కావ్యమందు ఔదాత్యరూపమున శక్తివంతమై సామాజికునిలో అట్టి అనుభూతిని అనగా ఉదాత్తానుభూతిని కల్గించుటకు సమర్థవంతమగును స్వ-పర, రాగ-ద్వేషాది ద్వంద్వాత్మక ప్రభావమునకు లోనైన సామాజికున్ని అతని సామాన్య వ్యక్తిత్వము నుండి వేరుపరచి దివ్యమైన రసలోకమునకు నడిపించుట సామాన్య కార్యము కానేరదు. భావములు శక్తివంతములై అత్యంత తీవ్ర స్థాయిలో నున్నపుడు మాత్రమే సామాజికుని హృదయము కదలింపబడును. ఆ దశయందాతడు కావ్య ఔదాత్యమందు తదాత్మ్యము నొంది దివ్యానందానుభూతిని బడయగలడు. ఈ విధముగా రస నిష్పత్తికి భావావేగముల తీవ్రతను లాంజినస్ అనివార్యముగా తెలిపెను. ఆతనికి పూర్వము ఆచార్యులు భావావేగముల ప్రాధాన్యతను గుర్తింపక వానిని కావ్య ఔదాత్య బాధకములుగా పేర్కొనిరి. భావావేగముల స్వభావము కావ్యసిద్ధికి తోడ్పడునను వైజ్ఞానిక దృక్పథమును లాంజినస్ ప్రకటించెను; భావిసాహిత్యాచార్యులకు మార్గదర్శకుడయ్యెను కావ్యమును శాస్త్రమునుండి వేరుపరచు తత్త్వమే భావావేగ తీవ్రత యను సత్యమును లాంజినస్ ధ్వసింపజేసెను. శాస్త్రము మానవుని మస్తిష్కమును సంతృప్తిపరచును. కాని కావ్యము అంతటితో ఆగక హృదయమునే కదలించి వేయును. ఇట్టి శక్తి కావ్యమునకు కవి యొక్క తీవ్ర భావావేశముద్వారా సిద్ధించును భావముల ను త్తేజింప జేయనేరని రచన అది కావ్య-నాటకములలో నేదియైన నేమి ? శాస్త్రము

వలె శుష్కమై నిరసనకు పాల్పడును. కావున రచన మహనీయ కావ్యకృతిగా రా జింపవలయునన్న అది పాఠకునిలో భావోత్తేజనను కల్గించు శక్తిని అవశ్యముగా కలిగియుండవలయునని లాంజినస్ స్పష్టముగా వచించెను–

'దివ్యావేశ భరితమై, దైవిక ప్రేరణవలె సహజముగా వ్యక్తమై దివ్యస్వర ము వలె మన వీనులలో ధ్వనించు నిజమైన భావావేగమునకు మించిన వేరే ఏది యును ఔదాత్యమునకు దోహదపడ నేరదని నేను విశ్వాస పూర్వకముగా తెలుప గలను'. 6.

'ఎల్లవేళల ఆనందింపజేయుచు, అందరిని అలరింపజేయు శబ్దములనే మనము సామాన్యముగా మహనీయములని ఉదాత్తములని తలంతుము. ఏలన అట్టి రచన యే ఆశయములందు, జీవన విధానములందు, ఆకాంక్షలందు, యుగము లందు లేదా భాషలందు విభేదముల నొందియున్న పాఠకులపై ఎల్లవేళల అట్టి ప్రభావ మునే నెరపును. పరస్పర విభిన్నము లందలి సమరసత వారి అభిప్రాయమునకు ప్రబలశక్తిని సమకూర్చును'-7.

భావావేగములను తాను వేరే గ్రంథమందు వివరించియున్నానని లాంజినస్ తెలిపెను. కాని అది అనుపలబ్ధం. ఐనను అతని దృక్పథమును గ్రహింపవచ్చును: 'పెరిఇప్సూన్' నందు ఆయన హర్షము, ఉల్లాసము, విస్మయము మున్నగు భావ ములను ఔదాత్యసిద్ధికి ఆవశ్యకములుగా గుర్తించెను పాఠకుని శీఘ్రతరంగా ప్ర భావిత పరచి ఔదాత్యానుభూతిని కల్గించుటలో ఆ భావములకున్నంత శక్తి ఇతర ములకు లేదని అతని మతము.

భావావేగము లన్నింటిని లాంజినస్ రెండుగా విభజించెను– భవ్యములు, హీనములు. ఉదాత్తచింతన కావ్యమందు తీవ్ర భావావేగ రూపమున వర్ణితమై దివ్య భావానుభూతిని పాఠకునిలో కల్గించును. అట్టి అనుభూతినే లాంజినస్ ఔదా త్యముగా ప్రతిపాదించెను. మరి హీన భావములకు సాహిత్యమందు కల స్థాన మెట్టిది? ఈ విషయ వివరణమందు లాంజినస్ వైజ్ఞానిక దృక్పథమును ప్రక టించెను. అల్పతర భావములకు సాహిత్యమందు స్థానము లేదనుట సరికాదు. సా హిత్యమునకు విషయముగా నున్న జీవితము సైతము ఉదాత్త, అనుదాత్త భావ ములకు నిలయమైయున్నది. ఐనపుడు సాహిత్యము జీవనమునకు అపవాద మెట్ల

గును? కావున భవ్య భావములతోపాటు హీనభావచిత్రణము సైతం కావ్య మందు అపేక్షితమగును కాని వాని చిత్రణమందు కవి జాగరూకుడై యుండవలయును. కటువైన ఔషధము ఆరోగ్యసిద్ధికి సహాయక మగునట్లు అల్పతర భావము సైతం కావ్య ఔదాత్యసిద్ధికి దోహదము కావలయును. కనుక హీనభావ చిత్రణ మందు కవి ఉదాత్త భావ వర్ణనా దృక్పథమునే వహింపవలయును. అట్టియెడ ఆ భావములు తమ హీనత్వమును కోల్పోయి భవ్యత యందు పర్యవసించును. కావున కావ్యమందు హీనభావ వేగములు ఉదాత్త రీతియందే వర్ణితములు కావలయును. అల్పతర వ్యక్తిత్వము గల కవికి అల్పతర భావముల నుదాత్తరీతియందు వర్ణించు సామర్థ్యము ఉండనేరదు ఒకవేళ అతడు యత్నించినను అతనికది సాధ్యము కానేరదు. కనుక కవికి ఉదాత్తవ్యక్తిత్వమే భావవేగ చిత్రణమందు ప్రధానమగును. మంచుతెర నల్లని కొండను శ్వేత నగముగా ప్రకాశింపజేయు విధముగా ఉదాత్త కవి అల్పతర భావమును సైతం ఉదాత్తరీతియందు ఔదాత్య సాధకముగా సాక్షాత్కరింప జేయగలడు అందువలన కవికి కావ్యవస్తువే ప్రధానం కాదు. దానిని సముచిత రీతిలో ఔదాత్యవంతముగా ప్రదర్శించు ప్రతిభయే ప్రధానమగును. ఈ తీరున గంభీర చింతనచే ప్రభావితమై ఉదాత్తరూపమున పరిణితమైన కవి వ్యక్తిత్వమును అనుదాత్త సందర్భములందు సైతం ఉన్నతమైనదిగా నిరూపించి లాంజినస్ ప్లేటో దార్శనిక దృక్పథమును అరిస్టాటిల్ నైతిక దృక్పథమును ఉదాత్తానుభూతి యందు పర్యవసింపచేసెను సాహిత్యము ద్వారా సామాజికుని భావాతిక్రమణను నిరూపించి సాహిత్యానందమును ఉదాత్తమైన అనుభూతిగా ప్రతిపాదించెను; సాహిత్య ప్రయోజనమును దార్శనిక ప్రయోజనమున కతీతముగా, నిరపాయానందకారిగా, సార్వజనీన మానవతా ప్రతీకగా నిరూపించెను; సాహిత్య వివేచనను వివిధ వాదముల కతీతముగా, ఔదాత్య వివేచనగా తెలిపెను, వైజ్ఞానిక దృక్పథమును వహించి సాహిత్యానుశీలన యందు మౌలిక ప్రతిభను ప్రదర్శించెను. భావి సాహిత్య విమర్శకులకు మార్గదర్శి యయ్యెను.

## సముచిత అలంకార ప్రయోగము–
## Appropriate use of figures.

ఔదాత్యము సాహిత్య ఆత్మ. అది మొదట కవి మానసమందు ఉదాత్త చింతనా రూపమున స్థితమయి యుండును. తదనంతరం తీవ్ర భావావేగముల రూ

మున సామాజికుని ముందు ప్రదర్శితమగును. అంతటితో కవి-కర్మయైన ఔదాత్యసిద్ధి సంపన్నము కానేరదు. పాఠకునిలో సైతం అట్టి ఔదాత్యానుభూతినే సామాజికునిలో కల్గింపవలయును. అపుడే కవి-కర్మ సార్థకమగును. ఈ కార్యము సులభంగా నెరవేరుటకై ఉదాత్త భావావేగములు అలంకారయుక్తములై సామాజికుని యెదుట ప్రదర్శితములు కావలసియుండునని లాంజినస్ తెలిపెను. అపుడు భావము లత్యంత రమణీయము లగును; శక్తివంతలై సామాజికు నాకర్షించుకొనును; ఉద్దిష్ట ప్రభావమును నెరపును. కావున ఔదాత్య భావము రమ్యాతి రమ్యమై, ఆస్వాదనకు యోగ్యముగా నుండవలయునన్న అది అలంకార సమన్వితమయి నూత్న శోభతో వెలుగొందుట అవశ్యకము ఈ దృష్టితో కావ్య రమ్యతకు లాంజినస్ అలంకార ప్రయోగావశ్యకతను కావ్య ఔదాత్య సిద్ధికి సాధకముగా ప్రతిపాదించెను. భావ రహిత అసందర్భ అలంకార ప్రయోగమును లాంజినస్ ఈ విధముగా అధిక్షేపించెను-

'అది పాఠక మానస మందు అసమంజసతను కల్పించును.... సామాజికుని ఒక అబోధ బాలకునిగా భావించి వక్త అనుపయుక్త అలంకారముల నుపయోగించును. ఆతనిలో భ్రాంతిని సృష్టించును'-8.

కావున అట్టి అలంకారముల ద్వారా భావమునకు గరిమ చేకూరదు. మీదు మిక్కిలి ఔదాత్య భావనయందు క్లిష్టతను సృష్టించును. అందువలన అలంకారములు భావస్ఫోరకములుగా నుండవలయును. కానన మందు జలజల పారు సెలయేటి నీటి యందు మత్తుగా తేలిపోవు సుందర పుష్పమువలె అలంకారములు భావావేగమందు అప్రయత్నంగా వచ్చి చేరవలయును; ఔదాత్యసిద్ధికి సహజ సహచరములుగా నుండవలయును. అపుడే సామాజికున కవి ప్రత్యేక ప్రయోగములుగా తోచక ఆతని అనుభూతి గమనమందు చేదోడు వాదోడుగా నుండును. ఆ స్థితియందు ఆతని సమగ్ర భావనిధి అతిలోక మోహనముగా స్వ పర భేదమునుండి విముక్తమై కావ్య ఔదాత్యమందు పరవశించును; రసలోకమందు విశ్రమించును. ఆ దశయందు కవి శక్తి దుర్నివారణ శక్తిగా భాసించును; వాక్కు రమణీయమై అందరి హృదయములను స్పర్శించును. కనుక అలంకారములు కావ్య శోభాకారక ధర్మములు కావలయునే కాని కృత్రిమాలంకారములు కారాదు. ఇట్లు అలంకార ప్రయోగము సముచితముగా నుండి ఔదాత్యమునకు పోషకము

కావలయును. కావ్య ఔదాత్యముతో అలంకారముల సంబంధ మీతీరున నుండును- 'సూర్యుని ప్రకాశము ముందు దీపపు వెలుగు విలీన మగునట్లు, ఔదాత్య ప్రకాశ న ముందు నసుచిత అలంకార ప్రయోగము యొక్క ప్రభావము సమసించును. ఈ తీరున ప్రకృతితో కళకు కల సంబంధం ధృవపడును. రచన యొక్క ప్రభా వం ద్విగుణీకృత మగును'-9.

అలంకార ప్రయోగ సందర్భమందు రచయిత స్థాన విశేషము, పరిస్థి తి విశేషము, రీతి మరియు ఆశయమును దృష్టియందుంచుకొన వలయునని లాం జినస్ నిర్దేశించెను. అతని మతమందు సముచిత రీతిలో ప్రయోగింపబడిన అలం కారములే అధిక ప్రభావవంతము లగును. ఆయన ఔదాత్యమునకు ఉత్కర్షతను చేకూర్చు అలంకారములనే వివరించెను. అవి ఔదాత్య సిద్ధికి తోడ్పడు విధాన మును మరియు రచనను రమ్యాతిరమ్యంగా తీర్చిదిద్దు ప్రక్రియను లాంజినస్ ప్రా చీన కవుల, రచయితల అలంకార ప్రయోగము ఆధారముగా సోదాహరణముగా నిరూపించెను. ఆయన వివరించిన ప్రధాన అలంకారములను పరిశీలింతము.

విస్తారణ - Amplification ;- విషయమును దాని తత్త్వము వివరణము మరి యు ప్రాచుర్యము ఆధారముగా అంగభూత ప్రసంగ సహితముగా వివరించు విస్తారణ. దీని ద్వారా ఉక్తులందు మరియు ఘటనలయందు ఘనిష్ఠత యేర్పడును ఉదాత్త భావ భరితమైన శైలికి అమోఘశక్తి సమకూరును.

శపథోక్తి-Aphostrophe:- దీనిని సంబోధనాలంకార మనుట ఉచితమని లాంజి నస్ తెలిపెను. వాస్తవముగా శపథము శక్తి, సామర్థ్యములను సూచించును. కా వ్య మందిట్టి శపథము ఓజస్సును, ప్రగాఢ విశ్వాసమును మరియు చమత్కార మును సృష్టించును. ఓజోగుణ భరితమైన వాక్కుకు శ్రోత శీఘ్రముగా వశీభూ తుడగునట్లు కావ్య మందలి ఔదాత్య భావము శపథోక్తుల ద్వారా వ్యక్తమైనపుడు అత్యంత శక్తివంతమై ఉద్దిష్ట ప్రభావమును నెరపును.

ప్రశ్నాలంకారము - Interrogation :- ప్రశ్నోత్తరముల పరస్పర సంబంధము ఔచిత్య సృష్టికి దోహదపడును. వక్త మొదట ప్రశ్నించును. తరువాత తానే స్వ యముగా ప్రశ్నకు సరియైన సమాధాన మొసంగును. సమాధాన భావ స్ఫోటన మందు స్వాభావికత నిండి యుండుటవలన వక్తవ్యము ఉదాత్తముగా భాసించును.

లాంజినస్ దృష్టియందు ప్రశ్నాలంకార మందు స్వాభావికముగా సమకూరిన భావావేగము స్వతః సంపూర్ణ సమాధానముతో సమ్మిళితమై యున్నపుడే కావ్య ఔదాత్యసిద్ధికి తోడ్పడును. 'డెమోస్తనీజ్' ప్రశ్నాలంకార ప్రయోగము ద్వారా రచనను ఔదాత్య భరితము కావించెను. 'మిల్టన్' రచించిన 'అన్ హిజ్ బ్లైండ్‌నెస్' యను కవిత ఉత్కృష్ట ఉదాహరణము.

విపర్యయము – Hyperbation :- ఆలోచనకు శబ్ద ప్రయోగముతో కల సహజ స్వాభావిక క్రమము విచ్ఛిన్నమై తలక్రిందైనపుడు విపర్యయాలంకార మేర్పడును. దీనివలన వక్తవ్యము అధిక ప్రభావవంతమగును విపర్యాసము ప్రకృతి నియమమునకు విరుద్ధము కానేరదు. మనము భావావేశమందు శబ్దార్థముల సహజ సంబంధంపై దృష్టిని కేంద్రీకరింపలేము అది తలక్రిందైనను ఉద్దిష్ట ప్రభావమును నెరవుటలో సఫలీకృతమే యగును. ఇట్లు విపర్యయాలంకారము ఔదాత్యసిద్ధికి సాధక మగును.

సంచయనము – Accumulation :- తథ్యములన్నీ ఒకదాని వెంబడి మరియొకటి క్రమముగా కూర్చబడినపుడు సంచయనాలంకార మేర్పడును. దీనివలన వక్తవ్యము మార్మిక మగును.

సారము – Climax ;- వస్తువు యొక్క ఉత్తరోత్తర వికాసమును ఒక క్రమము ననుసరించి వర్ణించుట సారము.

రూప పరివర్తనము – Polyphota :- వచన, కాల, పురుష, లింగ పరివర్తనము ద్వారా ఇది యేర్పడును. విషయ వర్ణన మందు సజీవత, సౌందర్యము, ఓజస్సు నిది సృష్టించును. దీనివలన కావ్యమునకు నాటకీయత చేకూరును. ప్రేక్షకునివలె పాఠకుడు కావ్యవస్తువు నందు తాదాత్మ్యము నొందును.

పర్యాయోక్తి – Periphrasis :- విషయము ప్రకారాంతరముగా ప్రదర్శింపబడుట పర్యాయోక్తి. దీనివలన రచన చమత్కారవంతమై, సౌందర్యశాలియై శోభించును. దీని ప్రయోగమందు కవి సంయమనమును పాటింపవలయును. అన్యథా రచన నీరస మగును.

రూపకము – Metaphor :- రూపకాలంకారమును అలంకార రాజ్ఞిగా లాంజినస్ తెలిపెను. కనుక దీని ప్రయోగమునకు హద్దుల నేర్పరచుట తగదు. భావము విభిన్నావస్థల యందు వివిధ రీతుల విస్తరింపబడునపుడు దాని కనుగుణముగా రూపకాలంకారము స్వతః స్థానము కల్పించుకొనును. వాస్తవముగా భావమునకు రమ్యతను చేకూర్చు ప్రధాన అలంకారము రూపకము, కనుక దాని సందర్భోచిత ప్రయోగము శ్లాఘనీయమే యగును.

అతిశయోక్తి – Exaggreation :- అతిశయోక్తి ద్వారా భావముయొక్క ప్రభావము ఇనుమడించును. పాఠక హృదయమందు విషయదీప్తి అధికతర మగును. ఐనను కవి సంయమనమును పాటింపవలయును.

లాంజినస్ దృష్టియందు అలంకారములన్ని ప్రయోగార్హములే. కావ్యమునకు రాగాత్మకతను, రామణీయకతను ఆపాదించునవి అలంకారములు. అవి సాహిత్యమందు నిర్వహించుపాత్ర శ్లాఘనీయము. ఐనప్పటికిని కావ్యప్రధాన తత్త్వమైన ఔదాత్త్యమునకు ఇవి సాధకములేకాని సాధ్యము కానేరవు. కవి ఔచిత్యమును పాటించి సందర్భానుగుణంగా అలంకారలనుపయోగించినచో కావ్యదృష్టితో, సామాజిక దృష్టితో ప్రయోజనవంతము కాగలదు కవి జాగరూకుడైయుండవలయును. ఏలన కవి కావ్యమందు పోషించునది ఔదాత్త్యము; అలంకారములను కాదు.

## భాషా గరిమ - Dignity of Language.

గ్రాంథిక భాషా ప్రయోగముద్వారా భాషకు గరిమ చేకూరునని తలంచరాదు. అట్టి ప్రయోగము ప్రయోక్త పాండిత్యమునే ప్రదర్శించును కాని పాఠకుని అవగాహనను లక్షించదు. విషయబోధ సుకరమగు రీతిలో సామాజికుని స్థాయికి అనుగుణముగా ప్రయోగింపబడిన భాషయే గరిమావంత మగును ఆస్థితి యందు ఉపయోగింపబడిన పదములు గ్రాంథికములా? వ్యావహారికములా? యను ప్రశ్నయే సామాజికునిలో ఉదయింపదు. కావున భాషా గరిమ సామాజికుని ప్రభావతకు లేక అనుభూతికి సంబంధించియున్నది; మరియు కావ్యవస్తువుతో సన్నిహితమైయున్నది. ఇట్లు కవియొక్క భాషకావ్యవస్తు వ్యక్తీకరణకు ఉచితమైసామాజికునకు బోధ గమ్యముగా నుండుటయే భాషాగరిమ. సామాజికుని అవగాహనయే భాషకు

ప్రధాన లక్ష్యము. కనుక విషయానుకూలమైన భాష నుపయోగించుట యందు కవి దక్షుడై యుండవలయును. కావ్యమునకు ఔదాత్యము ప్రధాన తత్త్వమగుట వలన కావ్యభాష కూడా ఉదాత్తమైయుండవలయును. అందువలన ఉదాత్త కావ్యమందు గంభీరపద ప్రయోగస్థితి సహజముగనే యుండును. విషయము ననుసరించి కావ్యభాషయందు పరివర్తనము కలుగుట ఉపయుక్తమే యగును ఉదాత్త భావ వ్యక్తీకరణకు అల్పతర పదములను అట్లే అల్పతర భావమునకు గంభీరపదముల నుపయోగింపరాదు. భావము సహజ ధోరణిలో వ్యక్తమైనపుడే బాషకు గరిమ చేకూరును. భాషకు గరిమ రెండు విధములుగా సిద్ధించునని లాంజినస్ తెలిపెను—

a) ఉపయుక్త పదముల ఎంపిక – The proper choice of words.

b) అలంకారిక భాషాప్రయోగము – The use of ornamented language.

కావ్యమందు భావము సామాన్య రీతిలోనే కానేరక, సౌందర్యాత్మక రీతిలోనే ప్రదర్శితమగును. అందువలన కావ్యము భావసౌందర్యాత్మక ప్రదర్శనమగును. ఉదాత్త కావ్యము గంభీర చింతనను ప్రభావోత్పాదకముగా ప్రదర్శించుట కుద్దేశితమై యున్నందున రచయిత సాధ్యమైనంత మేరకు భవ్యత, ఓజస్సు, మార్దవము, గరిమ మున్నగు గుణములను కలిగియున్న పదములనే ఉపయోగింపవలయును. తద్వారా బాషారూపము అత్యంత అకర్షకమై సామాజికుని భావములను సత్వరముగా ఉత్తేజింపగలదు. వాస్తవముగా భాషకు విశేష కాంతి నాపాదించునది ఉపయుక్త శబ్ద ప్రయోగమే యగును. కనుక కవి తన భావమును స్పష్టముగా, ప్రభావవంతముగా వ్యక్తీకరించు పదముల ఎన్నికలో మరియు వాని ప్రయోగమందు సావధానచిత్తుడై యుండవలయును. ఉపయుక్త పదమే సౌందర్యవంతము. సౌందర్యవంతములైన పదములే భావమునకు విశేష దీప్తిని కల్గించును– (Beautiful words are the very light of thought) ఐనను గంభీరధ్వని కల పదములే అన్నివేళల ఉపయుక్తములని తలచరాదు. సామాన్యములును, అప్రధానములునైన భావములను వ్యక్తపరచుటకు కూడా గంభీరపదముల నుపయోగించుట బలహీనుని నెత్తిపైన బండ బరువు నెత్తినట్లుండును. కనుక ఏ భావము ఏ సందర్భమున ఎట్టి ప్రభావమును కల్పింపవలయునో ఆ భావము ఆ సందర్భమున అట్టి ప్రభావమును కల్పించు పదములనే ఉపయోగింపవలెను.

ప్రసంగానుకూల పద ప్రయోగము నందు కవి దక్షుడై యుండవలయును. అపుడే ఆతని రచన సామాజికునిపై ఉద్దిష్ట ప్రభావమును నెరపగలదు. కొన్ని సందర్భ ములందు సామాన్య పదమే గంభీర పదము నెరవేర్చని ప్రయోజనమును సైతం చేకూర్చునను విషయమును కవి గుర్తునందుంచుకొనవలయును. కనుక అసామా న్యములతో పాటు సామాన్య పదములు సైతము సందర్భాను గుణముగా ఉపయు క్తములే యగును.

పద ప్రయోగము భాషాస్వరూపమును నిర్ధారించును; శైలిని ఏర్పరచును. కావ్యము భావముల నున్నవి నున్నట్లుగా వ్యక్తపరచక ఉదాత్తరూపమున, హృద యానందకరముగా ప్రదర్శించును. అందువలన కావ్యభాష సామాన్యభాషా రూప ము ననుసరింపక కావ్యాత్మకశైలీ రూపమున అవతరించును. కనుక కావ్యభాష సామాన్య భాషకన్న భిన్నమైన సౌందర్య శోభతో వెలుగును. భాషకిట్టి సొగసు చేకూర్చునవి అలంకారములు. అందు ప్రధానమైనది రూపకము. రూపకాలంకార ప్రయోగము వలన కావ్యభాషా శైలి అత్యంత మనోహరమై సామాజికునట్టే ఆ కట్టుకొనగలదు. కనుక రూపక ప్రయోగమునకు పరిమితిని విధించరాదు. సంద ర్భానుకూలముగా భాషారమ్యతకై కవి రూపకాలంకారమును వివిధములుగా నుప యోగింప వచ్చును. అట్లే అతిశయోక్తిఅలంకార ప్రయోగము. రూపకముద్వారా భావసాదృశ్య మేర్పడును. అతిశయోక్తిద్వారా ఉక్తి వైచిత్ర్యము సిద్ధించును. ఈ రెండు అలంకారములే ప్రధానముగా భాషకు అలంకారితను సిద్ధింపజేయునని లాంజినస్ మతము. ఐనను వివిధాలంకార ప్రయోగము నాతడు కాదనలేదు. అ సందర్భ అలంకార ప్రయోగము అపకర్షతకు హేతువగునని ఆయన తెలిపెను. 'అల్పతరములైన భావములకు సైతము విశేష సంజ్ఞలను కూర్చుట చిన్న బాలు నికి సమగ్రమైన విషాదనాయక వేషమును ధరింపజేసిన దానితో సమానమ గును ' 10. ఉదాత్త భావమును ఉపయుక్తపద, అలంకారములతో ధ్వనింపజేయు నదే లాంజినస్ మతమందు అలంకారిక భాష. అదియే ఉత్కృష్ట. అది భాషా గరిమకు సూచకము.

I

ally

## రచనా గరిమ - Dignity of composition.

లాంజినస్ మతమందు కావ్య ప్రధాన తత్త్వమైన ఉదాత్త చింతన భావా వేశముగా విస్తరించి, వివిధాలంకారములతో శోభాయమానమై, భాషా గరిమను

సంతరించుకొని, రచనా గరిమ యందు సిద్ధిని పొందును. అందువలన ఆయన ఔదాత్యసిద్ధికి రచనా గరిమను అవశ్యక తత్త్వముగా నిర్ధారించెను. ఇది వినా ఉదాత్త భావమెంత తీవ్రతరమైనను సామాజికుని హృదయమందు పరివర్తనము కల్గింపజాలదు. కావున రచనాగరిమ పదరచన లేక భాషాశైలికి మాత్రమే పరిమితమై యుండక వివిధాంగముల వరకు విస్తరించియున్న సమన్వయాత్మక తత్త్వమని బోధపడును. భాషాగరిమ భావమును సౌందర్యాత్మకముగా ప్రకాశింపజేయునే కాని మిగతా కావ్యాంగములను ఒక క్రమమున అమర్చి కావ్యమును సర్వాంగ సుందర రూపమున ప్రదర్శింప జాలదు. కావ్యాంగములన్నింటిని సమన్వయ పరచి వానినొక సుందరమూర్తివలె సాక్షాత్కరింపజేయు తత్త్వముగా ఈ సాహిత్యాచార్యుడు రచనా గరిమను వివరించెను. వస్తు సౌందర్యమునకు దాని వివిధాంగముల సరియైన పొందిక అవశ్యకమైనట్లు, ఔదాత్య సిద్ధికి దాని వివిధ తత్త్వముల సమన్వయాత్మక ప్రభావము అవశ్యకమగును. ఈ విషయమును లాంజినస్ ఇట్లు వివరించెను- "ఒకవేళ ఔదత్య తత్త్వములు ఒక దానితో మరియొకటి విడివడి యున్నచో ఔదాత్యము విచ్ఛిన్నమయి శిథిలము కాగలదు. కాని అవి ఒక క్రమమున కూర్చబడి, సమరసత యను సూత్రమునకు కట్టుబడి ఏ చిన్న సన్నివేశముకైనా అన్వితముగా నున్నపుడు ప్రభావవంతమై ప్రాణవంతమైన స్వరమును సమకూర్చుకొనును." 11.

పై వాక్యములందు లాంజినస్ రచనా గరిమకు సమరసతను మూలసూత్రముగా పేర్కొనెను. సమరసత యన వివిధాంగములను ఒక క్రమమున పొందుపరచి విడదీయరాని బంధముగా నేర్పరచు సూత్రము. ఔదాత్యమునకై లాంజినస్ ఏర్పరచిన అంగములన్ని సమరసతా సూత్రమునకు కట్టుబడి ఔదాత్య సిద్ధిని పొందును. అనగా అంగములన్ని ఏకాన్వితమయి తమ లక్ష్యమయిన ఔదాత్యానుభూతిని సామాజికునకు కల్గించును. ఉదాత్త చింతన, ఉత్కట భావావేశము, సముచిత అలంకార ప్రయోగము మరియు భాషాగరిమ- ఈ నాలుగు అంగములు రచనా రూపమును పొందవలసినదే; వేరు మార్గములేదు. అందువలన రచన సామాన్య రీతిలో పైన తెలుపబడిన నాలుగు ఔదాత్య అంగములకు ఏకాన్వితి నేర్పరచు సామర్థ్యమును కలిగియుండవలయును. అన్యథా అంగములన్ని విడి

ఔదాత్యసిద్ధిని పొందనేరవు. ఈ దృష్టితో లాంజినస్ రచనయందు సమరస

తను ప్రతిపాదించెను. సరమరసతా యుక్తమయిన రచనయే విశిష్ట రచన. అదియే రచనాగరిమ రచనా గరిమద్వారా భాషా-భావముల ఐక్యత సిద్ధించును. ఈ సమరసత లాంజినస్ మౌలిక ప్రతిపాదనము కాదు సృష్టికి మూల తత్త్వముగా సమరసతను అరిస్టాటిల్ మొదట ప్రతిపాదించెను. అతని మతమందు ద్రవ్యాకృతుల సమరసత ఈ సృష్టి. ఆయన సమరసతను జీవనమందలి విభిన్న క్షేత్రములకు అన్వయించి మూలభూత సద్ధాంతముగా నిర్ధారించెను లాంజినస్ సాహిత్యమునకు సమరసతను అన్వయించెను ఔదాత్య అంగములన్నింటియందు అనుస్యూతమయి రచనా గరిమ రూపమున సాక్షాత్కరించుననెను

కావ్య ఔదాత్యసిద్ధికై లాంజినస్ ప్రతిపాదించిన ఐదు తత్త్వములు స్వయముగా సాధ్యము కానేరవు; సాధకములు. ఔదాత్యసిద్ధి సాధకముల సమన్విత ప్రభావముపై ఆధారపడియున్నది; అతీతమయి యున్నది. దాని అనుభవము కర్తయైన కవికి కలుగగా అనుభూతిగా భోక్తయైన సామాజికుని పరవశింపజేయును ఆ పరవశతయే అతని రసలోక ప్రాప్తికి వాహకము. కనుక కవి సామాజికుని పరవశతను దృష్టియందుంచుకొని కావ్యమందు ఉదాత్త తత్త్వమును పోషింపవలయును.

## దోషములు-Defects.

కావ్య ఔదాత్యమునకు భంగమును కల్గించు కావ్యాంశములను లాంజినస్ కావ్యదోషములుగా పరిగణించెను ఔదాత్య సిద్ధికి తోడ్పడని అంగములన్నింటిని ఆయన ఔదాత్య బాధకములుగా పేర్కొనెను. ఆయన నిరూపించిన ఔదాత్య బాధకములలో ప్రధానముగా పేర్కొనదగినవి ఇవి.

1. **అల్పతర చిత్రణ**–Trivial Portrayal:- దీనిని లాంజినస్ ప్రధాన దోషముగా పరిగణించెను. వస్తు భవ్యతర చిత్రణము ఔదాత్యమునకు తోడ్పడును. కాని దానికి వ్యతిరేకముగా వస్తువును అల్పతరమయిన దానిగా వర్ణించినచో, ఆ చిత్రణము ద్వారా కావ్య ఔదాత్యమునకు భంగము వాటిలును కనుక కవి సాధ్యమైనంత మేరకు అల్పతర వస్తువును సైతము ఉదాత్తరూపమున వర్ణింపవలయును. అట్లే వివిధ భావములను ఉదాత్త రూపముననే ప్రదర్శింపవలయును. ఏదేని ఉదాత్త భావమును ప్రభావవంతముగా వర్ణించు సందర్భమున కవి ఆభావ

మునకు సంబంధించిన ఆలంబన, ఉద్దీపనాది భావములను సైతము ఉదాత్తరూప మునసే గ్రహించి ఉదాత్త భావ పోషకములుగా చిత్రింపవలయును. కవి ఔదాత్య సిద్ధిని దృష్టియందుంచుకొని అల్పతర చిత్రిణను సర్వదా పరిత్యజింప వలయును. ఒకవేళ ఏదేని సందర్భమునందు అల్పతర చిత్రిణ అపరిహార్యమైనపుడు ఆ సందర్భమును పూర్వకవులు ఏతీరున ఔదాత్యమున కన్వయించి యున్నారో గుర్తించి కవి ఆ విధానమును పాటింపవలయును.

2. శబ్దాడ బరత – Fustian :- వ్యక్తపరచవలసిన భావము లేనపుడు కవి ఆ లోపమును అసందర్భ పద ప్రయోగము ద్వారా తీర్చ యత్నించును; అసంగత ములును, హృదయావర్జకములు కాని అలంకారములను సైతము ఉపయోగించి కవి భావహీనతను కప్పిపుచ్చుటకు ప్రయత్నించును. ఇట్టి శబ్దాడంబరత వలన భావ ము కుంటువడి సామాజికుని విశ్వాసము నుండి దూరమగును ఆ పట్టున పరవశత, భావాతిక్రమణ వంటి స్థితి యుండనందున రచన శుష్కమై నీరసమగును. ఔదా త్యమునకు బాధ యేర్పడును. కనుక కవి పాండిత్య ప్రదర్శనను మానుకొని ఔ దాత్య సిద్ధియందే మనసును లగ్నము కావింపవలయును. కావ్య పఠనము ద్వారా పాఠకుడాశించునది ఉదాత్తమైన అనుభూతియే కాని కవి ప్రదర్శించు పాండిత్య ప్రకర్ష కానేరదను విషయమును రచయితలు కావ్య రచన వేళ గుర్తుంచుకొనవల యును. కావ్యానుభూతి సుకరము కావలయునన్న రచన శబ్దాడంబర విహీనమై, సహజాలంకార శోభతో స్వాభావికముగా పాఠకుని ఆకర్షించు శక్తిని కలిగి యుండవలయును. వాస్తవముగా శబ్దాడంబరత కృత్రిమతకు సూచకము. కృత్రి మత సామాజికునకు ఆస్వాదనీయము కానందున అవహేళనకు పాత్రమగును.

3. భావాడంబరత – Parenthyseus :- శబ్దాడంబరత వలె భావాడంబరత కృత్రిమతనే సూచించును. భావము ప్రధానముగా నుండక అప్రధానమైనపుడు తత్సంబంధిత ప్రేరకములు సైతము గౌణములే యగును. కాని ప్రతిభాహీనుడైన కవి ఈ విషయమును గుర్తింపక అప్రధానములను సైతము ప్రధానములుగా పో షించు విఫలయత్నమును సలుపును. తద్వారా కావ్య వస్తు రూపము వికృతమగు టయే కాదు; కావ్య ప్రధాన తత్త్వమైన ఉదాత్తతకు భంగము వాటిల్లును. కనుక భావాడంబర ప్రదర్శనను విడనాడి ఔచిత్య దృష్టితో ఔదాత్యసిద్ధికి పాటు పడవలయును.

4. చమత్కార వ్యామోహము - Craving for novelty :- కళా చమత్కారము కావ్యమునకు వినూత్న శోభను చేకూర్చును. తద్వారా కావ్యము రమణీయమయి హృదయాహ్లాదకారి యగును ఐనను కవి చమత్కార ప్రదర్శనమే కావ్యమందు ప్రధానముగా నున్నపుడది సామాజికుని నిరసనకు హేతువు కాక తప్పదు; అట్లే ఔదాత్య సిద్ధికి బాధకముగా నుండక తప్పదు. కారణమేమన చమత్కార వ్యామోహమునకు వశుడైన కవి నవ్యతా ప్రదర్శనమందే రమించును కాని సామాజికుని అనుభూతిని లెక్కించడు. చమత్కార ప్రదర్శనమందు బుద్ధి లోపించినపుడు అనన్ని వేశము పఠిత లేదా శ్రోతృహృదయమును పరవశింపజేయనేరదు. బుద్ధికి నియంత్రితము కాని కల్పనా జగత్తు గాలి మేడవలె నిరుపయోగమగును. కనుక కవి సామాజికుని మానసిక స్థాయి కనుగుణముగా భావమును చమత్కారవంతంగా ప్రదర్శింపవలయునే కాని నేల విడచి సాము నెన్నడును చేయరాదు. పరంపరాగత సభ్యత, సంస్కృతిని త్రోసిపుచ్చి నవ్యతకై ప్రాకులాడు కవి సామాజికుని విశ్వాసమును పొందలేడు. కవి ప్రదర్శించు చమత్కారిత కావ్య ఔదాత్యమునకు సాధకముగా నుండుట ఆవశ్యకము. కవి కల్పనా చిత్రము వివేక సమ్మతముగా నుండవలయును. అది సంప్రదాయ సంవర్ధకముగా, ఔదాత్యానుభూతికి గమ్యముగా నుండుట శ్రేయస్కరము. అన్యథా కవి కల్పన వికృతమై ఔదాత్యమునకు బాధకముగా ఏర్పడక తప్పదు. ఈ సందర్భమున లాంజినస్ ఇట్లు వచించెను-

''సాహిత్యమందు వ్యాపించియున్న వికారము మరియు పరోప జీవికా ప్రవృత్తికి మూలకారణము కేవలము ఒకటి. అదియే అభివ్యక్తియందు నవ్యతకై ప్రాకులాడు ఆరాటము. ఇది నేడు వెఱ్ఱితనమునకు చేరువయైయున్నది. మానవుని గుణ-దోషములకు మూలసూత్ర మొకటే యగును. ఇది సాహిత్యమునకు కూడా అన్వయించును. అభివ్యక్తి రమణీయతకు పోషకములైన అలంకారిక శైలి మరియు ఉదాత్తములును ఆనందదాయకములునైన కావ్యబింబములు కావ్య సఫలతకు మాత్రమే మూలస్రోతము కానేరవు; విఫలతకు కూడా హేతువులగును.'' 12.

5. లయాధిక్యత - Over-rhythm :- భాష అస్తవ్యస్తముగా నున్నపుడు ఔదత్యమునకును భంగకర హేతువగును. భాషయందు అత్యధికముగా లయను చెప్పుట వలన భాష తన స్వాభావిక రూపమును కోల్పోవును. అందువలన వస్తువు

సమగ్రరూపమున ప్రదర్శితము కానేరదు. తత్ప్రభావమున సామాజికుడు కావ్యా నుభూతి నుండి విముఖుడగును. లాంజినస్ ఈ సందర్భమును నిట్లు వ్యాఖ్యానించెను.

''వాస్తవముగా లయాధిక్యత వలన రచన అల్పతరమగును. కృత్రిమత కు నిలయమై, ఏక రసాధిక్యతకు ఆలవాల మగును. అందువలన రచన నీరసమ గును. అన్నింటికన్న సహింపరాని విషయమేమన గేయ కావ్యము శ్రోత యొక్క ధ్యానమును కథా వస్తువు నుండి మరల్చి లయ యందే ఆకృష్టపరచునట్లు, లయ ధిక్యత వలన రచన శ్రోతను భావానుభూతికి లోను చేయనేరక లయకు మాత్రమే పరిమితుని కావించును. నర్తకుడు నృత్య సమాప్తిని దాని లయ ద్వారా అనుమ నించి చివరి గంతువేయు విధమున అపుడపుడు శ్రోత కథా గాయకునితో పా తాళము వేయుట కూడా జరుగుచుండును.'' 13.

6. సంక్షిప్త ఉక్తి - Over-compression :- స్వల్ప పదములలో అనల్ప విష యమును నిబంధించు ప్రవృత్తి సంక్షిప్తమైన ఉక్తిగా కావ్యమందు నెలకొనును. అత్యంత సంక్షిప్తముగానున్న ఉక్తివలన ఔదాత్యమునకు బాధ యేర్పడును. కా రణమేమనగా సామాజికుడు విషయమును సరిగా గ్రహింపనేరక ఔదాత్య సిద్ధిని బడయలేడు.

'అత్యంత సంక్షిప్తత వలన రచనకు గరిమ చేకూరదు; మీదు మిక్కిలి అసంగతి దోషము వాటిల్లును. ఇట నా అభిప్రాయము భాషయొక్క ఘనత్వము తో సంబంధించినది కానేక అత్యంత సంక్షిప్తతా కారణమున ప్రభావమును కోల్పోవు శైలికి సంబంధించి యున్నది. అత్యధికముగా శబ్దములను సంక్షిప్తపర చుట భావములను సంగ్రహించుట యగును. వాస్తవముగా నేరుగా ప్రభావమును నెరపుటయే సంక్షిప్తతకు లక్ష్యమైయున్నది.' 14.

7. అల్పతర భాష - Sordid language:- విషయము మరియు ప్రసంగమున కనుగుణముగా భాషా ప్రయోగము కావించుట ఔదాత్యసాధక మగును. కాని దా నికి వ్యతిరేకముగా అల్పతర భాషాప్రయోగము ఔదాత్యమునకు బాధకమగును.

''ఏదేని ప్రబల కారణ వశమున అనివార్యమని తోచిననే కాని ఉదాత్త ప్రసంగము లందు అల్పతరమును మరియు హీన తరమునైన భాష నుపయో గింప రాదు.'' 15.

## గుణములు – Qualities.
(Patrons of sublimity)

ఔదాత్యసిద్ధికి సహకరించు కావ్యాంగములను లాంజినస్ కావ్యగుణములుగా తెలిపెను. ఇవి కావ్య ఔదాత్యసిద్ధికి అనుకూలస్థితి నేర్పరచుట వలన ఔదాత్య సాధకము లగును. వీనికి వ్యతిరేకములైన కావ్య దోషములు ఔదాత్య బాధకము లగును. ఔదాత్య సహాయకములై, కావ్య ఉత్కృష్టతకు తోడ్పడు కావ్య గుణము లను లాంజినస్ వివరించెను అందు ప్రధానములైనవి.

1. భావావేగ సంయమనము–Moderation of passions :- భావావేగముల ఆధిక్యత ఔదాత్యమునకు బాధాకరముగా మారును. అందువలన కవి భావావేగ సంయమనమును పాటింపవలయును. దీనినే లాంజినస్ భావావేగ హ్రాసముగా పే ర్కొనెను. మహాకవుల మహనీయత వారు కావ్య వర్ణనమునందు పాటించిన భావావేగ సంయమనముగా లాంజినస్ తెలిపెను. కనుక కవి భావ వర్ణనమందు అతిశయమునకు తావీయక భావములను సంయమితములుగా ప్రదర్శింపవల యును. కావ్య సఫలత భావముల అత్యధిక వర్ణనముపై ఆధారపడి యుండక వా నిని ఔచిత్య వంతములుగా తీర్చిదిద్దుటలోనే కలదు.

2. తథ్య నిబంధనము – Combination of facts .- కవి తథ్యము లన్నింటిని కావ్యమందు నిబంధించు యత్నము చేయరాదు. సందర్భాను గుణముగా సార వంతములైన తథ్యములకే కావ్యమందు స్థానమును కల్పించవలయునని లాంజి నస్ ఇట్లు తెలిపెను– "ఏదేని తథ్యమును వర్ణింపదచినపుడు కవి అందలి సారాం శమును గ్రహించి దానిని తిరుగ సమగ్ర ప్రాణిరూపమున ప్రదర్శింపవలయును. అవుడా తథ్యము అవశ్యముగ ఔదాత్యమునకు సహాయక మగును. అంతేకాదు, సారతథ్య నిబంధనము వలన కావ్యము నవ్యమై భాసింపగలదు. కొందరు పాఠ కులు కథాగత తథ్యమునకు ఆకృష్టు లయ్యెదరు; మరి కొందరు ఆ తథ్యమును నిబంధించు ప్రతిభకు వశీకృతులయ్యెదరు.'' 16.

3. కల్పనా చిత్రము – Phantasy :- లాంజినస్ మతమందు సమస్త వస్తువు లందు వాని సారభూత తత్త్వము ఏదోయొక రకమున చేరుకొనియే యుండును. అట్లు కానియెడల వస్తువులకు ఉనికియే యుండదు. అదే విధముగా ఇంద్రియోప

లబ్ధికి సంబంధించిన సారభూత అంశము లుండుట సహజం. కవి ఆ అంశములను క్రోడీకరించి వానిని సంఘటనాత్మక రూపమున సాక్షాత్కరింపజేయును. అనగా సమగ్ర రూపమున ప్రదర్శించును. ఆ దృశ్యమే కావ్య బింబము లేదా కల్పనా చిత్రము. కావ్య బింబము కవి యొక్క మహనీయ ప్రతిభకు మాత్రమే తార్కాణము కాదు; కావ్య రమ్యతను అత్యంత మనోరమముగా వికసింప జేయును. ఔదాత్య సహాయకముగా ప్రధానపాత్రను నిర్వహించును. "శైలి యొక్క భవ్యత, గరిమ మరియు శక్తి చాలావరకు శబ్ద చిత్రముల సముచితమైన కూర్పు నాశ్రయించి యున్నవి" 17.

## కావ్యాత్మ – Poetic soul.

కావ్య ప్రధాన తత్త్వముగా లాంజినస్ ప్రతిపాదించిన ఔదాత్య సిద్ధాంతము వివరింపబడినది. ఔదాత్యమును ఆ గ్రీకు సాహిత్యాచార్యుడు భావపరముగా, శైలీపరముగా అన్వయించి అది ఐదు తత్త్వముల ద్వారా సిద్ధించు ననెను. ఆ తత్త్వములు కావ్య రచనా దృష్టితో మూడు రకములుగా విభజింపబడును.

1. అంతరంగ తత్త్వములు – ఉదాత్త చింతన, ఉత్కట భావావేశము.
2. బహిరంగ తత్త్వములు – సముచిత అలంకార ప్రయోగము, భాషా గరిమ.
3. సామాన్య తత్త్వము – రచనా గరిమ.

ఐదు తత్త్వముల ద్వారా ఔదాత్యము కావ్యమందు పరిపుష్టి నొంది అనుభూతి రూపమున సామాజికునిచే ఆస్వాదిత మగును. ఇట్లు ఔదాత్యము కవియందు చింతనా రూపమున స్థితమై, భోక్తయైన సామాజికునియందు అనుభూతి రూపమున సిద్ధించును

కావ్య రచనాపరముగా ఔదాత్య సిద్ధి క్రమ మిది — ఉదాత్తచింతన > ఉత్కట భావావేశము > అలంకార ప్రయోగము > భాషాగరిమ > రచనాగరిమ = శబ్దార్థ రూపమున ఔదాత్యసిద్ధి

సామాజిక పరముగా ఔదాత్య ఆస్వాదన క్రమమిది — భావోద్రిక్తత > స్వ,పర భావ విస్మృతి > తాదాత్మ్యము > పరవశత > అనుభూతి = అర్థ రూపమున ఆస్వాదనీయము.

పై క్రమము ననుసరించి కావ్యమందు ఔదాత్యము శబ్దార్థముల సమరసత రూపమున సిద్ధింపగా, అర్థరూపమున సామాజికునకు ఆస్వాదనీయ మగును. ఐనందు ఔదాత్యము అర్థ పరమా ? లేక శబ్ద పరమా ? యను సంశయము రాక

మానదు. కావ్యమందు ఔదాత్యమును అర్థరూపముననే గ్రహింపవలయును. అది కవి యందు ఉదాత్తచింతనా రూపమున స్థితమై, కావ్యమందు అర్థరూపమున అభివ్యక్తమగును. ఆ అర్థరూపమునే సామాజికుడాస్వాదించును. ఆస్వాదన స్థితి యందు శబ్దరూపము లోపించుట సహజము. కనుక అంతరంగ తత్త్వమైన ఉదాత్త చింతనయే ఔదాత్య ప్రాణ తత్త్వము. అదియే కావ్యాత్మ.

మానవ జీవితమువలె సాహిత్యము జీవనమును కలిగియున్నది. అందువలన అది మానవ జీవనమును రసలోకమున విశ్రమింపజేయు శక్తిని కలిగియున్నది. జీవితమును నడిపించునది ఆత్మ. అది అంతర గిక శక్తి. అదియే మూలద్రవ్యము. ఆత్మకు రూపమును కల్పించునది శరీరము. ఇది బాహ్యశక్తి. ఇదియే ఆకృతి. ఈ రెండింటిని సమన్వయపరచి పురోగమింపజేయు సామాన్య సూత్రము సమరసత. సమరసత సృష్టియందు వ్యాపించియున్న సామాన్య తత్త్వము. అది ద్రవ్యాకృతులను సమన్వయ పరచి సృష్టి రూపమున పురోగామియైయున్నది. సాహిత్యమందు అర్థము ద్రవ్యము కాగా శబ్దము ఆకృతి యగును. ఇవి రెండు సమరసత యను సూత్రమునకు కట్టుబడి మానవ జీవనమును పురోగమింపజేయ చున్నవి; ఇంద్రియాతీతమైన ఆనందానుభూతిని కల్గించుచున్నవి. కావున సృష్టి ద్రవ్యమువలె సాహిత్యమునకు అర్థమే ప్రధానము. అదియే భావనా రూపము. సామాజికుని పరవశింపజేయుచున్నది. కావ్యమందలి ఆ అర్థమే ఉదాత్త భావన రూపమున నున్నచో సామాజికుడు పరవశించడమే కాదు, ఉదాత్తానంద భరిత మైన రసలోకమున విశ్రమింపగలడు. అందువలన లాంజినస్ ఔదాత్యమును అనగా అర్థరూపమున నున్న ఉదాత్త చింతనను కావ్య ప్రాణ తత్త్వముగా ప్రతిపాదించెను.

## కావ్యహేతువులు-Poetic equipments.

కావ్యమును ఔదాత్య భరితముగా తీర్చిదిద్దు కవిశక్తి స్వరూపమే తీరున పరిగణింపబడును ? అనగా కావ్యహేతు వేమైయుండును ? ఈ విషయ మందు లాంజినస్ పూర్వాచార్యులు తెలిపిన ప్రతిభ, అభ్యాసము- రెండింటిని కావ్యహేతువులుగా సమర్థించెను. ఐనను ప్రధానా ప్రధానములందు మధ్యేమార్గ మవలంబించెను. ఈ ఆచార్యుని దృష్టియందు కవి ప్రతిభ అనంతము; నిత్యనూతనము. ఐనను కావ్య రచనావేళ కవి ప్రతిభ కొన్ని నియమములకు కట్టుబడియుండి ఒక

క్రమమున తన కార్యమును నెరవేర్చవలయును. కావున కావ్య సృజనయందు కవికి జన్మజాతమైన ప్రతిభతోపాటు కళాభ్యాసము అపేక్షితమైయుండును పూర్వ కవుల రచనలను పరిశీలించుట, సాహితీవేత్తల మరియు సుకవుల యొద్ద శిక్షణను గ్రహించుట, ఆచార సంప్రదాయములను తెలిసికొనుట మున్నగునవి అభ్యాస మందు చేరును; అట్లే కళా సిద్ధాంత జ్ఞానము అపేక్షితమే యగును. ఇట్లు కావ్య రచన యందు ప్రతిభకు తోడ్పడు అభ్యాసము కవికి అవశ్యకమగునని లాంజినస్ తెలిపెను-

''కావ్య రచన వేళ ఏదేని సన్నివేశమునకు ఉదాత్త భావదీప్తి మరియు ఉత్కృష్టరీతి అవశ్యకములైనపుడు అట్టి సన్నివేశమును హోమర్ ఏ తీరున ప్రదర్శించి యున్నాడో, ప్లేటో లేక డెమోస్తనీజ్ మరియు ఇతిహాస రచనయందు థ్యుసిడైడ్స్ ఏ రూపమున కళాత్మకముగా రూపొందించి యుండిరో తెలిసికొని యుండుట మనకు చాలా అవసరం. ఇట్టి కళాత్మక స్పర్థ అట్టి ఉదాత్త ఉదాహరణములను మన కనుల ముందు సాక్షాత్కరింప జేయును; మన మార్గము నాలోకితము కావించును; మరియు మన ఆత్మలను ఊర్ధ్వ ముఖమునకు పురోగమింప జేయుచు మనలో మెదలు భావమును పరిపుష్ట మొనర్చును '' 18.

కావున ప్రతిభతోపాటు అభ్యాసము కవికి ఆవశ్యక మగును. ఈ రెండింటి సమరసత ద్వారా ఏర్పడినదే అసలైన కావ్య హేతువు. నియమ నిబంధనల ననుసరింపని ప్రతిభ స్వతంత్ర విహంగమువలె గగన వీధులందు విహరించునే కాని, భువికి దిగివచ్చి యథార్థ స్థితిని గ్రహింపజాలదు. అందువలన అభ్యాస విరహితమైన ప్రతిభా గాథ కల్పనా గాథగానే మిగిలిపోవును. ప్రతిభను సరియైన మార్గమున నడపించునది అభ్యాసము. అభ్యాస మందు కల్పనను నియంత్రిత పరచు శక్తి ఇమిడియుంది. అందువలన అభ్యాసము ఉచితానుచితముల నిర్ణయించు మేధాశక్తిని వికసింప జేయును. కవి చింతనను ఉదాత్తముగా మార్చి ఔదాత్య సిద్ధికి అనువైన మార్గమును చూపును. ఇందు ప్రతిభకు స్థానము లేదనుట కాదు. ప్రతిభ అభ్యాసమును పెరుగు పరచును. బుద్ధియందు సూక్ష్మ పరిశీలనా పాటవమును పెంపొందించును. ఇట్లు అభ్యాసమునకు సైతం ప్రతిభ సహకారము ఆవశ్యకమే యగును. ప్రతిభా హీనులైన కవులు అభ్యాస బలమున తమ రచనా వైభవమును ప్రదర్శించు విఫల యత్నము సలిపెదరు. పైవిధముగా లాంజినస్ ప్రతిభ, అభ్యా

సము- ఈ రెండింటి సమరసతను కావ్య హేతువుగా నిరూపించి కవి యొక్క
వ్యక్తిత్వ మహత్వము నుద్ఘాటించెను.

## విశుద్ధ సాహిత్య దృక్పథము–Pure Literary View.

తనకు పూర్వము ఆచార్యులుగా ప్రసిద్ధులైన ప్లేటో మరియు అరిస్టాటిల్
రచనల నుండి లాంజినస్ ఔదాత్య సిద్ధాంతమున కుపకరించు అంశములను గ్రి
హించెను ఆయన ప్లేటో నుండి ఉదాత్త భావమును, అరిస్టాటిల్ నుండి సమర
సత సూత్రమును గ్రహించి వానిని కావ్య ఔదాత్యమున కన్వయించెను. కావ్య
లక్ష్యమును ప్లేటో ఇట్లు తెలిపెను- మానవ ప్రకృతి యందు ఏతత్త్వము ఉన్నత
ముగను ఉదాత్తముగను భాసించియున్నదో తత్ సౌందర్యమువైపు వ్యక్తుల దృష్టిని
మరల్చుటయే కళ యొక్క ప్రథమ కర్తవ్యము- నిస్సంశయముగా ఔదాత్యము
నకు మూలమైన ఉదాత్త చింతనకు పై ప్లేటో వాక్యములే ప్రాతిపదిక. ఆయన
సమరసతను అరిస్టాటిల్ కావ్యశాస్త్రము నుండి గ్రహించెను. అరిస్టాటిల్ సమర
సతను కావ్య విభిన్నాంగము లందు ప్రతిపాదించెను. ఇట్లు లాంజినస్ పూర్వాచా
ర్యుల నుండి తన సిద్ధాంతమునకు ఉపయుక్తములుగానున్న అంశములను గ్రహిం
చెను. విశుద్ధ సాహిత్య దృక్పథముతో వానిని వ్యాఖ్యానించి ఔదాత్య మను నూ
తన కావ్య సిద్ధాంతమును ప్రతిపాదించెను. వాస్తవముగా లాంజినస్ ప్రతిభా
సంపన్నుడైన సాహిత్యాచార్యుడు.

అరిస్టాటిల్ వలె లాంజినస్ తన కాలము వరకు ప్రసిద్ధిగాంచిన కావ్యకృతు
లను తాను ప్రతిపాదింపబోవు సిద్ధాంతమునకు లక్ష్యములుగా గ్రహించెను. ఐన
ను ఆయన తన సాహిత్యానుశీలన మందు ప్లేటో మరియు అరిస్టాటిల్ కన్న భిన్న
మైన దృక్పథము నవలంబించెను. కావ్యమునకు మూలతత్త్వము అనగా ఆత్మ
ఏమైయుండవచ్చు నను ప్రశ్నకు ఆ గురు-శిష్యు లిరువురు సమాధానముగా అను
కరణ సిద్ధాంతమును ప్రతిపాదించిరి. కాని లాంజినస్ వారి మతముతో ఏకీభవింప
లేదు. అనుకరణమును సాహిత్య ఆత్మగా అంగీకరించినపుడు సాహిత్యమునకు
చెందని ఇతర రచనను దేనినైనను సాహిత్య కృతిగానే పరిగణింపవలసియుండు
ను. అట్లయినపుడు ఆ రెండింటి ప్రయోజనము ఒకటేయై యుండవలయును;
భిన్నముగా నుండ రాదు. కాని అట్లు కానేరక యున్నది. సాహిత్యము నెరవేర్చు
ప్రయోజనము సాహిత్యేతర రచనల కన్న భిన్నముగా నుండుటయే కాక ఆనంద

దాయకముగా నుండును. అందువలన సాహిత్యము రసలోక వాహకమను వినూత్న సిద్ధాంతమును ప్రతిపాదించి లాంజినస్ విశుద్ధ సాహిత్య దృక్పథమును ప్రదర్శించెను. పూర్వ కవుల ననుకరించుట యను భ్రాంతిని తొలగించి కవుల మౌలిక ప్రతిభను నిరూపించెను. అంతేకాక సాహిత్యానుభూతిని ఉదాత్తమైన ఆనందానుభూతిగా వివరించెను సాహిత్యమునకు ఆత్మ ఔదాత్యమే యగునని అనుకరణమును నిరసించెను. తన సాహిత్యాను శీలనమందు సందర్భాను గుణముగా విశ్లేషణాత్మక, వైజ్ఞానిక, చారిత్రక మరియు అనుగమన పద్ధతుల నవలంబించి సాహిత్య జగత్తునందు గొప్ప సంచలనమును కల్గించెను. ప్రాచీన గ్రీకు సాహిత్యమందు మరుగుపడియున్న ఉదాత్త తత్త్వమును వెలికి తీసి తన్మాహాత్మ్యము నెలిగెత్తి చాటిన విశుద్ధ సాహిత్య సౌందర్యోపాసకుడు లాజినస్. ఈ దృష్టితో గ్రీకు సాహిత్యాచార్యులలో ప్రథముడు ఈ ఆచార్యవర్యుడే

కరుణ-త్రాసములను పరిష్కరించు రచనను అరిస్టాటిల్ ఉత్కృష్టసాహిత్య ప్రక్రియగా పరిగణించెను. కాని లాంజినస్ ఉదాత్తసాహిత్యమును ఆ రెండు భావములకే పరిమితము కావింపక విభిన్న భావభివ్యంజన వరకు విస్తరించెను. కరుణ-త్రాస భావేతరములు కూడా సామాజికునిలో ఉదాత్తానందమును కల్గింపగలవను దృక్పథమును లాంజినస్ ప్రకటించెను. అరిస్టాటిల్ మతమందు కరుణ-త్రాస భావ ప్రధానమైన విషాద రూపకము ఉదాత్తానుభూతిని కల్గించును. కనుక అదియే ఉత్కృష్ట సాహిత్య ప్రక్రియ. కాని ఈ నియమము మహాకావ్యమునకు వర్తింపకున్నది. ఐనను అది ఉదాత్తానందానుభూతిని ప్రసాదించు సామర్థ్యమును కలిగియేయున్నది. సాహిత్యానుభూతి వివిధ భావములకు సంబంధితమై యున్నం దుననే సాహిత్యము రసలోక వాహక మగుచున్నది.

సాహిత్యము సామాజికుని భావముల నుద్రేకపరచి దేశ సంక్షోభమునకు పాల్పడుచున్నదని ప్లేటో అధిక్షేపించెను. భావావేగముల తీవ్రతను సమర్థించి వాని మూలముననే సామాజికుడు సాహిత్యానుభూతిని పొందగలుగుచున్నాడని లాంజినస్ క్రాంత దృష్టిని ప్రదర్శించెను. సాహిత్యమందు భావావేగమును సమర్థించిన ప్రథమ పాశ్చాత్య సాహిత్యాచార్యుడు లాంజినస్.

## విమర్శక నిర్దేశములు-Critical Guide Lines.

లాంజినస్ దృష్టియందు సాహిత్య విమర్శ యన కావ్యము లేదా రచన యందలి కొన్ని దోషములను చూపించి నిరసించుటయో లేదా గుణములను నిరూపించి ప్రశంసించుటయో కానేరదు. కావ్య విమర్శ గుణ-దోషములకే పరిమితముగా నుండక అది సామాజికునిపై నెరపు ప్రభావము వరకు వ్యాప్తమైయున్నది. అందువలన విమర్శకుడు సాహిత్య సమీక్షయందు రాగ, ద్వేషాది సంకుచిత భావముల నుండి విముక్తుడై విశుద్ధ కళాత్మక దృక్పథమును వహింప వలయును. విమర్శకుడు స్వయముగా కావ్య వస్తువునందు తాదాత్మ్యము నొంది తాను పొందిన అనుభూతిని సామాజికునకు అతని మానసిక స్థాయిని దృష్టియందుంచుకొని అందింప వలయును. అపుడే అతడు ఒకవైపు కవికి మరోవైపు సామాజికునకు న్యాయమును చేకూర్చిన సద్విమర్శకుడు కాగలడు. కావ్య ఉత్కృష్టతకు పరమ ప్రమాణము పూర్వ కావ్య సిద్ధాంతములను తు చ తప్పకుండ పాటించుట కానేరదని, కావ్య మందు ప్రతీయమానమగు కవి ప్రతిభయే మూలముగా నుండునని లాంజినస్ స్పష్టపరచెను. అందువలన ప్రతిభావంతుడైన కవివరుడు తన అభీష్ట సిద్ధికై కావ్య నియమముల నుల్లంఘించుట దోషము కానేరదు కావ్య ఔదాత్య సిద్ధియందు కవి కనబరచిన ప్రతిభనే పరమ ప్రమాణముగా విమర్శకుడు గ్రహింపవలయునని లాంజినస్ స్పష్టపరచెను. రచనయందు కానవచ్చు దోషముల అధారముగా కావ్యస్థాయిని నిర్ణయించుట అవివేకమని, ఉదాత్త కావ్య మందే దోషములుకానవచ్చునను వినూత్న దృక్పథమును లాంజినస్ ఇట్లు ప్రకటించెను-

"రచయితయొక్క గద్యరచన యందైనా లేదా పద్యకావ్యమందైనా కొన్ని లోపములు కానవచ్చుట సహజము. ఆ లోపములు ఔదాత్యమునకు బాధకములుగా నుండక పోవచ్చు; మరియు అతని రచన సామాన్యశైలినే అనుసరింపవచ్చును. అట్టియెడ దోషములు మరియు శైలి ఆధారముగా కవిని అల్పతరునిగా కించపరచుట తగదు. వాస్తవముగా ఉత్కృష్ట రచనయందే దోషము లుండును సామాన్య కావ్యమందు సాధారణముగా లోపములు కానరావు. కారణమేమన సామాన్యకావ్యము మహదాశయమునకు ఉద్దేశితమై యుండదు. అట్లని ? ఉత్తమ కావ్యముగా ప్రశంసింపరాదు. అట్లే లోపముల ఆధారముగా కావ్యమును అధమ కావ్యశ్రేణి యందు చేర్చరాదు. కావున లోపమ

కనబరచని 'అపోలియస్'కన్న లోపములను కనబరచిన'హోమర్' గొప్పకవి యగుచున్నాడు. అట్లే 'హైపీరియస్' కన్న లోపములను కలిగియుండియు 'డెమోస్తనీజ్' ఘనుడగుచున్నాడు.''

పై విధముగా పూర్వులెవ్వరును కనబరచని వినూత్న దృక్పథమును ప్రదర్శించి లాంజినస్ సాహిత్య వ్యావహారిక విమర్శకు సంబంధిన సార్వకాలీన సూత్రములను ప్రతిపాదించెను. ప్రధానములైన వాని నిట్లు గుర్తింపవచ్చును-

1. సాహిత్య విమర్శకుడు సువిశాలమైన సార్వజనీన వ్యక్తిత్వమును కలిగి యుండవలయును.
2. తాను సమీక్షింపబోవు రచన యొక్క అనుభూతిని విమర్శకుడు స్వయముగా ఆస్వాదించి యుండవలయును.
3. ఉదాత్త కావ్యమందే సామాన్యముగా దోషములు కానవచ్చును.
4. సామాన్య కావ్యము దోష రహితమై యుండవచ్చును.

మరి విమర్శకుడు సమకాలీన రచయితల కృతులను సమీక్షింప వచ్చునా ? లాంజినస్ తన అభిప్రాయము నిట్లు వ్యక్తపరచెను. రచయిత యొక్క రచనను భావి కాలపు విమర్శకులు మాత్రమే సమర్థవంతంగా సమీక్షింపగలరు. సమకాలీన విమర్శకులంత సమర్థవంతులు కానేరరు. కారణమేమన సమకాలీన రచయితలను గురించి విమర్శకులు వ్యక్తిగత అభిప్రాయములను కలిగియుందురు. ఇట్టి అభిప్రాయము విమర్శకులకు గత కవులపైయుండనేరదు. అందువలన వారి రచనల మూల్యాంకన మందు విమర్శకులు విశుద్ధ సాహిత్య దృక్పథమును వహింతురు.

కావ్య ఔదాత్య నిరూపణ మందు విమర్శకుడు గుర్తుంచుకొనవలసిన విషయములను లాంజినస్ ఇట్లు తెలిపెను-

1. రచయిత లేదా కవి ప్రదర్శించు ఘట్టమును పోలిన సన్నివేశమును హోమర్ లేదా ప్లేటో ఏ తీరున అభివర్ణించియుండిరి ?
2. రచయిత లేదా కవి వ్యక్తపరచిన భావముయొక్క ప్రతిక్రియ హోమర్ లేదా ప్లేటో దృష్టియందు ఏ రూపమున నుండి యుండెడిది ?

3. రచయిత లేదా కవి యొక్క భావ వ్యక్తీకరణ భావి తరమువారిపై ఎట్టి ప్రభావమును నెరపగలదు ?

పై అంశములు ప్రాచీన కావ్యాదర్శములతో రచనను పోల్చిచూచు తులనాత్మక సాహిత్య విమర్శకు సంబంధించినవి విమర్శకుడు ప్రాచీన అలంకారశాస్త్రమందు నిష్ణాతుడై నవీన ఆదర్శములతో రచన యొక్క మూల్యమును నిర్ధారించుట యందు దక్షుడై యుండవలయును. వాస్తవముగా లాంజినస్ తెలిపిన విమర్శనాత్మక సూత్రములు అతని సూక్ష్మ పరిశీలనా పాటవమునకు నిదర్శనములు. మాథ్యూ ఆర్నాల్డుయను (Mathew Arnold) ప్రసిద్ధ ఆంగ్ల విమర్శకుడు లాంజినస్ సాహిత్య దృక్పథమునే తన విమర్శకు ఆదర్శముగా నెన్నుకొనెను. అతని సాహిత్య విమర్శ 'టచ్ స్టోన్ మెథడ్' (Touch stone method) గా ప్రసిద్ధము. అనగా ఆదర్శ కావ్య సిద్ధాంతముల ఆధారముగా సాహిత్య కృతి మూల్యమును నిర్ధారించుట

గ్రీకు సాహిత్య శాస్త్రమునకు సంధ్యాకాలపు భానుడైన లాంజినస్ విశుద్ధ సాహిత్య దృక్పథము సాహిత్యవేత్తలను వివిధ రీతుల ప్రభావిత పరచినది. కొందరు ఆ ఆచార్యుని సంప్రదాయ సమర్థకునిగా, మరికొందరు నవ్యవాద ప్రవర్తకునిగా కీర్తించిరి భావ కళా తత్త్వముల ననురసత ద్వారా ఆయన సాహిత్య ప్రాచీనతను సమర్థించి నవీనతా ప్రవృత్తిని వ్యతిరేకించెనని సాంప్రదాయిక విమర్శకులు తలంతురు. పూర్వ కవితా సంప్రదాయమును నిరసించి విద్యుత్ శకలముల వలె దీపించి, సామాజికునకు రసలోక వాహకముగా నున్న భావకవితను సమర్థించెనని భావ కవితా వాదులు లాంజినస్‌ను కీర్తించిరి.

## లాంజినస్ మహనీయత—
## The Greatness of Longinus.

కవి—కర్మను దూషించి ప్లేటో కవిని ధర్మ రాజ్యము నుండి బహిష్కరించెను. కాని అరిస్టాటిల్ కవి—కర్మను స్తుతించెను. మహాకవుల కావ్యకృతుల పరిశీలించి ఔదాత్య సిద్ధాంత ప్రతిపాదన ద్వారా కవి వ్యక్తిత్వ మహనీయత విశ్లేషించి చూపిన ప్రథమ పాశ్చాత్య సాహిత్యాచార్యుడు లాంజినస్. కాంట్ హెగెల్ మున్నగు సౌందర్య శాస్త్రవేత్తలు లాంజినస్ ఔదాత్య సిద్ధాంతమును

కముగా ఆదరించిరి. మాథ్యు ఆర్నాల్డు యను ప్రసిద్ధ ఆంగ్ల కవి, విమర్శకుడు తన సాహిత్య వివేచనకు ఔదాత్య సిద్ధాంతమునే మూలముగా గ్రహించెను. కవి యొక్క భావనా పటిమకు అధిక ప్రాధాన్యత నొసంగి సాహిత్యమును వివేచించుట వలన లాంజినస్ భావ కవితా ప్రవర్తకునిగా కీర్తనీయు డయ్యెను.

కవి యొక్క నిజమైన శక్తిని వెల్లడించిన ప్రథమాచార్యుడు లాంజినస్. ఆతనికి పూర్వము కవిశక్తి అనుకరణ శక్తిగా భావింపబడెను. అనుకరించుటలో దక్షుడైన రచయిత రచనయే ఉత్తమముగా పరిగణింపబడెను. ఇట్టి దృక్పథము అవైజ్ఞానికమని, ఇతరుల ననుకరించు వ్యక్తివలె ఇతరుల రచనల ననుకరించు కవి ఆదరణీయుడు కాజాలడని లాంజినస్ ప్రకటించెను అనుకరణము కొన్ని సందర్భములందు ఆవశ్యకమైనప్పటికిని అది కవి యొక్క మౌలిక ప్రతిభను మరుగుపరచునదిగా నుండరాదని ఆయన కవులను హెచ్చరించెను. అనుకరణ ప్రవృత్తి ఉన్నత మానసిక ప్రవృత్తిగా పర్యవసింప వలయునను నూతన దృక్ప నమును లాంజినస్ వెల్లడించెను. ఇట్లు అనుకరణ ప్రవృత్తిని కావ్యమందు కల్పనా శక్తిగా నిరూపించిన ప్రథమాచార్యుడితడే సామాజికుని పరవశింపజేసి ఆ నిని రసలోక మందు విశ్రమింపజేయు శక్తి కవి కల్పనకే కలదని నిరూపించి ప్రథమ గ్రీకు సాహిత్యాచార్యుడితడే. కావ్య రచనా ప్రక్రియను వైజ్ఞానికముగ వివేచించి లాంజినస్ కవులకు, సాహితీ వేత్తలకు కానువిప్పు కల్గించెను.

సాహిత్య రచన యందు వలె సాహిత్య మూల్యాంకన మందు లాంజిన క్రాంత దర్శనమును ప్రదర్శించి కావ్య విమర్శకుడు పాటింపవలసిన ఆవశ్య సూత్రములను ప్రతిపాదించెను. విమర్శకుని విశాల దృక్పథమును సమర్థించెన ఈ ఆచార్యుడు కావ్య విమర్శను పరిపక్వమైన బుద్ధికి అంతిమ ఫలముగా యించి సాహిత్య వ్యావహారికతను సాహిత్య సృజనాత్మక స్థాయికి చేర్చె న Judgement in literature is the final fruit of ripe scholarship- ప్రాచీ నవీన కావ్య సంప్రదాయముల సమన్వయాత్మక సాహిత్య దృక్పథమును లా నస్ ప్రదర్శించెను. సేంట్స్బరి, అట్కిన్స్ మున్నగు సాహితీవేత్తలు లాంజి ను మధ్యేమార్గ మవలంభించిన సాహిత్యాచార్యునిగా ప్రశంసించిరి.

19వ శతాబ్దియందు పాశ్చాత్య సాహిత్య లోకమందు వెల్లివిరిసిన భ కవితా స్రవంతికి లాంజినస్ సాహిత్య దృక్పథము మూల ప్రేరకమై నిలిచి

ఆయన ప్రతిపాదించిన ఉత్కట భావావేశము రచనా గరిమ. కల్పనా వైభవము మున్నగువాని ప్రభావము డ్రైడన్, అడిసన్, పోప్ మున్నగు ఆంగ్ల రచయితల రచనలందు స్పష్టముగా కానవచ్చును. ఆ ప్రభావమే వర్డ్స్‌వర్త్ కవిత యందు వికసించి భావ కవితా రూపమును సంతరించుకొన్నది. అందువలన స్కాట్ జేమ్స్ యను ఆంగ్ల విమర్శకుడు లాంజినస్‌ను ప్రథమ భావ కవితా విమర్శకునిగా కొనియాడెను- The first Romantic Critic.

ప్రాచీన కావ్యములందలి ఉదాత్తతను విశదీకరించి, అది నవీన సాహిత్యమున కన్వయించు విధానమును లాంజినస్ నిరూపించెను. కనుక ఆయన సాంప్రదాయక వాదిగా పేర్కొనబడును. కవి వ్యక్తిత్వ నిరూపణమ దు కవి స్వాతంత్ర్యమును ప్రతిపాదించి బావ కవితా మార్గమునకు దారి చూపెను. ఔదాత్య సిద్ధాంత ప్రతిపాదనము ద్వారా ప్లేటో ఆదర్శ వాదమును సమర్థించెను. అందువలన ఆయన ఆదర్శ కవితా వాదిగా భావింపబడుట సముచితమే యగును. ఈ తీరున లాంజినస్ తిగుణాత్మక మూర్తిమత్వమును ప్రదర్శించిన ప్రథమ గ్రీకు సాహిత్యాచార్యుడగుచున్నాడు.

## భారతీయ దృక్పథము - Indian View.

## సాహిత్యము - కళ - Literature-Art.

భారత దేశమందు ప్రాచీన కాలమున ప్రవర్థిల్లిన చతుశ్శష్టి కళలలో ప్రధానములుగా పరిగణింపబడినవి- సాహిత్యము, సంగీతము, వాస్తువు. చిత్రము మరియు శిల్పము. ప్రాచీనాచార్యులు చిత్ర, శిల్ప కళలను వాస్తువునందు చేర్చి మొదటి మూడింటినే పరమాత్మ ప్రతిపాదకములుగా, స్వతంత్ర కళలుగా గుర్తించిరి. వానికి సంబంధించిన సిద్ధాంతములే రసబ్రహ్మము, నాదబ్రహ్మము, వాస్తుబ్రహ్మముగా స్థిరపడినవి. సాహిత్యము రసప్రధానము, సంగీతము నాద ప్రధానము. వాస్తువు స్థాపత్య ప్రధానము. ఈ మూడు కళలలో సాహిత్యమే అగ్ర స్థానము వహించింది. కారణముల నిట్లు గ్రహింపవచ్చును.

1. కళాజనిత ఆనందము అన్నింటిలో రసానందమే ఉత్కృష్టమును, స్థిరమును యగుట.

2. కళానందమునకు మూలమైన భావోద్వేలన నిమిత్తం సంగీతమునకు నాదము, వాస్తువుకు స్థాపత్యము ప్రధాన తత్త్వములై యున్నవి. కాని సాహిత్యము ఇతరముల నపేక్షింపక భావోద్వేలన నిమిత్తం భావములనే ప్రధాన తత్త్వముగా గ్రహించుట.

3. సాహిత్యమునకు ప్రధాన తత్త్వమైన భావతత్త్వము భావోద్వేలన రూపమున సంగీత, వాస్తువునకు అన్విత మగును. కాని సంగీత, వాస్తు కళల ప్రధాన తత్త్వములైన నాదము, స్థాపత్యము సాహిత్యమునకు అన్వయింపవు.

అందువలన ప్రాచీన భారతీయాచార్యులు సాహిత్యమును కళలనుండి వేరు పరచి విద్యాగా కీర్తించిరి; కళలను ఉప విద్యలుగా గుర్తించిరి సాహిత్యము సర్వకళా ప్రపంచ మందు ఉన్నతమగుటయే కాక విద్యగా విభూషితము.

'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసం ఫణిః
సాహిత్య రస మాధుర్యా మీశ్వరో వేత్తి వా నవా'

సంగీత మాధుర్యం శిశువు, పశువు, పాము గూడా ఎరుగ గలదు. కాని సాహిత్య రస మాధుర్యంను ఈశ్వరుడు కూడా ఎరుగునో లేదో– అని ప్రాచీనులు సాహిత్య ఉత్కృష్టతను వెల్లడించి యున్నారు సాహిత్యమునకు ఇతర కళలకు మధ్య కల అంతరమును అధునిక హిందీ మహా కావ్య కర్తయైన జయశంకర్ ప్రసాద్ గారిట్లు వివరించిరి–

"కామ సూత్రమందు వివరింపబడిన కళల యందు సంగీతము మరియు చిత్రము అట్లే నానారకములైన లలిత కళలతోపాటు సమస్యాపూరణము ఒక కళగా తెలుపబడినది. కాని ఆ సమస్యాపూర్తి కూతూహలమును పెంచుటకై మరియు వాద వివాదములందు కౌశలమును ప్రదర్శించుటకై ఏర్పడి యున్నది. సాహిత్యమందు అది సామాన్య తరగతికి చెందిన కౌశలముగా భావింపబడుచుండెను. పాశ్చాత్యుల దృష్టియందు కళ ఏ అర్థమందు భావింపబడినదో ఆ అర్థమునందు కాదు". 19. కనుత సాహిత్యము ఉత్కృష్టతమము.

సాహిత్యము రసప్రధానము. అనగా సామాజికునిలో అలౌకికనమమైన రసానుభూతిని కల్గించును. భారతీయాచార్యులు రసమును పరమాత్మ స్వరూపముగా తెలిపిరి– రసో వై సః– కనుక రసము సర్వోత్కృష్ట తత్త్వము. అది లోకోత్తరమును,

విశిష్టమునైన ఆనందము. సామాజికుని ఇహలోక వ్యాపకము నుండి విముక్త పరచి అధ్యాత్మిక లోకమునకు మళ్లించుట సాహిత్య లక్ష్యము. ఇట్టి మహత్తర లక్ష్యమును నెరవేర్చవలయునన్న సాహిత్యము ఉదాత్త భావభరితమై యుండక తప్పదు. అట్టి భావముల ఉద్వేలన ద్వారా మాత్రమే సామాజికుడు రసానందము ననుభవించగలడు. అట్లుగాక సాహిత్యము సామాన్య భావ భరితమైనచో తద్వారా సామాజికు డనుభవించు ఆనందము ఇంద్రియాత్మకమే యగును. కాని ఇంద్రియాతీతమైన రసానందము కానేరదు. భారతీయాచార్యులు ఉదాత్తతను అత్యంత వ్యాపకముగా గుర్తించి యున్నారు దార్శనిక ఆలోచన ధర్మము, నీతి, న్యాయము, సంక్షేమము లోకకళ్యాణము మున్నగు ఆశయము లన్నియు ఉదాత్తత యందే అంతర్భావము నొందును ఎట్లన ఉదాత్తత లోపించినపుడు మహదాశయ ప్రసక్తియే యుండదు. భారతీయ సాహిత్యశాస్త్ర మందు శబ్దార్థ పరముగా ఉదాత్త భావము సమర్థింపబడియే యున్నది.

## ఉదాత్త దృక్పథము- Concept of Sublimity.

భారతీయ సాహిత్యశాస్త్ర మందు ఉదాత్తత ఇట్లు తెలుపబడినది. ఉత్కర్ష ఆదియతే గుహ్యతేస్మేతి ఉదాత్తమ్— అనగా ఉత్కర్షతా పూర్వకంగా వర్ణించుట కనుక కావ్యము ఉత్కృష్టమై యుండవలయును. భరతుడు ధీరోదాత్త ధీరోద్ధత ధీరలలిత, ధీర ప్రశాంతులని నాటకమందలి నాయకులను నాలుగు రకములుగా తెలిపెను. వీరి నలుగురి యందు కానవచ్చు సామాన్య గుణము ధీరము. అనగా కష్ట, సుఖములందు ధైర్యమును వీడక యుండు గుణము. నాయకులందరు ధైర్యవంతులుగా, సహనశీలురుగా యుందురు. ఐనను ధీరోదాత్త నాయకుడే నాటక/కావ్య ప్రసిద్ధికి కారణముగా తెలుపబడినది. ధీరశ్చ అసౌ ఉదాత్తః ధీరోదాత్తః— అనగా ధీరత్వమును, ఉదార్యమును కలవాడు ధీరోదాత్తుడు ఈ తీరున ఉదాత్తత యన ఉత్కర్షత లేక ఉదారత యను అర్థము లేర్పడుచున్నవి. ఇవి రెండును మహనీయార్థక పదములే. కనుక ఉదాత్తతను మనము అత్యుత్తమ స్థాయికి చెందిన వర్ణనముగా భావింపవచ్చును. ఉదాత్తనాయక వర్ణనమే లేక ప్రదర్శనమే సామాజికుని రసానుభూతికి ఆధార భూమిక. తద్వారా సామాజికునకు కలుగు ఉదాత్త ప్రయోజనమును భరతుడిట్లు వివరించెను— ధర్మమునకు విరుద్ధము కానిది లోకములో ప్రసిద్ధిచెందుటకు కారణమైన దానిని చూపునది, ఆయుర్వృద్ధి కరమును,

హితకరమును, బుద్ధిని వృద్ధి చేయునది యగును. కావున నాటకము ద్వారా సామాజికు డనుభవించు రసానందము ఉదాత్తానందానుభూతి యగును. తరువాతి ఆచార్యులు రసానందమును సాహిత్యమున కిట్లు అన్వయించిరి-

''జ్యోతి స్వరూపమగు అద్వైత బ్రహ్మ సహజ స్వభావము ఆనందము. ఈ ఆనందము చైతన్య చమత్కారమగు రసరూపమున వ్యక్తమగుచున్నది''.

-అగ్నిపురాణము. (కావ్య స్వరూపమ్. P. 13)

''విచిత్ర భావములను, ధర్మములను, అంశలను వ్యక్తము చేయు ప్రఖ్యయే దర్శనము. తత్త్వ దర్శనము కవికి ఉండవలసిన మొదటి లక్షణము''.

-తౌతభట్టు. (కావ్య స్వరూపమ్ P 86)

''కావ్యాస్యాత్మా ధ్వని- కావ్య ప్రధాన తత్త్వము ధ్వని. అనగా లోకోత్తరమైన మణీయ అర్థము ధ్వని. -ఆనందవర్ధనుడు. (ధ్వన్యాలోకము).

కావ్యామృత రసాస్వాదనము చతుర్వర్గ ఫలప్రాప్తికన్న మిన్న అనగా అంతశ్చ మత్కారము- చమత్కారో విన్యతే'' -కుంతకుడు (వక్రోక్తి జీవితమ్)

'కావ్యము వృక్షము వంటిది; పుష్పాదుల వంటిది అభినయాది నట వ్యాపారము; సామాజిక రసాస్వాదము ఫలము వంటిది, విశ్వమే రస మయము'' 20.

-అభినవగుప్తుడు. (అభినవ భారతీ)

''సత్య ప్రత్యయ నిశ్చితమువలన కావ్యము సహృదయ సంవాది కాగలదు. తత్త్వ చిత కథనము వలన కవియొక్క కవిత ఉపాదేయ మగును'' 21.

-క్షేమేంద్రుడు. (ఔచిత్య విచార చర్చ)

''అలౌకికానందము యొక్క జ్ఞానము గోచరించుటయే రమణీయత -రమణీయతా చ లోకోత్తరాహ్లాదాత్ జ్ఞాన గోచరతా- జగన్నాథుడు (రస గంగాధరము)

జ్యోతి స్వరూపము, అద్వైత బ్రహ్మ, అలౌకికానందము, ప్రతీయమానార్థము. అలౌకికానంద గోచరము మున్నగున వన్నియు ఉదాత్తతను ప్రతిపాదించును. కనుక రసానందమును ఇంద్రియాతీతమైన ఉదాత్తానందానుభూతిగా పేర్కొన వచ్చును. అందువలన కావ్యము ఉదాత్త భావ భరితమైయుండుట సముచితమును, ప్రయోజన వంతమును యగును. కావ్యమందు సంతరింపబడు ఉదాత్త భావ సంపద శబ్దార్థ రూపముననే సాధ్యము. భాషను విడనాడి కావ్యమును వివేచించుట నేల విడిచి చేసిన సాము యగును. ఈ దృష్టితో భామహుడు శబ్దార్థముల

సంయోగముగా కావ్యమును నిర్వచించెను- శబ్దార్థౌ సహితౌ కావ్యమ్. అతని దృష్టియందు కూడా కావ్యము తత్త్వోచితమై ఉదాత్త భావభరితమై యుండవలెను. తరువాతి ఆచార్యులు అలంకార, రీతులను వెలయించి ఉదాత్తతను అలంకార మందు పర్యవసింప జేసిరి. దాని నిట్లు వివరించిరి. ఉదాత్తాలంకార మనగా వస్తువు యొక్క సమృద్ధి లేక మహాపురుషుల అంగ భావముతో నిండియున్న ఉత్కర్ష వర్ణనము. ఇది రెండు భేదములను కలిగి యుండును. వస్తువును లేక ఘటనను అతిశయ సమృద్ధిగా వర్ణించుట. ఇది ప్రథమ ఉదాత్తము. వర్ణనీయ అర్థమునందు మహాపురుషుల అంగ భావమును నిబంధించి వర్ణించుట. ఇది ద్వితీయ ఉదాత్తము. కాని ఆనందవర్ధనుడు ఉదాత్తతను అలంకారముగా అంగీకరింపక రమణీయ అర్థ రూపమున గ్రహించెను. కావ్యమందు ఉదాత్త భావ సంపద ఏ తీరున పోషింప బడును? తద్వారా సామాజికుడు రసానుభూతి నెట్లు బడయగలడు? యను ప్రశ్నలపై గంభీరముగా ఆలోచించి ఆయన ధ్వని సిద్ధాంతమును ప్రతిపాదించెను. ఉదాత్త కావ్యమును రస ధ్వని కావ్యముగా, ఉత్తమ కావ్యముగా నిరూపించెను కావున ఆనంద వర్ధనుని ధ్వనిసిద్ధాంతమును ఇట సంగ్రహముగా తెలిసికొందము

## ధ్వని ప్రస్తావన-
## Introduction to suggestive meaning.

తాను 'ధ్వని' పదమును వైయాకరణుల నుండి గ్రహించితినని ఆనంద వర్ధనుడు ధ్వన్యాలోక తృతీయోద్ద్యోతమున తెలిపెను అందువలన విరోధావిరోధ ప్రసంగావశ్యకత యుండదనెను. వైయాకరణులు నాదమును శబ్దమునకు మూల శక్తిగా నిర్ణయించిరి. నాదము నుండి వర్ణములు శబ్దరూపమున ధ్వనించును. ఆ ఉచ్చార్యమాన వర్ణములు అర్థమును బోధించును- 'గౌః' యను శబ్దోచ్చారణ మాత్రమున గంగడోలు, తోక, గిట్టలు, కొమ్ములు గల పశువు బోధ కలుగును శబ్దమునకిట్టి అర్థ బోధకశక్తి 'స్ఫోటము' ద్వారా సిద్ధించునని వైయాకరణులు తెలిపిరి స్ఫోట మన స్ఫుటింప జేయునది లేక బహిర్గత మొనర్చునది యని భావము. స్ఫోటశక్తి అవ్యక్తరూపమున విశ్వమందు వ్యాపించియున్నది. దాని వ్యక్తరూపమే శబ్దము అది శ్రూయమాన వర్ణముల రూపమున వ్యక్తమైన కొలది అవ్యక్తరూపమున నున్న స్ఫోటము అర్థ రూపమున ధ్వనన మగుచుండును. కనుక స్ఫోట మన విశ్వవ్యాప్తమైన అర్థ బోధకశక్తి. ఇది శబ్ద రూపమున ధ్వనిత మగును.

కనుక స్ఫోటమే శబ్దము. అందువలన ఈ అనంత అర్థ బోధకశక్తి స్ఫోటబ్రహ్మ ముగా, శబ్దబ్రహ్మముగా తెలుపబడినది. స్ఫోటము నిత్యము. తద్వారా వ్యక్త మైన అర్థము కూడా నిత్యమే. కాని వర్ణములు నిత్యములు కావు కారణ మేమన అవి ఉచ్చరింపబడిన మూడవ క్షణమున లయ మగును. అంత్యవర్ణ ధ్వననముతో అర్థము స్ఫురించును. ఎట్లన 'వనిత' యను పదమందు మూడు వర్ణములు కలవు. 'వ' ఉచ్చరింపబడిన తోడనే దాని సంస్కారము చిత్తమందు నిలుచును. 'ని' వర్ణ ఉచ్చారణతో మొదటి వర్ణ చిత్త సంస్కారము 'ని' తో ఏకీభవించును. అంతిమ 'త' వర్ణ ఉచ్చారణతో మొదటి రెండు వర్ణముల సంస్కారముతో 'త' సంస్కా రము చేరి ఏక రూపమున వనిత పదమునకు అర్థము నేర్పరచును. ఇట్లు వర్ణము లనిత్యములు. శబ్దార్థములే నిత్యములు. వాని మధ్యగల సంబధము కూడా నిత్య మే. సిద్ధే శబ్దార్థ సంబంధే- కావున వర్ణముకంటె భిన్నమై వర్ణములచే వ్యక్త కావింపబడి, అర్థమును బోధించు శబ్దశక్తియే స్ఫోటము- వర్ణాతిరిక్తం, వర్ణా వ్యంగః, అర్థప్రత్యాయనో నిత్యః శబ్దః స్ఫోటః- పై విధముగా అర్థబోధక క్రమమ ఈ తీరున నుండును- నాదము > వర్ణధ్వని > స్ఫోటము > శబ్దశక్తి > అర్థము.

## వ్యంజనాశక్తి -

## The power of suggestivity.

శ్రూయమాన వర్ణములకు ఉపయుక్త అర్థము నేర్పరచునది 'స్ఫోట' వ స్పష్టము. స్ఫోటము ద్వారా బోధింపబడు అర్థము శబ్దశక్తి. ఆనందవర్ధనుని పూర్వము రెండు శబ్దశక్తులు ప్రచలితములై యుండెను. అభిధ మరియు లక్ష శబ్దమునకు సంకేతితమై యున్న ముఖ్యార్థమును బోధించునది అభిధాశక్తి. రో ఇల్లు, నూనె, ఉన్నది మున్నగు అర్థములు ఆయా శబ్దములకు ప్రాచీన కాల నుండియే లోకవ్యవహారమున క గుణముగా సంకేతితములై యున్నవి. ముఖ్యా మునకు సంబంధించిన వేరొక అర్థమును బోధించునది లక్షణాశక్తి- మా రోడ్డు మీద నున్నది. ఇట రోడ్డు మీద ఇల్లు ఉండుట యను అర్థము పొసగ అందువలన రోడ్డు ప్రక్కన యను అర్థ ను సరిపెట్టుకొనవలసి యుండును. యును ముఖ్యార్థమునకు సంబంధితమై యుండవలయును. ముఖ్యార్థము క లక్ష్యార్థము రమణీయముగా నుండును. కాని ఆనందవర్ధనుడు పై రెండు శబ్దశ పరిమితి నంగీకరింపక 'వ్యంజనాశక్తి' యను మూడవ శబ్దశక్తిని ప్రతిపాదించె

తద్వారా బోధపడు అర్థము వ్యంగ్యార్థము. అది లక్ష్యార్థము కన్న అత్యంత రమణీయమైనదని అదియే ధ్వనియని తెలిపెను. ఆయన వైయాకరణుల నుండి ధ్వని నీ తీరున గ్రహించెను.

"పూర్వ పూర్వ వర్ణములయొక్క సంస్కారముతో గూడిన యంత్య వర్ణధ్వని స్ఫోటమును వ్యక్తపరచు విధమున బ్రికరణాదుల సాహాయ్యమున శబ్ద మర్థాంతరమును వ్యక్తపరచును" అట వర్ణధ్వని స్ఫోట వ్యంజకము. ఇట శబ్ద మర్థాంతర వ్యంజకము. అట వ్యంగ్యము స్ఫోటము ఇట వస్త్వలంకారరసాదులు. అధ్వని పదమునే వ్యంజకత్వ సాదృశ్యమును బట్టి ఆనందవర్ధనుడు కావ్య సిద్ధాంతముగా ప్రతిపాదించెను. వైయాకరణుల వ్యంగ్యము స్ఫోటము. ఆనందవర్ధనుని వ్యంగ్యము అర్థాంతరము ఈ వ్యంజనకు ధ్వననము, గమనము, ద్యోతనము, ప్రత్యాయనము. ధ్వని మున్నగునవి పర్యాయ పదములు. కావున ధ్వని సిద్ధాంతము శబ్ద శక్తిగా శైలికి, అర్థశక్తిగా భావమునకు అన్వయించును. ఐనను కావ్య ప్రయోజన దృష్టితో పాఠకుడు అర్థరూపము (భావనా రూపము) ననే రసానందము ననుభవించు వాడైనందున ధ్వని కావ్యాత్మగా విభూషిత మగును. అందువలన ధ్వనిని ఆనందవర్ధనుడు కావ్యాత్మగా తెలిపెను. కావ్యస్యాత్మా స ఏ వార్థ- ఆ అర్థమే (ధ్వని) కావ్యాత్మ

## ధ్వని సిద్ధాంతము - Theory of Dhvani.

ఆనందవర్ధనుడు ధ్వని స్వరూపము నిట్లు వివరించెను-

"ఎచ్చట శబ్దము తన అర్థమును, అర్థము తనను అప్రధానముగా జేసి అర్థమును బోధించునో అది ధ్వని .. ఎచ్చట విశిష్టరూపమైన వాచ్యార్థము మరియు వాచక రూప శబ్దము ఆ అర్థమును (వ్యంగ్యార్థమును) బోధించునో అట్టి కావ్య విశేషము ధ్వని.... సహృదయులచే ప్రశంసింపబడి కావ్యమునకు ఆత్మ రూపమున ప్రతిష్ఠితమై యున్న ఆ అర్థము వాచ్యము, ప్రతీయమాన మని రెండు విధములుగా చెప్పబడినది. . లలితమును, నుచితమునగు సన్నివేశమున నందగించు కావ్యమునకు శరీరమున కాత్మవలె సారతమమై, సహృదయుల మెప్పు గొను నర్థము వాచ్యము మరియు ప్రతీయమానము లని రెండు విధములు అందు ఉపమాది భేదములచే (గుణాలంకారాదులు) ప్రసిద్ధమైనది వాచ్యార్థము. అన్యులు (పూర్వాలంకారికులు) అనేకములుగా వానిని ప్రదర్శించియే యున్నారు.' 22.

లోచన కర్తయైన అభినవ గుప్తుడిట్లు వివరించెను–

''శబ్దార్థ శరీరమ్ కావ్యమ్. దీని ప్రకారము శరీర గ్రహణముచే వానిని అను ప్రాణితము కావించు ఆత్మ ఆవశ్యకమై యుండును. ఈ దృష్టియందు శబ్దము స్థూల శరీరమునకే చెందును.........చార్వాకులు స్థూల దేహమును ఆధారముగా గ్రహించి ఆత్మను వేరుగా అంగీకరించు వాదమును సృష్టించినట్లు, ఈ కారికయందు ధ్వన్యాచార్యుడు అర్థ రూపమున ఉపక్రమించి "సహృదయ శ్లాఘ్య'' విశేషణము ద్వారా అర్థమును రెండుగా విభజించెనే కాని కావ్యమునకు ఆత్మలు రెండు అని కాదు ... ఈ ప్రతీయ మానార్థము వస్త్వలంకార రసములందు అనుస్యూతమై యున్నది. వాచ్యార్థము యొక్క అంతరంగిక శక్తిద్వారా ఇది వ్యక్తమగును. దానిని ఆధారముగా గొనియే ప్రతీయ మానము వ్యక్తమగును ..... ఆత్మ శరీరముతో మిశ్రితమై యుండుటయే దీనికి కారణము. ప్రతీయ మానార్థము వాచ్యార్థముతో మిశ్రమముగనే స్ఫురించును''. 23.

ఉపర్యుక్త వివరణమునకు సారాంశమిది–

1. కావ్యము శబ్దార్థ సహితము.
2. వాచ్యార్థము కావ్య శరీరము.
3. లక్ష్యార్థము గుణాలంకార రూపమున వాచ్యార్థమైన కావ్య శరీరము నలంకరించును.
4. వ్యంగ్యార్థము (ధ్వని) కావ్యమునకు ఆత్మ.
5. లక్ష్యార్థ వ్యంగ్యార్థములకు వాచ్యార్థమే ఆధార భూమిక.
6 వ్యంగ్యార్థము వాచ్యార్థ, లక్ష్యార్థములకన్న అత్యంత గంభీరమును, రమణీయమును యగుచున్నది.

ధ్వని కారుడు వ్యంగ్యార్థ విభిన్నత నిట్లు తెలిపెను– సహ్యర్థోవాచ్య సామర్థ్యాక్షిప్త్య వస్తు మాత్రమ్ అలంకార రసాదయశ్చేత్య్ర ప్రభేదా ప్రభిన్నో.... సర్వేషు తేషు ప్రకారేషు తస్య వాచ్యాదన్యత్వమ్– వాచ్య సామర్థ్యమున నాక్షిప్తమగు నదియు, వస్తువు, అలంకారము, రసములని అనేక విధములుగాయగు నదియు, ఇది అన్ని విధములందు వాచ్యము కన్న వేరుగానే యుండును.

ధ్వన్యాచార్యుడు ధ్వనిని ప్రధానముగా అభిధామూలము, లక్షణామూలము అని రెండుగా విభజించి అనేక అవాంతర భేదములను చూపించెను. ఆచార్యులు ధ్వనిని (51) ప్రధాన భేదములను కలిగియున్నదని నిరూపించినారు. అభిధామూలము- 47, లక్షణామూలము - 04. మరల అవి అవాంతర భేదములతో 10, 455 భేదముల వరకు విస్తరించి యున్నదని పండితుల అభిప్రాయము. ఈ విధముగా ఆనందవర్ధనుడు ధ్వనిని ప్రత్యయము మొదలుకొని ప్రబంధము వరకు అత్యంత వ్యాపకముగా నిరూపించెను. సార్వభౌమిక సాహిత్య సిద్ధాంతముగా ధ్వనిని ప్రతిష్ఠించెను.

ధ్వని సిద్ధాంతము దర్శనమునకు అన్వితమై యున్నదని ఇట్లు నిరూపింపగలము-

1. దర్శనమునకు ఆధార భూమి సుఖ దుఃఖాత్మకమైన ప్రకృతి.
   ధ్వనికి ఆధారభూమి శబ్దార్థ సహితమైనభాష.
2. దర్శనమునకు పార్యంతిక ప్రయోజనము ముక్తి.
   ధ్వని కావ్య పార్యంతిక ప్రయోజనము రసానుభూతి.
3. దర్శనమునకు జ్ఞాన తత్త్వమే మాతృక.
   ధ్వని కావ్యమునకు ధ్వని తత్త్వమే మాతృక.
4. జ్ఞానము సామాన్య వస్తు జ్ఞానమునకు ఆశ్రితమై యుండియు సామాన్యాతీతమై ప్రకాశించును. ధ్వని సంకేతితమైన సామాన్య వాచ్యార్థము నాశ్రయించి యుండియు దాని కతీతముగా రమణీయమై భాసించును.
5. మోక్షావస్థ యందు జీవ-పరమాత్మల అద్వైతము స్థాపింపబడును. రస దశ యందు శబ్దార్థముల అద్వైతము స్థాపిత మగును.

ధ్వని సిద్ధాంతము దర్శనమునకు అన్వితమై యున్నందున ప్రకాశమును (వనితా వదనాదుల నవలోకింప) కోరువాడు దీప శిఖ నాదరించునట్లు, వ్యంగ్యార్థమందే ఆదరము కలవాడు (ప్రతిభావంతుడైన కవి) తదుపాయ స్వరూపమైన వాచ్యార్థము నాదరించును'' 24.... వాచ్య వాచకముల రచించినంత మాత్రమున మహాకవి కాజాలడు. వ్యంగ్య-వ్యంజకముల జక్కగా ప్రయోగించియే మహాకవి కాగలుగును. కావున వ్యంగ్య - వ్యంజకములే ప్రధానము లనుట స్పష్టము. ... సహృదయులందరు ధ్వనియే కావ్య తత్త్వమని మనస్ఫూర్తిగా విశ్వసించి

యున్నారు. ఇదియే వారి మనసులకు నచ్చిన కావ్యతత్త్వము. ఆ ధ్వని స్వరూపము సత్కవు లందరి కావ్యములకు ఉపనిషత్తు.'' 25. లోచనకర్తయైన అభినవ గుప్తుడు ధ్వని వ్యాపకత నిట్లు నివరించెను–

''ఎల్లెడల శబ్దము మరియు అర్థము రెండింటి ధ్వనన వ్యాపారము జరుగుచుండును.....అది కావ్యవిశేషమునకు అర్థము. అర్థము లేదా శబ్దము లేదా వ్యాపారము. వాచ్యార్థమును కూడా ధ్వనింపజేయును; మరియు శబ్ధమును కూడా. అట్లే వ్యంగ్యార్థముసైతము ధ్వనింపబడును;లేదా శబ్దవ్యాపారమైనా ధ్వనించును. ఈ విధముగా కారిక ద్వారా ప్రధానముగా సముదాయ శబ్దము, అర్థము, వాచ్య-వ్యంగ్యార్థములు మరియు శబ్ద వ్యాపారములు ధ్వనింపబడును.'' 26.

## ధ్వని / ఔదాత్యము–
## Suggested meaning / Sublimity.

ఆనందవర్ధనుడు ధ్వని వైభవము నిట్లు వివరించెను–
''అలంకృతములగు అవయములకన్న వేరుగానే గుణాలంకారా ద్యుపస్కృతమగు వాచ్యముకన్న వేరుగానే- లావణ్యము చక్కని వనితలందే లోచనామృత మగునట్లు ప్రతీయ మానార్థమును మహాకవుల పలుకులలోనే సహృదయుల హృదయముల కెరుగ వచ్చును '' 27.

''అట్టి స్వాదు [సరసమైన)అర్థమును ఎల్లెడల వ్యాపింపజేయుచు మహాకవుల సరస్వతి అలౌకికమును,అతిభానమానమగు ప్రతిభా విశేషమును ప్రకటించును.''28.

ఇట స్పష్టమగు అంశము లివి–

i) ధ్వని అత్యంత రమణీయము ii) ధ్వని తన వైభవమును ఎల్లెడల వ్యాపింపజేయును iii) మహాకవుల వాక్కు లోకాతిశాయినీయైన ధ్వనికి నిలయము iv) ధ్వని శబ్దార్థముల కతీతమైన అందరిని అలరింపజేయు లోకోత్తరశక్తి.

లాంజినస్ ఏభావమందు ఔదాత్యమును కావ్యప్రధాన తత్త్వముగా నిర్ణంచెనోఆభావమే ధ్వనిసిద్ధాంతమందు అంతర్భావము జెందియున్నదని పైవాక్య

ము ద్వారా స్పష్టము. లాంజినస్ ఉదాత్త భావమును ప్రధానముగా ప్రతిపాదింప ఆనందవర్ధనుడు రమణీయమైన ప్రతీయమానార్థమును. శబ్దము ద్వారా బోధింపబడు అర్థమే భావము. కనుక ఉదాత్త భావమే మహనీయమైన రమణీయార్థము. లాంజినస్ తెలిపిన ఉదాత్తమైన అర్థమే ఆనందవర్ధనుని సిద్ధాంత మందు రస ధ్వని. కావ్య ఔదాత్యమును రసధ్వనిగా భావింపవచ్చును.

ధ్వని సిద్ధాంతమునకు ఆకరము స్ఫోట వాదము. నాదమునకు కారణములైన వర్ణములను వైయాకరణులు ధ్వనిగా మరియు నాదమును వ్యంజకముగా పేర్కొనిరి దీనిని ప్రాతిపదికగా గ్రహించి ఆనందవర్ధనుడు ధ్వనిని సాధించెను; ధ్వనిని ఐదు రకములుగా పేర్కొనెను- వ్యుత్పత్తి అర్థము ననుసరించి కూడా ధ్వని ఐదు రకములుగా నిరూపింపబడినది.

1. "ధ్వన్యతే అస్మిన్ ఇతి ధ్వనిః"
   -వస్త్వలంకార రసాదులను ధ్వనింపజేయు కావ్యము ధ్వని.
   —The poetic work containing the suggestible element.

2. "ధ్వనతి ధ్వనయంతి వా యః సః వ్యంజకోऽర్థః ధ్వని"
   -ధ్వనిత మగునది లేదా ధ్వనింపజేయునది యగు వ్యంగ్యార్థము ధ్వని.
   —The power of word to convey the suggestible meaning

3. "ధ్వనంతే ఇతి ధ్వనిః"
   -ధ్వనింప బడునది ధ్వని – వస్త్వలంకార రసములు.
   —The suggestible meaning.

4. "ధ్వనతి ధ్వనయతి వా యః సః వ్యంజక శబ్దః ధ్వనిః"
   -ధ్వనితమగు లేదా ధ్వనింపజేయు వ్యంజక శబ్దము ధ్వని.
   —The conventional symbol, the articulate sound.

5. "ధ్వన్యంతే అనేన ఇతి ధ్వనిః"
   -దేని ద్వారా ధ్వనింపబడునో ఆ శబ్ద శక్తి ధ్వని.
   —The conventional meaning.

పై విధముగా ధ్వని సిద్ధాంతము ఐదు అర్థములను కలిగి యున్నది.

i) వ్యంగ్య ప్రధాన కావ్యము ii) వ్యంజక అర్థము iii) వ్యంజనా వృత్తి iv) వ్యంజక శబ్దము v) వ్యంజనా వ్యాపారము. ఔదాత్య సిద్ధాంతము కూడా ఉదాత్త చింతన, ఉత్కట భావావేశము, సముచిత అలంకార ప్రయోగము, భాషా గరిమ మరియు రచనా గరిమ యను ఐదు అంగములతో ఏర్పడి యున్నది. ఈ రెండు కావ్య సిద్ధాంతములందు కానవచ్చు సామ్యతను పరిశీలింతము.

## రసధ్వని/ఉదాత్త చింతన-
## Rasa Dhvani/Grandeur of Thought.

ఆనందవర్ధనుడు వస్త్వలంకార రస ధ్వనులలో రసధ్వని కావ్యమునే పరమార్థ ప్రతిపాదకముగా, ఉదాత్త కావ్యముగా నిర్ధారించెను. లాంజినస్ ఔదాత్య భరితమైన కావ్యమునే ఉత్తమ కావ్యముగా తెలిపెను. రసధ్వని, ఉదాత్తత- ఈ రెండును పరమార్థ ప్రతిపాదకములైన గంభీరఅర్థమునకు ద్యోతకములు. ఆనందవర్ధనుడు ఎట్టి కావ్యమును రసధ్వని కావ్యముగా పరిగణించెనో తెలిసికొన్నచో రసధ్వని, ఉదాత్తచింతన— ఈ రెండింటియందు కానవచ్చు సామ్యత బోధపడును.

నాటకము రసరూపమైన ఆనందమును ప్రేక్షకునకు కల్గించునని భరతుడు రస సిద్ధాంతమును ప్రవేశపెట్టెను. రసము స్థాయి భావము నుండి నిష్పన్నము. భావము లన్నింటిలో ప్రధానములైనవి రతి హాస, శోక, ఉత్సాహ, భయ, జుగుప్స, క్రోధ, విస్మయములను ఎనిమిది భావములను తెలిపెను. వానినుండి క్రమముగా శృంగార, హాస్య, కరుణ, వీర, భయానక, భీభత్స, రౌద్ర, అద్భుతములను ఎనిమిది రసములు జనించుననెను. రసానందము లోకోత్తరమని, తద్ఫలము ధర్మవృద్ధి, నీతికరము, పరమార్థజ్ఞానప్రాప్తి యని తెలిపెను. తరువాతి ఆచార్యులు రసానందము పురుషార్థ సాధకమనిరి. ఆనందవర్ధనుడే ప్రప్రథమమున రసఫలమును యథార్థ దృష్టితో వైజ్ఞానికముగా వివేచించెను. శృంగారాది రసముల ద్వారా (కరుణము తప్ప) సామాజికుని ఆయా స్థాయి భావములకు సంతృప్తి కలుగును. తద్వారా అనుభూతమగు ఆనందము ఇంద్రియాతీతమును, లోకోత్తరమును యగుట సమంజసమే. ఐనను సామాజికుని ఆ భావములు శాంతించడం లేదు గదా! నాటకము చూచినంత కాలము లేదా కావ్యము పఠించునపుడు సామాజికుడు రత్యాది భావముల ప్రభావము నుండి విరతుడగును; కనుక రసానందము నను

భవించును. తదనంతరం సామాజికుని మానసము యథాస్థితి యందుండును. ఆ అవస్థ యందు పరిస్థితుల కనుగుణముగా భావములు పునరుద్రిక్తము లగును. గత రసానందానుభవము చేదోడు వాదోడుగా ఉండి ఉద్రిక్త భావమునకు తీవ్రత కల్గించుట సహజం. అందువలన సామాజికుడు భావోద్రిక్తతకు లోనై భౌతికమైన ఇంద్రియానందమునకు వశుడగునే కాని పారమార్థిక చింతనకు లోను కాలేడు. అట్లే జరిగియున్నచో అనాది కాలము నుండి సృష్టింపడుచున్న కావ్య-నాటక పరంపరా ప్రభావమున మానవుడు మాధవునిగా మారి యుండెడి వాడే. జగత్తు శాంతికి నిలయమైన స్వర్గమును తలపింప జేసెడిది. కాని దానికి వ్యతిరేకముగా మానవుని దానవ ప్రవృత్తి దినదిన ప్రవర్ధమాన మగుచున్నది; జగత్తునందు అశాంతి చీకట్లు క్రమ్ముకొనుచున్నవి. కావున పైన తెలుపబడిన ఏడు రకములైన రసానందము మానవ దానవ ప్రవృత్తిని సంస్కరించుటలో తమ అసఫలతను వెల్లడించుచున్నవి. శృంగార రసము సుకుమారమును, పరమాహ్లాదకరమే యగును. ఐనంత మాత్రమున అది పరమార్థ ప్రతిపాదకమని అంగీకరించు టెట్లు ? రతి భావ ప్రభావము సంపూర్ణముగా శాంతించకుకడనే సామాజికుడు మోక్షఫలము ననుభవించు టెట్లు? అట్లే ఇతరములైన ఆరు భావములు. కనుక ఇవి యన్నియు అనగా ఏడు భావములు మానవునిలో ఉదాత్త భావమును పరిపుష్టి నొందింప జాలవు.

ఇక కరుణ రసమును గురించి. దీని స్థాయి భావము శోకము ఈ రసానందానుభవ కాలమందు సామాజికుని శోక భావ ప్రభావము తగ్గును తదనంతరం పరిస్థితి వశమున శోకము ఇనుమడించును, అనగా పరిస్థితి ప్రభావమున సామాజికునిలో నున్న శోకభావము గత కరుణరస ప్రభావము చేదోడు వాదోడుగా నుండ తీవ్రతర మగును. ఈ శోక భావము ఎంత తీవ్రతరమైనను హాని ప్రదము కానేరదు. కారణమేమన వాస్తవిక జీవితమందు సైతం శోక తీవ్రత జాలిని కల్గించునే కాని హానిని కల్గింపదు. రత్యాదుల స్థితి సమాజమందు శోకస్థితికన్న భిన్నముగా కానబడుచున్నది. శోకానుభూతికి లోనైన వ్యక్తి ఈ భౌతిక జగత్తుయొక్క నశ్వరతను భావించుకొని అనశ్వమైర పారమార్థిక చింతనకు చేరువగుట సహజం ఇట్లు శోకభావ ప్రభావమున ఇతర భావములు తీవ్రతను కోల్పోవును. కను! శోక భావము ఉదాత్తస్థాయికి చెందినదిగా పరిగణింపబడును.

## శాంత రసము – Santa Rasa.

మరి సాహిత్యము మోక్షసాధక మెట్లగును? ఆనందవర్ధనుడు మోక్షస్థితిని దార్శనిక దృష్టితో వివేచించెను. మోక్షమనగా భౌతిక తాపత్రియమునుండి విముక్తి నొందుట. అస్థితియందు మానవుని కోరికలన్ని నిర్వీర్యములగును. నిర్లిప్తంగా సుఖ, దుఃఖాదులకు అతీతముగా నుండు స్థితియే మోక్షము. ఇట్టి అనుభూతిని సామాజికునకు కల్గింపవలయునన్న కావ్య-నాటకాదులు శాంతరస ప్రధానములై యుండవలయును. అపుడే సామాజికుడు భౌతిక సుఖమునందలి అనిత్యతను గుర్తించి పరమార్థ సాధనకై ప్రాకులాడును; ఊర్ధ్వ ముఖుడగును. సామాజికునిలో కలుగు ఇట్టి మహత్తర పరివర్తనము దేశశాంతి, సౌభాగ్యములకు తోడుగానుండును: ఆత్మ జ్ఞానమునకు ప్రేరకముగా నుండును; పరమ పురుషార్థమైన మోక్షమునకు సాధక మగును. ఈ దృష్టితో ఆనందవర్దనాచార్యులు శాంత రసమును కావ్య-నాటకములందు అంగి రసముగా ప్రప్రథమము భారతీయ సాహిత్య శాస్త్రమందు ప్రతిపాదిచెను. శాంతమునకు ఆయన 'తృష్ణాక్షయ సుఖము'-(కోరికల ప్రభావము అణగారి పోగా ఏర్పడు మానసిక శాంతి) ను స్థాయి భావముగా తెలిపెను. ఇదియే పరమార్థ ప్రతిపాదకముగా నున్న ఉదాత్త భావము. మానవునకు మోక్షమునకు మించిన వేరొక లక్ష్యము లేదు. అట్లే తృష్ణాక్షయ సుఖమునకు మించిన ఉదాత్తానందానుభూతి లేదు. బౌద్ధ జైన కవులు క్రీ.శ. ఐదవ శతాబ్దియందు 'అనుయోగాద్వార' సూత్రము నందు ప్రశాంత రసమను పేరుతో శాంతము నంగి రసముగా గ్రహించిరి. బహుశ ఆనందవర్ధనుడు వీరి నుండియే ప్రేరణ గ్రహించి యుండవచ్చును. తరువాత ఉద్భటుడు కావ్యాలంకార సంగ్రహమందు నవరసములలో శాంత రసమును చేర్చి చెప్పెను-

> 'శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకః
> భీభత్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యే రసాః స్మృతాః'

ఆనందవర్ధనుడు భారతమును శాంతరస ప్రధాన కావ్యముగా అంగీకరించెను. ధ్వన్యాలోకమందు శాంతరస ప్రధాన్యత నిట్లు వివరించెను-

'అసలు శాంతమను నొక రసమున్నదా? యను యొక వివాదమున్నది. దాని విచారింతము. శాంత మనగా తృష్ణాక్షయ రూపమగు పరిపుష్టము నొందినట్టి స్థి

తృష్ణాక్షయము నాశ రూపమైన సుఖ రూపము ఈ విషయమున సంశయ మనవ సరము—

'కామమది లోకాన గలుగు నెంత, నెంత దివ్య మహా సుఖం బింత కూడ
నాశలన్ని నశించెడి నట్టి సుఖము, ననుపదార వంతునకైనను దగునాకో'

యని పెద్దలు వాకొని యున్నారు. ఆ సుఖము కావ్య నాటకములందు జక్కగా బరిపుష్ట మగునపుడు తద్పరిపోషణ స్వరూపమగు శాంతము ప్రతీయ మానమగు చునే యున్నది. అది జనులందరికి గోచరమగుట లేదే యందురా? ఏమి చేయు దము. తృష్ణాక్షయ మందరి హృదయములనేది? కావుననే యా రస మందరి హృదయములకును గోచరము కాదు కాని అంత మాత్రమున అది లేదనుటకు వ లను పడదు. సామాన్యముగా మన కందరికుండు చిత్తవృత్తులకన్న నత్యధికోదా రమును, సమధికోన్నతమును, నగు చిత్తవృత్తి యేదోయొక మహానుభావున కు డుట లేదా? మనకందరికీ యనుభవములో లేనంత మాత్రమున నా చిత్తవృ[illegible] లేదనుటకు వీలు పడునా? అట్లే లేదందుమా? కావున శాంతరసము కూడా న[illegible] నిరాకరణీయమైనది. ఇట్టి నిరూపణము వలన సకలవిధ తృష్ణాక్షయ సుఖాత్మ[illegible] మగు శాంతరస మంగీకరింపక తప్పదు' 29.

శాంత రసా స్వాదన ద్వారా జీవన పరమార్థము సువ్యక్తమగు విధమును ఆనందవర్ధను డిట్లు తెలిపెను—

'అసలీ మహాభారతము శాస్త్ర కావ్యచ్ఛాయతో నున్నది. శాస్త్రమువలె పురు షార్థ నిరూపణమును. కావ్యమువలె రస స్ఫోరణము నిది యొనర్చును. ఎట్లందు రా! సర్వ సంపత్సమృద్ధులతో వెలిగి వెలిగి చివరకు యాదవులును పాండవులును గూడ నత్యంత శోచనీయమగు నవసాన మొందిరి. చివరికిట్టి వృష్ణి పాండవుల విర హావసానముననే గదా భారతము ముగియును. దీనని జదివిన వెంటనే పాఠకుని హృదయమున వైరాగ్య మొదవక తీరదు. ఎన్ని సంపదలున్న నేమి? ఎంత బల మున్న నేమి? ఏది యేమైన వెంట వచ్చునా? ఏదియైన నెందుకైన నవసాన కాల మున నుపయోగించునా? అన్నియు నశాశ్వతములే. మూన్నాళ్ల ముచ్చటయే యంతయు ఎవరి గతి యెట్లున్నదో? అంతలంతలేసి వారు వృష్ణులు పాండవులు ను వారి గతియే అట్లయినపుడు మన గతి యేమగునో? ఈ ధన కనక వస్తువాహ నైశ్వర్యాదులును, వీని యందలి మమకారమును నిరర్థకములు అనుబుద్ధి తప్పక

కల్గి తీరును. అదియే కదా వైరాగ్యము మనవారు వాడుకగా పురాణము విన్న వెంటనే కలుగు పురాణ వైరాగ్య మిట్టిదే. ఈ వైరాగ్యానుబంధియగు పురుషార్థము మోక్షము. రసము శాంతము. ఇవి రెండును పైతీరున వైరాగ్యోద్భోధన మొనరించు నీ కవికి వివక్షితము లనుకొనుటలో నందియ మేమున్నది? ఈ విషయమును కొందరు వ్యాఖ్యాతలు కొంచెము కొంచెముగా స్పష్టపరచియే యున్నారు. అదంతయు నేల ? అంతులేని అజ్ఞానాంధ కారమున మునిగి కన్నుగానక యున్న యీ లోకమును విమలమగు జ్ఞాన దీపము వెలుగునిచ్చి యుద్ధరింపదలచు నా లోకైక నాథుడే తన యభిప్రాయము నిట్లు స్పష్టపరచి యున్నాడు-

"సారమే లేని లోక ప్రకారమిందు- విప్లుతంబగుచున్నట్టి విధము తెలియుచున్న కొలదియు వైరాగ్య మొదవు నిచట, నేమియు సంశయంబు లేదింత నిజము'' -30.

## శాంతరస సమర్థనము -
## ommendation of Santa Rasa.

ఆనందవర్ధనుని తరువాత భట్టనాయకుడు శాంత రసమును మహారసముగా తెలిపెను- 'రసము ఒక్కటే' అది శాంత రసము. అయా నిమిత్తముల ద్వారా శాంతమే వివిధ రూపములఁ భాసించుచున్నది; అసత్యము, నామరూప ప్రపంచాత్మకమగు జగమే శ్రవణ మన నాదులద్వారా పరమ పురుషార్థమును పొందింపఁ జేయునట్లే, నాట్యశాస్త్రము కూడా లోకోత్తరమగు పరమ పురుషార్థమును సూచించున దగుటచే ఈ శాస్త్రము శాంత రసోపేక్షక మగుచున్నది '' 31. తరువాత ధనికుడు శాంతరసము నంగీకరించెను. ఐనను అది శ్రవ్యకావ్యమునకే తగును కాని నాటకమునకు కాదనెను. అభినవగుప్తుని గురువైన తౌతభట్టు 'కావ్యకౌతుకము' మను గ్రంథమునందు శాంతరసమును రసము లన్నింటిలో ప్రధానమైనదిగా మోక్ష ఫల ప్రదాయినిగా సమర్థించెను

అభినవగుప్తుడు శాంతరసము అంగిగా యుండదగిన దనియు, అసలు శాంతము ప్రకృతి రసమని మిగిలిన వన్నియు వికృతి రసములని తెలిపెను; శాంతమునకు మిగిలిన భావములన్ని వ్యభిచారులుగా నుండుననెను. తత్త్వజ్ఞానమే స్థాయిభావము. అనగా జ్ఞానానందాది విశుద్ధ ధర్మములుకలిగి విషయోప భోగ శూన్యమైన యాత్మయే స్థాయి. ఈ స్థాయి భావము ఇతర స్థాయిభావముల వంటిది కాదు.

స్థాయితము. మిగిలిన స్థాయి భావము లన్నింటికి నిది మూల భూతము. ఏలన ంతరసము ప్రకృతి రసము; మిగిలినవి వికృతి రసములు. శాంతము ప్రకృతి ావము. రత్యాది భావములు వికృతులు. ప్రకృతి వలన బుట్టిన వికృతి ప్రకృతి యందే లీనమగును. ఆయా నిమిత్తములను బట్టి శాంతము నుండి రత్యాదులు ప్ర ర్తిల్లును. ఆ నిమిత్తము లడగగానే శాంతమే నిలుచును. కావున శాంతము భిత్తి ంటిది. భిత్తిస్థిరమైనది చిత్తరువు లస్థిరములు. ఒక చిత్తరువును జెరిపి మరొక ిత్తరువును వ్రాయుచున్నను భిత్తి ఏకరూపమున నిలుచును. కావున శాంతరస ము నుండియే ఇతర రసములు వెడలును. నిమిత్త మడగగానే మరల శాంతమే ిలుచును. ఎల్లశాస్త్రములను పండితులు శమము కొరకే నిర్మించిరి. కావున నెవని మనస్సు శాంతముగా నుండునో వాడు సర్వజ్ఞుడు అని చెప్పబడుటచే శాంతరసము ప్రధాన రసమని తేటపడుచున్నది. దీనికి రత్యాదులన్నియును వ్యభిచారులగును. ఈ శాంతమునకు స్థాయి భావము తత్త్వజ్ఞానము లేక యాత్మజ్ఞానము లేదా జ్ఞానా నందాది ధర్మోపేతమై విషయోప భోగ రహితమైన యాత్మయే. రత్యాదులన్ని యు శాంతమునకు వ్యభిచారులగు నట్లీ శాంతరసముయొక్క యాత్మరూప స్థాయి భావమే యితర రసములకు వ్యభిచారి గాజాలదు.'' 32.

హేమచంద్రుడు తృష్ణాక్షయమును 'శమము' అను స్థాయి భావముగా తెలి పెను- తృష్ణాక్షయ రూపశ్శమః స్థాయి భావశ్చర్వణాం ప్రాప్తశాంతో రసః- శ చర్వణ ద్వారా శాంత రసానుభవము కలుగును.

భోజుడు 'ధృతి'ని శాంతమునకు స్థాయి భావముగా పేర్కొనెను. ధృతి నిత్య సంతుష్టి. ఇది శమ రూపముగు తృష్ణాక్షయ చిత్తవృత్తి.

విశ్వనాథుడిట్లు తెలిపెను- మోక్షావస్థయందున్న శమమేకాక యుక్త క్త దశయందు అనగా నాత్మ సాక్షాత్కార దశయందును, గద సాక్షాత్కార యందును సాధారణముగానుండు శమము రసత్వమును బొందును. దానికి సం రాద్ధ్యు లుండును. అతని అభిమత మందు శాంతము కావ్య నాటకములందు ప్ర ధాన రసముగా నుండ దగును

పై వివేచనకు సారాంశ మిది- శాంతరస నిర్వహణ కష్టతరమైనప్ప టికిని దానిని అంగిరసముగా పోషించుటలోనే కవి మహనీయత ఇమిడి యున్నది.

మోక్షానందరూపమైన శాంతరసమే ఉదాత్తానందానుభూతి శాంతమునకు మించిన వేరే రసము లేదు. అట్లే పరమాత్మకు మించిన వేరే ఉదాత్తవిషయము లేదు. కావున శాంతరసమునకు స్థాయియైన శమమే ఉదాత్త భావము. సారహీనమైన జగత్తు, ప్రపంచ నశ్వరత, పరమాత్మ జ్ఞానము శాంతరసమునకు ఆలంబన విభావము లగును. తీర్థప్రదేశములు, పవిత్రమైన ఆశ్రమములు, రమ్యమైన వనాదులతోనున్న ప్రకృతి ఏకాంతము, సత్సంగము మున్నగునవి ఉద్దీపన విభాగము లగును రోమాంచాదులు అనుభావము అగును. హర్షము, దివ్యోన్మాదము మున్నగునవి సంచారు లగును. కనుక ఆనందవర్ధనుడు ప్రతిపాదించిన శాంతము అంగిరసముగా సమర్థనీయమే యగును. శాంతరస ప్రధానములైన కావ్య, నాటకములు లేవన రాదు. సంస్కృతమందు రమారమి ఏబది రచనలు శాంతమే ప్రధానముగా కలిగినవి కలవు. రాజతరంగిణి యందిట్లు తెలుపబడినది- "జంతువుల క్షణభంగుకమైన జీవితమును పరిశీలింపగా శాంతరసమే రససార్వభౌమమని తేటపడును. ఆ శాంతరసము జాలువారు రాజతరంగిణిని శ్రోతాంజలులతో త్రావుము." 33.

కనుక శాంతము సార్వభౌమ రసమని సారాంశము కావ్యమందలి శాంతరస అంగిత్వమే ఉదాత్తచింతన. ఔదాత్యము, రసధ్వని– ఈ రెండింటి యందు సామ్యత కానవచ్చును; అంతరము అంతగా నుండదు.

## వ్యంజక అర్థము - Power of Suggestible meaning/ ఉత్కట భావావేశము - Capacity for Strong emotion.

ఔదాత్యమును కావ్య ప్రధాన తత్త్వముగా నిర్ధారించి తద్సిద్ధి భావావేగ తీవ్రత వలన కలుగునని లాంజినస్ తెలిపెను. రసధ్వనియే కావ్యమునందు ప్రధానముగా నుండదగినదని అది వ్యంజక అర్థముద్వారా సిద్ధించునని ఆనందవర్ధనుడు నిరూపించెను. కావ్యార్థమే కావ్యభావము. అది వ్యంజిపబడినవుడు సామాన్య స్థాయిలో నుండక తీవ్రరూపమున భావముల నుత్తేజ పరచును. కావ్యము నందు రసధ్వని ప్రధానతత్త్వముగా నుండదగినందున దానినిని సిద్ధింపజేయుటకై కావ్యమందలి వివిధ భావములన్ని తీవ్రతమస్థాయి యందు వ్యంజక అర్థరూపమున కావ్యమందు వ్యాపించి యుండునని ఆనందవర్ధనుని సిద్ధాంతము. సామాజికుడనుభవించు రసానందము వ్యంజక అర్థరూపమున నున్న భావములకు పరిణామమని

ఆయన తెలిపెను-. ఇట్లు వ్యంజక అర్థ రూపమున నున్న భావ తీవ్రతను ఆనంద వర్ధనుడు రెండు రకములుగా తెలిపెను- అభిధా మూలము, లక్షణా మూలము.

అభిధేయార్థము అనగా సాంకేతితమైన వాచ్యార్థముతో పాటే ప్రతీత మగు నది అభిధామూల వ్యంజక అర్థము వక్తృ బోద్ధవ్యాదులు దీనికి ఆశ్రయములు. సూర్యుడస్తమించెను- ఈ వాక్యమునకు ప్రసంగానుకూలముగా అనేకార్థములు స్ఫురించును. లక్ష్యార్థము ద్వారా ప్రతీతమగునది లక్షణా మూల వ్యంజక అర్థము. ఇది వాచ్యార్థమునకు బాధ ఏర్పడగా లక్ష్యార్థము ద్వారా స్ఫురింపబడు వ్యంజక అర్థము. గంగయందు గొల్లపల్లె- ఇట ముఖ్యార్థమునకు బాధ కలుగగా 'గంగా తీరము' అను వ్యంజక అర్థము స్ఫురించును. ఆనందవర్ధనుడు వీనిని క్రమముగా అభిధామూల ధ్వని మరియు లక్షణా మూల ధ్వనిగా తెలిపెను.

పైన తెలుపబడిన రెండు అర్థములలో అభిధేయార్థముతో పాటే స్ఫురించు వ్యంజక అర్థమే భావ తీవ్రతను సూచించును; రమణీయంగా భాసించి క్షణంలో సామాజికుని పరవశింప జేయును. ఎట్లన వాక్యార్థబోధ ముగియక పూర్వమే వ్యంజక అర్థము స్ఫురించి మనలో తదనుగుణమైన భావదీప్తిని శీఘ్రంగా కల్గించును. భావ తీవ్రతను స్థాయిని సూచించుటకై అభిధామూల ధ్వనిని సంలక్ష్య క్రమము, అసంలక్ష్యక్రమము రెండుగా తెలిపెను. సంలక్ష్య క్రమ ధ్వని యందు వాచ్య-వ్యంగ్యార్థముల పౌరాపర్య క్రమము గోచరించును. అసంలక్ష్య క్రమ ధ్వని యందు వాచ్య-వ్యంగార్థముల పౌరాపర్య క్రమము గోచరింపదు. అనగా వాచ్యార్థముతో పాటే వ్యంగ్యార్థము స్ఫురించును. అందువలన సామాజికునకు వెనువెంటనే రసదీప్తి కలుగును. ఇది భావముయొక్క తీవ్రతను స్థాయికి సూచకము. అనగా వాచ్యార్థముతో పాటే స్ఫురించు ఆ అసంలక్ష్య క్రమ వ్యంజక అర్థము సామాజికుని భావముల నుద్రిక్తపరచి శీఘ్ర రసానుభూతికి లోను కావించును. కావున రసానుభూతికి అసంలక్ష్యక్రమ వ్యంజక అర్థమే ప్రాణము. ఆ అర్థమే కవియందు నెలకొనియున్న భావావేగమునకు పరిణామము. ఈకారణము చేతనే ఆదికవియొక్క శోకభావ తీవ్రత శ్లోక రూపమున అవతరించినదని ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమందు ఈ క్రిందిశ్లోకము నుదహరించెను-

'మానిషాద! ప్రతిష్ఠాం త్వమగ శాశ్వతీస్సమాః।
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామ మోహితమ్. ॥

—ఓ నిషాదుడా! అమాయకమైన క్రౌంచ మిధునమును, కామ మోహిత మైన దానిని ఎడబాపిన నీకు ప్రతిష్ఠ కలుగకుండుగాక.

కామమోహితమైయున్న క్రౌంచ మిధునము నుండి క్రౌంచిని శాశ్వతముగా ఎడబాపిన నిషాదుని క్రూర కృత్యమువలన వాల్మీకి హృదయమునకు ఆఘాతము కలిగెను; క్రౌంచ విలాపమునకు ద్రవించి పోయెను. ఆ మహర్షియొక్క శోకాను భూతియే తీవ్రభావావేగ రూపమున పై శ్లోకమందు వ్యక్తమైయున్నది. పాఠకునకు ఆ శ్లోక పఠనముతోపాటే కరుణ రసానుభవము కలుగుచున్నది. ఇది అసంలక్ష్య క్రమ వ్యంజక అర్థ శక్తికి జ్వలంత ఉదాహరణము. ఇట క్రౌంచి వధ ఆలంబన భావము; కామమోహితము ఉద్దీపన విభావము. శోకము స్థాయి భావము ఆ శోకస్థాయి భావము తీవ్ర భావావేగ రూపమున వ్యక్తమై కరుణ రసమునకు ఆల వాలమయినది. ఆ శ్లోక పఠనము ద్వారా పాఠకు డనుభవించునది సత్వర కరుణ రసానుభూతి. ఈ తీరున ఆనందవర్ధనుడు అసంలక్ష్య క్రమ వ్యంగ్యము ద్వారా కవియొక్క భావావేగ తీవ్రతను నిరూపించి యున్నాడు ఇంకను ఆయన అతి సూక్ష్మ భేదములను సైతం తెలిపి యున్నాడు. అవి— భావము, భావాభాసము, భావశాంతి, భావోదయము, భావశబలత, రసము మరియు రసాభాసములని ఎని[illegible] రకములు. ఇవి యన్నియును ప్రధాన రస పోషకములైన వ్యభిచారి భావ[illegible] తీవ్రతర, తీవ్రతమ స్థాయిని సూచించును. కావ్య ప్రపంచమంత ఈ అసంల[illegible] క్రమ వ్యంజక అర్థమునందు యిమిడియున్న దనుటలో అతిశయోక్తి లేదు. వా[illegible] వముగా సాహిత్యము ధ్వని మయము. లోచనకర్త అసంలక్ష్య క్రమమును సో[illegible] హరణముగా వివరించి కావ్యమందు దాని ప్రాధాన్యతను సమర్థించి యున్నా[illegible] ధ్వన్యాలోక ద్వితీయోద్ద్యోతమునందలి ఈక్రింది ఉదాహరణమును గమనించ[illegible]

''ఆమె (ఊర్వశి) కినుక వహించి అదృశ్యమయినా కావచ్చు కా[illegible] ఆ కోపగ్రస్తురాలు మాత్రం కానేరదు; ఆమె స్వర్గమునకు మరలిపోయి యుండ[illegible] ను. ఐనప్పటికిని ఆమె మనను నాపై ఆర్ద్రత చెందియున్నది. నా ముందున్న[illegible] మెను ఏ రాక్షసుడు కూడా అపహరించలేదు; మరియు ఆమె నాకనులకు ప్ర[illegible] విషయము కాకుండా యున్నది. ఇదేమి వింత ?" ఇట విప్రలంబ శృంగార[illegible] న్నప్పటికిని వితర్కమను వ్యభిచారి భావ చమత్కారముతో ప్రయుక్తమయి[illegible] తిశయము ఆస్వాదమాన మగుచున్నది. (భావముల ఉదయ, స్థితి, ప్రశాంత[illegible] మున్నగు వానికి ధ్వన్యాలోకమును చూడగలరు).

సారాంశముగా ఆనందవర్ధనుడు రసధ్వనిని కావ్య ప్రధాన తత్త్వముగా ప్రతిపాదించి తద్సిద్ధికై వ్యంజక అర్థశక్తిని నిరూపించి యున్నాడు. వ్యంజక అర్థము కవియొక్క తీవ్రభావావేశమును సూచించును. కనుక ఔదాత్యసిద్ధికై లాంజినస్ ఏర్పరచిన ఉత్కటభావావేశము ఆనందవర్ధనుడు ప్రతిపాదించిన వ్యంజక అర్థముతో సరిపడుచున్నది.

## వ్యంగ్య అర్థము – Suggestible meaning/ సముచిత అలంకార ప్రయోగము – Appropriate use of figures.

ధ్వని సిద్ధాంతాను సారము అలంకారము ధ్వనింపబడి వ్యంగ్య అర్థమును స్ఫురింప జేయును. అలంకారముల ద్వారా ప్రతీయమానములగు వ్యంగ్య అర్థము లన్నియు రస ధ్వనికి పోషకములుగా నుండవలయును. అపుడే అలంకారములు సార్థకములగును ఈ దృక్పథముతో ఆనందవర్ధనుడు అలంకార వివేచన మందు మౌలికతను ప్రదర్శించెను.

''అంగాశ్రితా స్త్వలంకారాః మంతవ్యాః కటకాదివత్''

–కటకాది అభూషణముల వలె అలంకారములు కావ్యమునకు అంగములు.

''అలంకారోహి బాహ్యాలంకార సామ్యాద్ అంగినశ్చారుత్వ హేతు రుచ్యతే''

–బాహ్యాలంకారములగు కటక కుండలాదుల పోలిక ననుసరించి అంగిక సౌందర్యము నొదవించునది అలంకార మనబడును.

'తథాహి అచేతనం శవశరీరం కుండలాద్యుపేత మపి

న భాతి అలంకార్య స్వభావాత్'

–ప్రాణరహితమైన శవమునకు కుండలాదులు శోభను కలుగజేయని విధమున కావ్యమందు అలంకారములు అలంకార్యాభావము (ధ్వని లేమి) వలన నిరర్థకములే యగును.

కనుక ఆనందవర్ధనుని దృష్టియందు ధ్వన్యుపస్కారములగునవి అనగా రసమును పోషించునవి మాత్రమే అలంకారములు. అవి సౌందర్య హేతువులు. రస పోషకములు కాని అలంకారముల ప్రయోగము నిరర్థకము. రసదృష్టిగల ప్రతిభావంతులైన కవులకు నిరూప్యమాణ మందు క్లిష్టత యున్నను అలంకారములను

గురించి చింతించు అవసరము వారికి యుండదు. కాదంబరి యందు కాదంబరి (నాయిక) దర్శన సందర్భమువలె అలంకారములే ఒకదాని వెనుక మరియొకటి స్వతః వచ్చి చేరును. ఉదాహరణముగా–

'చిత్తరంజక రాగ నిశ్రేణివైచి దివ్య గానంబు భూమికి దింపరావె'

–దువ్వూరి రామిరెడ్డి.

''మనస్సును రంజిపజేయు రాగము అను నిచ్చెన' అనునది ఇట రూపకాలంకారము. కాని పఠిత కీ అలంకారమే స్ఫురింపదు. కోయిల మధురగాన మననమందే తన్మయుడగును. కావున వస్తువుయొక్క శోభ నతిశయింప జేయునవి అలంకారములు. అన్యథా అవి వస్తువుకు సహజమైన శోభను క్షీణింపజేయు కవి దురహంకారము లగును. ఆనందవర్ధనుడు ఇట్టి అనౌచిత్యాలంకారములు కల కావ్యమును చిత్రకావ్యముగా, అధమ కావ్యముగా పరిగణించెను– ''కావ్య తత్త్వమైన వ్యంగ్యము లేక ధ్వని విహీనములైన అలంకారములు కేవలము ప్రతికృతులు. అవి చిత్రముల వంటివి. అట్టి అలంకారములే ప్రధానముగా గల కావ్యము చిత్రకావ్యము అనగా అధమకావ్యము'' కావ్యమందు రూపకావ్యలంకార ప్రయోగమునకు ఆనందవర్ధనుడు ఈ క్రింది నియమముల నేర్పరచెను.

1. కావ్యమందు ప్రధానమైనది రసధ్వని. అలంకారములు తదంగములుగా ప్రయోగింపబడ వలయును.
2. అలంకారముల నెప్పుడు అంగిగా వివక్షింప రాదు.
3. ఉపయుక్త సందర్భములందు మాత్రమే అలంకారములను ప్రయోగింప వలయును
4. అలంకార ప్రయోగము నారంభించి అంతము వరకు దానిని నిర్వహించు తలపును కలిగి యుండరాదు.
5. అప్రయత్నముగనే ఆద్యంత నిర్వహణము కావింపబడినచో దానిని రసధ్వని అంగ రూపమున పోషించు యత్నము సలుప వలయును. 34.

పై విధముగా ఆనందవర్ధనుడు అలంకార ప్రయోగము ద్వారా రస ధ్వని పోషించు వ్యంగ్య అర్థమును నిరూపించెను అనగా అలంకారము లన్ని వ్యంగ్య అర్థమునకు స్ఫోరకములు కావలయును. అపుడే వాని సముచిత ప్రయోగము శ

పడును ఇట్టి దృక్పథమును ప్రదర్శించి ఆయన సముచిత అలంకార ప్రయోగమును వ్యంగ్య అర్థమునకు అధీనము కావించెను. ఇట్లు అలంకార ప్రయోగమునందు లాంజినస్ మరియు ఆనందవర్ధనుడు ప్రకటించిన దృక్పథములందు సామ్యత కానవచ్చును.

ఆనందవర్ధనుడు అలంకారములను, లాంజినస్‌వలె విభజించి వివరింపలేదు. ధ్వని సిద్ధాంతమున కనుగుణముగా అలంకారముల నిట్లు వర్గీకరింప వచ్చును.



లాంజినస్ తెలిపిన సముచిత అలంకార ప్రయోగము ధ్వనికారుని వ్యంగ్య అర్థమునందు అంతర్భావము నొందును.

## వ్యంజక శబ్దము – The Articulate Sound/ భాషా గరిమ - Dignity of language.

పూర్వాలంకారికు లెవ్వరును తెలుపని వ్యంజనాశక్తిని నిరూపించి ఆనంద వర్ధనుడు కావ్య భాషాఉత్కృష్టతను, సౌందర్యమును వెలుగునకు తెచ్చెను. అంతే ాదు వ్యంజనాశక్తిని సర్వకళా ప్రపంచమునకు సూత్రికగా నిరూపించిన ప్రథమ ారతీయ లాక్షణిక చక్రవర్తియు ఆనందవర్ధనుడే. భావ సూక్ష్మత భాషా సౌంద ్యమునకు ఎట్లు నిలయమో అట్లే భాషా సూక్ష్మత భావ సౌందర్యమునకు నిలయ ుని నిరూపించిన ప్రథమాచార్యుడతడే. అందువలన సాహిత్య సౌందర్యశిల్ప వివే నమందు భాషయొక్క లఘుతమ రూపములైన ప్రకృతి ప్రత్యయాదులను ేక్షింవ రాదని, అట నుండియే భాషా సౌందర్య వివేచన ఆరంభము కావలయు ని ఆనందవర్ధనుని అభిమతము.

కవి భావన ప్రతిభా శక్తిచే అభివ్యంజన కుపక్రమింప వలయునన్న శబ్దార్థ రూపమైన భాషనే మాధ్యమముగా గ్రహింప వలయును. కవిభావన సామాన్యము కన్న భిన్నమై సార్వజనీనమై యున్నందున భాషాశక్తి అభిధ లక్షణా వృత్తుల ధిగమించి వ్యంజనద్వారా ముఖరితమగును కవి భావిత వస్తువు రమణీయమైన ్యంజనాశక్తి మాధ్యమమున ధ్వనించునపుడు భాష వర్ణ, పద ప్రకృతి, ప్రత్య యము మొదలుకొని ప్రబంధము వరకు అపూర్వ సౌందర్య శక్తితో విరాజిల్లును. ఈ తీరున వ్యంజకము లనేకము లొనగూడిన యెడల కావ్య బంధమునకు సర్వో త్కృష్టమగు ఛాయ యేర్పడును. ఏమనగా వ్యంగ్య పర్యవసాయి యగు పద మొ కడు యున్నంతనే కావ్యమున కెంతయో శోభ యొదవును గదా! అట్టి యెడ పద ము లన్నియు విశేషించి వ్యంజకములుగా నుండు కావ్యమును గురించి చెప్పవల సిన దేమున్నది ?

ఆనందవర్ధనా చార్యులు భాషాసౌందర్య సూక్ష్మాతి సూక్ష వివేచన మందు అపార పాండితీవై భవమును ప్రదర్శించెను. పండితులందరు అంగీకరింపక తీరని విధముగా అనేక ఉదాహరణముల ద్వారా భాషయొక్క ఉత్కృష్టతను, గరిమను.

లోకోత్తర రమణీయతను వ్యంజక శబ్దము నందు నిరూపించెను. భాషా సౌందర్య నిరూపణయందు ఆనంద వర్ధనాచార్యులకు సాటియగు వారెవరును ఈ ప్రపంచ మందు ఇంత వరకు జన్మించ లేదనుటలో అతిశయోక్తి లేదు. ఆయన ఎల్లెడల కవి ప్రతిభా వైశిష్ట్యమునే సమర్థించెను. ప్రతిభావంతుడైన కవి తనభావనా శక్తి కనివిని ఎరుగని తీరున భాషా సౌందర్యమును ప్రదర్శింప వచ్చును. భాషా సౌంద ర్యమునకై పాటుబడక సూక్ష్మాతి సూక్ష్మ భావనా ప్రదర్శన మందు కవి తత్పరు డైనచో అలంకార యుక్తముగా భాషయే స్వయముగా భావనకు సౌందర్యాత్మక రూపకల్పన యందు తోడ్పడు చుండును. కావున భాషా గరిమ కావ్య మందు ప్రయోగితమైన వ్యంజక శబ్దములపై ఆధారపడి యున్నదని స్పష్టము. ఆనందవర్ధనుడు భాషా వ్యంజకత నిట్లు నిరూపించెను–

''సుప్, తిజ్, వచన, సంబంధకారక, కృత్ తద్ధిత సమాసముల ద్వారా అట న అసంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని అభివ్యక్తమగును.'' 35.

''ధ్వనికి ఆత్మభూతమైన అసంలక్ష్యక్రమ వ్యంగ్యము రసాది సుప్ విశేష, తిజ్ విశేష, వచన విశేష, సంబంధ విశేష, కారకశక్తి, కృత్ విశేష, తద్ధిత విశేష, స మాస విశేషాదులపై వ్యంజితమగును.'చ' శబ్దముతో నిపాతము, ఉపసర్గ కాలా ప్రయోగము లందు కూడా అది వ్యక్తము కావచ్చును'' 36

ధ్వనికారుడు నిదర్శనపూర్వకంగా నిరూపించిన భాషయొక్క అంగప్రత్యం గముల సౌందర్య వివేచనను పాఠకులు ధ్వన్యాలోకమందు చూడగలరు. ఇట కేవ లము నిపాత వ్యంజకత్వము నిరూపింపబడును.

భాషా సౌందర్య దృష్టితో నిపాతముల పాత్ర గణనీయమైనది; మహిమోపే పేతమైనది. భాషాచమత్కారమునకు నిపాతము సంపూర్ణ నిదాన మనుటకు ఋగ్వే ద భాషనుండి నేటి వరకు భాషయందు కానవచ్చు వాక్యప్రయోగ వైవిధ్యమే నిదర్శనము. నిపాతములు స్వయముగా అర్థవిహీనములైనప్పటికిని పదాంశముతో (Morpheme) నిబద్ధమై ప్రసంగానుకూలముగా అర్థాతిశయమును, సౌందర్యము ను సృష్టించును. వక్త అభిప్రాయమును భావదీప్తికనుగుణంగా వ్యక్తపరచు సామర్థ్యము నిది కలిగియుండుటచే వైయాకరణులు నిపాతమును అర్థద్యోతకముగా భావించిరి. కనుక నిపాతము ఒకవ్యాకరణిక తత్త్వము ఆనందవర్ధనుడు నైపా తిక వ్యంజకత్వము నీ ఉదాహరణము ద్వారా నిరూపించెను–

"అయమేక పదే తయా వియోగః ప్రియయా చోపనతః సుదుఃసహోమే నవ వారి
రిధ రోదయాదహోభిర్భవిత వ్యంచ నిరాతపత్వ రమ్యైః"

-ప్రాణప్రియయైన హృదయేశ్వరి అసహ్య పీడ యొకటి క్రొక్కారుమేఘములు
క్రమ్ముకొనగ ఆపాత రహితములైన మనోహర దివసములు (వర్షాకాలపురోజులు)
ఈ రెండును ఒకేసారి వచ్చినవి. (ఇక వీనిని సహించుటెట్లు?).

పై శ్లోకమందు 'చ' యను నిపాతము రెండుసార్లు ప్రయోగింపబడినది.
యోగముతో (చ) మనోహర దినములలో (చ) వర్షాకాలము (కూడా) వచ్చెను.
ట రెండు నిపాతములు విప్రలంబ శృంగారమును అభివ్యంజించును.

నిపాతములు అర్థద్యోతకమునకు ప్రసిద్ధి యని ఆనందవర్ధనుడు తెలిపెను
కే నిపాతము ఒక వాక్యమునందు ఉపయోగింపవలయునను నియమము లేదు.
సానుకూలముగా రెండింటిని, మూడింటిని కూడా ఉపయోగింపవచ్చును. నిపా
కము భాషయొక్క లఘుతమ అంగము. దీని ప్రసంగానుకూల ప్రయోగము భా
షకు అపూర్వ సౌందర్యమును చేకూర్చును. ఆనదవర్ధనుని తరువాతి ఆచార్యు
లు కుంతకుడు, క్షేమేంద్రుడు మున్నగు వారలు నిపాత వ్యంజకత్వమును ముక్త
కంఠముగా ప్రశంసించిరి.

రసానుకూలముగా ప్రయోగితమైన వ్యంజక శబ్దమే ఉత్కృష్టభాష. అది
భాషాగరిమకు నిదర్శనము కావున లాంజినస్ ప్రతిపాదించిన భాషాగరిమ ఆనం
దవర్ధనుడు స్థాపించిన వ్యంజక శబ్దము నందు అంతర్భావము నొందు ననునది
ఇట స్పష్టము.

## వ్యంజనావృత్తి - Conventional meaning/ రచనా గరిమ - Dignity of composition.

భావనగా నున్న కావ్యవస్తువు మనోహర రూపమున సహృదయుల ముందు
ఆస్వాదనీయముగా ప్రదర్శితమగు కార్యము భాషద్వారా సంపన్నమగును. విజ్ఞా
నరాశి కంతటికి రూపమును కల్పించి స్థిరపరచు మహత్తర కార్యమును భాషయే
నాటినుండి నేటివరకు సఫలతాపూర్వకంగా నిర్వహించుచున్నది. ఐనను కావ్య
మందు ప్రయుక్తమగు భాష విజ్ఞాన శాస్త్ర భాషకన్న భిన్నమై రాగాత్మకముగ

నుండుట వలననే భావనా రూపమున నున్న వస్తువు లోకోత్తర రమణీయముగా విరాజిల్లి సహృదయ హృదయాహ్లాదకారి యగుచున్నది. కావ్యభాష సాహిత్య ప్రక్రియల కన్నింటికి ఒకే రూపమున నుండక కావ్యరూపముల కనుగుణముగా ప్రత్యేక రీతుల పరిదీప్తితము అగును. కావ్యభాషారీతియే కావ్యశైలి. అదియే పద రచన. పదముల సమూహము అర్థవంతములైన వాక్యముల రచనారూపము న కావ్యశైలి నేర్పరచును. భావన ఉపయుక్తపద మాధ్యమమున అభివ్యక్తమైనపుడే రాణించును; అపుడది లోకాతిశాయిని యగును భావము ఉదాత్తమైనపుడు దానిని వ్యక్తపరచు శైలి సైతం ఉదాత్తమై యుండవలయును ఉదాత్తశైలి లాంజినస్ రచనా గరిమగా తెలిపెను; కావ్యాంగము లన్నింటిని సమరసతా ప్ర కంగా సమన్వయపరచు రచనా తత్త్వముగా ప్రతిపాదించెను. కావున కావ్య తత్త్వము కావ్యాంగములైన భావ, గుణ, అలంకారాదు లన్నింటికి సమన్వ త్మక భాషారూపము ఆ రూపమందు రామణీయకత నెలకొని యుండును. ఈ ణీయత వ్యంజనావృత్తి ద్వారా సిద్ధించునని ఆనందవర్ధనుడు ధ్వని సిద్ధాంత ందు స్పష్టపరచెను. వ్యంజనా వ్యాపారము కావ్యాంగము లన్నింటియందు అ ప్యూతమై పదసంఘటనా రూపమున కావ్యశైలిగా సహృదయుల నలరించునని నందవర్ధనుడు తెలిపెను పదముల ఎంపిక, వాని ప్రయోగము శైలికి అనివార్య ంగములే యైనప్పటికిని అవి కొన్ని నియమములకు కట్టుబడి యుండవలయునని యన తెలిపెను. ఆనియమములను నాతడు సంఘటనా తత్త్వములుగా వివరించెను. ద సంఘటన యందు వ్యంజనా వ్యాపారము అంతర్లీనమైయున్నది కనుక ంజినస్ పేర్కొనిన రచనాగరిమ వ్యంజనావృత్తియందు చేరును. అందువలన నందవర్ధనుని దృష్టియందు రచనాగరిమ యన పద సంఘటనే యని స్పష్టము ను. ఆధునిక యుగమందు పద సంఘటన శైలిగా రూపాంతరితమైనది అ ందవర్ధనుడు పూర్వప్రచలిత 'రీతి' పద ప్రయోగమును అనుపయుక్తముగా భా ంచి రస దృష్టితో 'సంఘటన'యే సముచితమని తెలిపెను సంఘటన యనగా- సమ్యక్ = యథోచితమైన, ఘటన - కూర్పు - ఇట్లు పదముల యథోచితమైన కూర్పు సంఘటన యగుచున్నది. అదియే రచనాగరిమ. ఆయన సంఘటనను మూడు విధములుగా తెలిపెను— 1. సర్వదా సమాస రహితము 2. మధ్యమ (అల్ప) సమాస లతో నలంకృత మగునది 3. దీర్ఘసమాస యుక్తము" 37.

ఆనందవర్ధనుడు గుణములను సంఘటనకు అన్వయింప రాదని తెలిపెను. ఏలన గుణములు నియత విషయత్వమును కలిగి యున్నవి. కాని సంఘటన అనియత విషయము దీర్ఘ సమాస రచన శృంగారమున కుపయుక్తము కావచ్చు! అట్లే రౌద్రమునకు కూడా. కావున గుణములు సంఘటన నాశ్రయించి యుండవని ఆయన తెలిపెను- సంఘటనను గురించి మూడు ముఖ్యాంశములను తెలిపెను- 1. సంఘటనకు మూలాధారము సమాసరచన 2. సంఘటన రసాశ్రితము . సంఘటన రసాభి వ్యక్తికి మాధ్యమము

ఆనందవర్ధనుడు సంఘటనా నియామక తత్త్వములను ఔచిత్య ప్రాతిపదిక పై ర్పరచెను. కవి తనఅభీష్ట విషయమున కనుగుణంగా సంఘటనను(కావ్యశైలిని) ర్పరచుకొన వచ్చును- ఐనను సంఘటన గరిమావంతముగా నుండవలయునన్న కవి ఔచిత్య దృష్టిని వహించి జాగరూకుడై యుండుట ఆవశ్యకము. కావ్యశైలి (సంఘటన) సాధనయందు కవి తీసికొన వలసిన జాగ్రత్తలను ఆనందవర్ధనుడు నాలుగు సంఘటనా నియామక తత్త్వములుగా వివరించెను. అవి-

1. వక్తృ ఔచిత్యము- ఇది రచయిత స్వభావముతో శైలికి కల సంబంధమును నిరూపించును. వక్త కవి కావచ్చు లేక కవి నిబద్ధపాత్ర కావచ్చు. కవి నిబ పాత్ర రసభావదృష్టితో రెండురకములు- రసభావ సహితుడు రసభావ రహితుడు రసము కథానాయకుడు, ప్రతినాయకుడు, నాయిక. పీఠమర్దుడు- వీరి అంద యందు ఉండవచ్చును. కవి లేదా అతని పాత్రి రసభావ రహితుడైనచో సం టనా నియమములందు స్వతంత్రుడు- రసభావ సహితుడైనచో సంఘటన స స యుక్తమో లేక సమాసరహితమో అయి యుండవచ్చును కరుణ, శృంగార లకు సమాస రహిత సంఘటన ఉపయుక్తము.'' 38

2. విషయ ఔచిత్యము- కావ్యరూపములను దృష్టి యందుంచుకొని కవి సంఘ నేర్పరచు కొనుటకు ఇది సంబంధితము. ఏ సంఘటన ద్వారా తను ఎం న్న కావ్యరూపము సుబోధ గమ్యమగునో ఆ సంఘటననే (శైలినే) కవి అవ బింప వలయును. 39.

3. వాచ్య ఔచిత్యము- ఇది చాలా ముఖ్యమైనది. ఏలన వాచ్యము లేదా క వస్తువు సైతము అనేక విధములుగా నుండును. ఒకానొక కావ్యవస్తువు ధ్వని

రసమునకు లేదా రసాభాసమునకు అంగము కావచ్చును. మరొకటి అభినయయోగ్యము కావచ్చు; లేదా కాకపోవచ్చును. అట్లే కొన్ని కావ్యములు ఉత్తమ ప్రకృతికి మరికొన్ని అధమ ప్రకృతికి సంబంధించి యుండవచ్చును. కనుక రచయిత విభిన్న సాహిత్య రూపముల కనుగుణమైన సంఘటనా రూపముల నేర్పరచుకొన వలయును. 40.

4. రస ఔచిత్యము- కవి ఏరసమును ప్రధానముగా నెంచుకొని యుండునో ఆ రసమున కనుకూలమైన శైలిని అవలంబించ వలయును. రస బంధమునందు ఔచిత్యము నాశ్రయించు శైలి సర్వదా శోభించును. విషయ భేదము ననుసరించి అందు కొంత మార్పు సంభవము. 41.

ఇంతవరకు లాంజినస్ ప్రతిపాదించిన ఔదాత్య సిద్ధాంత దృష్టితో ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతము సంగ్రహముగా వివేచింపబడినది. ఈ యిరువురు సాహిత్యాచార్యులు ప్రతిపాదించిన కావ్యసిద్ధాంతములందు, కనబరచిన కావ్యదృక్పథము యందు, కానవచ్చు సామ్యత నిట్లు క్రోడీకరింప వచ్చును. ఔదాత్యసిద్ధికై లాంజినస్ ఏర్పరచిన ఐదు తత్త్వములు ఆనందవర్ధనుని 'ధ్వని' విషయిక ఐదు అర్థములతో సామ్యతను కలిగి యుండుట విశేషము.

| లాంజినస్ | | ఆనందవర్ధనుడు |
|---|---|---|
| 1. ఉదాత్త చింతన<br>Grandeur of thought | —> | రసధ్వని<br>Rasa Dhvani or poetic work containing snggestible |
| 2. ఉత్కట భావావేశము<br>Capacity for strong emotion. | —> | వ్యంజక అర్థము<br>The power to convey the suggestible meaning. |
| 3. సముచిత అలంకార ప్రయోగము<br>Appropriate use of figures. | —> | వ్యంగ్య అర్థము<br>The suggestible meaning. |
| 4. భాషాగరిమ<br>Dignity of language. | —> | వ్యంజక శబ్దము<br>The conventional symbol the articulate sound. |
| 5. రచనా గరిమ<br>Dignity of composition. | —> | వ్యంజనా వ్యాప్తి<br>The conventional meaning. |

కావ్య ఔదత్యము. రసధ్వని కావ్యము- రెండును అత్యంత గంభీరమైన కావ్యచింతనకు పరిణామములు. అందువలన ఈ రెండింటి యందు పర్యాప్త సామ్యత కానవచ్చును. ఐనను ఆనందవర్ధనుడు 'ధ్వని'ని కావ్య ఆత్మతత్త్వముగా ప్రతిపాదించినట్లు, లాంజినస్ 'ఔదాత్య సిద్ధాంతము'ను అన్వయింపలేక పోయెను. ఆయన ప్లేటో కావ్యచింతనచే ప్రభావితుడై కావ్య ఉదాత్తతను నిరూపింప దలచెను. అందువలన ఆయన అరిస్టాటిల్ కావ్యశాస్త్ర మందు నిరూపించిన కళాత్మక నైపుణ్యమును ఔదాత్య సిద్ధాంతమున కన్వయింప లేకపోయెనని భావింవ నచ్చును. అట్లే జరిగి యున్నచో లాంజినస్ ఔదాత్య సిద్ధాంతము, భారతీయ సాహిత్యశాస్త్ర మందు ధ్వని సిద్ధాంతమువలె, అత్యధిక ప్రసిద్ధిని గడించి యుండెడిది; ధ్వని సిద్ధాంతముతో సరితూగు స్థాయికి చేరి యుండెడిది.

ఇక ఆనందవర్ధనుడు వివరించిన ఇతర కావ్యాంగములను పరిశీలింతము.

## గుణములు - Qualities.

ఆనందవర్ధనుడు గుణములను రస ధర్మములుగా నిరూపించి వాని సంఖ్యను పరిమితము కావించెను-

'తమర్థ మవలంబంతే యే అంగినం తే గుణాః స్మృతాః (ద్వితీయోద్యోతము) -కావ్యమునకు అంగభూతమైన రసమున కాశ్రితములై యుండునవి గుణములు.

భామహునివలె ఆనందవర్ధనుడు మాధుర్యము, ఓజము, ప్రసాదములను అంగీకరించి గుణ సంఖ్యను పరిమితము కావించెను; వానిని రస ధర్మములుగ పరిగణించెను. ''రస మెచ్చట యుండునో గుణము లచ్చట యుండును. గుణము లెచ్చట యుండునో రస మచట యుండును.''

1. మాధుర్య గుణము- శృంగారము సర్వాధిక ఆనందదాయక రసము. ఆ రసమయ కావ్యమున కాశ్రితమగునది మాధుర్య గుణము. ప్రహ్లాదమునకు హేతు శృంగారము. శృంగార రసరూప భావము వ్యక్తీకరించు శబ్దార్థ యుక్తమైన కా గుణము మాధుర్యము. విప్రలంబ శృంగార, కరుణ రసముల ద్వారా మాధుర్య గుణము ఉత్కర్ష మొందును. 42.

2. ఓజో గుణము- కావ్య మందలి రౌద్రాది రసముల దీప్తి (చిత్త విస్తార రూప మగు రౌద్రాది రసములందు అనుభూయ మానమగు విశేష చిత్తావస్థ) ద్వారా లక్షితమగుచుండును. తదభివ్యంజక శబ్దము మరియు అర్థమునకు ఓజోగుణము ఆశ్రిత మగును.

"సామాజికుని హృదయ విస్తారము లేదా ప్రజ్వలన స్వభావము యొక్క అవస్థా విశేషము దీప్తి యను నామమున వ్యవహృత మగును. అదియే ముఖ్యముగా ఓజ శబ్దమునకు వాచ్యమగును దాని సంబంధము వలన తదాస్వాదమయ రౌద్రాది రసములు సైతము లక్షణ ద్వారా దీప్తి శబ్దముచే గృహీత మగును '' 43.

3 ప్రసాద గుణము- సమస్త రచనలయందు మరియు రసములయందుండునది ప్రసాద గుణమని గ్రహింప వలయును. ఇది అన్ని రసములతో సంబంధమును కలిగియున్నది ఇది లేనపుడు రసము లన్ని నీరసములే యగును. కావున నీ ప్రసాద గుణము రసములకు పురస్కరించుకొనియే ముఖ్యముగా గుణమగును. శబ్దార్థములు ప్రసన్నములను వ్యవహారము రస వ్యంజకత్వ వశమున నుపచరిత మని స్పష్టమే కదా '' 44.

## దోషములు - Defects.

ఆనందవర్ధనుడు దోషములను ఆత్మ (రస) పరములుగా నిర్ణయించెను. కావ్య దోషములకు మూలకారణములు రెండు- 1. అవ్యుత్పత్తి 2. అశక్తత. ఈ కారణముల ననుసరించి కావ్య దోషములు రెండు రకములు. 1. కవి అవ్యుత్పత్తి కృతము (అనిత్యము) 2. కవి అశక్తికృతము (నిత్యము). ఆనందవర్ధనుడు వీనిని గురించి ఇట్లు తెలిపెను-

'అవ్యుత్పత్తి కృత దోషములు ప్రతిభా శక్తిచే అచ్ఛాదితము లగుట వలన నవి గోచరింపవు. కాని అశక్తికృత దోషములు తమంతట తామే తొందరగా బహిర్గతము లగును.'' 45. కావున కవికి ప్రతిభయే ప్రధానము. తద్వారా సామాజికుని రసాస్వాదనకు భంగము కలుగకుండునట్లుగా కావ్యవస్తువును తీర్చిదిద్దగలడు. దీనినే ఔచిత్య మందురు- ఔచిత్యమునకు మించిన వేరే రసభంగ కారణములేదు. ఔచిత్యానుసరణమే రసపోషణకు పరమావశ్యకమైన విధానము. ఇది కవులకు రసోపనిషతు '' 46.

రసమునకు విఘాతమును కల్గించునవి దోషములు. ఇవి నిత్య దోషములు.
శ్రుతి దుష్టాది (శ్రుతి దుష్టము, అర్థ దుష్టము, కల్పనా దుష్టము) దోషములని
త్యములు "ఒక సందర్భములో దోషమైయుండి మరియొక యెడ గుణముగా పరిణ
మించునది అనిత్యదోషము. అన్ని స్థలములలోను దోషమేయైనది నిత్యదోషము.
మాట వరుసకు శ్రుతి దుష్టమును తీసికొందము. అది శృంగార రసములో పరుష
వర్ణము లుచితములే కావు గనుక దోషము. వీర, రౌద్రాదులలో అట్టి పరుష వర్ణ
ములు లుచితములే. కావున అది శ్రుతి దుష్టము కాదు. ఇట్లు ఒకచో గుణముగా
భాసించునది అనిత్య దోషము. చ్యుత సంస్కారాది దోషములు కొన్ని యెడల గు
ణములుగా భాసించుట సంభవింపదు. కావున అవి నిత్యదోషములు. రస భంగ
ములుగా తెలుపబడిన దోషములే నిత్య దోషములు. అవి సర్వదా పరిహార్యములు.
ఆనందవర్ధనుడు నిత్య దోషములను ఐదు రకములుగా తెలిపెను." 47.

1. విరుద్ధ రసభావాది పరిగ్రహణము– వర్ణ్యరస విరోధియగు రసమునకు సంబం
ధించిన భావాదులను గైకొనుట. ఎట్లన వస్తుతః శాంతరస విభావములను తద్వి
భాగములను నిరూపించిన వెంటనే వానిని శృంగార రసవిభావములుగా వర్ణించుట.

2. అప్రస్తుత ప్రసంగము– ప్రకృత కథావస్తువుకు ఎట్లో యేదో విధమున కొం
చెము సంబంధించిన మాత్రమున ప్రకృత రస పోషకము కాని మరియొక వస్తు
వును విస్తరించి చెప్పుట. నాయకుని విప్రలంబ శృంగారమును వర్ణించుట కుః
క్రమించిన కవి యమకాద్యలంకారముల రచించు వ్యసనమున బడి పర్వతాదిత
వస్తు జాలమును గొప్ప ప్రబంధముచే వర్ణింప దొరకొనుట.

3. అసమయ విచ్ఛేదన ప్రకాశములు– అవసర మెరిగి రసము నుద్దీపింప జేయ
టయు, ప్రశమము నొందించుటయు రసాభివ్యక్తికి సాధనములు దానికి విరు
మిది. అసమయముననే రసమును విచ్ఛిన్న మొనర్చుటయును, ప్రకాశన మొ
ర్చుటయును– ఇవి రసభంగ మొనర్చి తీరును.

4. అంగిరసః పునఃపునరుద్దీపనము– విభావాను భావాది స్వ సామగ్రి వశమ
నుచితమగు పరిపోషణము నొందిన రసము ప్రభుక్తమైన తరువాత గూడా మ
మాటికినుద్దీపింప జేయుచున్నచో నది వాడిన పూవు వలె సొగసు దరుగు ననుట
సందేహ మేమున్నది ?

5. రస విరోధి వృత్త్యనౌచిత్యము- అలంకారముల నౌచిత్య మెరిగి కూర్చుట రస వ్యంజకము. దానికి విరుద్ధము వృత్తిఅనౌచిత్యము. వృత్త్యనౌచిత్య మన వ్యవహారా నౌచిత్యము. నాయిక తన కుచితమగు అంగి భంగి (వయ్యారము) లేకుండనే తనంతట తానే నాయకునితో సంభోగాభిలాషను తెలుపుట రస భంగము ఇక రెండవ విధము భరతశాస్త్ర ప్రసిద్ధములగు కైశిక్యాదులు కాని. కావ్యాలంకార ప్రసిద్ధములగు నుపనాగరికాదులు కాని, వృత్తిపదమున కర్థములనవచ్చును. వాని ననుచితమగు సందర్భమున గూర్చుటయు రసభంగ హేతువే యగును.'' 47.

ఆనందవర్ధనుని వలె లాంజినస్ దోషములను నిత్యము లనిత్యములని విభజింప లేదు ఐనప్పటికిని దోష నిర్ణయమందు కూడా ఈ యిరువురి ఆచార్యులయందు, ప్రతిపాద్య సిద్ధాంతము లందువలె, సామ్యత కానవచ్చును లాంజినస్ తెలిపిన అస్తవ్యస్తభాష, సంక్షిప్త ఉక్తి, శబ్దాడంబరములను దోషములను అనిత్య దోషములుగా పరిగణింప వచ్చును. ఇక మిగిలినవి నిత్య దోషములు. వానియందలి సామ్యత నిట్లు గుర్తింపవచ్చును.

| ఆనందవర్ధనుడు | | లాంజినస్ |
|---|---|---|
| 1. విరుద్ధరస భావముల చిత్రణ | —> | భావాడంబరత |
| 2. అప్రస్తుత ప్రసంగము | —> | చమత్కార వ్యామోహము |
| 3. అసమయ విచ్ఛేదన ప్రకాశనములు | —> | అల్పతర అభివ్యక్తి |
| 4. అంగిరస పునః పునరుద్దీపనము<br>రస విరోధి వృత్త్య నౌచిత్యము | —> | అల్పతర చిత్రణ. |

## కావ్య హేతుపులు – Poetic equipments.

భామహుడు మొదలుకొని జగన్నాథుని వరకు భారతీయ సాహిత్యాచార్యులు ప్రతిభను ప్రధాన కావ్యహేతువుగా, వ్యుత్పత్తిని సహాయకముగా గుర్తించిరి. కావ్య సృజనాత్మక ప్రక్రియ యందు కవి ప్రతిభానంత్యమును నిరూపించిన ప్రథమాచార్యుడు ఆనందవర్ధనుడు. ఆయన ధ్వన్యాలోకమునందు ఈ క్రింది ప్రశ్నలను లేవదీసెను.

1. ప్రతిభకు నివాస మెచట? 2. ప్రతిభ నిర్వహించు కార్య మెట్టిది? 3. ప్రతిభా లోపము వలన కావ్యమునకు వాటిల్లు దోష మెట్టిది? 4 ప్రతిభ ద్వారా కావ్యము

నకు సమకూరు ప్రయోజన మెట్టిది? 5. ప్రతిభ జన్మ జాతమా లేక సాధితమా?
ఆనందవర్ధనుడే స్వయముగా పై ప్రశ్నల కిట్లు సమాధాన మొసంగెను.

1. ఆస్వాదనీయమగు రమణీయ అర్థ తత్త్వమును ప్రవహింపజేయు మహాకవుల వాక్కు ప్రతిభకు నివాసము 2. వసంతర్తువు నందలి లతా గుల్మములవలె మొదట గ్రహింపబడిన అర్థమును సైతము నూతనశోభతో ప్రకాశింపజేయును. 3. ప్ర
భా హీనత వలన కవి అసమర్థత బహిరంగ మగును కావ్యమునకు రస దోషము
)త్య దోషము) వాటిల్లును. 4 కావ్య విషయము లేక కథా వస్తువు సహృదయా
దకారి యగును. 5. పూర్వజన్మ విశేషమున ఇది సిద్ధించును. సరస్వతీదేవి నూ
నార్థములను స్ఫురింప జేయును.

ఆనందవర్ధనుడు ప్రతిభను సహృదయ పాఠకునకు కూడా నిర్ణయించెను. ఆయన సహృదయ ప్రతిభా నైపుణ్యము పాఠకునకు అవశ్యకముగా ఇట్లు తెలిపెను— శబ్దశాస్త్రములను వల్లించిన మాత్రమున ఎవరును కావ్యార్థమును భావింపలేరు. కావ్య మర్మజ్ఞత కల వారే మహాకవుల వాక్కులద్వారా స్రవించు రస ధారలను గ్రోలు సమర్థులగుదురు. వ్యుత్పత్తిని గురించి ఇట్లు తెలిపెను "అవ్యుత్పత్తి మూలమున సంభవించు దోషము లన్నింటిని ప్రతిభ కప్పి పుచ్చును. ప్రతిభా లోపమున వాటిల్లు దోషములు స్వయముగా బహిర్గతము లగును." కావ్య వ్యుత్పత్తి స్థానము ప్రతిభ తరువాతిది.

కావ్య సృజనాత్మక విషయమున లాంజినస్, ఆనందవర్ధనుడు— ఈ యిరువురి దృక్పథము లందు భేదము కానరాదు. ఇరువురును ప్రతిభకు ప్రథమ స్థానమును వ్యుత్పత్తికి ద్వితీయ స్థానము నొసంగిరి.

లాంజినస్, ఆనందవర్ధనుడు— ఈ యిరువురు సాహిత్యాచార్యులు ప్రతిపాదించిన సాహిత్య సిద్ధాంతము లందు సామ్యత కలదు. ఇరువురును సాహిత్యము ద్వారా ఉదాత్తమైన రసానుభూతినే ఆశించిరి. ఇరువురును సాహిత్య సౌందర్యమును అతిలోక రమణీయముగా, రసలోక వాహకముగా ప్రతిపాదించిరి. ధ్వనిసిద్ధాంత నిరూపణమందు ఆనందవర్ధనుడు ప్రదర్శించిన అపార పాండితీ వైభవమును మౌలిక ప్రతిభను ఔదాత్య సిద్ధాంత నిరూపణమందు లాంజినస్ ప్రదర్శింపలేక పోయెను. ఒకరు కావ్య ఆంతరిక, బాహ్య తత్త్వముల సూక్ష్మాతిసూక్ష్మ వివేచ

మందు అప్రతిమ కావ్యశాస్త్ర పారీణతను ప్రదర్శింప, మరొకరు కావ్య ఆంతరిక, బాహ్య తత్త్వములను స్పర్శించిరే కాని వాని కళాత్మక సమన్వయమును సాధింప లేక పోయిరి

పాశ్చాత్య సాహిత్య మీమాంసకుల వలె ఆధునిక భారతీయ సాహిత్యాచార్యులు లాంజినస్‌ను ఇట్లు ప్రశంసించిరి—

"భాష యందు మాధుర్య, ప్రసాద, ఓజో గుణములను భారతీయ రీతి సంప్రదాయానుయాయులు సమర్థించిన విధముగా లాంజినస్ ఔదాత్య సిద్ధాంతమును ప్రతిపాదించెను. అనుభూతి తీవ్రతను వ్యక్తీకరించుటయే భాషకు లక్ష్యమని, మిగిలిన నియమము లన్నియు అసమగ్రములును, అసంపూర్ణములని లాంజినస్ తెలిపెను." —డా॥ నగేంద్ర.

"లాంజినస్ ప్రతిపాదించిన ఔదాత్య వ్యాపక స్వరూపము మనకు అనుపయుక్తముగను, ఆరోపితముగను తోచవచ్చును. దానిని మనము అంగీకరింప కున్నను కావ్యమందు ఉదాత్తభావ పరిపోషణకు ఔదాత్యమును మనము ఒక ప్రముఖ అంగముగా గ్రహింపవచ్చును. కళ మరియు కావ్యమునకు సౌందర్యము లేదా ఆకర్షణ ప్రధాన గుణము. ఈ సౌందర్య ధర్మము ఓదాత్యగుణ సంపన్నమైనచో కళ ఒక మహత్తర కళగా, మరియు కావ్యము ఉదాత్త కావ్యముగా రాణింపగల దనుటలో సందేహం లేదు." 49. —డా॥ గణపతిచంద్ర గుప్త.

"ఉదాత్త విషయములు చిత్రించ గలిగినవారే మహాకవి కోటిలోకి ఎస్తున్నారు. అయితే ఈ ఉదాత్త ధర్మమే ఉత్తమ కావ్య లక్షణ మంటే బాగున్నట్లే ఉంది కాని దీనికి కూడా ఎన్నో బాధకాలు ఉన్నవి" 50. —నోరి నరసింహశాస్త్రి.

---

## అధోజ్ఞాపికలు – Foot Notes.

1. Sublimity consists in a certain distinction and consummate excellence in expression and it is from this and no other source that the greatest poets and prose writers have gained their eminence and immortal fame.
2. The effect of lofty passage is not to convince the reason of a reader but to transport him out of himself.

3. The sublime acting with an imperious and irresistible force sways every reader whether he will or not.

4. Sublimity flashing forth at the right moment scatters every thing before it like a thunderbolt and at once displays the power of an orator in all the plentitude

5. Sublimity is so to say the image of greatness of soul ...true eloquence can be found only in those whose spirit is generous and aspiring. For those whose whole lives are wasted in paltry and illiberal thoughts and habits can not possibly produce any work worthy of the lasting reverence of mankind. It is only natural that their words be full of sublimity whose thoughts are full of majesty.

6. I would confidently pronounce that nothing is so conducive to sublimity as an appropriate display of genuine passion, which bursts out with a kind of 'fine madness' and divine inspiration, and falls on our ears like the voice of God.

7. In general we may regard those words as truly noble and sublime which always please and please all readers, for when the same book always produces the same impression on all who read it, whatever be the difference in their pursuits, their manner of life, their aspirations, their ages, or their language, such a harmony of opposite gives irresistible authority to their favourable verdict.

8. Tends to raise suspiction in the mind of reader .....that the speaker is treating him like a silly boy and trying to outwit him.

9. For just as all dim lights are extinguished in the blaze of the sun, so do the artifices of rhetoric fade from when bathed in the pervading splendour of sublimity

10. To invest petty affairs with great and high sounding names would seem just like putting a full-size tragic mask upon a child.

    If the elements of granduer be seperated from one another, the sublimity is scattered and made to vanish but when organized into a compact system and still further encircled in chain of harmony, they gain a living voice by being merely rounded.

12. All these ugly and parasitical gowths in literature arise from a single cause, that pursuit of novelty in the expression of ideas which may be regarded as the fashionable craze of the day. Human blessings and human ills commonly flow from the same source and, to apply this principle to literature, those ornaments of style, those sublime and delightful images, which contribiute to success, are the foundation and origin, not only of excellence, but also of failure.

13. Such abuse of rhythm is sure to savour coxcomery and petty affectation, and grows firesome in the highest degree by a monotonous sameness of tone- But is worst effect is that, as those who listen a ballad have their attention distracted from its subject and can think of nothing but the true, so an over-rythmical passage does not affect the hearer by the meaning of its words, but merely by their cadence, so that sometime, knowing where the pause must come, they beat time with the speaker, striking the expected close like the dancers before the stop is reached.

14. Deformity istead of grandeur ensues from over-compression, here I am not referring to a judicious compactness of phrase but to a style which dwarfed and its force filtered away. To cut your words too short is to prune away fheir sense, but to be concise is to be direct.

15. In our sublimer efforts we should never stop to what is sordid and despicable, unless very hard - pressed by some urgent necessity.

16 It necessary follows, therefore, that one cause of sublimity is the choice of the most striking circumstances involved in whatever we are describing, and further, the power of afterwards combining them into one animate whole .....The reader attracted partly by the selection of the incidents, partly by the skill which has welded them together.

17 The dignity, grandeur and energy of a style largely depend on a proper employment of images.

18. It is good for us too, when we are working at some object which demads sublimity of thought and expression, to have some idea in our minds as to how Homer might have expressed the same thought, how Plato or Demosthenes would

have raised it to sublime or, in history Thyeydides. Emulation will bring th0se great examples before our eyes, illuminating our path and lifting up our souls to the high standered of perfection imaged in our minds.

19. జయశంకర్ ప్రసాద్ – కావ్య ఔర్ కళా.

20. 'తతో వృక్షస్థానీయం కావ్యమ్, తత్ర పుష్పాదిస్థానియోఽభినయాది నట వ్యాపారంః, తత్రఫల స్థానీయం సామాజిక రసాస్వాదః తేన రసమయమేవ విశ్వమ్. –అభినవ భారతీ.. 1. 294.

21. కావ్యం హృదయ సంవాది సత్య ప్రత్యయ నిశ్చయాత్ ।
తత్త్వోచితాభిధానేన యాత్యుపాదేయతాం కవేః॥ –ఔచిత్య విచారచర్చ. 30.

22. యత్రార్థ శబ్దోవా తమర్థ ముప సర్జనీకృత స్వార్థౌ।
వ్యంక్తః కావ్యవిశేషః సధ్వనిరితి సూరిభిః కథితః॥ –ధ్వన్యాలోకము. 1.13
'యత్రార్థో వాచ్యవిశేషో వాచక విశేషః శబ్దోవా తమర్థమ్
వ్యంక్తః స కావ్య విశేషో ధ్వనిరితి''
''యోఽర్థః సహృదయ శ్లాఘ్యః కావ్యమేతి వ్యవస్థితః ।
వాచ్య ప్రతీయ మానాఖ్యౌ తస్య భేదావుభౌ స్మృతౌ ॥ Ibid 1.2
''కావ్యస్యహి లలితోచిత సన్నివేశ చారుణః శరీరస్యే వాత్మా
సారరూప తయా స్థితః సహృదయ శ్లాఘ్యయోఽర్థః
తస్య వాచ్యః ప్రతీయ మానాశ్చేతి ద్వౌ భేదౌ''
తత్రవాచ్యః ప్రసిద్ధోయః ప్రకారై రుపమాదిభిః
బహుదా వ్యాకృతః సోఽన్యైః'' -Ibid.

3. ఆంధ్ర ధ్వన్యాలోకము- P. 15.

4. ఆలోకార్థీ యథా దీపశిఖాయాః యత్నవాన్ జనః।
తదుపాయ తయా తద్వదర్థే వాచ్యే తదా దృతః॥ -I bid 1.9

5. ఆంధ్ర ధ్వన్యాలోకము – ప్రథమోద్యోతము.

6. 'సర్వత్ర శబ్దార్థయోరుభయోరపి ధ్వనన వ్యాపారంః స కావ్య విశేష ఇతి। అర్థోవా శబ్దోవా। అర్థోపి వాచ్యోవా ధ్వనతీతి శబ్దో అపి ఏవం వ్యంగ్యోవా ధ్వన్యత ఇతి । వ్యాపారోవా శబ్దార్థయోః ధ్వనన యితి కారికయా తు ప్రాధాన్యేవ సముదాయ ఏవం వాచ్యరూప ముఖతయా ధ్వనిరితి ప్రతిపాదితమ్'
-I bid.

27. ప్రతీయమానం పునరన్యదేవ వస్త్వస్తి వాణీషు మహా కవీనామ్।
యత్తత్ ప్రసిద్ధావ యవాది రిక్తః విభాతి లావణ్య మివాంగనాసు ॥
-1bid 1.4

28. సరస్వతీ స్వాదు తదర్థవస్తు నిష్యందమానా మహతాం కవీనామ్॥
అలోకసామాన్య మభివ్యనక్తి పరిస్ఫురంతం ప్రతిభా విశేషమ్॥ -I bid. 1.6

29. ఆంధ్ర ధ్వన్యాలోకము- p.p. 408- 478- 487.

30. 1 bid pp. 662- 664

31. కావ్య స్వరూపమ్ - P. 82.

32. ఇహ తత్త్వ జ్ఞానమేవ తావన్మోక్ష సాధన మితి తస్యైవ మోక్షస్థాయితా యుక్తా తత్త్వజ్ఞానంచ నామ ఆత్మజ్ఞానమేవ, తేన ఆత్మైవ జ్ఞాన నందాది విశుద్ధధర్మ యోగీ పరికల్పిత విషయోపభోగ రహితోఽత్ర స్థాయీ।
"భావ వికారా రత్యాద్యా శాంతస్తు ప్రకృతిర్మతః
వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవ లీయతే
స్వం స్వం నిమిత్త మాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే
పునర్నిమిత్తా పాయేతు శాంతాద్భావః ప్రవర్తతే
శమూర్థం సర్వశాస్త్రాణి నిర్మితాని మనీషిభిః
తస్మాత్స సర్వశాస్త్రజ్ఞః యస్య శాంతం మనస్సదా"
-కావ్యాలంకార సంగ్రహము. PP 301 - 302.

33 'క్షణభంగిని జంతూనాం స్ఫురితే పరిచింతితే
మూర్ధాభిషేకః శాంతస్య ర స్యాత్ర విచార్యతాం
తద మందర రస స్యంద సుందరేయం నిపీయతాం
శ్రోత్ర శుక్తి పుటైః స్పష్టమంగ। రాజ తరంగిణీ'

34. వివక్షా తత్పరత్వేన నాంగిత్వేన కదాచన।
కాలేచ గ్రహణ త్యాగౌ నాతి నిర్వహణైషితా ॥
నిర్వ్యూఢాపి చాంగత్వే యత్నేన ప్రత వేక్షణామ్।
రూపకాది రలంకారవర్గ స్యాంగత్వ సాధనమ్ ॥
-ధ్వన్యాలోకము- ద్వితీయ. 18-19.

35. సుప్, తిజ్ఞ్, వచన సంబద్ధైస్తదా కారక శక్తిభిః।
కృత్, తద్ధిత సమాసైశ్చ ద్యోత్యోఽలక్ష్యక్రమ క్వచత్॥ -Ibid III- '6.

36 అసం లక్ష్యక్రమో ధ్వనేరాత్మా రసాదిః సుబ్బి సిశేషైః- తిజ్ఞ్ విశేషైః, వచన విశేషైః, సంబంధ విశేషైః, కారకశక్తిభిః కృత్ విశేషైః.

తద్ధిత విశేషైః, సమాసైశ్చేతి । చ శబ్దాన్నిపాతో పసర్గ కాలాదిభిః
ప్రయుక్తై రభివ్యజ్య మానో దృశ్యతే. –I bid.

37. అసమాసా సమాసేన మాధ్యమేవ భూషితా ।
తథా దీర్ఘ సమాసేతి త్రిధా సంఘటనో దితాః॥ –Ibid. 3.5

38. I bid. 3 6

39. విషయాశ్రయ మన్య న్యదౌ చిత్యం తాం నియచ్ఛతి ।
కావ్య ప్రభేదాశ్రియతః స్థితా భేదవతీ హి సా ॥ –I bid. 3.7

40. వాచ్యం ధ్వన్యాత్మ రసాంగ, రసవిభాసాంగవా, అభినేయార్థమ్,అభినేయార్థ
ఉత్తమ ప్రకృతి-శ్రియః తదితరాశ్రియంవేతి బహుప్రకారమ్ -Ibid 3.6.

41. రస బంధోక్త మౌచిత్యం భాంతి సర్వత్ర సంశ్రితా।
రచనా విషయాపేక్షం తత్తు కించిత్ విభేదవత్॥ –Ibid. 3.9.

42. శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః।
తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్య ప్రతిష్టతి॥ -Ibid 2.7.
శృంగారే విప్రలంభాఖ్యే కరుణేచ ప్రకర్షవత్ ।
మాధుర్య మార్ద్రాతాం యాతి యతస్త్రాధికం మనః॥ –Ibid. 2.8

43. రౌద్రాదయో రస దీప్త్యా లక్ష్యంతే కావ్యవర్తినః।
తత్ వ్యక్తిహేతూ శబ్దార్థ వాశ్రిత్యోజో వ్యవస్థితమ్॥ –Ibid 2.9.

44. సంపర్కత్వం కావ్యస్య యత్తు సర్వరసాన్ ప్రతి।
స ప్రసాదో గుణోజ్ఞేయం సర్వ సాధారణ క్రియః॥ –Ibid. 2.10.

45. అవ్యుత్పత్తి కృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః
యస్త్వ శక్తి కృతస్తస్య స ఝటిత్యేవ భాసతే॥ –Ibid 3.6,
అనౌచిత్యాదృతే నాన్యద్ రస భంగస్య కారణమ్।
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్ పరా॥ –Ibid 3.14.
విరోధి రస సంబంధి విభావాది పరిగ్రహః విస్తారేణాన్విత
స్యాపి వస్తునోఽన్యస్య వర్ణనమ్, అకాండ ఏవ విచ్ఛిత్తిరకాండే
చ ప్రకాశనమ్ పరిపోషం గతస్యాపి పౌన పున్యేన దీపనమ్
రసస్యస్యాద్ విరోధాయ వృత్త్యానౌచిత్య మేవచ. –Ibid. 3.19.

48 డా॥ నగేంద్ర - పాశ్చాత్య కావ్యశాస్త్ర కీ పరంపరా.

49. డా॥ గణపతి చంద్రగుప్త – భారతీయ ఏవం పాశ్చాత్య కావ్య సిద్ధాంత్.

50. సారస్వత వ్యాసములు. – P. 32. ○

# తృతీయోద్యోతము - The Third Flash

# అనుగమన
# The Following

## 1

## భూమిక - The Prelude

ప్రాచీన కాలము నుండి ప్రచారములోనున్న సాహిత్య విషయిక ఆలోచలను సూత్రబద్ధము కావించి భావి సాహిత్యశాస్త్ర వికాసమునకు మార్గదర్శకముగా నిలిచిన గ్రీకు సాహిత్య శాస్త్రము లాంజినస్ ఔదాత్య సిద్ధాంత ప్రతిపాదనతో ముగియుచున్నది. అందువలన లాంజినస్ గ్రీకు సాహిత్యశాస్త్రమునకు అంతిమ ఆచార్యుడు. తరువాతి ఆచార్యుల సాహిత్యాలోచన పూర్వాచార్యుల సూత్రీకరణకు వ్యాఖ్యానాత్మక రూపమున అనుగమన మాత్రమైయున్నదే కాని స్వతంత్ర కావ్యశాస్త్ర రచనగా రాణింపలేక పోయింది. గ్రీకు సామ్రాజ్య విచ్ఛిత్తియే గ్రీకు సాహిత్యశాస్త్ర పురోగమనమునకు ప్రధాన అవరోధకముగా పేర్కొనవచ్చును తదనంతరం పాశ్చాత్య సాహిత్యశాస్త్ర చరిత్రయందు ప్రధానముగా కానవచ్చునది హోరేస్ లాటిన్ భాష యందు రచించిన 'కావ్యకళ'. కనుక హోరేస్‌తో రోమన్ సాహిత్యశాస్త్ర మారంభ మగుచున్నది. ఈ రచన సైతం గ్రీకుసాహిత్యాచార్యుల సూత్రీకరణకు అనుగమనమైయుండియు,మౌలికమైన కావ్యసిద్ధాంతమును దేనిని కూడా ప్రతిపాదించలేక పోయినప్పటికిని కొన్ని శతాబ్దముల వరకు పాశ్చాత్య సాహిత్య జగత్తునందు తలమానికముగా ప్రసిద్ధి నొందినది. ప్రథమ రోమన్ లాక్షణిక గ్రంథమైన 'కావ్యకళ' రచనకు భూమికగా నిలిచియున్న ఆనాటి కావ్యశాస్త్ర స్థితిని, యుగ పరిస్థితులను ఈ అధ్యాయ మందు పరిశీలింతము.

## అలెగ్జాండ్రియా - Alexandria.

ప్రాచీన గ్రీకు సాహిత్యమందు అస్తవ్యస్తముగా ప్రచారంలోనున్న కావ్య చింతనకు శాస్త్రీయతారూపమును సంతరించిన మహనుభావులు ముప్వురు- ప్లేటో, అరిస్టాటిల్ మరియు లాంజినస్. ఈ మూర్తిత్రయముద్వారా పరిణిత రూపమును సంతరించుకొన్న గ్రీకు సాహిత్యశాస్త్రము తరువాతి యుగమున నూతన సిద్ధాంతములను చేర్చుకొని వికసింపవలసి యుండెను. కాని అట్లు జరుగలేదు. అనుగమన రూపమున నిలిచిపోయినది.

ప్రపంచమందలి చాలా భాగమును- పారసీకము, ఈజిప్టు, బాబిలాన్, ఆఫ్ఘనిస్తాన్, బెలుచిస్తాన్, సింధునది ప్రాంతము- జయించి గ్రీకు నాగరికతను ఎల్లెడల వ్యాపింపజేయ యత్నించిన ప్రపంచ విజేత అలెగ్జాండర్ క్రీ.పూ. 323లో, తన ముప్పది మూడవయేట బాబిలాన్ నగరమున పరమపదించెను. తరువాత గ్రీకు సామ్రాజ్యము విచ్ఛిన్నమయ్యెను. రెక్కలు విచ్చిన పక్షివలె మరల విద్వేషానలము ప్రజ్వరిల్లెను. అలెగ్జాండర్‌ను ఏవగించుకొన్న ప్రజానీకము అరిస్టాటిల్ పై పగదీర్చుకొనుటకు యత్నించెను. మెసిడోనియా ప్రాభవమునకు విరోధులైన ఎథీనియన్ పక్ష ప్రముఖులు నిందించిరి. సోక్రటీస్‌ను నిలువునా బలిగొన్న ఏతెన్స్ రాజనీతిని రాజనీతిజ్ఞుడైన అరిస్టాటిల్ మరచిపోలేదు. తత్త్వమునకు వ్యతిరేకముగా ప్రజలు మరోసారి ఉపద్రవమును తలపెట్టుట కనువైన అవకాశమును నేనీయను యను అంతిమ వాక్యముతో అద్వితీయ ప్రవక్త... తన జ్ఞాన సాహిత్యమునంత అటనే వదలి ఏతెన్స్ నుండి పారిపోయెను యూబియా దీవిలో నుండిన కాల్సిస్ నగరమునకు పోయి అటనే క్రీ.పూ. 322 లో దివంగతుడయ్యెను. అరిస్టాటిల్ రచనలన్నింటిని ఆతని శిష్యప్రవరుడును, రోడ్ రాజైన ఆండ్రోనికస్ రాడ్' నగరమందలి సెప్సిస్ గుహయందు భద్రపరచెను. దాదాపు రెండు శతాబ్దములపాటు అరిస్టాటిల్ జ్ఞానసాహిత్యము మరుగున పడిపోయెను. క్రీ.పూ 86లో జనరల్ మారియస్ మరుగుపడిన అరిస్టాటిల్ రచనల వెలికితీసి రోమ్ నగరమునకు కొనిపోయెను.

అలెగ్జాండర్ తను జయించిన ప్రతి దేశమునందు పట్టణముల నిర్మించి తన సేనాపతులను ప్రతినిధులగా నుంచెను. కాని ఆ మహనీయుని మరణానంతరం

అతడు స్థాపించిన సామ్రాజ్యము నంతటిని శాసించు సమర్థులెవరును లేకపోయిరి. అలెగ్జాండర్ సామ్రాజ్యము యూరప్. ఆసియా, ఆఫ్రికాలలో మూడు ప్రధాన భాగములుగా చీలిపోయినది అలెగ్జాండర్ సేనా నాయకులు ముగ్గురు ఈ మూడు ఖండములకు పాలకులైరి. యూరపు ఖండము నందలి మెసడోనియాకు అన్టిగనస్ అధిపతియయ్యెను ఆసియలోని పూర్వ పర్షియాకు సెల్యూకస్ పాలకుడయ్యెను. ఆఫ్రికా ఖండములోని ఈజిప్టుకు 'టోలమీ' అధిపతి యయ్యెను. ఈయన అలెగ్జాండర్ అనుయాయులైన మెసిడోనియన్ నాయకులలో చాలా తెలివైన వారిలో ఒకడు. ఈజిప్టులో వంశ పారంపర్యపు హక్కుగల ఒక రాజవంశానికి ఈ టోలమీ మూలపురుషుడయ్యెను. ఈ వంశపు రాజులందరికిని టోలమీలను పేరు వచ్చెను. టోలమీ వంశజులు అలెగ్జాండ్రియా రాజధానిగా ఈజిప్టు దేశమును దాదాపు మూడు దశాబ్దములు పాలించిరి అలెగ్జాండ్రియా ఈజిప్టు దేశమునకు ఉత్తర తీరమున నున్న ఒక ప్రాచీన రేవు పట్టణము. ఇట క్రీ.పూ. 332లో అలెగ్జాండర్ నగరము నిర్మించెను. అందువలన అది అలెగ్జాండ్రియాగా ప్రసిద్ధి నొందెను. ఆనాడు అలెగ్జాండ్రియా గొప్ప విజ్ఞాన కేంద్రమయ్యెను. ఇట నుండియే హెల్లెనిస్టు యుగము ప్రారంభ మగును.

టోలమీ వంశస్థాపకుడైన మొదటి టోలమీ (B C 32 3- 285) ప్లేటో మరియు ఆరిస్టాటిల్ స్థాపించిన ఎథీనియా విద్యాసంస్థల పద్ధతులలోనే 'అలెగ్జాండ్రియా చిత్రిపస్తు ప్రదర్శనాలయము' నేర్పాటు చేసెను. ఇది అలెగ్జాండ్రియ గ్రంథాలయముగా సుప్రసిద్ధము. ఇందు మొదట గ్రీకు వాఙ్మయమునకు సంబంధించిన గ్రంథములే యున్నను క్రమక్రమముగా విదేశీ వాఙ్మయ గ్రంథములు కూడా చేర్చబడెను. టోలమీ ఫిలడాల్ఫస్ కాలములోనుమారు ఒకలక్ష గ్రంథములుండెడివట తరువాత ఏడు లక్షలకు పెరిగినవి ఆ కాలమున ఇంతటి గ్రంథాలయము ప్రపంచములో లేదని ప్రతీతి. ఆనాడు ఈ గ్రంథాలయము వినూత్న పరిశోధనలకు కేంద్రమయ్యెను. నేటివలె పదార్థ విజ్ఞానశాస్త్రమందే ఆనాటి శాస్త్రజ్ఞులు శ్రద్ధ చూపిరి. సిరాక్యూజ్ వాసియైన ఆర్కిమిడీజ్ యను పదార్థ విజ్ఞాన శాస్త్ర పరిశోధకుడే ఆనాటి శాస్త్రజ్ఞులలో ప్రముఖుడై యుండెను. ఆయన అలెగ్జాండ్రియాలోని తన మిత్రులైన ఇతర శాస్త్రజ్ఞులతో సదా చర్చలు జరుపుచుండెను నాడు అలెగ్జాండ్రియా శాస్త్రజ్ఞుల సమాజము ప్రాచీన ప్రపంచ శాస్త్రజ్ఞకూటము లన్నింటికి తలమానికముగా నుండెను. వారందరు అచటి చిత్రివస్తు ప్రదర్శనాల

యములోనే నివసించుచుండెడివారు. టోలమీ ప్రభుత్వము వీరికి జీతము లిచ్చు చుండెను. ఈ గ్రంథాలయమున మొట్టమొదటి తరమునకు చెందిన శాస్త్రవేత్తల లోనే 'యూక్లిడ్' యను గొప్ప గణితశాస్త్రజ్ఞుడు వెలసెను నాటి యూక్లిడ్ గణిత శాస్త్రము నేటికిని సుప్రసిద్ధముగా నున్నది గణితముతోపాటు భూగోళ, ఖగోళ శాస్త్రములు కూడా చాలా అభివృద్ధి నొందెను టోలమీ వంశజులు అలెగ్జాండ్రి యాలో ఒక వేధశాల (ఖగోళ పరిశోధన కేంద్రము) ను నిర్మించిరి నాటి ప్ర ముఖ ఖగోళశాస్త్రజ్ఞుడు హిపార్కస్. ఎరటనోస్తనీజ్ యను భూగోళశాస్త్రజ్ఞుడు భూ గోళ శాస్త్రమును రచించెను. ప్రపంచ పటములపై అక్షాంశ రేఖాంశములను సూ చించు అడ్డగీతలను, నిలువు గీతలను మొట్టమొదటిసారిగా గీచిన ప్రథమ భూగోళ శాస్త్రజ్ఞుడు ఎరటోస్తనీజ్. జంతు, వృక్షశాస్త్ర పరిశోధనలలో అరిస్టాటిల్ శిష్యులు ఘటికులుగా పరిగణింపబడిరి. భాషా విషయికమైన కృషియు, ప్రాచీనతర సాహి త్య మీమాంసయు కూడా బాగుగా సాగుచుండెను. సాహిత్యరంగమందు కూడా శాస్త్ర విజ్ఞానులతో తులతూగగల ప్రతిభాన్వితుడు 'కాలిమేకస్' యను ఆనాటి ప్రసిద్ధ కవి అలెగ్జాండ్రియా గ్రంథాలయమునకు అధిపతిగా నుండెను ఆనాడా గ్రంథాలయము సరస్వతీ కేంద్రముగా ఖ్యాతి నొందెను భారతీయులు అలెగ్జాం డ్రియాను 'యవనపురి'గా కీర్తించిరి.

అలెగ్జాండ్రియా విజ్ఞాన కేంద్రము భౌతికశాస్త్ర పరముగా సాధించినంత ప్ర గతి సాహిత్యశాస్త్ర మందు సాధించలేదని తెలుపవచ్చును ఆనాటి సాహిత్యాచా ర్యులలో ఏ ఒక్కరును నూతన కావ్య సిద్ధాంతమును ప్రతిపాదించ లేకపోయిరి. దానికి ప్రధాన కారణముగా ప్రామాణికమైన అరిస్టాటిల్ కావ్యశాస్త్రము అందుబా టులో లేకుండుటను పరిగణింపవచ్చును. ఐనను వారి సాహిత్యశాస్త్ర విషయిక రిశ్రమను గుర్తింపక తప్పదు; సాధ్యమైనంత మేరకు ప్రాచీన గ్రీకు సాహిత్య మును భద్రపరచిరి. ప్రసిద్ధ ప్రాచీన కావ్య-నాటకాదులకు టీకా- వ్యాఖ్యానము వెలయించి వ్యావహారిక కావ్య విమర్శకు ప్రశస్త మార్గముల నేర్పరచిరి. సాహి త్యశాస్త్రమును గురించిన ఆనాటి యవనపురి మండలి ప్రగతి ప్రధానముగా ఐదు భాగములందు విభక్తమగును కథా సంవిధానము- ఔచిత్య నిర్ణయము- వాక్య రచనావిధానము- టీకా- వ్యాఖ్యానము మరియు విమర్శనాత్మక వ్యాఖ్యానము. వారు సాహిత్య ప్రయోజనమును ఆనందాత్మకముగా లేక ఉపదేశాత్మకముగా లేదా ఆ రెండింటి సమన్వయాత్మకముగా నిర్ధారించిరి. గద్యకావ్యము సైతము

సాహిత్య సౌందర్యముచే ఆవిష్టమై యుండవలయునని నిర్ధారించిరి. ఇట్లు ఆనాటి సాహిత్యాచార్యుల పరిశ్రమ యంతయు కావ్య బాహ్యరూప సౌందర్య వివేచన వరకే పరిమితమైయుండెనేకాని బాహ్యసౌందర్యమునకు మూలమైన ఆత్మతత్త్వము వరకు విస్తరింపలేదు. అందువలన వారి సమీక్ష ఏకపక్షముగా కొనసాగినది. పరిణామతః ఈ విద్వన్మండలిద్వారా ఉత్కృష్ట సాహిత్యశాస్త్ర గ్రంథ రచన జరుగలేదు. ఐనప్పటికిని వారు గ్రీకు కావ్యసంప్రదాయమును ప్రచారము లోనికితెచ్చి భావి తరమువారికి ఆదర్శమై వెలసిరి. కావ్య-నాటకములు సామాజికుని వశపరచుకొను శక్తిని కలిగియుండ వలయును: ఆనందానుభవమును కల్గింపవలయును; దివ్యసందేశము నీయవలయును- యనునవి ఆనాటి కావ్య చింతన యందు కానవచ్చు ప్రధాన లక్షణములు.

ఏతెన్స్ నుండి తరలి వచ్చిన జ్ఞాన భాస్కరుడు 'టోలెమీ'వంశపు రాజుల కాలమున దాదాపు 300 సంవత్సరములు అలెగ్జాండ్రియాయందు నివాసమేర్పరుచుకొని ఈజిప్తు కళా సంస్కృతిని ఎల్లెడల వ్యాపింపజేసెను ఆలెగ్జాండ్రియా ఒకనాటి ఏతెన్స్ నగరమును మరపింపజేసెననుటలో సందేహంలేదు. తరువాత క్రీ. పూ. 30 లో భూలోక సుందరిగా ఖ్యాతి గాంచిన 'టోలెమీ' వంశపురాణి 'క్లియోపాట్రా' రాజ్యమునకు వచ్చెను. ఆమెను రోమ్‌దేశ పాలకుడైన అగస్టస్ ఓడించెను. పరిణామముగా అలెగ్జాండ్రియా రోమ్ సామ్రాజ్యమందు విలీనమైనది, తరువాత కావ్యశాస్త్ర రచనలు రోమనుల మాతృభాషయైన 'లాటిన్' యందు రచింపబడినవి. ఇంతటితో ప్రాచీన గ్రీకు సాహిత్యశాస్త్రము ముగియుచున్నది.

## రోమన్ సామ్రాజ్యము – The Roman Empire

గ్రీకులు ట్రాయ్ నగరమును ధ్వంసము చేసి హెలెన్‌ను తమ దేశమునకు తోడ్కొని పోయిరి. తరువాత ట్రాయ్‌లో మిగిలిన రాజ కుటుంబ సభ్యులకు స్థావరము కరువయ్యెను. వారు 'ఈనియస్' నాయకత్వమున ఇటలీకి వచ్చిరని సంప్రదాయము, వీరు మాటాడిన భాష ఆర్యభాషా కుటుంబమునకు చెందిన లాటిన్ భాష వీరు స్థావర మేర్పరుచుకొన్న జనపదము 'పేలటైన్'. పరిసర పర్వత ప్రాంతంలో ఏడుకొండలపై మరికొన్ని జనపదములుండెను. వానిలో

ప్రధానమైనది. 'సేబైనులు' నిర్మించుకొన్నది. క్రమముగా ఈ ఏడు జనపదములు ఒక పెద్ద నగరముగా ఏర్పడినవి 'రోమ్యులస్' యను ప్రజ్ఞాశాలి తన పేరిట దీనిని 'రోమ్ నగరము'గా క్రీ.పూ. 753 లో రూపొందించెనను పురాణ గాథ యొకటి కలదు. ఇతడు రోమ్ నగరమును (37) సంవత్సరములు పాలించినట్లు తెలియును. తదనంతరం 'న్యూమా పింపీలియస్' రోమ్‌ను పాలించెను ఇతడు తన భార్యయైన 'ఇజిరియా' సుందరి సలహాతో కళలను పోషించెను. తరువాతి రాజు "హోస్టీలియస్". తదనంతరం 'అంకస్ మార్టియస్' యను రాజు పాలకుడై రోమ్ నౌకాశ్రయమైన 'అస్టియా'ను నిర్మించెను. రాజుల నిరంకుశ పరిపాలనకు విసిగి ప్రజలు తిరుగుబాటు లేవదీసిరి, పరిణామముగా క్రీ, పూ. 350 లో ప్రజా త్మాక రాజ్యమేర్పడెను. క్రీ పూ. 275 లో 'కార్థజీనియన్' సేనాపతి నాయక త్వమున గ్రీస్ రోమనుల హస్తగత మయ్యెను. క్రీ.పూ. 138-78 వరకు పాలిం చిన 'సిల్లా' యను రాజు రోమన్ రిపబ్లిక్‌ను స్థాపించెను. కాని స్వార్థపరులైన ధనవంతులు అధికారమును చేజిక్కించుకొన యత్నించిరి. ఫలితముగా క్రీ.పూ. ప్రథమ శతాబ్దియందు అంతర్యుద్ధములు చెలరేగెను. రోమన్ రిపబ్లిక్ పతనావ స్థకు చేరెను. తత్పరిణామమే జూలియస్ సీజర్ హత్య.

రోమనుల భాషయైనలాటిన్ నందు ప్రాచీన తమములుగా భావింపబడిన రచనలు న్యాయ విచారణకు స బంధించిన ద్వాదశ పత్రములు; ప్రకృతిని, దేవ తలను ఉద్దేశించిన గీతములు, సూక్తములు, ప్రార్థనలు. తదనంతరం హోమర్ కావ్యములు, గ్రీకు నాటకములు లాటిన్‌లోకి అనువదింపబడినవి. ఐనను క్రీ.పూ. ప్రథమ శతాబ్దినాటికి కాని లాటిన్ సాహిత్యము సర్వతోముఖాభివృద్ధిని సాధించ లేకపోయింది.

## సిసిరో - Cicero - (Bc. 106-43)

రోమన్ రిపబ్లిక్ అంతిమ దశయందు క్రీ.పూ. 49-44 వరకు రోమ్ నగ రమును మకుటములేని మహారాజుగా పాలించిన జూలియస్ సీజర్ (క్రీ.పూ. 100-44) కు సిసిరో సమకాలికుడు. ఇతడు రోమను వాగ్మిశిరోమణి గొప్ప రాజకీయ వేత్త. సిసిరో తండ్రి రోమన్ వీరుడు. సిసిరో రోమ్ నగరమందు న్యాయము, వక్తృత్వము, గ్రీకువాఙ్మయము, తత్త్వశాస్త్రముల నభ్యసించెను; క్రీ పూ. 79లో అనగా తన 21వ ఏట సిసిరో న్యాయవాది యయ్యెను; క్రీ.పూ. 75 లో న్యాయ

మూర్తిగా నియమితుడయ్యెను. క్రీ పూ. 70 లో గవర్నరు గైయెస్ వెరెస్‌కు ప్రతిపక్షమున వాదించి ఆతనిని పరివానమునకు పంపించెను. తరువాత క్రీ పూ. 63లో సలహాదారునిగా (కాన్సల్) ఎన్నుకొనబడెను. ఆనాడు రిపబ్లికన్‌కు వ్యతిరేకముగా కుట్రల పన్నుచున్న 'కాటిలైన్'ను ఎదిరించి తన వక్తృత్వ శక్తిచే ఆతని పన్నాగములను ప్రజల ముందు బహిరంగ పరచెను. కాటిలైన్ సిగ్గుపడి రోమ్ నగరమును విడిచి పారిపోయెను. ధనవంతుల పక్షపాతియైన మార్క్ ఆంటోని ఖండించుచు సిసిరో అనేక ఉపన్యాసముల నిచ్చి తన వాదనైపుణ్యముచే ప్రజల నురూరిత లూగించెను. ఇట్లీ మేధావి తన వాక్పటిమచే ప్రతిపక్ష కుటరిలను భంగపరచెను. గొప్ప వక్తగా, దేశ జనకునిగా కీర్తింపబడెను. క్రీ.పూ. 44 లో జూలియస్ సీజర్ తన మిత్రులైన బ్రూటస్, క్యాషియస్ కుట్రకు బలియయ్యెను. తనకు వ్యతిరేకముగా ప్రజలను రెచ్చగొట్టినందుకు ఆంటోని సైనికులు సిసిరోను క్రీ.పూ. 43లో వధించిరి.

సిసిరో రచించిన లేఖలు సుమారు వేయి వరకు లభించును. కాటిలైన్‌కు వ్యతిరేకముగా ఇచ్చిన నాలుగు ఉపన్యాసములు కాక రచనా కళ, రాజకీయ నైతిక తత్త్వము, మతము మున్నగు వానిని గురించి పెక్కులు రచించెను. ఇతడు రచించిన గ్రీను చరిత్ర వక్తృత్వ వాదపటిమకు వైదుష్యమునకు నిధియని పేర్కొన వచ్చును. ప్లేటో దార్శనిక చింతనచే సిసిరో అత్యధిక ప్రభావితుడు. అందువలన ఆయన ప్లేటోవలె తన రచనలయందు సంవాదాత్మక శైలినేవాడెను. డి రిపబ్లిక్, డి ఆరేటర్, డి లెజిబస్ యను రచనలు ఆ మేధావి యొక్క సాహిత్యిక, రాజనైతిక, వక్తృత్వ కళా చింతనకు సంపూర్ణ నిదానములు.

సిసిరో వక్తృత్వమును సర్వోపరి కళగా ఆరాధించెను. అరిస్టాటిల్, ఇసోక్రేటస్ ప్రతిపాదించిన వక్తృత్వ సిద్ధాంతములను సమకాలీన యుగ పరిస్థితి కన్వయించి వక్తృత్వ కళా మహనీయతను ఎలుగెత్తిచాటెను. వక్తృత్వము ఆతని దృష్టియందు వ్యక్తి తన వ్యక్తిత్వమును ఋజువు పరచుకొనుట కుపకరించు ఏకైక సాధనము. దేశ శాంతి-సౌభాగ్యముల సంస్థాపనము, మానవతా వ్యాప్తి వక్తృత్వ కళ ద్వారా మాత్రమే సాధ్యములు కాగలవు. ప్రజలను మంచి మార్గమున నడిపించి ఆదర్శ నాగరికులుగా తీర్చిదిద్దుటలో వక్తృత్వమే తనకు తానే సాటి. దీని కున్నంత శక్తి వేరొక కళకు లేదు. కనుక సిసిరో దృష్టియందు వక్తృ

త్వమే మానవ మనుగడకు, దేశ సౌభాగ్యమున కుపకరించు ఉత్కృష్ట కళ. వక్త వక్తృత్వకళా మహిమను దృష్టియందుంచుకొని ఉపన్యసింప వలయును; తాను సామాజికుల ముందు వివరింపదలచుకున్న విషయముపై సంపూర్ణాధికారమును కలిగి యుండవలయును ప్రసంగ వశాత్తు చేరు ఇతర విషయముల వ్యావహారిక జ్ఞానము సైతం వక్తకు అవశ్యకమైయుండును. అపుడే వక్త శ్రోతలపై తన ఉద్దిష్ట ప్రభావమును నెరపి వారిని సంతృప్త పరచగలడు అంతేకాక వక్త ఉపన్యాసము యథార్థస్థితిని స్ఫురింప జేయుచు ఆదర్శప్రాయమై యుండవలయును; అందరిని అలరింప జేయవలయును; మరియు ఉదాత్తమైన ఉద్దేశ్యమును కలిగియుండవలయును. సిసిరో దర్శనము, తర్కము, చరిత్ర, సాహిత్య రచనా రీతులను పరిశీలించి వక్త అనుసరింపదగిన శైలీ త్రియమును నిర్ధారించెను

సామాన్యశైలి-Low style :- వక్త తన ఉద్దేశ్యమును నిరూపించుటకు (to prove) ఇది ఉపకరించును. కనుక దీనిని నిరూపణాత్మక శైలిగా పేర్కొనవచ్చును.

2. మాధ్యమిక శైలి-Middle style :- ఉద్దేశ్య నిరూపణముతో వక్త కార్యము ముగియదు. శ్రోతల మానసమును అలరింప (to please) జేయవలయును. అపుడే శ్రోతలు వక్త ఉపన్యాసమునకు వశీభూతులు కాగలరు; వక్త వ్యక్తపరచు విషయమునందు ఆసక్తులై ఆనందించగలరు. దీనిని రాగాత్మకశైలిగా పేర్కొనవచ్చును.

3. ఉదాత్తశైలి-Lofty style :- విషయ నిరూపణము, విషయాసక్తి ఈ రెండింటికి మించినది మానసిక అతిక్రమణ. వక్త ఉపన్యాసము శ్రోతల మానసమును త్తేజింప (to move) జేసి వారిని వక్తయొక్క అభీష్టము వైపు మరల్చవలయును; పురోగమింపజేసి కార్యోన్ముఖుల కావింప వలయును. దీనిని భావోత్తేజనాత్మక శైలిగా పేర్కొనవచ్చును.

పై విధముగా వక్త అనుసరింపదగిన మూడు శైలీ రూపముల నేర్పరచి సిసిరో ఉదాత్తశైలి యందు ఉపన్యసించు వక్తనే వక్తృత్వ కళా పారంగతునిగ నిర్ణయించెను. ఈ శైలీ విశేషము వక్త యొక్క ఉదాత్త వ్యక్తిత్వమును నిరుపించి ఆతనిని మహాపురుషులలో చేర్చును. సామాన్య, మాధ్యమిక శైలీ రూ

ములందు విశేష పరిశ్రమను సలిపి నైపుణ్యమును సంపాదించిననే కాని వక్తకు ఉదాత్తశైలి అలవడదు. కనుక ఉదాత్త శైలి వక్తయొక్క మహోన్నత వ్యక్తిత్వమునకు సూచకము.

సిసిరో వక్తృత్వమున కేర్పరచిన శైలీ రూపములు కావ్యశాస్త్ర దృష్టితో ప్రధానములే కాదు; మహనీయములు కూడా. తరువాతి సాహిత్యాచార్యులు అతడేర్పరచిన మూడు శైలీ రూపములను మూడు కావ్యరూపములకు అన్వయించిరి. సామాన్యశైలి జానపదగేయ రూపములకు (Eclogue) ఉపయుక్తముగా నిర్ణయింపబడినది; మాధ్యమికశైలి ప్రకృతివర్ణనలకు (Georgic) ఉపయుక్తముగా భావింపబడినది మరియు ఉదాత్తశైలి మహాకావ్యమునకు (Epic) ఉపయుక్తముగా నిర్ధారింప బడినది. సిసిరో రోమన్ వాగ్మిశిరోమణి యగుట వలన వక్త తన ఉపన్యాసమందు అనుసరింపదగిన లాటిన్ భాషాపదముల ప్రయోగము, భాషా రమణీయత అలంకారిత, వాక్య సంయోజన మున్నగు శైలీ అంగములను వివేచించి కావ్యశైలీ రూప సంపాదనయందు తరువాతి ఆచార్యులకు మార్గదర్శకుడయ్యెను. వాస్తవముగా అతని శైలీ వివేచన రోమన్ సాహిత్యశాస్త్ర మందు కావ్యశైలీ రూప నిర్ధారణ యందు ఉపకరించింది; హోరేస్ ''కావ్య-కళ'' రచనకు భూమిక పాత్రను నిర్వహించింది.

ఇక అతని సాహిత్య దృక్పథమును గురించి- సిసిరో వక్తృత్వమునే క జగత్తునందు ఉత్కృష్టముగా నెంచెను. వాస్తవముగా శ్రోతలను శీఘ్రముగా జింప జేయుశక్తి వక్తృత్వమునకు కలదనుటలో సందేహము లేదు. ఈ దృష్టి అనగా సామాజిక సత్వర భావోత్తేజనను దృష్టియందుంచుకొని ఆయన సాహిత్యమును వక్తృత్వమునకు సహకారిగా, ద్వితీయ స్థానీయముగా పరిగణించెను కావ్య, నాటకాదులు వక్తృత్వ కళా సిద్ధాంతములకు లోబడి యున్నపుడే రాణించగలవని తెలిపెను. ఐనప్పటికిని ప్లేటో వలె సిసిరో కావ్య వైముఖ్యమును ప్రకటింప లేదు అతని దృష్టియందు కావ్యము దైవికమైన ప్రేరణకు పరిణామము. అది యథార్థము, కల్పన- రెండింటికి సమన్వయాత్మక రూపము. అది కేవలము సౌందర్యవంతమై యుండుటయే కాదు; చిరస్థాయితను కలిగి యుండవలయును. ఆకర్షణీయత వక్తృత్వమునకు వలె సాహిత్యమునకు శాశ్వతధర్మము. వక్తృత్వము వలె సాహిత్యము సైతం సామాజికుల నుత్తేజపరచి ఆదర్శము వైపు వారిని

4. కావ్యము ఆదర్శ తత్త్వమును ప్రదర్శింప వలయును.

5. నిర్ణయాత్మక కావ్య విమర్శయే శ్రేష్ట తరము.

6. కావ్యమందు గద్యశైలి యొక్క ప్రభావము పద్యశైలికన్న తక్కువేమికాదు.

రోమన్ చరిత్రయందు సిసిరో చిరస్మరణీయుడు. ఆ మహనీయుడు రోమన్ రిపబ్లిక్‌ను సమర్థించిన దేశ జనకుడు. తన వాద పటిమచే మొదటిసారిగా లాటిన్ భాషయందు విశిష్టమైన గద్యశైలిని రూపొందించిన గొప్పవక్త. అధునిక యూరపు ఖండమందలి గ్రాంధిక వ్యక్తీకరణకు మూలమని చెప్పదగిన శ్రేష్టమైన శైలి ని నెలకొల్పిన భాషావేత్త. కావ్యశాస్త్రమున కుపకరించు కావ్యాంగములను వివరించిన కావ్యమర్మజ్ఞుడు. ఇట్టి ప్రతిభాశాలి తన రచనల ద్వారా భావి ప్రథమ రోమన్ లాక్షణిక గ్రంథ రచనకు సముచితమైన ప్రేరణను కల్గించెను. కనుక సిసిరో సారస్వత కృషి హోరేస్ 'కావ్య కళకు' భూమికగా వెలయును.



# II

# హోరేస్ - Horace

**( B.C. 65-08 )**

## ప్రస్తావన – Introduction.

క్రీ॥పూ॥ మొదటి శతాబ్దియందు రోమ్‌లో విచ్ఛిన్నకర శక్తులు బయలుదేరి అంతర్యుద్ధమును తెచ్చినవి. వాని నన్నింటి నణచి జూలియస్ సీజర్ మేనల్లుడైన ఆగస్టస్‌సీజర్(అక్టేవియన్ క్రీ॥పూ॥63 క్రీ॥శ॥14) రోమన్‌సామ్రాజ్యమును స్థాపించి సుస్థిర రాజ్య వ్యవస్థ నేర్పరచెను. ఏథెన్స్‌లో పెరెక్లెస్ వలె, భారతదేశమందు అశోకునివలె, ఇంగ్లండునందు ఎలిజిబెత్. I వలె ఆగస్టస్ సీజర్ కాలము(క్రీ॥పూ॥ 31- క్రీ॥శ॥14) రోమన్ సామ్రాజ్యమందు స్వర్ణయుగము.ఇతని కాలముననే మహాకవి వర్జిల్ (క్రీ.పూ. 70-19) గ్రీకు మహాకవి హోమర్‌తో సరితూగగల 'ఈనియడ్' యను ఇతిహాస కావ్యమును రచించెను. ఈనియస్ ఇటలీని చేరిన గాథను పురస్కరించుకొని ఈ మహాకవి రోమ్ వైభవమును 'ఈనియడ్'కావ్యరూపమున గానము చేసి చిర ప్రసిద్ధుడయ్యెను. లాటిన్ భాషలో ఈ కావ్యమునకు సాటియైనది వేరొకటి ఇంతవరకు వెలువడలేదు. టిబులస్, ఒవిడ్, హోరేస్ మున్నగు కవులు ఈ యుగమందే వెలసి వివిధ కావ్య ప్రక్రియల రచనలద్వారా లాటిన్ సారస్వత దేవి నలంకరించిరి. గ్రీకు సాహిత్యమందు అరిస్టాటిల్ వలె లాటిన్ సాహిత్య మందు హోరేస్ తొలిసారిగా కావ్యశాస్త్రమును రచించెను. పాశ్చాత్య సాహిత్యశాస్త్రమందు అరిస్టాటిల్ కావ్యశాస్త్రము తరువాత అధిక ప్రాధాన్యతకు వచ్చినది హోరేస్ రచించిన అర్స్ పొయెటికా (Ars poetica = కావ్యకళ). కావున రోమన్ కావ్యశాస్త్రము హోరేస్‌తో ప్రారంభ మగును.

హోరేస్ క్రీ.పూ. 65 లో దక్షిణ ఇటలీ యందలి వెనెసియా నగరమున జన్మిం చెను. ఇతని పూర్తి పేరు. 'క్వింటస్ హోరేసియస్ ఫ్లెక్స్'- Quintus Horatius Flaccus జూలియస్ సీజర్ వధానంతరము అయన బ్రూటస్ సైన్యంలోచేరి కొంత కాలము పనిచేసెను. బ్రూటస్ ఆత్మహత్యానంతరం హోరేస్ రోమ్ నగర మరు రెంచి గుమస్తాగా పనిచేసెను. ఆకాలమందే హోరేస్ పద్యకావ్యములను రచిం చెను. మహాకవియైన వర్జిల్ హోరేస్‌ను 'మెయ్‌సినా' యను కళా సారస్వత పోష కునితో పరిచయము చేసెను. మెయ్‌సినా హోరేస్‌ను పెక్కు విధముల సత్క రించెను.

హోమర్, పిండార్ మున్నగు గ్రీకు కవులవలె హోరేస్ వాగ్దేవతా ప్రసా దమే తన సాహిత్య రచనలకు మూల స్రోతముగా తెలిపెను. వాగ్దేవత తలచు కొన్నచో మూగ జీవులైన చేపలకు హంసల స్వరమును కల్పించుననెను. తాను లాయర్ వాద్యగాయకునిగా పదుగురి ప్రశంసల నందుకొని సంతోషించుటకు మూలకారణము ఆ వాగ్దేవతా కరుణా కటాక్షమేనని హోరేస్ తన కృతులందు తెలిపెను.

## రచనలు - His writings.

హోరేస్ మొదట కవి, తరువాత సాహిత్యాచార్యుడు. కవి కన్న సాహి చార్యునిగా ఈతని ప్రశస్తి అధికతరము. ఈ కవి, విమర్శకుని రచనలన్ని-మ రకములుగా విభజింపబడును.

1. వ్యంగ్య కావ్యములు– Satires- ఇవి రెండు భాగములు ఈ కావ్యములం హేరేస్ విషాదరూపకమును మరియు మహాకావ్యమును ఉత్కృష్ట సాహిత్య ప్ర యలుగా తెలిపెను. వ్యంగ్య కావ్యమును మరియు హాస్య రూపకమును అల్పత ములుగా గుర్తించెను. కారణమేమన ఇవి వ్యక్తిగతముగ బాధాకరములుగా పరిణ మించుటయే కాక సంకుచితమైన అల్పతర ఆశయము నుద్దేశించును. మహాకావ్య విషాద రూపకములు ఉదాత్తాశయమును కలిగి దేశ కళ్యాణ కారకములగును.

2. సంబోధనా గేయములు– Odes- ఇవి నాలుగు భాగములు. హోరేస్ ప్రౌఢ కవితా స్వరూపము నివి ప్రదర్శించును. కవికి ప్రకృతిపై కల ప్రేమ ఇందు ధ్వని తము. కోలాహల పూరితమైన నగర వాతావరణమును విసర్జించి, ప్రకృతి వాతా

వరణ మందు సామాన్య రైతుగా, స్వేచ్ఛగా బ్రతుకును సాగించడమే శ్రేష్టమను హోరేస్ ప్రబల ఆకాంక్ష ఈ గేయములందు ప్రతిఫలించింది.

3. కావ్య పత్రములు– Epistles :- ఇవి మూడు రకములు.

a) ఫ్లోరెన్స్ కావ్య పత్రము– Epistle to Florence :- ఇందు హోరేస్ కావ్య దృక్పథము వ్యక్తమైయున్నది. కవి స్వయముగా విమర్శకుడైనపుడే, అతని కావ్యము ఉదాత్తమై పలువురి ప్రశంసల బడయగలదు; కవి సఫల కవిగా రాణింప గలడు. అట్టి కవియే కావ్యవస్తువున కుపయుక్తమైన పదజాలము నెన్నుకొనును; ఉపయుక్తాలంకార సంయోజనచే రమ్యమైన కావ్యశైలిని రూపొందింపగలడు.

b) అగస్టస్ కావ్యపత్రము–Epistle to Augusts- ఈ కావ్య పత్రిమందు హోరేస్ కావ్య ప్రతిభను నిరూపించెను. కవికి నైసర్గికమైన ప్రతిభయే ప్రధానమని అది యుగానుకూలముగా కావ్యరచనా రూపమున ప్రకాశించుననెను. స్వర్ణయుగ మందు మాత్రమే కవి ప్రతిభ మహాకావ్య రచనయందు ప్రవృత్తమగుననెను.

c) పీసోస్ కావ్య పత్రము- Epistle to pisos :- ఈ రచనయే అత్యంత ప్రసిద్ధమైన లాటిన్ భాషా కావ్యశాస్త్రము. ఇది 'ఆర్స్‌పొయెటికా'గా రోమ్ దేశమందు అధిక ప్రచారమునకు వచ్చినది; అంతేకాక రెండవ అరిస్టాటిల్ కావ్యశాస్త్రముగా కూడా ఆదరణను పొందినది. ఈ కావ్యపత్రమునకు మొదట క్వింటీలియన్ శాస్త్రాచార్యుడు 'ఆర్స్ పొయెటికా'యను నామ మిడెను. తన వృద్ధాప్య మందుహోరేస్ దీనిని రచించెను.

## ఆర్స్ పొయెటికా (కావ్యకళ) - Ars Poetica·

రోమ్ చరిత్రయందు స్వర్ణయుగమైన అగస్టస్ సీజర్ పరిపాలనాకాలమంద రచింపబడిన ఈ కావ్యశాస్త్ర రచన 'పీసో' మిత్రులకు సంబోధింప బడినది. హోరేస్ ఈ కావ్య శాస్త్రమును కావ్య కళాశిక్షణ నిమిత్తం రచించెను హోరేస్‌ను ఈ కావ్య శాస్త్ర రచనకు ప్రేరేపించిన ఆనాటి యుగ పరిస్థితు లిట్లుండెను.

రాజకీయ దావానలమందు భస్మము కారాదను మహదాశయముతో ట్రాడ్ నగరమందు భద్రపరచబడిన అరిస్టాటిల్ జ్ఞానభండారము క్రమ క్రమముగా క్రీపూ. ప్రథమ శతాబ్దియందు ఏథెన్స్ చేరెను. రోమన్ సేనాపతియైన మారియన్

ఈ రచనల మహోనతను గుర్తించి క్రీ.పూ. 85 లో అరిస్టాటిల్ సాహిత్యమును రోమ్ నగరమునకు కొనిపోయెను. అట సమాలోచకులు (Peripetatics) అరిస్టాటిల్ కావ్యశాస్త్రమును అధ్యయనము చేసిరి; అరిస్టాటిల్ సాహిత్య దృక్పథమును, కావ్య స్వరూపమును విశ్లేషించు యత్నమును సలిపిరి. అందు ప్రధానముగా నెన్నదగిన శాస్త్రాచార్యుడు 'నియోప్టోలెమస్' (Neoptolemus). ఇతడు బితియానా వ్యాకరణ పండితుడు. ఈయన అరిస్టాటిల్ కావ్యశాస్త్రమునకు లాటిన్ భాష యందు వ్యాఖ్యానము రచించి యుండెను. క్రీ.పూ. 15 లో రోమన్ సభాసదస్యుడైన 'లూయిన్ కాల్పర్నియన్ పీసో' నెపుల్స్ గార్డెన్ స్కూల్ అధిపతియైన 'ప్రొఫెనస్ ఫిలోమెడస్'తో నియోప్టోలెమస్ వ్యాఖ్యానమును గురించి చర్చించుచుండెను. ఆ నేపుల్స్ చర్చ యందు హొరేస్ పాల్గొనుచుండెను. ఆపుడాతడు అరిస్టాటిల్ కావ్య శాస్త్ర వ్యాఖ్యానము నందలి లోపములను గ్రహించెను. అందువలన ఆయన పీసో ను మరియు అతని ఇరువురు కుమారులను సంబోధించి 'ఆర్స్‌పొయెటికా'ను రచించెను. కాని ఫిలోమెడస్ తన రచనయైన 'అన్ పొయెమ్స్' నందు నియోప్టొమెల్ రచించిన అరిస్టాటిల్ కావ్యశాస్త్ర వాఖ్యానము నుండి హోరేస్ కనీసం ప్రము సిద్ధాంతాలనైనా గ్రహించియే ఆర్స్ పొయెటికా రచించెనని తెలిపెను. క్రీ ॥ మూడవ శతాబ్దమందలి పోర్ఫిరో (Porphyrio) యను పండితుడు ఆర్స్‌పొయెటిక కు వ్రాసిన పీఠిక ద్వారా పైవిషయము తెలియుచున్నది. ఎది యెట్లున్నను నియె ప్టోలెమస్ వ్యాఖ్యానము సరియైనదిగా హోరేస్ భావింపక పోవచ్చును. అంద లన ఆయన పీసో బంధువుల నుద్దేశించి నవరచయితలకు కావ్య కళా శిక్షణ త్తం ఆర్స్‌పొయెటికా రచించెనని భావింపవచ్చును. ఆనాటి కవులలో. సాహి వేత్తలలో రచనావిధానమును గురించిన నిర్దిష్టమైన అభిప్రాయము లేకపోవుట కారణము.

ఆగస్టస్ రోమన్ సామ్రాజ్య సంస్థాపనతో అంతవరకు ప్రజలలో, నాయకులలో బలీయముగా నున్న ప్రజా ప్రభుత్వ కాంక్ష సన్నగిల్లెను. పరిణామతః ప్రజలపై తర్కవాదుల, వక్తృత్వ కళా పారంగతుల ప్రభావము తగ్గిపోయెను. ఒకనాడు బహుళ ప్రచారమునకు వచ్చి దివిజ లోకమును భువికి దింపగలుగు సామర్థ్యమును కలిగియున్నదిగా భావింపబడిన వక్తృత్వ కళకు రాజ్య వ్యవస్థయందు ప్రాధాన్యత తగ్గెను. రోమనులు స్వాభావికముగనే వ్యవహార కళలురు. అందువలన వారి దృష్టి దేశవైభవోన్నతి మరియు జాతిసమైక్యతపై కేంద్రీకృతమై ఉండెను. సాహిత్య మందు వారు విశేష శ్రద్ధను కనబరచలేక పోయిరి కావ్య, నాటక

ములను వారు మనోరంజక సాధనములుగా, దేశభక్తి ప్రేరేపకములుగా భావించిరే కాని సాహిత్య మహనీయతను కాని, అది నెరవేర్చు ప్రయోజనమును కాని వారు గుర్తింపలేదు. అందువలన లాటిన్ భాషలో ''కవి''కి ఉపయుక్తమైన పదమే లేకుండెను. ఆ సాహిత్యమందు కవి పరముగా వాడబడు 'పొయెటెస్; వేట్స్' పదములు స్వదేశీయములు కావు. సిసిరో సాహిత్యమును జీవన అలంకార ప్రాయముగా రాజసభ మర్యాదా నిమిత్తమాత్రముగా పేర్కొనెను. ఇట్లు రోమన్ ప్రజలలో స్వభాషా సాహిత్య చింతన కన్న రోమన్ సామ్రాజ్య వైభవ కీర్తనమే మిన్నగా కానవచ్చును.

ఏథెన్స్ వైభవముకన్న మిన్నగా కాకున్నను, దానితో సరితూగునట్లు రోమ్ సామ్రాజ్య వైభవమును గానము చేయవలయు ననెడి ఆకాంక్ష అనాటి సాహిత్య చయితలలో ప్రబలముగా నుండెను ఆగస్టస్ పరిపాలనము కూడా దీనికి అనుకూలముగనే యుండెను అంతఃకలహములు లేక, యుద్ధభీతి లేక శాంతి సౌభాగ్యములతో సాగిపోవుచున్న ప్రజాజీవనమునకు జాతి కీర్తి ప్రతిష్ఠల నినుమడింపజేయు కోరిక కలుగుట సహజము. రాజు నుండి పేదవరకు, అందరిని ప్రభావిత పరచిన స్వరాజ్య వైభవమును వర్ణించుటకై కవులకు ప్రామాణిక కావ్య సంప్రదాయ అవశ్యకత యేర్పడెను. స్వర్గమును తలపింపజేయు రోమ్ నగర వైభవమును ఉదాత్త రీతిలో మనోహరంగా ప్రదర్శింపగల సమర్థిత ఏ కావ్య సంప్రదాయము కలిగి యున్నదను విషయంలో వాద వివాదములు తలయెత్తెను. అనాడు ప్రచారంలో నున్న కావ్య సంప్రదాయములు రెండు. ఒకటి ఎన్నియస్ మరియు వెనియస్ యను కవులు స్థాపించిన స్వజాతీయ లాటిన్ సంప్రదాయము. రెండు అలెగ్జాండ్రియాలోని విద్వన్మండలి ద్వారా ఆమోదితమై 'కాటులస్' ద్వారా ప్రచారంలోనికి వచ్చిన నూతన గ్రీకు కావ్య సంప్రదాయము దీనికి మూలము అరిస్టాటిల్ కావ్యశాస్త్రము. అంతేకాక అనుకరణ ప్రక్రియ. కావ్య ప్రయోజనము, నాటక రచన మున్నగు రచనాంగములను గురించి ఏకాభిప్రాయము అనాటి సాహిత్య రచయితలలో లేకుండెను కుకవులు అల్పతర రచనల ద్వారా కావ్య ప్రమాణములను తారుమారు చేయుచుండిరి పరిణామముగా స్వదేశీయ కావ్య ప్రమాణ ఆవశ్యకత యేర్పడెను. ఈ అవశ్యకతను పూరించుటకై హోరేస్ కావ్యశాస్త్ర సంబంధిత రచనకు తన వృద్ధాప్యమందు పూనుకొనెను. అయన హోమర్, వర్జిల్ మున్నగు మహాకవుల రచనలను పరిశీలించెను; అరిస్టాటిల్ కావ్యశాస్త్రమునే పరమ ప్రమాణముగా గ్రహించెను; నేపుల్స్ సాహిత్య చర్చల యందు పాల్గొని నూతన విష

యములను తెలిసికొనెను; లాటిన్ భాషలో మొదటి సారిగా కావ్య-కళను రచించి ధృవ తారయై వెలసెను.

'క్వింటీలియన్స్' యను లాటిన్ శాస్త్రాచార్యునిచే 'కావ్య కళగా' విభూషింప బడిన హోరేస్ ఆర్స్ పొయెటికా 'పీసో' బంధువులను సంబోధించి రచితమైన పత్ర రూప కావ్య రచన. సిద్ధాంత పరిజ్ఞానముతో సంతృప్తి నొందక ప్రత్యక్ష అనుభవ మునే విశ్వసించు రోమనులకు కావ్య రమణీయతను, కావ్యానందమును వివరించు టకై హోరేస్ దీనిని రచించెను. అందువలన ఆయన గ్రీకు సంప్రదాయము,ఆధా రముగా లాటిన్ సాహిత్య ఉదాత్తత కనువైన మార్గములను ఆర్స్ పొయెటికా యందు నిర్దేశించి చూపెను. ఈ రచనా కార్య మందాతనికి గ్రీకు సంప్రదాయ మును సంకుచిత పరచక తప్పలేదు. లాటిన్ సంప్రదాయ నిరూపణార్థము ఆయన ఔచిత్యమును ప్రధానముగా భావించెను. ఆర్స్‌పొయెటికాయందు ఔచిత్య సిద్ధాం తము అనుస్యూతమై యున్నది. కావ్యశాస్త్రమునకు విషయమైన కావ్య సిద్ధాంతము ల విస్పష్ట వ్యాఖ్యానము నిది కలిగి యున్నది ఐనను కావ్యశాస్త్రమందు పాటింప బడు విషయక్రమ మిందు లేనందున ఆర్స్ పొయెటికా కళా విహీన కళ – Art written without art- గా భావింపబడినది.కాలరిడ్జ్,యను సుప్రసిద్ధ ఆంగ్ల విమ ర్శకుడు దీనిని అస్పష్ట ఆలోచనా పత్రముగా పేర్కొనెను. కొందరు విమర్శ కులు ఆర్స్ పొయెటికాను పరంపరాగత కావ్య చింతనను వివరించు కావ్యశాస్త్రము గా పరిగణించిరి. వృద్ధాప్య మందలి రచన యగుటచే ఆర్స్ పొయెటికా హోరేస్ యొక్క గంభీర దార్శనిక దృష్టిని ప్రకటించును. ఆయన స్వయముగా ఇట్లు తెలి పెను- నేనిపుడు ఛందమును మరియు అట్టి అల్పతగ విషయములను వదలివేయు చున్నాను. ఏది వాస్తవమో, కుపయుక్తమో అదియే నా అధ్యయనమునకు, జిజ్ఞా సకు మరియు చింతనకు విషయమై యున్నది. త్వరగా ప్రకటించుటకై నేను సా మాగ్రిని ఏకత్రితము చేయుచున్నాను కావున సాధ్యమైనంతమేరకు త్వరితముగా తన సాహిత్య చింతనను ప్రకటించ వలయునను ఉద్దేశంతో ఆయన విషయక్రమ మును పాటింపక పోవచ్చును.

## విషయ విశ్లేషణ– Analysis of the content·

ఆర్స్ పొయెటికా మొత్తం (476) పంక్తులు కల రచన. మొదటి 41 పంక్తులు ప్రస్తావనా రూపముగానున్నవి. 42 నుండి 118 వరకు కావ్యశైలి వివేచింపబడినది

119 నుండి 294 వరకు కావ్యవస్తువు సమీక్షింపబడినది. 295 నుండి 476 వరకు కవి కర్తవ్యము నిరూపింప బడినది. ఇట్లు అర్స్‌పొయెటికా కావ్యశాస్త్ర క్రమ దృష్టితో ప్రధానముగా మూడు భాగము లందు విభక్తమగును.

1. పొయెసిస్ - Poesis = కావ్య వస్తువు

2. పొయెమా - Poema = కావ్య రూపము.

3. పొయెటా - Poeta = కవి కర్తవ్యము.

వీనిని సంగ్రహముగా తెలిసికొందము.

## 1. కావ్య వస్తువు - Poesis.

ఈ భాగము కావ్య సేంద్రియ ఐక్యత (Organic Unity) తో ప్రారంభమగును. కవి తన హృద్గత భావమును స్వేచ్ఛగా ప్రకటింప వచ్చును అట్లని అసహ్యాకరములును, అసంభవములునైన సన్నివేశములను ప్రదర్శింపరాదు. అసంగతమునకు స్థానము కల్పింపరాదు వర్ణచిత్రమందు వలె కావ్యమందు సమస్తాంగములు విడదీయరానివిగా పరస్పర సన్నిహిత సంబంధమును కలిగియుండవలయును. కావ్య విభిన్నాంగములు మరియు కావ్య సమగ్ర స్వరూపము- ఈ రెండింటి మధ్య సమరసత నెలకొని యున్నపుడే కథాన్వితి సిద్ధించును. కావ్యవస్తు గ్రహణము వివేక సమ్మతమై కావ్యశైలికిని కవిశక్తికిని ఉపయుక్తముగా నుండవలయును. కథావస్తు రచనయందు ఏకరూపత భాసింప వలయును, అది సరళ సుబోధకమై సామాజిక కావ్య, నాటకానుభూతికి తోడ్పడ వలయును.

పదముల ఎంపిక యందు కవి వివేకశక్తి నుపయోగింప వలయును. అపుడపుడు అనాలోచితముగా చేరిన పదములు వినూత్న శోభాకారకములు కావలయును. కవికి వినూత్నపద నిర్మాణమందును ప్రాచీన పద పునరుద్ధరణ మందును అధికారము కలదు. ఐనను వాని ఆవశ్యకత అపరిహార్యమైనపుడు మాత్రమే అవి ఉపయోగార్హములు వ్యవహారమందున్న పదములవి ప్రాచీనములైనను, నవీనములైనను ప్రయోగార్హములే యగును. కావ్యభాషకు నియత సిద్ధాంతములు కాని సంప్రదాయములు కాని లేవు భాష వృక్షము వంటిది; పదములు దాని ఆకులు. ప్రతి సంవత్సరము అవి రాలిపోవును. వాని స్థానమందు క్రొత్తవి వచ్చి చేరును. వ్యవహారమే భాషకు ప్రమాణము. కవి అవ్యవహారిక పదములను సైతము ఉప

యోగించి వాని వ్యావహారికతను నిరూపింప వచ్చును. కాని ఈ విషయమందు కవి మిత దృష్టిని పాటింపవలయును.

ప్రాచీన గ్రీకు సాహిత్య విదులు ఏయే ఛందములు ఏయే సాహిత్య ప్రక్రియలకుపయుక్తములని నిర్ధారించి యున్నారో వాని నదే విధముగా కవులు ఉపయోగింపవలెను. మహా కావ్యమునకు లఘు-గురు ఛందము, దేవతలకు స్తోత్రఛందము, విజయ సందర్భమందు సంబోధనా గీతము, ప్రేమ సందర్భమందు గీతము- ఇవి ఉపయుక్తములు కనుక ప్రతి కవి వానినట్లే పాటింప వలయును.

## 2. కావ్య రూపము - Poema.

కథా వస్తువు ప్రసిద్ధమైనను, కల్పితమైనను కళాత్మకముగా రచితము కావలయును. వినూత్న కావ్య వస్తువులను కవి ఆవిష్కరింప వచ్చును; కాని వాని సంవిధానము కళాత్మకముగా నుండవలయును. ప్రసిద్ధ కథా వస్తువులను యథాతథముగా అనుకరింపరాదు. అసంగత, అస్వాభావిక సన్నివేశములను పరిహరించి వానికి నవ్యతా రూపమును ప్రసాదింప వలయును. సుఖాంతములకు విషాద రూపక స్థితి నికల్పింపరాదు. కథావస్తు రచన యందు హోమర్‌ను ఆదర్శముగా గ్రహింపవలెను; నేరుగా మధ్య భాగమును చేరవలెను. ఆరంభము సామాన్యముగా నుండి నేరుగా లక్ష్యమువైపు సాగి పోవలెను. అనవసర ప్రసంగములను పరిహరింపవలెను; సన్నివేశములన్ని తర్క సమ్మతములుగా సంయోజితములు కావలయును.

పాత్రలు ఆదర్శమునకు అనురూపములై పరస్పర పొందికను కలిగియుండవలయును. ఐతిహాసికములును, ప్రసిద్ధములునైన పాత్రల చిత్రణము సాంప్రదాయిక రూపమును రక్షించునదిగా నుండవలయును. అఖిల్లెస్‌ను కోపిగా, శక్తివంతునిగా, ఉద్రేక స్వభావునిగా చిత్రింప వలెను అట్లే మీడియా అనియంత్రిత నారీగా, క్రూరురాలుగా మరియు ఓరెస్టెస్‌ను విషాద భరితునిగా సాక్షాత్కరింపవలెను దీనికి వ్యతిరేకముగా పాత్రలను చిత్రించిన యెడల అవి అసత్యములుగా పరిగణింపబడి సామాజిక విశ్వాసమును చూరగొనలేవు. పాత్ర చిత్రణము వయోనురూపముగా నుండవలెను. ఎట్లన శిశువులు తొందరగా కోపమునకు వచ్చెదరు. మరియు మరియు శాంతించెదరు బాలురు ఆట పాటల యందు ఆసక్తులై నిర్భీకులైయుందురు వయస్కులు జ్ఞాన శీలురై, వ్యాపారానురక్తులైయుందురు. మరియు వృద్ధులు గతమే వైభవోపేతమని నవీనతను నిరసింతురు: నవ యువకులను విమర్శింతురు.

నాటకశైలి పాత్రల మనోస్థితికి అనుకూలముగా ప్రసంగానుకూలముగా నుండవలయును. భాషా ధోరిణి వివిధ పరిస్థితులకు సంబంధితమై వివిధ రీతుల ధ్వనింపవలయును.

ఏది సూచ్యమో, ఏది అసూచ్యమో నాటక కర్త గుర్తెరిగి యుండవలయును. కథావస్తువు నందలి కొన్ని సన్నివేశములు ప్రదర్శనీయములుగా, మరికొన్ని అప్రదర్శనీయములుగా నుండును. జుగుప్సాకరములును భయంకరములునైన సన్నివేశములను రంగశాలయందు ప్రదర్శింపరాదు మీడియా తన సంతానమును తానే వధించుట, ప్రొన్ పక్షి రూపమును ధరించుట మున్నగునవి ఇట్టివి. అవి కేవలము ప్రేక్షకులకు సూచ్యములే యగును.

నాటకము ఐదు అంకములకన్న తక్కువ కాని, ఎక్కువకాని యుండరాదు. ఒకే దృశ్యమందు పాత్రలు మూడింటికన్న నెక్కుడు ఉండ కూడదు; నాల్గవ పాత్రను ప్రవేశ పెట్టరాదు. అనివార్య సందర్భము లందు మాత్రమే దేవతా పాత్రలకు ప్రవేశమును కల్పింప వలయును నాటకాంతము స్వాభావికమై, సన్నివేశములకు పరిణామి కావలయునే కాని యాదృచ్ఛికము కారాదు. బృందగానములు కథకు అంతర్భాగములై, కథా పురోగమనకు తోడ్పడు విగా, సౌభాగ్యవర్ధకములై, దివ్య సందేశ భరితములై యుండవలయును.

లఘు-గురు ద్విమాత్రిక వృత్తమందలి మాత్రలను ఆరు వరుసలుగా కూర్పవలయును. గ్రీకు కావ్యాదర్శములను తప్పక పాటింపవలెను. కావ్యకళా ప్రావీణ్యతకై కవి వానిని దినమంత- అధ్యయనము చేయవలయును. రాత్రంతా వాన్ని గురించి ఆలోచింపవలయును.

విషాద, హాస్య రూపకములు రెండును గ్రీకు ఆవిష్కారములే. వాని సమగ్రతకై గ్రీకు నాటకకర్తలు సలిపిన అవిరళ కృషి ప్రశంసనీయము. రోమన్ నాటకకర్తలు వాటిని ఉపేక్షింప జాలరు. గ్రీకు నాటక కర్తలు తమ కథా వస్తువులనే గ్రహించినను, దేశ గౌరవమును, జాతి ఉన్నతిని సఫలంగా గానము చేసినారు. గ్రీకు నాటక మందలి లోపములు మరియు హాస్యరూపక స్వభావము వివరింపబడినది.

## 3. కవి కర్తవ్యము- Poeta.

కావ్యకళ ఎడతెగని పరిశ్రమ నపేక్షించును. ఇది యొక ఉదాత్తకార్యము. రచన కావ్యకళా రూపమును సంతరించు కొనునంత వరకు పునః పరీక్షింపబడవలయును, సమీక్షింపబడ వలయును. తదనంతరం కళాకారుని సమ్ముఖమున ప్రదర్శింప వలయును; ఆతని సలహాలను గైకొనవలయును ప్రచురింపవలెనని వేగిర పడరాదు కనీసం నవ వర్షములపాటైన రచనను అముద్రితముగనే యుండనిమ్ము. సముచితమైన నిర్ణయమే సత్కావ్యమునకు ప్రమాణము. వస్తువు ఎంపిక సవ్యమై వివేక సమ్మతమైనచో పదములు ఎట్టి కష్టము లేకుండా తమంత తామే స్ఫురితములగును.

కవి మానవ వర్తనమును జాగ్రత్తగా పరిశీలింప వలయును; జీవన మనెడి పుస్తకమును చదివి జీవనమున కనుగుణమైన భాషనే ఉపయోగింప వలయును. సత్కావ్యము ద్వారా కవికి అధికలాభము చేకూరును; కీర్తి ప్రతిష్ఠలు ఇనుమడించును. ఆతడు ఉదాత్తమును, ప్రకాశ మానమైన హృదయమును కలిగి యుండ వలయును.

కవి ఆనందమును కల్గింపవచును; ఉపదేశింప వచ్చును. లేదా రెండింటి సమన్వయాత్మక ప్రభావమునైనా నెరప వచ్చును. అసంగతమునకు, అతి భావోద్రిక్తతకు పాల్పడక కవి ప్రయోజనవంతమైన ఆనందమును నిరూపింప వలయును. కవి వర్ణన సంక్షిప్తమై అనవసర ప్రసంగ రహితమై యున్నపుడే ప్రజలు శ్రద్ధతో ఆలకించెదరు. తద్వారా రచయిత ప్రశంసనీయుడగును. ప్రచురణకర్తకు అధిక లాభము చేకూరును.

మహాకవియైన హోమరు రచనలయందు కానవచ్చు స్వల్ప దోషములను దోషములుగా పరిగణింపరాదు. ఉత్కృష్ట కావ్యమందలి స్వల్పదోషములు కావ్యానుభూతికి బాధకములు కానేరవు. సాధ్యమైనంత మేరకు కవి దోషములను పరిహరింప వలయును.

హృదయమును కదలించు శక్తిని కావ్యము అధికముగా కలిగియున్నది 'ఆర్ఫియస్' తన సంగీత మాధుర్యముచే పశుపక్ష్యాదుల నానంద పరచెను మరియ 'అంపియన్' తన గీతముల మహిమచే థేబ్స్ నిర్మించెను. ఈ కథలు నిజములని

నీవు నిరూపింపుము. తన కవితా మహిమచే హోమర్ ట్రైటాన్ యువకులను సమరమునకై ప్రేరేపించి అత్యంత ఆదరణీయు డయ్యెను. మహాకవు లందరు గొప్ప తత్త్వవేత్తలు. తమ రచనా వ్యాసంగమును గురించి కవులు బిడియ పడరాదు. అట్లు పిలువబడుట వారికి గర్వకారణము.

కవి కీర్తికి అధారమేమి? ప్రతిభ యగునా లేక కళా కౌశలమా? యనునది సర్వదా చర్చింపబడుచున్నది. సత్కావ్య రచనకు రెండును అవశ్యకములే. ప్రతిభా హీనమైన కళా కౌశలము, కళా కౌశలము లేని ప్రతిభ- రెండును నిరర్థకములే యగును. కవికి నైసర్గిక ప్రతిభతో పాటు కళాభ్యాసము ఆవశ్యకము.

కవి ఆవేశము లేదా కావ్యప్రేరణ యను భావము వివేక వంతముకాదు. కవి కావ్యావేశము నిగ్రహింప బడవలయును. కావ్య ప్రేరణపై ఆధారపడిన కవి నవ్వుల పాలగును. కావ్యోన్మాదమును గురించిన వ్యంగ్య విమర్శతో అర్స్‌పొయెటికా సమాప్తమగును.

హోరేస్ అర్స్‌పొయెటికా సంగ్రహముగా తెలుపబడినది. ఇక అతని సాహిత్య దృక్పథమును పరిశీలింతము.

## కావ్య స్వరూపము– The nature of poetry.

అరిస్టాటిల్ వలె హోరేస్ కావ్యమును జీవన అనుకృతిగా, కవిని ఒక కుశల అనుకర్తగా పేర్కొనెను. ఐనను అతని దృష్టియందు అనుకరణ మన అంధానుకరణము కాదు; పునరావృత్తి (Repitition) కూడా కాదు. అది పునః సృజనాత్మకము (Recreation) జీవనమును గురించిన గంభీర చింతనతో ఈ పునః సృజనాత్మక కార్యము ముడివడి యున్నది. దానికి రూపమును కల్పించు భాష సైతం జీవనమున కనురూపముగా నున్నచో కవి కర్మ సఫలముగా రాణింప గలదని హోరేస్ కవుల నిట్లు నిర్దేశించెను– "ఆదర్శ కావ్యవస్తు నిమిత్తం మానవ జీవితమును మరియు నీతిని అధ్యయనము చేయవలయును. అట నుండియే జీవనమున కనుగుణమైన భాషను గ్రహింప వలయును. కుశల అనుకర్తకు నేనొసంగు సలహా ఇదియే" 1.

హోరేస్ దృష్టి యందు నీతివంతమయిన ఆదర్శ జీవనమును ప్రదర్శించునదే కావ్యము. అట్లే కావ్య అనుకార్యమైన ఆదర్శ జీవనమునకు రూపమును కల్పించు భాష సైతము ఆదర్శమై యుండవలయును. అనగా పేలవముగా, నీరసముగా నుండక సామాజికుని సుకర అవగాహనకు ఉపయుక్తముగా నుండు భాషను కవి ఉపయోగింప వలయును. మరి ఆదర్శ జీవన భావన కవి కెట్లు అలవడును ? హోరేస్ ఇట్లు తెలిపెను-

"నీ సామర్థ్యమున కుపయుక్తముగా నున్న విషయమునే ఎన్నుకొనుము. నీ భుజస్కంధము లె తటి బరువును మోయగలవో లేక మోయలేవో దీర్ఘంగాఆలోచించుకొనుము. తన శక్తికి అనుకూలముగా నున్న విషయమును ఎన్నుకొనిన కవికి పదముల ఎంపిక మరియు వాని ప్రయోగ మందు ఇబ్బంది కలుగ నేరదు'' 2.

కవి యొక్క సామర్థ్యమునే హోరేస్ పరమ ప్రమాణముగా గ్రహించెను. కవి తన శక్తికనుగుణముగా పురాణ ప్రసిద్ధమైన లేక ఐతిహాసిక కథా వస్తువునైనా ఎన్నుకొనవలయును. దానిని సమకాలీన జీవన ప్రవృత్తి కనుగుణముగా ఆదర్శ ప్రతిపాదికముగా తీర్చిదిద్ద వలయును. ఇట్లు కావ్య స్వరూప వివేచనమందు హోరేస్ గ్రీకు సాహిత్య మందలి పరంపరాగత అనుకరణ సిద్ధాంతమునే సమర్థించెను అరిస్టాటిల్ వలె ఆదర్శ జీవన ప్రతిపాదనమును కావ్య మందు సమర్థించెను. కవిని కుశల అనుకర్తగా పేర్కొని అతని రచనా సామర్థ్యమును కావ్యోత్కర్షతకు పరమ ప్రమాణముగా అంగీకరించెను కనుక కావ్య స్వరూప వివేచన మందు హోరేస్ నూతన దృక్పథమును ప్రకటింప లేదనుట స్పష్టము.

## కావ్య శైలి - Poetic Style

కావ్య వస్తువు భావనా రూపమున నుండును ఆ భావనకు రూపమును కల్పించునది భాష. కవికి కావ్య వస్తువుతో కల సంబంధమే వస్తువుకు భాషతో కలదు. ఉపయుక్త బాషా మాధ్యమమున వ్యక్తమైన కావ్య వస్తువు నవ్యమై, భవ్యమై సామాజికునకు ఆనంద దాయక మగును కావున కవి ఉపయుక్త భాషాప్రయోగమందు దక్షుడై యుండవలయును ఈ విషయ మందు హోరేస్ రెండు అంశములను నిర్ధారించెను. ఒకటి పదముల ఎంపిక (Selection of words) రెండు సముచిత సంయోజనము (Lucid arrangement). ఈ రెండు అంశములు కావ్య

రామణీయకమునకు ఆకరము. ప్రసంగానుకూలములై కావ్య సౌందర్య పోషకములుగా నుండునవి ఉపయుక్త పదములు. వీని ఎంపిక యందు కవి సావధానచిత్తుడై యుండవలయును. ఇవి సాధ్యమైనంత వరకు వ్యావహారికము లైనచో సామాజికుని సుకర అవగాహనకు తోడ్పడి కావ్యాను భూతిని కల్గించును. కనుక క్లిష్ట పద ప్రయోగము కవికి వాంఛనీయము కారాదు. తద్వారా సామాజికుని అవగాహన బాధాకరమై, కావ్య విముఖత యేర్పడును. కొన్ని సందర్భము లందు వ్యావహారిక పదముల ద్వారా వస్తు వ్యక్తీకరణ మందు క్లిష్టత యేర్పడినపుడు కవి నూతన పదముల రచింప వచ్చును; లేదా ప్రాచీన పదములందు స్వల్ప మార్పును కల్పించి వినూత్నార్థములతో ప్రయోగింప వచ్చును. గ్రీకు పదములను స్వదేశీయములుగా మార్చి ప్రయోగించుట హోరేస్ దృష్టియందు సముచితము. ఈ తీరున పదములను మార్చి ఉపయోగించు అధికారము కవికి కలదు. ఐనను ఈ అధికారమును దుర్వినియోగ పరచరాదని హోరేస్ కవుల నిట్లు హెచ్చరించెను- "ఒకవేళ సంయోగ వశాత్తు ఏదేని క్లిష్ట తర విషయ అర్థ స్పష్టతకై నూతన పదముల అవసర మేర్పడినచో నవ నిర్మితము లుపయుక్తములే యగును. వానిని ప్రాచీనతా వాదు లెన్నడును వినియుండక పోవచ్చును. ఇట్టి స్వాతంత్ర్య దురుపయోగము జరుగనంత వరకు అది అనుమతింపబడినదే యగును" 3.

ఉపయుక్త పదముల ఎంపికతోనే కవి కార్యము ముగియదు. వానిని సముచిత రీతిలో సంయోజింప వలయును. పద సంయోజన శైలి నేర్పరచును. పద సంయోజన సామాజిక అభిరుచి గమ్యముగా నున్నపుడే శైలి రాణింప గలదు; అధిక శక్తిశాలియై హృదయమును కదలింప గలదు. ప్రాచీన పదముల యథాతథ ప్రయోగము ద్వారా శైలికి సౌందర్య మలవడదు; వినూత్నార్థములతో సంయోజితములైనపుడే శైలి మనోహరమై సామాజికుని ఆనంద పరవశుని కావింపగలదు. కనుక పద సంయోజన మందు కవి దక్షుడై యుండవలయును. అంతేకాదు భాషా స్వరూపమును సైతం కవి గుర్తు నందుంచుకొని పద సంయోజన ద్వారా శైలి నేర్పరచు కొనవలయును. కారణ మేమన యుగానుకూలముగా మానవ జీవనము మారునట్లు, భాషా స్వరూపము కూడా మారుచుండును వినూత్న పదములువచ్చి చేరును; అనేక పరివర్తనలు కలుగును—

"వర్షాంత మందు వృక్షములు ఆకులను రాల్చును. మొదట వచ్చిన ఆకులు మొటనే రాలి పోవును. అట్లే ప్రాచీన పదములు తిరోహితములగు చుండును;

మరియు నూతనములు వ్యవహారమందు వచ్చి చేరును. అవి నవయౌవనావస్థ వలె శక్తివంతము లగును. వ్యవహారము ననుసరించి పదములు సమీక్షింపబడి వినూత్నార్థములతో ప్రయోగితము లగును. అధిక ప్రచారంలోనివి శక్తివంతములుకాక పోవచ్చు. వ్యవహారమే పదములకు శాసనము; భాషకు ప్రమాణము'' 4.

ఛందస్సు కావ్యశైలికి అంతర్భాగ మగును వివిధ ఛందములు వివిధ కావ్య వస్తువుల కుపయుక్తములుగా నుండును. ఒకే ఛందము వివిధ కావ్య వస్తువుకు ఉపయుక్తము యగునని తలంచరాదు. ఈ విషయ మందు ప్రాచీన గ్రీకు కవుల ననుసరించుట మేలు. వారు కావ్య వస్తువుల కుపయుక్తములగు రీతిలో వివిధ వస్తువులకు వివిధ ఛందముల నిర్ధారించి యున్నారు. రాజకుమారుల, యోధుల సాహస కార్యములే ప్రధానములుగా నుండు మహా కావ్యము లకు హోమర్ ఉపయోగించిన షట్పదీ ఛందము సముచిత మగును. స్మృతి కావ్యములకు పంచపది మరియు విషాద, హాస్య రూపకములకు, వ్యంగ్య కావ్యములకు లఘు-గురు ద్విమాత్రిక ఛందము ఉపయుక్తముగా నుండును. ఏలన ఈ కావ్యకృతులు పరిచిత కథా వస్తువులను కలిగి యుండును. దైవ స్తోత్రములకు, ప్రణయ గీతములకు వివిధ ఛందము లుపయుక్తము లగును. సారాంశముగా ఈ ఆచార్యుని అభిమత మందు వస్తువున కుపయుక్తమైన ఛందో ప్రయోగముచే శైలి రమణీయ మగును. కావ్యము రాగాత్మక మగును. కనుక కావ్యశైలి వ్యావహారిక శైలికన్న భిన్నమై అలంకార యుక్తముగా నుండును. అట్లని కవి యథేచ్ఛగా విభిన్న పద ప్రయోగము ద్వారా తన పాండితీ వైభవమును ప్రదర్శింప రాదు. కవి సర్వదా మధ్యే మార్గ మవలంబించ వలయును. గ్రీకు కవుల రచనా రీతులను ఆదర్శములుగా గ్రహించినపుడు కవి-కర్మ సులభతర మగునని హోరేస్ వచించెను. గ్రీకు ప్రకృష్ట గ్రంథముల నధ్యయనము చేయవలసినదిగా సమకాలీన కవులకు హోరేస్ సలహా నొసంగెను.

## కావ్య ప్రయోజనము- Poetic Function.

హోరేస్ స్వయముగా కవి కావ్యము సామాజికునిపై ఎట్టి ప్రభావము నెరపవలయునో గుర్తెరిగిన విమర్శకుడు కూడా. అందువలన ఈ లాటిన్ ఆచార్యుడు కావ్య ప్రయోజన నిరూపణ మందు మధ్యేమార్గ మవలంబించెను. హోరేస్ కాలము నాటికి కావ్య ప్రయోజనము రెండు రకములుగా ప్రచారములో నుండెను.

జ్ఞాన ప్రాప్తి మరియు ఆనంద ప్రాప్తి. మొదటి వాదము ననుసరించి కావ్యము మానవ నడవడిని సంస్కరించి దేశ సంక్షేమమును చేకూర్చునదై యుండవలయును. కనుక జ్ఞానోపదేశమే కావ్య ప్రధాన ప్రయోజనము. రెండవ వాదము ననుసరించి కావ్యము ఆనందమును చేకూర్చ వలయును. ఇది ప్రాచీన కాలము నుండియే ప్రచారమునకు వచ్చినది. ప్లేటో కావ్యముద్వారా జ్ఞానప్రాప్తి నపేక్షించి, కావ్యము భూలోకమును స్వర్లోకమందు పరిణమింప జేయు లక్ష్యమును కలిగియున్న దనెను. అరిస్టాటిల్ కావ్యము ద్వారా నైతికానందమును ప్రతిపాదించెను. ఆనందము కావ్యప్రయోజన మను మతమునకు పుష్టి చేకూరింది. ఐనప్పటికినీ ఆనందమందు ఉదాత్తానుదాత్త భేదములు తలయెత్తుట వలన కావ్యానంద మెట్టిదై యుండవలయునను ప్రశ్న తల యెత్తెను. హోరేస్ మతమందు కావ్యానందము మానవ జీవన సంస్కరితా యుక్తము. అనగా జీవనమును సంస్కరించునదిగా నుండవలయును. ఈ ఆనందానుభవ మందు నీత్యుప దేశము యిమిడి యుంది. ఇట్టి ప్రయోజనము నెరవేర్చిన కవి సమాజమునకు మేలు చేసిన వాడగునని హోరేస్ తెలిపెను-

''కవులకు లక్ష్యము నీత్యుప దేశము కావచ్చు లేక ఆనంద ప్రదానము కావచ్చు లేదా ఆనందము మరియు ఉపదేశము- ఈ రెండింటి సమన్వయాత్మక అనుభూతి కావచ్చు. వృద్ధులు జ్ఞానోపదేశ రహితమైన కావ్యమును నిరసింతురు. నవ యువకులు నీత్యుపదేశమును నిరసింతురు. అందువలన జ్ఞానోపదేశమును ఆనందముతో సమన్వయ పరచి పాఠకునకు నీతిస్ఫోరక ఆనందానుభూతిని కల్గించు కవియే అందరి ప్రశంసల నందుకొనును.'' 5.

గ్రీకు సంప్రదాయమున కనుగుణముగా హోరేస్ కావ్య ప్రయోజనమును రోమనుల స్వభావ సమ్మతముగా నిరూపించెను. రోమనులు వ్యవహార కుశలురగుట వలన శుష్క జ్ఞానోప దేశము వారి స్వభావమునకు గిట్టదు. ఆనందాత్మకమైన జ్ఞానోపదేశమే వారికి అభీప్సిత మగును అట్టి అనుభూతిచే ప్రేరితులై రోమనులు దేశవైభవోన్నతికి తోడ్పడ గలరని హోరేస్ ఆశయము. అందువలన ఆయన జ్ఞానయుక్తమైన ఆనందాను భూతిగా కావ్యప్రయోజనమును వివరించెను; కావ్యమును దేశహితైషిగా నిరూపించెను. కావున హోరేస్ అభిమత మందు కావ్యము రమణీయము (Beautiful) మాత్రమే కారాదు; ఇది కేవలము బాహ్య గుణము (Formal excellence). మానవ హృదయమును స్పందింప జేయు రమణీయ

గుణముతో శోభిల్ల వలయును.(Possest of charm). అపుడే కావ్యము జీవనము ను సంస్కరింపగలదు; విశిష్టమైన ఆనందానుభూతిని కల్గించగలదు. కావ్య ప్రయోజన నిరూపణ మందు హోరేస్‌పై ప్లేటో మరియు అరిస్టాటిల్ ప్రభావము స్పష్టముగా కానవచ్చును

## కావ్య వర్గీకరణము - Classification of Poetry.

కావ్య గుణ పరముగా అరిస్టాటిల్ కావ్యములను ఉత్కృష్టము మరియు నికృష్టము లని రెండుగా విభజించెను కావ్య ప్రవృత్తి పరముగా హోరేస్ కావ్యములను విభజించెను. అరిస్టాటిల్ దృష్టియందు కావ్యములు ఉత్తమాధమములని రెండే రకములు.కావ్య, నాటకాదులలో వీటికి మించిన మూడవ భేదము ఉండదు. కావ్య ప్రవృత్తి ననుసరించి హోరేస్ మూడవ భేదమును తెలిపెను. వ్యంగ్య కావ్యమును (Satire) మూడవ భేదముగా గుర్తించి అది హాస్య రూపకము కన్న భవ్యతర మైనదని తెలిపెను. హాస్య రూపకము ప్రేక్షకుల ఆమోద ప్రమోదముల వరకే పరిమితమై యుండును. అందు మానవుల లోపములను సరిదిద్దు భావన యుండదనుట కాదు. ఐనను అది వ్యంగ్య కావ్యమువలె నేరుగా మానవుని దుర్బలతను, లోపమును, దుర్వ్యసనమును,దురాచారమును స్పర్శింపనేరదు. వ్యంగ్య కావ్యము పాటించు మర్యాద సంతులనము హాస్య రూపకమునందు పాటింపబడదు. అది ప్రేక్షకులకు బాధాకరముగా కూడా పరిణమింప గలదు.

తాను రచించిన 'సటైర్స్' రెండు భాగము లందు హోరేస్ 'లుసిలియస్ (Lucilius) ను వివేచించెను. ఈ విమర్శ యందు వ్యంగ్య కావ్య లక్షణములు కానవచ్చును. లుసిలియస్ నందు కానవచ్చు ప్రశంసాత్మక గుణములు- వ్యంగ్యాత్మక ధోరణి,దురాచారా ఆక్షేపణ, వ్యక్తిత్వ ప్రతిఫలనము, ప్రతిభ, నైపుణ్యము. ఇవియేకాక లుసిలియస్ నందు లేని ఇతర గుణములను సైతం వ్యంగ్య కావ్యకర్త కలిగి యుండవలయును. అవి- కార్యదక్షత, అలంకారిక శైలి, భాషావైవిధ్యము మున్నగునవి.వ్యంగ్య కావ్యము పాపము,దురాచారములను కథావస్తువుగా కలిగి యున్నను దానికి లక్ష్యము పాపాత్ముడు కానేరడు. అందువలన వ్యక్తిగతంగా బాధాకరం కానేరదు. వ్యంగ్య కావ్యము ఒకవైపు నియమ బద్ధంగా మరోవైపు హాస్య గర్భితంగా నుండును సామాన్యముగా వంగ్యకావ్యశైలికి అవశ్యక గుణములివి- 1. వ్యావహారిక భాషా ప్రయోగము 2 సంక్షిప్తత 3. కళాత్మకత 4. ఆరోహణావరోహణ స్వరయుక్తత 5. మానసిన స్థితి కనుగుణమైన వైవిధ్యత.

వ్యంగ్య కావ్య మూల రూపము హోమర్ విరచితముగా భావింపబడిన మార్గెటెస్ (Margites) నందు కానవచ్చును. హాస్య రూపకము వ్యంగ్య కావ్యము నుండి ఉద్భవించెనని హోరేస్ స్వయముగా తెలిపెను. ఆయన ఈ కావ్య ప్రక్రియను విరివిగా ప్రచారమునకు తెచ్చెను.

## ప్రతిభ- అభ్యాసము - Nature - Art.

హోరేస్ ప్రధానముగా కవి. అందువలన ఆయన కావ్యశాస్త్రాచార్యుని వలె సిద్ధాంత స్థాపన యందు శ్రద్ధ వహింపక వ్యావహారిక దృష్టినే ప్రదర్శించెను. కావ్య సృజనాత్మక ప్రక్రియ నాయన విస్తారముగా వివేచింపలేదు. కావ్య రచనను హోరేస్ అవిష్కారముగా (Invention) పేర్కొనెను; కవి ప్రతిభను స్వభావముగా (Nature) మరియు అభ్యాసమును కళగా (Art) తెలిపెను కావ్య ప్రేరణను ఆయన రహస్యాత్మకమైన బాహ్యశక్తిగా భావించెను. కవి బాహ్య జగత్తునుండే కావ్య ప్రేరణను గ్రహించును. అది ప్రకృతి పరము కావచ్చు లేదా మానవజీవన పరము కావచ్చు; కనుక కావ్య ప్రేరణను వాగ్దేవతా కృపాకటాక్షముతో ముడి పెట్టి విచ్చలవిడిగా కావ్యములను రచించుట తగదని హోరేస్ హెచ్చరించెను. ప్రేరణను ఆయన ఉద్రేక జనితముగా తెలుపక భావసంయమనముగా భావించెను. భావములను నిగ్రహించుకొన్నపుడే కవి కావ్యమును రచింప సమర్థుడగును. భావోద్రేకమునకు లోనైన కవి కావ్యరచన యంద సమర్థుడగునని ఆతని అభిప్రాయము. సంయమిత భావము ప్రతిభా శక్తి ద్వారా వ్యక్తీకరింపబడును. ఆ వ్యక్తీకరణను ఆనందదాయకముగా మార్చునది అభ్యాసము. ఇట్లు కావ్య రచనకు ప్రతిభ, అభ్యాసము- రెండును అవశ్యకములే కాదు వాని సమన్వయాత్మకత కూడా అనివార్యమగును-

"పలువురు నన్ను ప్రశ్నించిరి. కావ్య ప్రసిద్ధికి మూలము ప్రతిభ యగునా? లేక కళాభ్యాస మగునా? నా దృష్టి యందు ప్రతిభ వినా అభ్యాసము, అభ్యాసము వినా ప్రతిభ సఫలీకృతము కానేరదు. అందువలన ఈ రెండింటి మైత్రీ పూర్వక సహయోగము అపేక్షిత మగును." 6.

కావ్య మందు కానవచ్చు ఆక్షేపణ లన్నియు సవరింపబడ వలయును; సంస్కరింపబడ వలయును. లేనియెడల కవి అవహేళన పాలగును కనుక కావ్య

ప్రసిద్ధికి అభ్యాసము ప్రతిభ వలె ప్రధాన పాత్రను నిర్వహించునని హోరేస్ తెలిపెను. కావున–

"మిత్రులారా! గ్రీకు ఉత్కృష్ట కావ్యములను దినమంతా అధ్యయనం చేయండి. వానిని గురించి రాత్రంతా గంభీరంగా ఆలోచించండి." 7.

ప్రతిభ మరియు అభ్యాసము– రెంటింటిని కావ్యహేతువులుగా హోరేస్ కావ్య ప్రయోజనమునకు అన్వయించెను. కావ్య ప్రయోజనములైన సామాజకుని జ్ఞానప్రాప్తి మరియు ఆనందప్రాప్తి– రెండు క్రమముగా ప్రతిభ, అభ్యాసమునకు అన్వయించును. కవి ప్రతిభావంతుడైనపుడే కళ్యాణ కారకమైన దివ్య సందేశము నీయగలడు. ఆ సందేశము హృదయాహ్లాదకరముగా నుండవలయునన్న కవి కళాభ్యాస మందు నిష్ణాతుడై యుండవలయును. ఇట్లు ప్రతిభ, అభ్యాసముల సమన్వయాత్మక శక్తి కావ్య సృజనకు మూలహేతువైనపుడు తద్వారా సామాజికునకు సమకూరు ప్రయోజనము జ్ఞానానందానుభూతియే యగును కాని వేరుకాదు. పై విధముగా హోరేస్ కావ్యహేతు నిరూపణ మందు మరియు కావ్య ప్రయోజన వివరణ మందు సమన్వయాత్మక దృక్పథమును ప్రదర్శించెను.

## నాటక పరిశీలన– Observations on Drama.

హోరేస్ లాటిన్ నాటక సంప్రదాయములను పరిశీలించియు అరిస్టాటిల్ కావ్యశాస్త్రమునే ప్రాతిపదికగా గ్రహించెను. తన కాలము వరకు లేని వానిని కొన్నింటిని నూతనముగా ప్రతిపాదించెను. ఐనప్పటికిని అతని నాటక వివేచన అరిస్టాటిల్ నాటక సిద్ధాంతములకు పునరుక్తిగా కానవచ్చునే కాని మౌలిక వివేచనా శక్తిని ప్రదర్శింపదు కావ్య వివేచన కన్న అతని నాటక వివేచన మంత భవ్యతరముగా లేదు. ఐనను అదియే లాటిన్ నాటక కర్తలకు శిరోధార్య మయ్యెను ప్రాచీన గ్రీకు నాటకముల అదర్శముపై రచయితలకు శ్రద్ధ ఏర్పడెను. హోరేస్ నాటక వివేచన ప్రధానముగా కథా వస్తువు, పాత్రలు, శైలి యను మూడు శీర్షికల యందు విభజింప బడును.

## కథా వస్తువు - Plot.

ప్రాచీన కాలము నుండి ప్రసిద్ధములై యున్న సంఘటనలను, వృత్తాంతములను నాటక కథా వస్తువుగా గ్రహించుట మేలని హోరేస్ తెలిపెను; అందు

గ్రీకులలో ప్రసిద్ధలై యున్నవి మేల్తరములు అట్టి కథా వస్తువులు సామాజికులకు సు పరిచితములై యుండుట వలన నాటకానుభూతి సుకరము కాగలదు. ప్రఖ్యాత వస్తువు యొక్క యథాతథానుకరణమును ఆయన సమర్థింప లేదు. సమకాలీన పరిస్థితుల కనుగుణముగా అందు అవశ్యకమైన మార్పులు చేయుట నాటక కర్తకు అనివార్యము. నాటక కర్త ప్రజాభిరుచిని గమనించ వలయును. అట్లు కాకున్నను నాటక కర్త తన అభీప్సితమైన వస్తువును సమకాలీన ప్రజా జీవనము నుండి సేకరింపవచ్చును. అట్టియెడ కథావస్తు నిర్మాణ మందు నాటక కర్త అత్యంత జాగరూకుడై యుండవలయును. సామాజిక అభిరుచి కనుగుణముగా సన్నివేశములను కల్పించి కథా వస్తువును రమణీయ మూర్తిగా ప్రదర్శింప వలయును. ప్రసిద్ధ కథా రసాస్వాదన వలె ప్రేక్షకుడు కల్పిత కథా వస్తువు ద్వారా కూడా శీఘ్ర రసాస్వాదనకు లోనగునట్లు కథా వస్తువును రచింప వలయును. కథా ఏకరసత (Consistency) తప్పక పాటింపబడవలయును.

ప్రముఖ సంఘటనలతో మాత్రమే కథా వస్తువు రచితమై అన్వితిని కలిగి యుండవలయును. కథాన్వితికి తోడ్పడని అనవసరపు ఘటనల పరిహార్యము అవశ్యకము. జుగుప్సాకరములు, భయంకరమైన సంఘటనలు సర్వదా పరిహార్యము. ఉదాహరణముగా– 'మీడియా' తన సంతానమును తానే వధించుట; క్రూరుడైన అట్రియస్ నరమాంసమును వండుట; ''ప్రాక్నె'' పక్షి రూపమును ధరించుట; 'కైమియస్'సర్పముగా మారుట మున్నగునవి. ఇట్టి సన్నివేశములు వాస్తవంగా సంభవములు కావు.అవి భయంకరములై అద్భుతమును సృష్టించుట వలన ప్రేక్షకులకు విశ్వసనీయములుగా నుండవు. కనుక ఆనందదాయకములు కానేరవు. ఇట్టి అతిలోక మానవీయ ఘటనల జ్ఞానము ప్రేక్షకులకు అవశ్యకములైనపుడు నాటక కర్త వానిని సూచ్య భాగమందే చేర్చవలయును. అట్లే దేవతల కార్యకలాపములు. అతి మానవీయ కార్యములు రంగశాల యందు ప్రదర్శింప రాదు రంగస్థల ఉపకరణముల ద్వారా సాధ్యపడనపుడు, ప్రదర్శన అనివార్యమైనపుడు మాత్రమే అట్టి కథా గత సంఘటనలు ప్రేక్షకులకు అస్వాభావికములు కాకుండునట్లు నాటక కథా వస్తువుకు సహజ సంబంధితములైనట్లు ప్రదర్శింప బడవలయునే కాని ప్రత్యేకములుగా నుండకూడదు. ప్రదర్శనాత్మకదృష్టితో నాటకకథావస్తువు సూచ్యము. అసూచ్యము లను రెండు ప్రధాన విభాగములను కలిగి యుండును. సమగ్ర నాటక కథావస్తువు (5) అంకములకు తగ్గకుండ హెచ్చకుండ రచితము కావల

యును. ఒకే దృశ్యమునందు ముగ్గురికన్న ఎక్కువ పాత్రలను ప్రదర్శింపరాదు.

'Five acts, no more, no less
only three speakers at a time.'

నాటక కథా వస్తువు (5) అంకములకు హెచ్చు తగ్గులు లేకుండా యుండ వలయును. మరియు ఒకే దృశ్యమందు ముప్వరి సంవాదకుల కన్న ఎక్కువ పాత్రలను ప్రవేశ పెట్టరాదు- ఈ రెండు నియమాలను అరిస్టాటిల్ కాని అతని పూర్వులైన అచార్యులెవ్వరును కాని విధించ లేదు. హొరేస్ సమకాలీన నాటక ప్రదర్శనను మరియు ప్రేక్షక రసానుభూతిని దృష్టి యందుంచుకొని స్వయముగా పై రెండు నియమముల నేర్పరచి యుండును

బృందగానములు కథకు అంతర్భాగములుగా నుండవలయును; అంకములకు మధ్య రాకూడదు. కథా గమనమునకు దోహదములై శుభాశీస్సులతో ఆశావాద స్ఫోరకములుగా నుండవలయును. మానవుని నడవడిని తీర్చి దిద్దునవిగా, దౌర్భాగ్యమునకు లోనైన వ్యక్తి సౌభాగ్యమును పొందగలడను అశాభావ భరితములై యుండవలయును; నిరాశా జనకములు కారాదు.

విషాద రూపక రచన సర్వదా గ్రీకు రూపములకు అనుసరణమై యుండవలయునని హొరేస్ ప్రత్యేకముగా నాటక కర్తలను హెచ్చరించెను. గ్రీకు రూపకములే ఆదర్శములు; బృందగానము లావశ్యకములు; అవి కథకు అంతర్భాగములై ఉదాత్తానందానుభూతి యందు పర్యవసితములు కావలయును. మొదటి అంశము ద్వారా రసరమ్యమైన కథాన్వితి సిద్ధించును. రెండవ అంశము ప్రేక్షకుని నైతికమైన ఉదాత్తా నందానుభూతిని సమర్థించును. కావున నవ నాటక కర్తలు గ్రీకు ప్రకృష్ట గ్రంథముల నధ్యయనము చేయవలయును.

హాస్య రూపక కథా వస్తువు హాస్య రూపకమున కనుగుణముగా నుండవ యును. విషాద రూపక కథా వస్తువుకు హాస్యరూపక రూపమును కల్పింపరాద పాత్రలు సామాన్యులై యుండవలయునే కాని ఉదాత్త చరితులై దేవతలను పై యుండరాదు. హాస్య నాయకున కెన్నడును ఉత్కృష్ట శీలమును కల్పింపరా హాస్యము రాజుకు, పేదకు సమాన రూపమున అన్వయించునట్లు శిష్టమై యుండవ లెను. వ్యక్తిగత కక్షతో కూడి యుండక సాంఘిక దుర్బలతను ఏవగించుకొను నట్లుండ వలయును. వన దేవతను రంగశాల యందు ప్రదర్శించినపుడా దృశ్యము నవ్వులాటగా నుండరాదు. అది ధనికులకు ఏవగింపుగా నుండును; అనభ్య హాస్యముగా పరిణమించును.

## పాత్రలు - Characters.

ఐతిహాసిక లేక ప్రసిద్ధ పాత్రల చిత్రణ మందు నాటక కర్త వాని మూల రూపము (Proto type) నెన్నడుచు విస్మరింపరాదు. సమకాలీన యుగ అభిరుచి కనుగుణముగా పాత్ర పోషణ మందు ఆవశ్యక పరివర్తనమును నాటకకర్త కల్పిం పవచ్చును. ఐనను పరంపరాగత ప్రసిద్ధమైయున్న మూల స్వభావ మందు అఘా పరివర్తనము కల్పింపరాదు. అట్లే జరిగి యున్నచో నది ప్రేక్షకుని అవిశ్వాసమ నకు హేతువగును. పరిణామముగా నాటకానుభూతి యందు ఆఘాత మేర్పడును కనుక పాత్ర చిత్రణ మందు నాటకకర్త కడు జాగరూకుడై మూలపాత్ర స్వభా మునకెట్టి ఆఘాతము కలుగకుండునట్లు సమకాలీన అభిరుచి కనుగుణముగా చిత్రిం పవలసి యుండును. ఒకవేళ కవి సమకాలీన జీవనమును గ్రహించి నపుడా పాత చిత్రణము సామాజికుని మనోనుకూలముగా నుండ వలయును. అన్యథా నాట ఉద్దేశము నెరవేర జాలదు. పాత్ర లెట్టివైనను వానియందు అకస్మాత్ పరివర్త మును ప్రదర్శింపరాదు. కథా ప్రసంగానుకూలముగా పాత్రలందు పరివర్తనమ ఆవశ్యకమైనపుడది సబబే యగును. ఐనను ఆ పరివర్తనము అనేక రూప మంద ఏక రూపతను (Consistently inconsistent) ను పాటింపవలయును. అన సందర్భానుకూలముగా పాత్రయందు కోపమును, రౌద్రమును, ఉత్సాహము ప్రదర్శించినను ఆ పరివర్తనము పాత్ర స్వభావమున కుచితముగా నుండవలయ ను. అదియును జీవనమున కనుగుణముగా నుండవలయును; అస్వాభావికముగ అవిశ్వసనీయముగను యుండరాదు. అంతేకాక పాత్ర చిత్రణమందు అవస్థా వి షమును పాటింపవలయును. కథా సందర్భమున కనుగుణముగా పాత్ర యొక్క వయసునకు తగినట్లుగా పాత్రను పోషింపవలయును నాటక ఉద్దేశమునకు ఉప యుక్తముగా పాత్రల గుణచేష్టాదులను చిత్రింప వలయును. బాలునియందు యౌ వనపు చేష్టలు కాని, యువకుని యందు వృద్ధాప్య వ్యవహారమును కాని ప్రదర్శిం పరాదు. బాలురు తొందరగా కోపమునకు వత్తురు; తొందరగా శాంతించెదరు. ఉపాధ్యాయుడు లేనపుడు ఆటపాటలందు రమింతురు. కాని యౌవనమందు అభి రుచి మారును. ధనార్జన, స్నేహసౌఖ్యము. మున్నగు నూతనాభిషలు మెండగు ను. వృద్ధాప్యమందు ధనకాంక్ష ప్రబలమగును. నూతన విధానములపై నిరసన యేర్పడును. కావున పాత్రయొక్క అవస్థా విశేషమును దృష్టియందుంచుకొని నా టకకర్త కడు జాగరూకతో పాత్రలను పోషింపవలయును.ప్రసిద్ధ పాత్రల చిత్రణ

మందు కూడా పై అంశములన్ని పాటింపబడవలయును పరంపరాగత ప్రసిద్ధ ములైన మూల పాత్రల రూపములనట్లే సురక్షితంగా కాపాడుము. నీ నాటక కథా వస్తువునందు ప్రసిద్ధుడైన 'అఖిల్లెస్'ను నీవు ప్రదర్శింప దలచినతో నాతని నట్లే అవిశ్రాంత జీవునిగా, ఉద్రేక స్వభావునిగా, అజేయ శక్తి సంపన్నునిగా చిత్రిం పుము.'' 8.

## నాటక శైలి – Dramatic Style.

నాటకము సత్వరానంద ప్రాప్తిని కలుగ జేయును కాని కావ్య మట్లు కాదు. పాఠ కుని ఆలోచనాశక్తిని వికసింప జేయుచు అనందమును కల్గించును. కనుక నాటక భాష కావ్యభాషకన్న భిన్నంగా నుండుట సహజము. నాటక సంవాదములు వ్యా వహారిక భాష యందుండుట సముచితము. ప్రేక్షకుడు సత్వరముగా వాని అర్థ మును గ్రహించి కథావస్తువు నందు తాదాత్మ్యము జెందగలడు ప్రేక్షకుని కథా వస్తు తాదాత్మ్యమే నాటకానుభూతి.బృందగానము లు సైతం సరళ భాషలో ద్విమా త్రా ఛందము (లఘు, గురు) నందే రచితము లగుట శ్రేష్టము ఏలన ఇదియే సర శతమ వృత్తము ఇది ప్రేక్షకులకు సుబోధకమై అనందదాయక మగును. పాత్రా నుకూల భాష నుపయోగించుటలో నాటక కర్త సిద్ధహస్తుడై యుండ వలయు; రాజ, సేవకు లిరువురు ఉపయోగించు భాష ఒకటేయైనను పద ప్రయోగ మం విభిన్నత కాన్పించ వలయును అట్లే సామాజిక స్థితి, వ్యక్తి, సంస్కారము ననుసరించి నాటక కర్త భాషా ప్రయోగ మందు సముచితమైన పరివర్తన కల్గింపవల యును. పాత్ర యొక్క స్వభావము, గుణ, శీలాదుల కుపయుక్తమైన భాషను కలిగి యున్నపుడే నాటకము సఫలమగును ఉదాత్తాశయమును కలిగియున్న విషా ద రూపక భాష ఉదాత్తమై యుండవలయును. కాని హాస్య రూపక భాషయందిట్టి ఉదాత్తత కానరాదు. దాని ఆశయము దైనందిన సమస్యల పరిష్కార మగుట వలన అందలి భాష వ్యావహారిక భాషకు సమీప వర్తినియై యుండవలయును; మ రియు పాత్రల అవస్థా విశేషముల ప్రతిఫలింప జేయవలయును బాలుడు వృద్ధుని కన్న బిన్నమైన రీతిలో మాట్లాడునట్లు,ప్రశాంత మనస్కుడు ఆగ్రహావేశపరుడైన వ్యక్తికన్న బిన్న మైన రీతిలోనే భాషింప వలయును. దేవతల, ధీరోదాత్తుల వాక్కు లు సార్వకాలీనమైన అమరవాణి వలె ధ్వనింప వలయును. సామాన్యుల మాటలు పరిమితమైన అర్థమునే కలిగియుండ వలయును.

హోరేస్ నాటక వివేచన మందలి ముఖ్యాంశముల నిట్లు గ్రహింపగలము.

1. నాటకమునకు కథా వస్తువు ప్రధాన తత్త్వము.
2. నాటకా కథా వస్తువు అంకము లందు విభజింప బడవలయును.
3. సమగ్ర కథావస్తువు (5) అంకములకన్న అధికముగను, తగ్గియును ఉండరాదు.
4. ఒకే దృశ్యమందు ముగ్గురి సంవాదకుల కన్న ఎక్కువ పాత్రలను ప్రవేశ పెట్టరాదు.
5. కథావస్తువు ప్రసిద్ధమైనను, కల్పితమైనను సమకాలీన సామాజిక మానసిక స్థితి కనుకూలముగా రచింపబడ వలయును.
6. పాత్ర పోషణమందు మూల పాత్రయొక్క స్వభావమును నాటకకర్త సర్వదా రక్షింప వలెను.
7. సమకాలీన సామాజిక మనోను కూలముగా పాత్రలను పోషింప వలయును.
8. పాత్రల వయస్సు, అవస్థ, పరిస్థితి మున్నగు వానికి అనుగుణముగా పాత్ర చిత్రణ యుండవలయును.
9. నాటక భాష సరళ వ్యావహారికమై పాత్రాను కూలముగా నుండవలయును.
10. అతి మానవీయ సంఘటనలను, హింసాది కృత్యములను నాటక సూచ్య భాగ మందే చేర్చవలయును.

## సత్కావ్య స్వరూపము-

## The Nature of Good Poetry.

హోరేస్ కావ్యస్వరూపమును వివేచించెను. సత్కావ్యము ఈ క్రింది లక్షణములను కలిగియుండ వలయునని తెలిపెను.

1. కథావస్తు వెట్టిదైనను, కల్పితమైనను లేదా ప్రసిద్ధమైనను, మానవ జీవితమునకు సన్నిహిత సంబంధమును కలిగియుండ వలయును అప్పుడే అది సామాజికునకు విశ్వసనీయమై రమణీయముగా భాసించును. నవీనము కన్న ప్రసిద్ధ కథావస్తువే శ్రేష్ఠము; ఐనను సమకాలీన యుగమున కనుగుణముగా ప్రసిద్ధ కథా వస్తువును మలచుటలో కవి మౌలిక ప్రతిభను ప్రదర్శింప వలసియుండును.

2. తానెన్నుకొన్న కథా వస్తువును గురించి కవి గంభీరముగా, నవ్యముగా, వివేక సమ్మతముగా ఆలోచించి తద్వారా సార్వజనీన సత్యము ధ్వనించునట్లు రచింప యును.

3. ధనాపేక్షకు లోనైన కవులు సక్రమంగా, వివేక సమ్మతంగా ఆలోచింపలేరు ఉత్కృష్ట కావ్యమును రచింప లేరు, కనుక కావ్యరచన వేళ కవులు ధనార్జన దృష్టిని విడనాడ వలయును.

4. సౌందర్య వంతమై, శివ రూపాత్మకమైనంత మాత్రమున కావ్యము సత్కావ్య ముగా రాణింప జాలదు. సత్కావ్యము సామాజిక హృదయమును స్పందింపజేయ వలయును; మానవత నుపదేశించి జీవనమును సంస్కరింప వలయును; ధైర్య సాహసములను పెంపొందింప వలయును; శ్రమక్లాంత మానవులకు విశ్రాంతి నొసంగ వలయును; సంస్కృతిని, సభ్యతను కాపాడుచు ప్రజానీకమును ప్రగతి పథమున నడిపించ వలయును.

5. వస్తువున కనురూపమైన శైలిని, ఛందమును సత్కావ్యము కలిగియుండ వలయును.

6. కావ్య అంగ, ఉపాంగములన్నీ ఔచిత్య వంతముగా సంయోజితములై యుండ వలయును.

7. సత్కావ్యశైలి ప్రధానముగా మూడు గుణములను కలిగి యుండవలయును. అవి- ఉపయుక్త శబ్ద చయనము, ప్రభావోత్పాదకమైన సంగ్రహాభివ్యక్తి, మరియు స్పష్టత. శైలియందు ఈ గుణములు నెలకొని యుండుటకై శబ్దముల ఎంపిక యందు మరియు వానిక్రమిక సంయోజనమందు కవి అత్యంత సావధాన మతియై యుండవలయును– In style it is order and connection that are all important.

8. సత్కావ్యము అడంబరశైలితో ప్రారంభింపబడ కూడదు అట్లే జరిగియున్నచో మొదట పాటింపబడిన ఉదాత్తత తరువాత పాటింపబడక పోవచ్చును. సామాజికుడు నిరాశకు లోనయ్యే అవకాశము కలదు. కనుక సత్కావ్యశైలి సామాన్యము నుండి సంశ్లిష్టమునకు (Simple to complex) పురోగమింప వలయును.

9. సత్కావ్యము సేంద్రియ ఐక్యతను (Organic unity) కలిగియుండ వలయును. కావ్య విభిన్నాంగములు పరస్పర సన్నిహితములై యుండవలయును.

10. సత్కావ్యము పునఃపునః సమీక్షింపబడిన తరువాతనే ప్రకాశింపబడవలయును.

## దోషములు - Defects.

కావ్యము అల్పతరముగా నుండుటయే గొప్ప దోషముగా హోరేస్ పరిగణించెను. ఉత్కృష్టతచే కొరవడిన కావ్యము నిశ్చయముగా దుష్టమని తెలిపెను. If a poem has not exellence, it is definitely bad- కనుక లిఖిత ప్రతిని తొమ్మిది సంవత్సరముల వరకు ప్రకాశమునకు తేరాదని అతని అభిప్రాయము. మొదట సత్కావ్యము సహృదయ విమర్శకునిచే సమీక్షింప బడవలయును. తదనంతరం రచయిత స్వయముగా నిర్వ్యైక్తిక భావంతో తన రచనను పరీక్షించు కొనవలయును. ఈ తీరున సమీక్షింపబడినపుడు కావ్యదోషములు బహిర్గతము లగును. రచయిత ఆ దోషములను పరిష్కరించు కొనవచ్చును. కావ్యమపుడు నిర్దోషమై రాణింపగలదు- Put your manuscript away and kep t it for nine years.

ఉదాత్త కావ్య మందే దోషము లుండుట సహజమని హోరేస్ తెలిపెను. వానిని కవి మానసిక దౌర్బల్యతకు పరిణామములుగా భావించి క్షమింప వచ్చును. కాని సామాన్య కావ్య మందలి దోషములు అక్షమ్యములని ఆయన తెలిపెను. విషయము సామాన్యమైనపుడు దానిని కళావంతముగా తీర్చిదిద్దజాలని కవి అసమర్థుడే యగును. కాని ఉదాత్తకావ్యమునకు తద్కవికి ఈనియమము వర్తింపదు. ఎట్లన- ''కొన్ని దోషములను క్షమింప వచ్చును. విలుకాని బాణములన్ని లక్ష్యమును భేదించ లేవు. వాస్తవంగా గుణాధిక్యతను కలిగియున్న కవితయందే దోషము లుండుట సహజము. వానిని క్షమించుటలో నాకెట్టి ఆపత్తి యుండనేరదు. ఇట్టి దోషములు అజాగ్రత్త మరియు మనోదౌర్బల్య కారణమున జరుగుచుండును" 9.

అజాగ్రత్త మరియు మనోదౌర్బల్యము మూలమున ఏడ్పడిన దోషములు క్షమ్యములే యైనప్పటికిని అవి పునరుక్తములు కారాదు. అట్లయినచో వానిని క్షమింప రాదు. మహాకావ్య మందు రసవత్తర ఘట్టములతో పాటు నీరసములు కూడా యుండవచ్చును. ఐనను అవి స్వాభావికములుగనే పరిగణింప బడును. హోమర్ కావ్యము లందలి కొన్ని ఘట్టములను చదువునపుడు మనకు నిద్రరావచ్చును. కాని సామాన్య కావ్యమందు అట్టివి అసహ్యములుగా, అక్షమ్యములుగా పరిగణింప బడును.

## ఔచిత్య సిద్ధాంతము - Theory of Propriety.

అరిస్టాటిల్ కావ్యసిద్ధాంతములను సమకాలీన లాటిన్ సాహిత్య రచనా రీతులతో సమన్వయ పరచి హోరేస్ 'ఆర్సుపొయెటికా' యందు వ్యాఖ్యానించెను. అరిస్టాటిల్ తెలిపిన 'ఔచిత్యము'ను ఆయన తన కావ్యకళా రచనకు ప్రాతిపదికగా గ్రహించెను. ఈ దృష్టి కావ్యకళ యందు ఆది నుండి అంతము వరకు నిర్వహింపబడినది. కావ్య రచనాత్మక దృష్టితో మరియు కావ్య ప్రయోజనాత్మక దృష్టితో ఆ సాహిత్యాచార్యుడు ఔచిత్యమును ప్రధానముగా భావించెను. ఔచిత్య రహితమైన కవి యొక్క కావ్యశ్రమ యంతయు నేల విడిచి చేసిన సాము యగునని ఆయన కవులను హెచ్చరించెను. కావ్య మందు ఔచిత్య ప్రాధాన్యతను హోరేస్ ఈ ఉదాహరణము ద్వారా స్పష పరచెను- ''ఒక వేళ ఎవరేని చిత్రకారుడు గుఱ్ఱము మెడకు మానవ శిరమును జత పరచినట్లు పైభాగమును అందమైన స్త్రీ రూపముగా, అధో భాగమును వికారమైన చేప రూపముగా మరియు నానా జంతువుల అవయవముల నందు సంయోగ పరచి వానిపై రంగుల రెక్కలను చిత్రించినచో ఆ చిత్రమును ఏకాంతంగా తిలకించినపుడు మిత్రమా! నీవు నవ్వును ఆపుకో గలవా?'' 10.

హోరేస్ దృష్టియందు ఔచిత్యము కావ్య విభిన్నాంగములకు అన్వయించు కావ్య ప్రధాన తత్త్వము. ఆ రోమన్ ఆచార్యుడు వివరించిన ఔచిత్య సిద్ధాంతమును ఈ శీర్షికల ద్వారా గ్రహింపగలము.

1 విషయ-ఔచిత్యము- Propriety of plot :- కావ్య వస్తువది పరంపరాగత సిద్ధమైనను, కవి స్వకపోల కల్పితమైనను, లేదా నవీనమైనను సమకాలీన యుగ జీవనమున కనురూపముగా రచిత మగుటయే విషయౌచిత్యము. సామాజిక దృష్టితో నవీనము, కల్పితముకన్న ప్రసిద్ధ కథా వస్తువే ఔచిత్య వంతంగా నుండును. కారణమేమన అట్టి కథావస్తువు ప్రేక్షకునకు సుపరిచిత మగుట వలన ఆతని శీఘ్ర రసానుభూతికి తోడ్పడును. ప్రసిద్ధ కథావస్తువునందు కవి కల్పించు నూతన సన్నివేశములు సామాజికుని విశ్వాసమును చూరగొనునట్లుండ వలయును. కవి తన జీవన దృక్పథమును ప్రకటించునపుడది సమకాలీన జీవన విధానమున కెంతవరకు తగియున్నదో పరిశీలించుకొన వలయును. నవీనమైన కల్పిత కథా వస్తువు నందు ఔచిత్యమును పాటించుట శ్రమ సాధ్యము. అందువలన కల్పిత కథావస్తువుకన్న

ఈలియడ్ కథావస్తు నాటకీకరణమే వివేక సమ్మతంగా నుండునని హోరేస్ తెలిపెను- You act more wisely dramatising the Iliad than by introducing a subject unknown and unsung కథావస్తు స్వభావమున కుపయుక్తమైన కావ్య రూప సంపాదన కూడా విషయౌచిత్యముగా పరిగణింపబడును విషాద రూపక కథావస్తువుకు హాస్యరూపక రూపమును కల్పించుట, అట్లే హాస్య రూపక కథావస్తువుకు విషాద రూపక రూపమును కల్పించుట విషయ అనౌచిత్యమే యగును. కనుక కవి కథావస్తు గ్రహణమందు కూడా ఔచిత్యమును పాటింపవలయును.

2. పాత్ర - ఔచిత్యము- Propriety of Characters ;- పాత్రౌచిత్యమును హోరేస్ రెండు రకములుగా తెలిపెను. ఒకటి పాత్ర చిత్రణ మందు మూలపాత్ర రూపమును సురక్షితంగా కాపాడుట. రెండు వయసున కుపయుక్తమైన రీతిలో పాత్ర చిత్రింపబడుట. ప్రసిద్ధ పాత్రలను సమకాలీన యుగమున కనుగుణంగా చిత్రించునపుడు మూల పాత్ర యొక్క స్వభావము. గుణశీలాదులకెట్టి భంగమును కల్గింపరాదు. ఉదాహరణముగా 'అఖిల్లెస్' పాత్రను కవి పరంపరాగత స్వరూపమున కనుగుణముగా సర్వ సతంత్రునిగా, అజేయునిగా, ఆవేశపరునిగా చిత్రింపవలయును. అట్లే 'మేడియా' ను దీక్షాపరురాలిగా, దుర్దమనీయ నారిగా వర్ణింపవలయును. ఇట్టి పాత్ర చిత్రణ సామాజికుని దృష్టితో ఔచిత్యవంతంగా యుండును. కారణ మేమన అతడా యా పాత్రల గుణ శీలాదులతో సుపరిచితుడై యుండును.

పాత్ర పోషణ ఆయా పాత్రల అవస్థల, పరిస్థితుల కనుగుణముగా నుండవలయును ఉదాహరణముగా శిశువర్ణన శైశవావస్థకు తగినట్లుగా నుండవలయును. ఇపుడిపుడే మాటలు నేర్చి నడవగలిగిన శిశు మానసిక స్థితి యందు సత్వర పరివర్తన కలుగుట సహజము. కిశోరుడైన బాలుడు ఉపాధ్యాయుడు లేకుండా చూచి పెంపుడు కుక్కలతో ఆటాడుట యందను రక్తుడగును; యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము ఆ అవస్థ యందుండదు యౌవన దశ యందు ఆశయములలో అభూత పరివర్తనము కానవచ్చును; సుఖాపేక్ష హెచ్చగును; సాహస కార్యము లందను రక్తి పెరుగును. వృద్ధాప్య మందలి స్థితి ఇందుకు భిన్నంగా నుండును. చిత్తవృత్తి సంకీర్ణ మగును. గత వైభవమే ప్రస్తుతముకన్న భవ్యతరముగా తోచును; నవీనతపై నిరసన యేర్పడును.

పై విధముగా పాత్ర చిత్రణ మందు కవి ఔచిత్యమును పాటించినపుడే ఆ పాత్రలు, నవీనములైనను లేదా ప్రాచీనములైనను మన కనుల ముందు నడచుచున్నట్లు ప్రాణవంతములుగా ప్రత్యక్షము లగును. ప్రసంగాను కూలముగా పాత్ర చరిత్ర యందు పరివర్తన సంభవించుట సహజము. ఐనను ఆ పరివర్తన పాత్ర ఆశయమునకు స్వభావమునకు ఉత్కర్షతను చేకూర్చునదిగా నుండవలయును. కళాత్మకముగా నుండవలయును.

ఘటన-ఔచిత్యము Propriety of incidents :- నాటక కథావస్తువు రంగశాలయందు ప్రదర్శింపబడును కథా వస్తువుకు సంబంధించిన సంఘటనలనేకములుగా నుండవచ్చును. అవి యన్నియు ప్రదర్శనీయములు కావలయునను నియమము లేదు. సముద్రము, యుద్ధము, దారుణ కృత్యములు మున్నగు సంఘటనలను రంగశాలయందు ప్రదర్శించుట వలను పడదు. అందువలన ఆయా సంఘటనల జ్ఞానమును ప్రేక్షకులకు సూచనల ద్వారా కల్గింప వలయును ఈ కథావస్తువు నందలి ఏయే ఘట్టములు వర్జనీయములో అవి రంగశాలయందు ప్రదర్శింపక యుండుటయే ఘటనౌచిత్యము. ప్రదర్శనకు అననువుగానుండి ప్రేక్షకుని మానసిక ఆందోళనకు, నిరసనకు హేతువులుగా పరిణమించునవిగా నున్నచో వానిని రంగస్థలమందు ప్రత్యక్షీకరింపరాదు ఇట్టి ఘట్టములను సూచ్యములుగా నుంచుటయే శ్రేష్టము. ఈ విషయమున హోరేస్ అభిప్రాయ మిది—

"కార్య వ్యాపార మేదియైనను రంగశాలయందు ప్రదర్శితము కావచ్చు లేదా సూచితముగానైనా యుండవచ్చును పేక్షకుడు తన కనుల ముందున్న దృశ్యమునే విశ్వసించును. వీనుల ద్వారా వినిన దానికన్న కనుల ద్వారా కాంచినదే అధిక ప్రభావ వంతమగును కనుక పరోక్షముగా జరుపబడు సంఘటనలను నీవు రంగశాలయందు ప్రదర్శింపరాదు. అట్లే నటునిద్వారా క్రమక్రమముగా వ్యక్తీకరింపబడు విషయమును కూడా ప్రేక్షకునియెదుట ప్రదర్శించు యత్నము చేయకుము. ఉదాహరణముగా 'మేడియా' తన కుమారులను తానే స్వయముగా వధించి ప్రదర్శించుట లేదా 'అట్రియస్' నరమాంసమును వండుట. 'ప్రోక్నె' పక్షి రూపమును ధరించుట 'కామెడస్' సర్పరూపమును పొందుట మున్నగునవి రంగశాలయందు ప్రదర్శనకు ఉపయుక్తములు కానేరవు. ఇట్టి సన్నివేశములు నాటకమందు ఉన్నచో అవి నా మనసునందు అవిశ్వాసమును మరియు విరక్తినే సృష్టించును." 11.

4. అభినయ ఔచిత్యము– Propriety of acting :- సంఘటనలతో
ల కార్యకలాపములందు కూడా ఔచిత్యము పాటింపబడవలయును.
తాను ప్రేక్షకులపై ఎట్టి ప్రభావమును నెరప దలచుకున్నాడో దాని
న అభినయము ద్వారా నటకులు ప్రేక్షకులను పరిభావిత పరచ వల
నటకుల అభినయము, సంవాదములు పాత్రల మనోదశలను ప్రత్యక్షీక
నుండ వలయును. అపుడే నాటకకర్త ఉద్దేశ్యము నెరవేరును. ప్రేక్షకు
దలచినపుడు నటకుని ముఖము హాస్యస్మితమై యుండవలయును. అ
అభీష్టమైనపుడు నటుని ముఖము విషాద భరితమై చూచుటతోడనే ప్ర
నసము కరుణాంత రంగితము కావలయును. నటుల వచనములు కూ
మనోదశలను స్వరిత మొనర్చునట్లుండ వలయును. శోకార్త హృదయు
నుండి దుఃఖాత్మక శబ్దములు, కుపితుడైనవ్యక్తి ముఖము నుండి రోషా
శబ్దములు; ప్రశాంత చిత్తుడైన వ్యక్తి ముఖము నుండి పరిహాసోక్తులు,
తనా పరుడైన వ్యక్తినుండి ఓజోగుణ శబ్దములు జాలువారు చుండ
హోరేస్ ఈ సందర్భమున ఇట్లు వచించెను–

"గాంభీర్యము ఉల్లాసమందు పర్యవసిత మగు విధముగా ప్రేక్షకుల
స్యమును ప్రదర్శింప వలయును. దివ్యులు లేక వీరులైన నాయకుల
యందు ప్రత్యక్షమైనపుడు వారు రాజోచితములైన స్వర్ణిమ, నీలలో
రణచే ప్రత్యేకముగా శోభింప వలయును. వివాదములందు జరుపబడు
వార్తాలాపము లందు వారిని చేర్చరాదు. నా ఉద్దేశ్య మందు వనదే
శాల యందు ప్రవర్శించు నపుడతి జాగ్రత్త వహింపవలయును. ప్రణ
దు వారు నగర యువకు లుపయోగించు భాషయందు మాట్లాడరాదు.
కర పరిహాసోక్తుల వాడరాదు. నాగరికులు, ధనాఢ్యులిట్టి దోషములను

5. శబ్ద-ఔచిత్యము– Propriety of words :- కావ్యవస్తు గ్రహణ
త్య మెంత ప్రధానమో, రచనయందు అంతే ప్రధాన మగును. కావ
క్తీకరణకు ఉపయుక్త పదముల ఎంపికయందు మరియు వాని సంయో
కృత్రిమములును, డాంబికములునైన పదప్రయోగమును కవి సర్వ
వలయును. సరళ వ్యావహారికములు, గంభీర ధ్వని యుక్తములైన
మాత్రమే కవి ఉపయోగింప వలయును. రుక్ష శబ్దములను మసృణము
వలయును. ఈ విధముగా పదచయన మందు కవి ఔచిత్యమును తప

వలయును వాని సంయోజన మందు సైతం అప్రమత్తుడై యుండ వలయును; ఔచిత్య దృష్టితో పదములను సంయోజింప వలయును. పదక్రమమును పాటించి సురుచిరము నొనర్ప వలయును. పదముల క్రమయుక్త సంయోజనము శైలి యందు ప్రధానముగా భావింపబడును. కనుక శైలీ రామణీయకమునకై కవి శబ్దౌచిత్యమును పాటింప వలయును. అన్యథా శైలి శిథిల మగును.

6 వృత్తి-ఔచిత్యము— Propriety of metre :- ఛందములన్ని భావము లన్నింటిని వ్యక్తీకరించుటకు సమర్థవంతములు కానేరవని హోరేస్ అభిమతము. విషయమున కనుగుణముగా వృత్తులు ఉపయుక్తములగు చుండును. విషయమున కుపయుక్తమైన ఛందము నుపయోగించినపుడే కావ్యరచన శోభాయమాన మగును. ఈ విషయమును గురించి హోరేస్ ఇట్లు వచించెను— "రాజుల, సాహసోపేతులైన నాయకుల, అదే విధంగా యుద్ధ,విషాద గాథల నాఖ్యానించుటకు ఏ ఛందము ఉపయుక్తంగా నుండునో హోమర్ మనకు ఉదాహరణ పూర్వకంగా నిరూపించి యున్నాడు. ఆవేశ పరుడైన "అఖిల్లెస్"ను ఆయన సహజమైన లఘు-గురు ద్వి వర్తిక ఛందముతోనే మూర్తిమంతము కావించెను. విషాద, హాస్య రూపక కర్త ఈ ఛందమునే అవలంబించిరి. ఏలన సంవాదమునకు ఇదియే ఉపయుక్తంగ యుండును. సాంఘిక కల్లోలమును శాంతింప జేయు శక్తి దీనికి కలదు; మరియు కార్యవ్యాపార ప్రతినిదానమున కిది సహజముగా అనుకూలించి యున్నది."

కావున కావ్య విషయమునకు తగిన ఛందము నుపయోగించుటలోనే అ వ్యక్తి-సౌందర్య మిమిడి యుంది. ఇతర అనుపమయుక్త ఛందముల ఉపయోగము సౌందర్య హానిని కల్గించును. మహాకావ్యమునకు షట్పది (Hexametre) విషాద, హాస్య రూపకములకు, వ్యంగ్య కావ్యములకు లఘు-గురు ద్విమాత్రిక ఛందము (Iam bic metre) శోక కావ్యమునకు కరుణాత్మక గీతము (Elegaic) విజయ స్తవనమునకు సంబోధనా గీతము(Ode) ప్రేమాభి వ్యంజనకు ప్రగీతము(Lyric) ఉపయుక్త ఛందము లగును. ఇట్లు కావ్య వస్తువునకు ఛందముతో అవిభాజ్య సంబంధ మేర్పడి యున్నది. కావున ఏయే కావ్యరూపముల కేయే ఛందము ఉపయుక్తముగా నుండునో కవి గుర్తించి యుండ వలయునని హోరేస్ ఇట్లు తెలిపెను—

"నాకు పరంపరాగత నియమముల మరియు కావ్య రూపముల జ్ఞానము లేనపుడు మరియు వానిని నేను పాటించనపుడు కవిగా పిలువబడు అధికారము నాకెక్కడిది?"

7. శైలీ- ఔచిత్యము– Propriety of composition;- కావ్య రూపము లనేకములు. అందువలన రూపమున కనుగుణమైన శైలి ఏర్పడుట తథ్యము. కనుక ఒకే శైలి కావ్య రూపము లన్నింటికి. అట్లే శైలీ రూపములన్ని ఒకే కావ్యరూపమునకు ఉపయుక్తము లగునని భావింపరాదు. కావ్య రూపమున కనుగుణమైన శైలిని ఉపయోగించుటయే శైలీ ఔచిత్యము. మాధుర్య, ఓజ ప్రసాద గుణములు శైలికి ఆవశ్యకము లగును. శైలి ప్రసంగానుకూలముగా నుండ వలయును. సంవాద శైలి పాత్రల లింగ, అవస్థ, జాతి, స్థాయి, మానసిక స్థితికి అనుగుణముగా నుండి జీవన వాస్తవికతను స్ఫురింప జేయవలయును. లేని యెడల నాటకము ప్రేక్షకులపై ఉద్దిష్ట ప్రభావము నెరప జాలదని హోరేస్ కవుల కీ సలహా నొసంగెను–

''సంక్షిప్తతా కారణమున అస్పష్టత నంగీకరింపకుము; స్పష్టతా ప్రయాస మందు శక్తిహీనునిగా పరిగణింపబడకుము; ప్రసిద్ధికై బహుళ ఛందో ప్రయోగ కునిగా వ్యవహరింప బడకుము; సామాన్య ప్రదర్శనా నెపమున నీరసుడవు కాబోకుము; బహుళ ప్రయోజన ప్రాప్తి కారణమున మర్యాదా రహితునిగా మారకుము; నీ అభివ్యక్తీకరణ మందు నిజాయితీ పరునిగా నుండుము.''

## వ్యావహారిక విమర్శకుడు - A Practical Critic.

కావ్యశాస్త్రము సైద్ధాంతకము మరియు వ్యావహారిక మని ద్విముఖము. ప్రసిద్ధ సాహిత్య కృతులను పరిశీలించి వానికి అన్వయించునట్లు సిద్ధాంతములను ప్రతిపాదించుట సైద్ధాంతికము. ఆ సిద్ధాంతములను దృష్టియందుంచుకొని కావ్యకృతులను వివేచించి మూల్యమును నిర్ధారించుట వ్యావహారికము. సైద్ధాంతిక విభాగము ప్రతిపాదకుని గంభీర చింతనను, మౌలిక ప్రతిభ నపేక్షించును. ఈ దృష్టితో ఆర్స్ పొయెటికా ను పరిశీలించినపుడు పూర్వాచార్యులు తెలుపని నూతన సిద్ధాంతమును దేనిని కూడా హోరేస్ ప్రతిపాదించ లేదని స్పష్టమగును. ఆయన కావ్య ఆంతరిక తత్త్వమును పరిశీలింప లేదు; కావ్య రూప తత్త్వమైన భాషా ప్రయోగము, శైలి, ఛందము, అలంకారము మున్నగు వాని పరిశీలన వరకే తన దృష్టిని పరిమితము కావించెనని బోధపడును. అందువలన హోరేస్ ప్రతిభావంతుడైన సాహిత్యాచార్యుడు కానేరడను అభిప్రాయము ప్రచారములోనికి వచ్చినది వాస్తవముగా హోరేస్ కావ్యరచన మరియు కావ్య ప్రయోజనమును గురించి చర్చించియే

యున్నాడు. కావ్య రచనకు ప్రతిభ, అభ్యాసము- రెండింటిని ఆయన సమర్థించియే యున్నాడు; కావ్య ప్రయోజనమును ఉపదేశాత్మకమైన ఆనందముగా వివరించెను. అన్నింటికి మించి ఆయన ఔచిత్యమును ప్రధాన తత్త్వముగా ప్రతిపాదించెను ఐనప్పటికిని హోరేస్ మౌలిక ప్రతిభా సంపన్నుడైన కావ్యతత్త్వవేత్తగా పరిగణింప బడలేదు 'వర్స్ఫోల్డ్' తెలిపినట్లు 'ఆర్స్‌పొయెటికా' అరిస్టాటిల్‌కావ్య శాస్త్రమునకు పునరుక్తిమాత్రముగా నుండుటను కారణముగా భావింప వచ్చును. ఆయన వివరించిన కావ్య ప్రయోజనము పూర్వాచార్యులచే తెలుపబడియున్నది. ఔచిత్య ప్రతిపాదన హోరేస్ మౌలికము కాదు అరిస్టాటిల్ ఔచిత్య ప్రాధాన్యతను తెలిపియే యున్నాడు. దానిని హోరేస్ విభిన్న సాహిత్యాంగములకు అన్వయించెను. ఈ తీరున హోరేస్ తన రచన యందు కావ్యాత్మను వివేచించు గంభీర చింతనను కాని మౌలిక ప్రతిభా పాటవములను కాని ప్రదర్శింపలేక పోయెనని పలువురి అభిప్రాయము.

హోరేస్ స్వయముగా ఇట్లు తెలిపెను- తన కెట్టి ఆధూ క్రము కలుగకుండా ఇతరములను ప్రకాశింప జేయు సానపట్టు రాయిగా నాకు నేను భావించుకొన్నాను. నేనేదియును రచింపక పోవచ్చును. ఐనప్పటికిని రచయితలకు వారి విద్యుక్త ధర్మమును గుర్తు చేసెదను. వారికి కావ్యసామాగ్రి ఎట లభింపగలదు? ఎయే అంశములను పాటించినపుడు వారు కవులుగా పరిగణింపబడగలరు ? ఏయే విషయములు వారికి స్వీయములుగా భావికములు కాగలవు? అట్టి జ్ఞానమెట ఉపలబ్ధమగును? మరియు తప్పిదమెట దొరలి పోవును? వీని నన్నింటిని వారికి నేను తెలియజేతును. కనుక సమకాలీన పరిస్థితుల కనుగుణముగా కవులను ఉదాత్త కావ్య రచనా ప్రవృత్తుల కావించుటకై హోరేస్ వ్యావహారిక కావ్య విమర్శ యందే తన దృష్టిని నిలిపెనని బోధ పడును. ఆతని యుగ మందు సాహిత్య జగత్తు నందిట్టి కావ్యశాస్త్ర ఆవశ్యకత ఏర్పడి యుండెను కవులకు కావ్య-కళా శిక్షణ అవసరమై యుండెను. అందువలన సిద్ధాంత ప్రతిపాదనమందు శ్రద్ధ వహింపక, ప్రతిపాదితములై యున్న సిద్ధాంతముల ఆచరణయందే ఆయన అధిక శ్రద్ధ వహించెను. కావ్యరచనకు ఉపయుక్తమగు కావ్య సంప్రదాయ మేమైయుండ గలదు? స్వదేశీయమైన లాటిన్ సంప్రదాయమా? లేక విదేశీయమైన గ్రీకు సంప్రదాయమా? యను వివాదము తలయెత్తిన రోజులలో హోరేస్ 'ఆర్స్ పొయెటికా'ను రచించి పరిష్కారమును చూపించెను. ఈ దృష్టితో హోరేస్ కావ్యశాస్త్ర వికాసమునకు తోడ్పడెనని అంగీకరింపక తప్పదు.

లాటిన్ సాహిత్య సర్వతోముఖ వికాసమునకై హోరేస్ గ్రీకు కావ్య సంప్రదాయమును సమర్థించెను. దానిని స్వదేశీయ లాటిన్ సంప్రదాయముతో సమన్వయ పరచి సాంప్రదాయిక వాదమును (Classicism) స్థాపించెను. పాశ్చాత్య శాస్త్ర మందు హోరేస్ సాంప్రదాయిక వాదిగా ప్రసిద్ధుడు. ఐనను ఆయన గ్రీకు సంప్రదాయ అంధానుకరణమును సమర్థించ లేదు. రోమ్ సామ్రాజ్యవైభవమును రోమనుల నాగరిక జీవనమును ప్రతిఫలింప జేయు ఉదాత్త సాహిత్య రచనకు గ్రీకు సంప్రదాయానుగమనము తప్పదని ఆయన కవులకు ఉద్బోధించెను. ఇట్టి సృజనాత్మక దృక్పథమును కలిగి యుండ వలయునని హోరేస్ కవులకు సలహానొసంగెను.

కవితా స్వరూపమును హోరేస్ ఇట్లు తెలిపెను- కవిత మనోవేగముల నాందోళిత పరచు క్షమతను కలిగి యుండవలయును సామాజికునకు జ్ఞాన సంపన్నమైన ఆనందమును కల్గింపవలయును. ఏదేని ఆదర్శమునకు కట్టుబడి యుండి కళా సిద్ధాంతముల సమన్వయాత్మక మూర్తిగా ప్రకాశింప వలయును ఇట్లు ఆతని మత మందు హ్లాదైకమయ మైనదే కవిత. ఆయన విశదీకరించిన కావ్యరూపాత్మక సౌందర్యము కావ్యశాస్త్ర దృష్టితో అత్యంత ప్రధానమైనది. కావ్య వస్తువున కుపయుక్తమైన కావ్యభాష; ఛందఃప్రయోగము, పదముల ఎంపిక మరియు వాని సంయోజనము, అలంకార ప్రయోగము మున్నగు కావ్య బాహ్య అంగముల జ్ఞానము రచయిత లందరికి ఆవశ్యకము. వీని వివేచన మందు హోరేస్ కావ్యవ్యావహారిక సమీక్షా దృష్టితో కృతకృత్యుడయ్యెను. ఔచిత్యమును కథావస్తువు, పాత్రలు, అభినయము, శైలి వరకు అన్వయించి వ్యావహారిక సమీక్షకు సరియైన కావ్య ప్రమాణము నేర్పరచెను. ఔచిత్యము కేవలము కావ్య రూపమునకే పరిమితం కాదు. అది సమగ్ర కావ్య రచన యందు అనుస్యూతమై యున్నది.

పై విధముగా హోరేస్ ఉదాత్త సాహిత్యమును సమర్థించి తద్రచన కావశ్యకములైన మార్గముల నిర్దేశించెను. తన రచన ద్వారా ఆయన కవులకు కావ్య 'క్షణ నిచ్చెను. కావ్య సిద్ధాంతములు కవులకు కావ్య రచనవేళ ఎట్లు ఉపకరించు 'ో వివరించెను. దర్శనముతో ముడివడియున్న అరిస్టాటిల్ కావ్యసిద్ధాంతములను ఆచరణాత్మకముగా రూపొందించిన ప్రథమ పాశ్చాత్య సాహిత్యాచార్యుడు హోరేస్. ఈ యత్నమందాతడు కావ్యశైలీ తత్త్వము నందే తన దృష్టిని కేంద్రీకరించుట సహజమై యున్నది.

నూతన కావ్య సిద్ధాంతాముల ప్రతిపాదన ఆర్స్ పొయెటికా యందు కాన రానప్పటికిని అది నెరపిన ప్రభావమందెట్టి కొరతకానరాదు. దాదాపు రెండు శతాబ్దములపాటు హోరేస్ ఆర్స్‌పొయెటికా పాశ్చాత్య సాహిత్యమును ప్రభావిత మొనర్చినది. మధ్యయుగ మందు ఆర్స్‌పొయెటికా ఏకైక కావ్యశాస్త్ర గ్రంథముగా పాశ్చాత్య సాహితీ వేత్తలకు తల మానికమై వెలసింది అంతేకాదు ఆర్స్‌పొయెటికా అధ్యయనము ఆరిస్టాటిల్ అధ్యయనము వినా సంభవం కానేరదను భావం కూడా ఆనాడు ప్రచారంలో నుండెను కావ్య సిద్ధాంతానుసరణ నెపమున కవులు సామాజికులను నీతి భ్రష్టుల కావించునపుడు వారికి కావ్య శిక్షణ తప్పదు. అదియును ప్రాచీను లేర్పరిచిన ఆదర్శమార్గముల కనుగుణముగా నున్నపుడే అందరికి ఆమోద యోగ్య మగును లేనియెడల నవ కవులు కావ్యా-కళా శిక్షణ యెడ ఉపేక్ష భావమును వహింతురు. ఈ దృష్టితో హోరేస్ ఆర్స్‌పొయెటికా ప్రశంసాత్మక రచనగా పరిగణింప బడును. క్వింటీలియన్ యను సాహిత్యాచార్యుడు ఆర్స్‌పొయెటికాను ఉదాత్త సాహిత్య రచన కుపకరించు కావ్యశాస్త్ర రచనగా కొనియాడెను. అబర్ క్రోంబి యను ఆంగ్ల సాహిత్య విమర్శకుడు హోరేస్ నిట్లు ప్రశంసించెను– ''మొత్తము మీద ప్రభావాత్మక దృష్టితో పరిశీలించినపుడు కావ్య శాస్త్ర చరిత్ర యందు ఆరిస్టాటిల్ తరువాత ఎన్నదగిన సాహిత్యాచార్యునిగా హోరేస్‌ను పరిగణింపక తప్పదు. కావ్యశాస్త్రము సాహిత్య అవగాహనకు తోడ్పడునదిగా నిరూపించిన ప్రథమాచార్యుడు ఆరిస్టాటిల్. దానిని సమగ్రి యూరపు ఖండమునంద ఆచరణాత్మక రూపమున ప్రచారమునకు తెచ్చిన ద్వితీయా చార్యుడు హోరేస్

డా॥ నగేంద్ర యను ఆధునిక ప్రసిద్ధ హిందీ విమర్శకుడు హోరేస్ కా కళ నిట్లు సమర్థించెను — ''హోరేస్ యుగ మందు ప్రజలు సాహిత్యము, అర్థోపలబ్ధికి సాధనముగా భావించి యుండిరి. ఇట్టి ప్రవృత్తి సముచితము కానేరదని హోరేస్ వ్యతిరేకించెను; సాహిత్య నిశ్చిత ఉద్దేశ్యములను ప్రతిపాదించెను. ఆ ఉద్దేశ్యము లివి– నైతిక శిక్షణ మరియు ఆనందము.''

హోరేస్ ప్రధానముగా రచయితను మరియు ఆతని రచనా వ్యాసంగమును గురించి వివరించెను. అందు పేర్కొనదగిన ప్రధానాంశములు రెండు– ఒకటి రచయిత అత్యధిక ధనాపేక్షకు లోను కారాదు; రెండు తన రచన అత్యంత శీఘ్రముగా ప్రసిద్ధి నొందవలయు నను అపేక్షను కలిగి యుండరాదు. పై రెండు అంశములు అల్పతర రచయితలకు అన్వయించు సార్వకాలీన దోషములు కనుక ఉత్తమ

రచయితలుగా రాణింప దలచు కొనువారు ఆ రెండు అంశములను దృష్టియందుం చు కొన వలయునని హోరేస్ హెచ్చరించెను.

## భారతీయ దృక్పథము – Indian Veiw.

సాహిత్య రూపములను పరిశీలించిన ప్రథమ భారతీయాలంకారికుడు భామహుడు. ఆయన కావ్యబంధ(స్వరూప)దృష్టితో సాహిత్యమును ఐదు రూపములందు విభజించెను. అవి– 1. సర్గ బద్ధము 2. అభినేయ వస్తుకము 3 ఆఖ్యాయిక 4. కథ 5. అనిబద్ధము లేదా ముక్తకము. ప్రదర్శించుటకు వీలైనది అభినేయ వస్తుకము అనగా నాటకము. సర్గబద్ధమన పూర్వాపర సంబంధమును కలిగియున్న పద్య కావ్యము లేదా మహాకావ్యము. అనిబద మన స్వతంత్ర శ్లోకము. కథ మరియు ఆఖ్యాయిక– ఇవి రెండును గద్యమందు పూర్వాపర సంబంధముతో రచింపబడును. కథ యందు వేరొక పాత్ర ద్వారా నాయక వృత్తాంతము వర్ణిత మగును. ఆఖ్యాయిక యందు నాయకుడే స్వయముగా తన చరితమును వివరించును. ఈ రెండింటి యందు భేదము లేదని దండ్యాచార్యుడు తెలిపెను. అవి పూర్వాపర సంబంధమును కలిగి యున్నందున మహాకావ్య మందే చేరును. కనుక భామహుని దృష్టి యందు సాహిత్య రూపములు ప్రధానములుగా మూడు– ముక్తకము, మహాకావ్యము. రువాత వామనుడు 'బంధ' దృష్టితో సమగ్ర సాహిత్యమును రెండుగా విభజిం ను. 1. నిబద్ధములు– కావ్యనాటకములు 2. అనిబద్ధములు– ముక్తక శ్లోకములు. తీరున వామనుని దృష్టి యందు కూడా కావ్యప్రధాన రూపములు మూడే యని ోధపడును. ముక్తకము లేదా గేయము, నాటకము మరియు కావ్యము. పాశ్చాత్య సాహిత్య ప్రపంచ మందు సైతము పైన పేర్కొనబడిన ప్రధాన సాహిత్య రూపములే కానవచ్చును. ఆ రూపములే యుగానుకూలముగా, సామాజిక అభిరుచి కనుగుణముగా అనేక అవాంతర రూపములను పొందినవి. హోరేస్ గేయ, నాటక, కావ్యములను గురించి వివేచించెను. వాని స్వరూపములను భారతీయ కావ్య దృష్టితో సంగ్రహముగా పరిశీలింతము.

## గేయము – Lyric.

భారతీయ–పాశ్చాత్య సాహిత్యాచార్యులు గేయమును సాహిత్య తొలి రూపముగా గుర్తించిరి. అత్యంత ప్రాచీన కాలమున ప్రకృతి చిద్విలాసమునకు లోనై అనాలోచితముగా వెలువరించిన ప్రాక్తన మానవుని భాషా రూపమే గేయముగా

అవతరించినదని పండితులు తెలిపి యున్నారు ఆ రూపమే క్రమక్రమముగా వికసించి జానపద గేయ సాహిత్యముగా బహుళ ప్రచారము నొందినది. ఇందు కొన్ని స్వతంత్ర గేయములుగా మరికొన్ని పూర్వాపర సంబంధ సహితములై కథా రూపమున, మరికొన్ని నృత్యమున కనువుగా కానవచ్చును. ఈ మూడు జానపద సాహిత్య రూపములలో గేయములదే పై చేయి. ఇవి ఆ కాలమున మౌఖిక ప్రచార మందుండుట వలన పండితులు ఉపేక్షించిరి. అందువలన అవి శిష్ట సాహిత్యమందు చేరలేక పోయినవి. వీనికి బదులుగా పూర్వాపర సంబంధ నిరపేక్షములైన ముక్తక శ్లోకములు సాహిత్య మందు చోటు చేసికొని ప్రత్యేక శాఖగా ప్రసిద్ధి గడించు కొన్నవి. ప్రతి ముక్తక శ్లోకము ఒక రసగుళికగా అత్యంత ప్రసిద్ధము. సంస్కృత మందు అమరుక శ్లోకరక్త చిర ప్రసిద్ధుడు. ముక్తక మందు గానాంశ చేర్చబడగా గేయము అవతరించినది. ముక్తక- గేయములు రెండును పూర్వాపర సంబంధ రహితములే. ఐనను గేయమునందు కానవచ్చు లయాధిక్యత ముక్తక మందు కానరాదు. సంస్కృతంలో జయదేవుడు, హిందీలో మీరాబాయి, తెలుగులో క్షేత్రయ గేయ రచయితలుగా చిర ప్రసిద్ధులు. హోరేస్ తెలిపిన 'సటైర్' ఒక గేయ భేదవ ఈ గేయములు పూర్వాపర సంబంధ సహితములుగా రచితములై వ్యంగ్య కావ్య రూపమును దాల్చినవి. హోరేస్ తెలిపిన గేయ కావ్య లక్షణములన్ని భారతీయ గేయ కావ్యములకు అన్వయించును. గేయ- ముక్తకము లందు కానవచ్చు సామాన్య లక్షణము లివి-

1. గేయ మందు కవియే స్వయముగా వక్త.
2. కవియొక్క తీవ్ర భావా వేగమే గేయ ప్రాణ తత్త్వము.
3. గేయ మందు ఒకానొక భావ దశ మార్మిక రూపమున వ్యక్తీకరింప బడును.
4. గేయములు పూర్వాపర సంబంధ రహితములై ముక్తక శైలి యందు విరచితము లగును.
5. లయాధిక్యతను చేర్చుకొని గానాంశను కలిగి యుండును.
6. సామాజికుని భావములను తీవ్ర రూపమున ఉత్తేజింప జేసి రసానందము కల్గించుట గేయమునకు లక్ష్యము.

వ్యంగ్య భావాత్మక దృష్టితో చాటు పద్యములు సటైర్స్‌ను పోలి యున్నవి.

## నాటకము- Drama.

భరత విరచిత నాట్య శాస్త్రమే భారతీయ ప్రథమ లాక్షణిక గ్రంథము. ..
ముని నాటక స్వరూపమును సూక్ష్మాతిసూక్ష్మముగా వివేచించి రసానంద ప్రాప్తి
తత్ప్రయోజనముగా సిద్ధాంత మొనర్చెను. తరువాత ధనంజయుడు నాటక
రూపమును వివేచించెను. విశ్వనాథుడు పూర్వాచార్యులు తెలిపిన నాటక లక్ష
ము లన్నింటిని సాహిత్య దర్పణ మందు ఇట్లు క్రోడీకరించెను—

1. నాటకము ఐతిహాసిక ప్రసిద్ధ కథా వస్తువును కలిగి యుండ వలయును.
2. ముఖప్రతి ముఖాది సంధి యుక్తమై, విలాసాది గుణ సమన్వితమై నానా
వైభవోపేతమైన సంపూర్ణ కథావస్తువును కలిగియుండ వలయును.
3. నాటక రచన గోపుచ్ఛము యొక్క అగ్రభాగ తుల్యముగా నుండ వలయును
అనగా ఒక క్రమము ననుసరించి కథా వస్తువు వికాస మాన మగుచు ఫలప్రా
తో ముగియ వలయును.
4. దివ్యుడైన, ధీరోదాత్తుడైన లేక సద్వంశ సంజాతుడైన వ్యక్తి నాయకునిగా
నుండ వలయును.
5. సుఖ—దుఃఖాత్మక వర్ణ్య సామాగ్రి విభిన్న రసాను భూతికి ఉపయుక్తంగా
నుండ వలయును.
6. శృంగార, వీరములలో ఏదో యొకటి అంగిరసముగా నుండ వలయును.
7. నాటకము (5) నుండి పది అంకముల వరకు విస్తరింపబడ వచ్చును.

పై లక్షణముల ననుసరించి నాటకమునకు ఐదు తత్త్వము లేర్పడును. కథ
వస్తువు, పాత్రలు, రసము, అభినయము మరియు వృత్తులు, అభినయము మరియ
వృత్తి - ఈ రెండు తత్త్వములు దశ రూపకములైన నాటకము, ప్రకరణము, భాణ
ము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీధి, ఈహామృగము మరియు
అంకము లన్నింటి యందు సామాన్యము. ఐనను వీని యన్నింటిలో నాటకమే ఉ
త్కృష్టము, కారణమేమన నాటక మందలి కథా వస్తువు, పాత్రలు, రసము— ఈ
మూడు తత్త్వములు తదితర రూపక ప్రక్రియల కన్న భిన్నములుగాను, ఉదాత్త
లుగాను యుండును. ఈ దృష్టితో ధనంజయుడు నాటకమునకు కథావస్తువు, పాత్ర
లు మరియు రసము— ఈ మూడింటినే తత్త్వములుగా గుర్తించెను. నాటక సంవా
దములను ప్రత్యేకముగా గుర్తింపక ఆచార్యులు వానిని అభినయ మందే చేర్చిరి.

భరతుడు కథా వస్తువును (ఇతి వృత్తమును) ప్రధాన తత్త్వముగా గుర్తించి నాటక ప్రదర్శన యందు అది పొందు మార్పులను సూక్ష్మాతి సూక్ష్మముగా వివేచించెను. పాశ్చాత్యులవలె భారతీయులు సైతం ప్రసిద్ధము, ఉత్పాద్యము, మిశ్రమము లని కథా వస్తువును మూడు రకములుగా తెలిపి ప్రసిద్ధ కథావస్తువునే సమర్థించిరి. ఈ సమర్థనమందు ప్రేక్షక శీఘ్ర రసాస్వాదన ఇమిడియుంది. కాని శూద్రకుడను నాటక కర్త 'మృచ్ఛకటిక'మను నాటక మందు వసంతసేన, చారుదత్తులను సామాన్యులను నాయికా నాయకులుగా కల్పిత కథావస్తువును సృష్టించి కథావస్తువు ప్రసిద్ధము కాకున్నను, కల్పితమైనను ప్రేక్షకునకు రసానుభూతిని కల్గించుటలో సఫలము కాగలదని నిరూపించెను. కావున నాటక కర్త ఎట్టి కథా వస్తువును గ్రహించినను తన ప్రతిభా శక్తిచే నాటకమును రసరమ్యముగా తీర్చి దిద్దగలడని బోధ పడును.

భారతీయులు సమగ్ర నాటక కథావస్తువును అధికారికము, ప్రాసంగికము అని రెండుగా విభజించిరి. నాయకపరమైనది అధికారికము; నాయకేతర పాత్రల పరమై సందర్భానుకూలముగా అధికారిక మందు వచ్చి చేరునది ప్రాసంగికము. ప్రాసంగికము మరల రెండు రకములు 1. పతాక- ఇది అధికారికముతో సన్నిహితముగా సంబంధితమై దానితోనే సమాప్తమగును. 2. ప్రకరి- ఇది మధ్యలోనే ముగియును.

రంగశాల యందు ప్రదర్శిత మగునది నాయకుని కార్యసాధన. ఇది స్వాభావికముగా వికసించుచు ఫలప్రాప్తితో ముగిసినపుడే ప్రేక్షకునకు నాటక కథావస్తు రూపమున నున్న నాయకుని కార్యగమనము విశ్వసనీయముగా నుండి ఆతని రసానుభూతికి తోడ్పడును. ఈ దృష్టితో నాటక కథావస్తువు యొక్క స్వాభావికమైన వికాసము నాయకుని కార్య సాధన కనుగుణముగా ఐదు అవస్థల యందు విభజింపబడినది. అవి- ప్రారంభము, ప్రయత్నము, ప్రాప్త్యాశ, నియతాప్తి మరియు ఫలాగమము. నాయకుని కార్య సాధనా జ్ఞానము ప్రేక్షకునకు కల్గించుటకై కథావస్తువు ఐదు సంఘటనలుగా విభక్తమగును. అవి- బీజము, బిందువు, పతాక, ప్రకరి, కార్యము. వీనిని అర్థప్రకృతు లందురు. సమగ్ర నాటకము ఐదు అంకము లందు విభక్తమగును, వానిని సంధు లందురు. అవి- ముఖము, ప్రతి ముఖము, గర్భము, అవమర్శము మరియు నిర్వహణము.

సమగ్ర నాటక కథావస్తువు ప్రదర్శనాత్మక దృష్టితో సూచ్యము (Unpresentable) అసూచ్యము (Presentable) అని రెండు విధములుగా విభాజితము. యుద్ధము, మరణము, హింసాది క్రూర కృత్యములు రంగశాలయందు ప్రదర్శించుటకు వలను పడనందున అది సూచ్య కథా భాగముగా పరిగణింపబడును. సూచ్యమును భారతీయులు ఐదురకములుగా, అర్థోప క్షేపకములుగా పేర్కొనిరి. అవి- విష్కంభము, చూలిక, అంకాస్యము, అంకావతారము మరియు ప్రవేశిక వీని ద్వారా ప్రేక్షకునకు అప్రదర్శనీయ కథా భాగ జ్ఞానము కలుగ జేయబడును. ప్రేక్షక మానసిక స్థితిని దృష్టియందుంచుకొని భరతుడు నాటక కథావస్తువును సూక్ష్మాతి సూక్ష్మముగా పరిశీలించి చూపెను. పాశ్చాత్య సాహిత్య శాస్త్ర మందు ఇంతటి కథావస్తు సూక్ష్మ పరిశీలన కానరాదు.

భారతీయాచార్యులు నాటక పాత్రల విషయ మందు కూడా సూక్ష్మ పరిశీలనా పాటవమును ప్రదర్శించిరి నాయకులను ధీరోదాత్త, ధీరోద్ధత ధీర లలిత మరియు ధీరప్రశాంత- యను నాలుగు రకములుగా పేర్కొనిరి. నాయక సహాకులను కూడా వివరించిరి. నాయికలను భారతీయులు రమారమి (70) రకములుగా తెలిపిరి. వీరికి అనుగుణంగా నాయికా సహాయికల నియమించిరి.

నాటక మందు ప్రదర్శింపబడు కార్యమును (Action) దాని స్వభావమున కనుగుణముగా నాలుగు వృత్తులుగా భారతీయులు తెలిపిరి అవి- భారతీ, సాత్వతీ, కైశికీ మరియు ఆరభటీ. వీనికి అనుగుణముగా అభినయము నిర్ధారింప బడినది. (వివరణకు చూడుడు- క్వింటీలియన్)

ఇక నాటక ప్రయోజనము. నాటకము ప్రేక్షకుని భావముల నుత్తేజపరచి అతనికి రసానుభూతిని కల్గించునని భరతుడు తెలిపెను. ఈ అనుభూతి యందు ఆనందముతో పాటు జ్ఞానము ఇమిడి యున్నది. కనుక ఈ అనుభూతి జ్ఞానానంద మయముగా తెలుప బడెను. భరతుని దృష్టి యందు రసానుభూతి యన దివ్యానందానుభవము. ఇది విభావాను భావ సంచారి భావముల సంయోగము ద్వారా కలుగునని రససిద్ధాంతమును ప్రతిపాదించెను. ఆ రస సిద్ధాంతమే భారతీయ సాహిత్య శాస్త్ర మందు శాశ్వతముగా స్థిరపడి యున్నది.

హోరేస్ తెలిపిన వన్నియు అరిస్టాటిల్ ప్రతిపాదించిన నాటక సిద్ధాంతములే. ఆయన వాసిని సమకాలీన యుగమున కనుగుణముగా వ్యాఖ్యానించెను.

సందర్భానుగుణంగా (5) అంకములు మరియు మువ్వురు సంవాదకులు - యను రెండు విషయములను నూతనముగా చేర్చెను. నాటక ప్రయోజనమును హొరేస్ జ్ఞానానందముగనే ప్రతిపాదించెను కాని దానిని సూత్రిబద్ధము కావింప లేకపో యెను. మొత్తము మీద నాటక వివేచన మందు భారతీయాచార్యులు ప్రదర్శించిన సూక్ష్మపరిశీలనా పాటవము, కళాత్మకత పాశ్చాత్యాచార్యుల యందు కానరాదని చెప్పవచ్చును. అరిస్టాటిల్ నాటక కథా రమణీయతను గురించి సూక్ష్మముగా పరి శీలించెను. (వివరణకు చూడుము అరిస్టాటిల్ కావ్యశాస్త్రము).

## మహాకావ్యము - Epic.

అరిస్టాటిల్ కావ్యశాస్త్ర వ్యాఖ్యానమునే ధ్యేయముగా నెంచుకొన్న హొరేస్ ఏ నూతన కావ్య సిద్ధాంతమును ప్రతిపాదింపనట్లే మహాకావ్య స్వరూపమును స్పృశించెనే కాని సూక్ష్మాతి సూక్ష్మ విశ్లేషణ కావింపలేదు సత్కావ్య లక్షణ ములను తెలుపుచు అపుస కావ్య కథావస్తువుకు సంబంధించిన కొన్ని అంశములను తెలిపెను ఐనను అవియును అంతసి మౌలికములు కావు. అవి కథా రమణీయతకు తోడ్పడుచు సామాజిక రసానుభూతిని సుకరము కావించుటకై ఏర్పడినవి. భా తీయ కావ్యశాస్త్ర మందు కథావస్తు రమణీయతను గురించి ఆలోచించిన ప్రథమా చార్యుడు ఆనందవర్ధనుడు ఆయన కథారస వ్యంజకతకు ఈ నియమముల నేర్ప రచెను-

1. కథా వస్తువు, అది ప్రసిద్ధ ఉత్పాద్య, మిశ్రమములలో నేదియైనను విభావాను భావ సంచారుల ఔచిత్యమును కలిగి రమణీయముగా నుండ వలయును.
2. అనౌచిత్యములను అనగా అసందర్భ సంఘటనలను పరిహరింప వలయును.
3. రసమును దృష్టియందుంచుకొని సంధి, తదంగములను కూర్పవలయును.
4. సందర్భాను గుణముగా ఆయా ఘట్టముల ననుసరించి స . చిత రసోద్దీపన మును, రస ప్రశమనమును కావింప వలయును.
5 ఆరంభింపబడి ఆగిపోయిన రసమును మరల అనుసంధింప వలయును.
6 రసానుకూలముగా కావ్యాలంకారములను కూర్ప లయును

ఆనందవర్ధనుడు కావ్యములను మూడు తరగతులుగా విభజించెను. వస్తు ధ్వని కావ్యము, అలంకార ధ్వని కావ్యము, రసధ్వని కావ్యము, రసధ్వని కావ్యమే ఉదా త్తము. అది సామాజికునకు పరమార్థ జ్ఞానముతో పాటు ఆనందము కల్గించును.

(వివరణకు చూడుము లాంజినస్). రసధ్వని కావ్యమే హోరేస్ దృష్టి యందు సత్కావ్యము. ఆయన సత్కావ్యమునకు నిర్దేశించిన అంశములన్ని రసధ్వనియందు అంతర్భావము నొందును.

## ఔచిత్య సిద్ధాంతము – Theory of Propriety.

అరిస్టాటిల్ కావ్యశాస్త్రము నుండి ఔచిత్యమును గ్రహించి దానిని హోరేస్ 'కావ్య-కళ' యందు వివిధ కావ్యాంగములకు విస్తరించెను. కనుక హోరేన్ దృష్టి యందు ఔచిత్యాను సరణము సాహిత్య మందు అనివార్యము భారతీయ సాహిత్య శాస్త్రము నందు ఔచిత్యము విస్తారముగా చర్చింపబడినది; ఔచిత్య మను పేరుతో ప్రత్యేక కావ్య సంప్రదాయము వెలసింది. ఔచిత్య విచారచర్చ యందు హోరేన్ భారతీయాలంకారికులను అధికముగా పోలియున్నాడు. కావున భారతీయ సాహిత్య మందలి ఔచిత్య సిద్ధాంతమును గురించి సంగ్రహముగా పరిశీలించుట ఇట అనుచితము కానేరదు.

నాట్యము లోక స్వభావమున కనుగుణముగా నుండ వలయునను భరతుని నాట్యదృక్పధము క్రమముగా వికసించి "ఔచిత్య సిద్ధాంతము" గా భారతీయ 'వ్యశాస్త్ర మందు స్థిరపడినదని తెలియును. ఆ ముని నాట్య స్వరూపము నిట్లు తెలిపెను-

''వయసున కనురూపమైన వేష- భూష, వేషమున కనుగుణమైన కార్య కలాపము ను పాత్రలు నిర్వహింప వలయును. అట్లే కార్యమునకు ఉపయుక్తముగా నుండు సంభాషణ మరియు సంభాషణ కనుగుణముగా అభినయించ వలయును.'' 12.

లోక ధర్మాను సరణ మందు నాట్య సిద్ధి ఇమిడి యున్నదని భరతు డిట్లు సచించెను-

లోకమందు ప్రసిద్ధమై యున్నదే నాట్యమందు ప్రసిద్ధము. నాట్యము సర్వదా లోక స్వభావాను కరణము ద్వారా సంపన్న మగును. అందువలననే నాట్య ప్రయోగమునకు లోకమే ప్రమాణముగా నుండును.'' 13.

''లోకమందు (దేశ, కాల, పరంపరాదుల కనుకూలముగా) నానా రకములైన శీల, స్వభావాదు లుండును శీల పరిపోషణ మందే నాట్యప్రతిష్ఠ కలదు. నాట్య సంయోజకులు సర్వదా లోకమునే ప్రమాణముగా అంగీకరింప వలయును.'' 14.

"దేశ సంప్రదాయమునకు విరుద్ధమైన వేష, భూష శోభా కారకము కానేరదు. ఒక వేళ వడ్డాణమును హారరూపమున ధరింపజేసినపుడది హాస్యాస్పదమే యగును" 15.

పై వాక్యములందు భరతుడు నాట్య ఉచితానుచితములను లోక ధర్మ ప్రమాణముగా నిర్ణయించెను. అనుక నాట్య సఫలత లోక స్వభావానుకరణము యొక్క ఉచితత్త్వముపై ఆధారపడియున్నది. ఉచిత మనగా తగినట్లు ఉండు స్థితి. పై వాక్యములందు భరతుడు నాట్య ఔచిత్యమును వివరించెనని స్పష్టము.

తరువాత భామహుడు డిట్లు తెలిపెను. కావ్యమందు పాటింపబడిన ఉచిత రీతి దోషమును సైతము గుణముగా మార్చి వేయగలదు—

"సంయోజనా విశేష దృష్టితో ప్రయుక్తమైన ఉక్తి సైతం మాల మధ్యభాగ మందలి పలాశము వలె శోభాకారకమే కాగలదు" 16. రమణి రమణీయ నేత్రము లందలి కాటుక లావణ్యమును పెంపొందించునట్లు సన్ని వేశ వశాత్తు ఆశ్రియ సుందరమైన అసాధువు సైతం అదే మాదిరి శోభా వర్ధక మగును.
(ఇట సన్ని వేశ వశాత్తును ఉచిత రీతిగా గ్రహింప వచ్చును).

మహాకవి మాఘుడు 'శిశుపాల వధ' యందు ప్రసంగ వశాత్తు గుణౌచిత్యమును, రసౌచిత్యమును ఇట్లు తెలిపెను— తేజ, క్షమా గుణములు రెండును నృపతికి మహనీయ గుణములే యగును. ఐనను సమయాను గుణముగా వానిని ప్రదర్శించుట ఉచితము— తేజః క్షమావానై కాంతం కాలజ్ఞస్య మహీపతేః। నైక మోజః ప్రసాదో వా రస భావ విదః కవేః।

తదనంతరం దండి ఇట్లు వచించెను— "దేశ కాలాదులకు ప్రతికూలముగ నున్న ఉక్తులు సైతం కవి కౌశలముచే ఔచిత్య స్పర్శను పొంది కావ్య గుణములుగా రాణించును." 17.

కన్నౌజ్ అధిపతియైన యహోవర్మన్ 'రామాభ్యుదయము' అను నాటకమందు ఔచిత్యా వశ్యకతను మూడు రకములుగా తెలిపెను—

1. నాటక భాష ఔచిత్యవంతమై యుండవలయును. అనగా పాత్రల స్వభావమున కనుకూలముగా నుండు భాషయే ఉపయోగింప బడవలయును.
2. ఉపయుక్త సందర్భములందు పాత్రల వ్యవహారమున కనుకూలముగా రసమును పోషింపవలయును.
3. కథా రచన యందు అతిక్రమణ యుండరాదు.

భరతుని వలె యశోవర్మన్ నాటకౌచిత్యమును సమర్థించెనని స్పష్టము.

భట్టలొల్లటుడు మహాకావ్య రస నిష్పత్తియందు ఔచిత్యము నిర్వహించు కార్యము యొక్క ప్రాధాన్యతను తెలిపెను. కావ్యాంగముల సముచిత సమన్వయము ద్వారా రసౌచిత్యమును సమర్థించెను.

భరత, భామహాదులందు బీజ రూపమున నున్న ఔచిత్యమును కావ్యశాస్త్ర పరముగా ప్రయోగించిన ప్రథమాచార్యుడు రుద్రటుడు ఆయన-అలంకారవాదియే యైనను విభిన్న కావ్యాంగములందు ఔచిత్యావశ్యకత నిట్లు సమర్థించెను—

"కావ్య వృత్తులను సమగ్రముగా అవగాహన పరచుకొనవలయును. తదనంతరం పాత్రగత, అర్థగత ఔచిత్యమును గురించి సాంగోపాంగముగా చర్చించుకొనవలయును. ఆ వృత్తులను పరస్పర మిశ్రమ రూపమున కావ్యమందు నిబంధించవలయును. అవి సుసంగతములై యుండవలయును నాతి విస్తృతములును, నాతి అల్పములునై యుండరాదు." 18.

దోష వివేచన మందు అనేక దోషములు సైతం ఔచిత్య వశమున గుణములుగా రాణింప గలవని రుద్రటుడు నిరూపించెను. అనౌచిత్య కారణముననే కావ్య మందు దోషములు వాటిల్లునని ఆయన స్పష్టముగా తెలిపెను. తరువాత ఆనందవర్ధనుడు కావ్యాంగము లన్నింటికి అన్వయించునట్లుగా ఔచిత్యమును స్వతంత్ర కావ్య సిద్ధాంతముగా ధ్వన్యాలోకము నందు నిరూపించెను.

(చూడుము లాంజినస్)

రుద్రట, ఆనందవర్ధనాదుల నుండి ప్రేరణను గ్రహించి క్షేమేంద్రుడు ఔచిత్యమును కావ్య తత్త్వము లన్నింటికి అన్వయించు వ్యాపక సిద్ధాంతముగా నిరూపించెను; ఔచిత్య మను ప్రత్యేక కావ్య సంప్రదాయమును నెలకొల్పెను కావ్యమునకు రసమే ప్రాణ మని, ఆ ప్రాణమునకు జీవితమును కల్పించునది ఔచిత్యమని ఆయన తెలిపెను. కనుక ఔచిత్యమే కావ్య జీవితము. ఇది పాటింపబడనపుడు కావ్యప్రాణ తత్త్వమైన రససిద్ధి యుండదు. అందువలన రససిద్ధికి ఔచిత్య నిర్వహణ అనివార్య మగుచున్నది. ఈ దృష్టితో క్షేమేంద్రుడు ఔచిత్య సంప్రదాయమును స్థాపించెను. ఆ ఆచార్యుడు ఔచిత్య స్వరూపము నిట్లు తెలిపెను—

'ఏదేని వస్తువు దేనికైనా అనురూపముగా (సదృశముగా) నున్నచో దానిని ప్రాచీనాచార్యులు ఔచిత్యముగా తెలిపి యున్నారు. (కనుక) ఉచితమైన భావమే ఔచిత్యముగా గ్రహింప బడును.'' 19.

ఆధునిక భారతీయాచార్యులు ఔచిత్యము నీ తీరున వివరించిరి– ''కావ్య మందు సంయోజనా కార్యము ప్రాధాన్యతను వహించి యున్నది. ఈ కార్యము ను కల్పన నిర్వహించును. జీవనమందు అనేక సందర్భము లందు అనేక మారు లు దృష్టములును అనుభూతములునైన వస్తువులకు ఏదేని భావము లేదా కథ సహా యమున సమరసత సంయోజింప బడును. ఈ సమరసతకై అవశ్యకమగు సాదృ శ్యము లేదా సంతులనము ఔచిత్యముగా తెలుపబడును ఇట్లు ఔచిత్యము ఒక విధేయాత్మక తత్త్వముగా నిరూపిత మగును. ఇదియే సమస్త సౌందర్యమునకు మూలము'' –డా॥ మనోహర్ గౌడ్.

'నా దృష్టి యందు అధునిక పదావలి యందు ఔచిత్యమును 'స్వాభావికత' గా తెలపడం సముచితం. కావ్య మందలి సంఘటనన, పాత్రల సంయోజన మందు స్వాభావికత యున్నపుడు మాత్రమే ఆస్వాదనీయ మగును. కనుక ఔచిత్య మన స్వాభావికత" –డా॥ గణపతిచంద్ర గుప్త.

కావున కావ్యతత్త్వములన్ని సమరసతను పాటించుచు ప్రేక్షక రసాస్వాద నకు యోగ్యముగా సంయోజితము లగుట ఔచిత్యము.

ఔచిత్య కావ్య సంప్రదాయ సంస్థాపకుడైన క్షేమేంద్రుడు ఔచిత్యమును రససిద్ధమైన కావ్యముయొక్క స్థిర జీవితముగా తెలిపెను– ''ఔచిత్యః రస సిద్ధస్య స్థిరం కావ్య జీవితమ్." కావ్య మందు కవి ఔచిత్యమును పాటించ వలయును. లేని యెడల సామాజికుడు కావ్యాను భూతిని బడయ లేడు. ఔచిత్య రహితమైన కావ్యము జీవనము లేనిది యగును. ఇట కావ్య జీవన మనగా క్షేమేంద్రుని దృష్టి యందు కావ్యాత్మమైన రసము కానేరక రసాస్వాదనకు తోడ్పడు తత్త్వము. అ దియే ఔచిత్యము. కావ్య సఫలతకు ఔచిత్యమే ఒరపిడి రాయి. అ ప్రమాణమే కావ్య సఫలతను నిర్ణయించును ఇట్లు క్షేమేంద్రుడు ఔచిత్యమును కావ్య తత్త్వ ము లన్నింటికి అన్వయించెను. కావ్య వివిధాంగములకు ఔచిత్యముతో కల సం బంధమును ఆ ఆచార్యుడిట్లు వివరించెను–

''కావ్య చమత్కారము మరియు సౌందర్యముతో ఔచిత్యము కార్య-కారణ సం బంధమును కలిగి యున్నది. కావ్యమందు సృజింపబడు చమత్కారమునకు, సౌం దర్యమునకు ఔచిత్యమే కారణ మగుచున్నది. కావ్య అన: తత్త్వ ములైన రసా లంకార గుణాదు లన్నింటికి ఔచిత్యమే జీవనము. రసము తప్ప మిగిలిన కావ్య

తత్త్వము లన్నింటికి ఔచిత్యమే శరీరము; మరియు శరీరమువంటి సంబంధమునే కలిగియున్నది. అలంకారముల ప్రాధాన్యత అలంకారముల వరకే, గుణప్రాధాన్యత గుణములవరకే పరిమితమై యున్నది కాని ఔచిత్యము రససిద్ధమైన కావ్యమునకు జీవితముగా స్థిరమై యున్నది సముచిత సందర్భములందే అలంకారముల అలంకారత్వ మున్నది. అనగా అలంకార ప్రయోగ మందు ఔచిత్యము నిర్వహింపబడవలయును. అన్యథా కావ్య గుణములు కూడా గుణములుగా రాణింపవు'' 20.

హొరేస్ వలె క్షేమేంద్రుడు ఔచిత్య రహితమైన కావ్యము హాస్యాస్పదమని ఈ క్రింది ఉదాహరణము ద్వారా స్పష్ట పరచెను-

''మెడయందు వడ్డాణము, నడుమునకు హారము, చేతులకు నూపురములు, మరియు పాదములకు అంగదములను ధరించుట; శరణాగతునిపై పరాక్రమమును ప్రదర్శించుట, శత్రువుయందు దయను చూపించుట- ఇవి ఎవరికి హాస్యాస్పదములు కానేరక యుండును ? ఔచిత్యము వినా అలంకారములు శోభింపవు, గుణములు ప్రకాశింపవు'' 21.

'ఔచిత్య విచార చర్చ' యందు క్షేమేంద్రుడు ఔచిత్యమును (27) రకములుగా వివరించెను. అవి- పద, వాక్య, ప్రబంధ, గుణ, అలంకార, రస, క్రియ, కారక, లింగ, వచన, విశేషణ, ఉపసర్గ, నిపాత, కాల దేశ, వంశ, వ్రత, తత్త్వ, సత్వ, అభిమత, స్వభావ, సార సంగ్రహ, ప్రతిభ, విచార, నామ మరియు ఆశీర్వాదము. ఆచార్యులు అధ్యయన సౌలభ్య నిమిత్తం వీని నన్నింటిని నాలుగు విభాగము లందు చేర్చిరి.

1. భాషాశైలి- పద, వాక్య, కారక, లించ, వచన, విశేషణ, ఉపసర్గ, నిపాతము.
2. కావ్య తత్త్వములు - ప్రబంధార్థ, గుణ, అలంకార, రస, సార సంగ్రహ, తత్త్వము.
3. పాత్ర చిత్రణ- వ్రత, సత్వ, అభిమత, స్వభావ, ప్రతిభ, విచార, నామము.
4. సంఘటనలు- కాల, దేశ, వంశ, అవస్థ.

పై వివరణ దృష్ట్యా క్షేమేంద్రుడు కావ్యవస్తువు మరియు కావ్యశైలి రెండింటియందు ఔచిత్యమును సమర్థించెనని బోధ పడును.

ఔచిత్య విచార చర్చ యందు క్షేమేంద్రుడు ఔచిత్యముతో పాటు అనౌచిత్యమును సైతం సోదాహరణగా నిరూపించెను. ప్రధానము లిట ఉదృతములు-

1. పద ఔచిత్యము- Propriety of words ;- సూక్తియందు ఏదేని విశేష పదము సముచిత రీతిలో ప్రయోగితమై చంద్రానన మస్తకముపై కస్తూరివలె మరియు శ్యామ (పదహారేళ్ల నాయిక) మస్తకముపై చందన తిలకమువలె శోభాయమాన మగును. (ఔచిత్య విచార చర్చ-11)

"హా! దేవా! నాథా! నీ ప్రచండ ఖడ్గ ధారలో శత్రువంశ మంత మునిగి పోయినదని మాగధులు వర్ణింప , మొదటనే అనేక మారులు వినియుండియు, గుర్జరాధిపుని ముగ్ధారాణి చకితయై అరణ్యమందు నీటి ఆశతో పతి ఖడ్గమును పదేపదే చూచును- ఇట 'ముగ్ధ' యను పద ప్రయోగము ఔచిత్య వంతమై అర్థ చమత్కారమును సృష్టించును.

అనౌచిత్యమునకు ఉదాహరణము -Impropriety :- లావణ్య రూపమైన ధనమును లెక్కించలేదు; అతి ఆవేదననే అంగీకరించింది. స్వతంత్రులై , సౌఖ్యవంతులుగా నుండెడి పురుషులకు చింతారూపమైన జ్వరమును సృష్టించింది. ఈ ము అనుకూలవంతుడైన పతిలేనందున నష్టము పొందుచున్నది. ఈ తన్వి శరీరమును రూపొందించునపుడు విధాత మనసు నందేమని యనుకొని యుండెనో?" - ఇట 'తన్వి' పదము సముచితము కాదు. తన్వికి బదులుగా 'సుందరాంగి' యన్నచో బాగుండెడిది

2. వాక్య ఔచిత్యము- Propriety of Sentence :- సముచిత రీతిలో కూర్చిన వాక్యము త్యాగము వలన లభించు మహనీయ ఐశ్వర్యము వలె శీ ద్వారా ప్రాప్తమగు ఉజ్వల కీర్తివలె, పండితులచే నిరంతరము ప్రశంసి ను- (ఔచిత్య విచార చర్చ-12)

"ఓ సుందరీ! పురురాజ సంబంధింతుడును, కామదేవుని వ్యాపారమునకు దీక్షువును, తారా వధువుల పతియును, రమణుల సౌందర్య వదనములకు సాటిగ రిచితుడును, దాక్షిణాత్య సుందరాంగుల స్వచ్ఛమైన శ్వేత దంత పంక్తి కాంతి కలవాడును, మహాదేవుని మకుట మణియునైన ఆ చంద్రుని చూడుము ఇట చంద్రుడు మరియు శృంగారమునకు తోడ్పడు అంశములు కామోద్దీపకములునైన పదములద్వారా నిష్పన్నమైన వాక్యార్థము ఔచిత్య సామర్థ్యమున అత్యధిక అర్థశోభను సృష్టించును.

అనౌచిత్యము – Impropriety :- ''శౌర్యమే రూపముగానున్న మహనీయ నీల కమల దండముతో సమానమైన సమరము అను సాగరమునకు పొడవైన వంతెన వంటిదైన, ఖడ్గముగా భుజంగమును నిరంతరము ధరించు చందన వృక్షముతో సరియైన, లక్ష్మీ క్రీడలకు ఆలవాలమైన శయ్యతో సమానమైన విజయ కుంజరము నకు బంధనాశృంఖలతో సమానమైన, సుందరాంగులకు మన్మథ దర్ప సదృశము నైన శ్రీ దుర్యోధనుని భుజ పరాక్రమ మందు జగమంతా ఆనందిత మగుగాక!'' –ఇట అధిక కఠోరములును, ఉన్నతములునైన యోధుని బాహువులు నీలకమల దండముతో పోల్చబడినవి. కనుక ఈ వాక్యార్థము హాస్యాస్పదమే యగును.

3. ప్రబంధ ఔచిత్యము– Propriety of Narrative Construction :- ప్రబంధార్థము సముచితమైన విశిష్టార్థముతో గుణ ప్రభావమున ఐశ్వర్య సంపన్నుడైన సజ్జనుని వలె ప్రకాశించును- (ఔచిత్య విచార చర్చ-13)

"ప్రపంచ మందు ప్రసిద్ధమైన పుష్కరావర్తక వంశమున జన్మించినావు ఇష్ట మైన రూపమును ధరించు ఇంద్రుని యొక్క ప్రకృతి- పురుష-తుల్యునిగా నిన్ను సమ్మానింతును. ఈ కారణము చేతనే దౌర్భాగ్య వశాత్తు దూర ప్రాంతములందు ప్రియురాలిని కలవానినైన నేను నీకు యాచకుండ నైతిని. ఏలన నీచుల యాచించి అసఫలీ కృతుడగుటయే మేలు.''– ఇట అచేతనమును చేతనముగా, దూత కార్యమునకు మేఘమును యోగ్యముగా, కులీనతను, ప్రకృతి. పురుషత్వమును, మంత్రిత్వమును ఆరోపించి వర్ణించుట వలన ఒక సుందర ఇతిహాసము అత్యధిక ఔచిత్యవంతంగా ప్రదర్శితమైంది.

అనౌచిత్యము– Impropriety :- ''ఉరుమూల యందు శోభితమైన నఖరాజికి ఆకృష్టములైన నేత్రములతో శివుడు ఆ సమయమున శిథిల వస్త్రమును ధరించుచున్న ప్రియురాలిని ఆపెను." ఇట శివ–పార్వతుల సంభోగ శృంగారము నీచ స్త్రీ-పురుషుల వలె అనహ్యముగా నున్నది.

4. గుణ-ఔచిత్యము– Propriety of Quality :- ఔచిత్యవంతముగా ధ్వనింప బడిన అర్థముతో కావ్యము ఓజ, ప్రసాద, మాధుర్యాది గుణములతో సంపన్నమై, సంభోగ సమయ మందలి చంద్రోదయము వలె కమనీయ సౌభాగ్యముతో అతిశ యిల్లును- (ఔచిత్య విచార చర్చ-14)

''పూలమాల, తడిసిన వస్త్రములు, సరస చందనము దేనికి ఇంధనముగా పనిచేయునో అట్టి కామాగ్ని చల్లారునెట్లు?'' ఇట కాదబంరి వియోగ వర్ణనము మాధుర్య. సౌకుమార్య గుణయుక్తమై హృదయము నానందింపజేయు ప్రియురాలిని తలపింప జేయును.

అనౌచిత్యము - Impropriety :- ''చంచలమైన భాగ్యము నే కలిగియున్న యుద్ధముల విషయమున నేను ప్రతిన పూనను. ఏలన జయాపజయములు భాగ్యమునకు అధీనములు రణరంగమున కేతెంచిన నా ప్రతిజ్ఞ సర్వదా ఇదియేయై యుండును. ఏమన శత్రు సైన్యము మా అశ్వముల పృష్ఠ భాగమును చూడలేదు.''- ఇట క్షత్రియోచిత వాక్కు మలిన దీపశిఖవలె నున్నదే కాని ఓజో గుణ భరితమై శోభించుట లేదు.

5. అలంకార ఔచిత్యము- Propriety of Figures .- అర్థోచితమైన అలంకార యుక్తసూక్తి పీన పయోధరములపై ఊగులాడు హారముచే శోభించు మృగాక్షి వలె ప్రకాశమాన మగును- (ఔచిత్య విచార చర్చ-15)

''ప్రేమికుడును, జనుల చిత్తమందు నివాస మేర్పరచుకొన్న వాడును, వసంతక ప్రియుడునైన ఆ వత్సరాజు ఉదయనుడు యుద్ధచర్చ నుండి విశ్రాంతి గైకొని సాక్షాత్తు మన్మథుని వలె తన మహోత్సవమును చూచుటకై ఉత్కంఠతో ఏతెంచుచున్నాడు''- ఇట మన్మథునితో వత్సరాజు సాదృశ్యము శృంగార రస ప్రసంగ మందు చమత్కారమును సృష్టించును.

అనౌచిత్యము- Impropriety :- ''పక్షులు వేసిన ప్రేవులు వృక్షములపై ఊయల మాదిరి ఏర్పడినవి. ఆహారంతో తృప్తి చెందిన ఆడునక్క, సంభోగంతో ప్రశాంతిని జెందిన రమణివలె నిద్రించుచున్నది దప్పికగొన్న నక్క రక్తముతో తడసిన ఖడ్గమును పదే పదే నాకుచున్నది. బిలమును వెదకుచు సర్పము మరణించిన ఏనుగు తొండములో దూరుచున్నది.'' ఇట వర్ణన అయోగ్యములైన ఉపమానములతో విపరీతము - నున్నది

6 రస-ఔచిత్యము- Propriety of Rasa :- వసంతము అశోకము నంకురింప జేయునట్లు, ఔచిత్యముతో దీప్తమైన రసము సహృదయు లందరి హృదయములందు వ్యాపించి వారి మనసుల నాహ్లాద పరచును- (ఔచిత్య విచారచర్చ-16)

''బాలచంద్రుని పోలియున్న కుటిలములును, అతిరిక్త వర్ణములకు కూడలియైన

మోదుగ మొగ్గలు శీఘ్ర వసంత సమాగమముతో వన స్థలి యందలి నఖ క్షతము ల వలె శోభితము లయ్యెను."- ఇట వనస్థల రూపమైన వనితలకు కుటిల, రక్త వర్ణములైన మోదుగ మొగ్గల నవీన సమాగమము వలన కలుగు నఖక్షతముల ఊహ ఔచిత్యవంతమై సౌందర్యమును ప్రదర్శించెను

అనౌచిత్యము- Impropriety :- "ఉత్కృష్ట సౌందర్యమును కలిగియున్నను, గంధ విహీనములగుట వలన గన్నేరు పూలపై ప్రీతి యుండదు గుణము లన్నింటిని సమగ్రముగా ఏర్పరచుటలో బ్రహ్మ ప్రవృత్తి సామాన్యము ప్రతికూలము గానే కనబడును"- ఇట గన్నేరు పూల ద్వారా అనగా అనుపయుక్తమైన శృంగార ఉద్దీపనము ద్వారా బ్రహ్మను నిందించుట ఔచిత్య వంతము కాదు.

7. తత్త్వ-ఔచిత్యము – Propriety of Philosophising :- తత్త్వము యొక్క సముచిత కథనము ద్వారా కావ్యము నిశ్చితమైన దృఢ విశ్వాసముతో ఉపాదేయ మగును. (ఔచిత్య విచార చర్చ-30)

"స్వర్గము, భూలోకము, నాగలోకము, బాల్య, యౌవన, వృద్ధావ్యవస్థలు, మృత్యుకాలము, గర్భావస్థ- ఈ దశ లన్నింటిలో శరీరధారుల వెంటాడు పురాకృత కర్మకు నాశము లేదు. అది శరీరధారుల నంటిపెట్టికొనియే యుండును"- ఇట మానవజాతికి హృదయ సమ్మతమైన తత్త్వ ప్రతిపాదనము ఔచిత్యమును ప్రదర్శించును.

అనౌచిత్యము–Impropriety ;- "ఆకలి గొన్న వ్యక్తి వ్యాకరణమును మ్రింగడు; దప్పిక గొన్న వ్యక్తి కావ్యరసమును గ్రోలడు; విద్యవలన ఏ వంశము కూడా ఉద్ధరింప బడదు. అందువలన కళలన్ని నిష్ఫలములైనపుడు ధన సంపయనమే శ్రేష్ఠము"- ఇట తత్త్వమునకు విపరీతంగా ప్రతిపాదింప బడినది. ఏలన సంపదలకు జననియైన విద్యయే కులము నుద్ధరించును.

8. సత్వ-ఔచిత్యము- Propriety of Goodness :- కవి యొక్క సత్వ గుణోచిత కథనము సద్బుద్ధితో పరిశీలింపబడిన శ్రేష్ఠమైన ఉదార చరితము వలె చమత్కార జనక మగును- (ఔచిత్య విచార చర్చ-31)

''ప్రచండ వేగముతో ప్రవహించు నదుల జలముతో శరీరము (ఆకారము) వృద్ధి యైనప్పటికిని (విస్తరింపబడినప్పటికిని) మరియు ప్రదీప్తమై, ప్రవృద్ధమైన బడబానల జ్వాలా సమూహంతో జలము నశించి నప్పటికిని, గంభీరమైన సముద్రము గర్వింపదు; దీనత ననుభవింపదు. అవస్థా విశేషములు విభిన్నములైనప్పటికిని మహా పురుషులలో ఏకారసు జనింపదు.''- ఇట గంభీరమును, ధీరమునైన సత్వ ప్రవృత్తి ఔచిత్యమును ప్రకటించును.

అనౌచిత్యము - Impropriety.- ''బడబాగ్ని మరియు సముద్రము- ఇవి రెండును ఆశ్చర్య జనకములే వాని కార్యములను తలంచుకొన్నపుడు కంపించెదము. బడబానలము అధికమైన సత్త్వము కలిగి యుండనందున నిరంతరం సముద్రుని జలమును గ్రోలుచున్నను తృప్తిని బడయజాలక పోయెను. సముద్రుని శరీరమునకు ఎట్టి బాధయు కలుగ జాలక పోయెను.''- ఇట అసత్త్వమైన బడబాలనమందు సత్త్వమైన సముద్రుని స్తుతి అనౌచిత్యమునే ప్రదర్శించును.

9. స్వభావ-ఔచిత్యము - Propriety of Nature :- సుందరాంగులకు స్వాభావికమును, అద్వితీయమునైన సౌందర్యము వలె స్వభావమునకు సంబంధితమైన ఔచిత్యము కవుల సూక్తులందలి శ్రేష్ఠమైన అలంకారముగా భావింపబడును- (ఔచిత్య విచార చర్చ-33)

"కర్ణమూలము నుండి కేశాంతము వరకు జారుచున్న జల బిందువులను హారముగ చక్రాకార స్తనములపై ధరించి సౌందర్యము నొలకబోయు దాని, చలితో రోమ చితయై చిరు కేకల వేయుచు కాటుక చెదరగా ఎర్రబడిన నేత్రములుగల ? విరియ బోసిన వెండ్రుకలతో నీటి బిందువుల వెదజల్లు దాని స్నాన స ఎవరి మనసును అభిలాషతో ద్రవింప జేయదు.''- ఇట స్వభావముగా ఆ భావమును కలది ఇతరులను కూడా ఆర్ద్ర పరచు ననుట స్వాభావికమును మును యగును.

అనౌచిత్యము- Impropriety :- ''పిశున స్వభావముకల వారి వాక్కు ర్ణముగా దోషావహమే యగును. అది దానినే ప్రదర్శించును. వారిభక్తి యందు, క్షమ భయ మందు, పూజ్యస్తుతి దీనత యందు, ధ్యానము యందు, తపస్సు ప్రచ్ఛన్నత యందు మరియు శీలము నపుంసకత్వ మారి పోవును''- ఇట పిశునారి కథనము స్వయముగా శుష్కమై యుండి ఇతరుల నార్ద్రపరచు ననుట అనుచితము.

**10.** ప్రతిభ-ఔచిత్యము . Propriety of Genius :- ప్రతిభ ద్వారా అలంకృత మైన కవి కావ్యము లక్ష్మీద్వారా సుశోభితుడైన గుణవంతుని నిర్మల వంశము వలె ప్రకాశించును- (ఔచిత్య విచార చర్చ-35)

'ఓ నిర్దయురాలా! బింబమను భ్రమకులోనై నాక్రింది పెదిమను కొరుకుచున్నావా? ఓ చంచలా! ఇక నీవు జామ పండ్లపై కల ఆశను విడిచి పెట్టుము. ఈ విధముగా ద్వార మందు తన ప్రియుడు ఉండుట గ్రహించి వేరే ప్రియునితో పెదవి కాటు బడగా చిలుకను లక్షించి ఒక కామిని బిగ్గరగా పలుకుచున్నది'- ఇట చెయిద . ను కప్పిపుచ్చుకొనుటకై చతురమైన కామిని పలుకులు ఔచిత్య చమత్కారమును ప్రదర్శించును.

అనౌచిత్యము- Impropriety :- "ప్రియుడు బయటికి వెళ్లగానే పడకను, గదిని సుగంధ మాలారహితములుగా నొనర్చిన తరువాత ప్రాతఃకాల మందు ప్రగాఢ వాంఛతో మొదటి ప్రియుడురాగా, వంచితయైతి నను కోపముతో నీదర్శనమున కై ద్వారము కడ కాపుగాయుచు నిద్రించితి నని వేశ్య పలుకగా ముడి విప్పుటలో తత్పరుడైన ఆ ప్రేమికుని శోకమును చరణాఘాతములతో దూరము చేసెను"- ఇట వేశ్య గాఢాను రాగము రహస్య గోపనము నుద్దేశించినది కనుక ఇది ప్రతిభా సంపన్నమైన ఔచిత్యము కానేరదు.

హోరేస్ సాహిత్య దృక్పథము భారతీయ దృక్పథంతో పోల్చబడినది కావ్య పరముగా కాని, నాటక పరముగా కాని, ఆయన ప్రదర్శించిన మౌలిక చింతన కానరాదు. తత్కాలీన కవులకు, నాటక కర్తలకు తగిన శిక్షణ నొసంగుటకై ఆయన అరిస్టాటిల్ కావ్యశాస్త్రము ననుసరించి 'ఆర్స్‌పొయెటికా'ను రచించెను; గ్రీకు కావ్య సంప్రదాయాను సరణముపై తనకు కల అపార శ్రద్ధా గౌరవముల ను ప్రకటించెను. కావ్య శాస్త్ర దృష్టితో 'ఆర్స్-పొయెటికా' వ్యావహారిక కావ్య వి మర్శకు అధికముగా నుపయోగపడు ననుటలో సందేహం లేదు. గ్రీకు కావ్య సంప్రదాయాను గమనమందు 'హోరేస్' ప్రథమ సాహిత్యాచార్యునిగా పరిగణింప బడును తత్కాలీన సాహిత్య రచనను దేశప్రగతికి, శాంతికి ఉన్ముఖ పరచుటలో ఆయన ప్రదర్శించిన గ్రీకు సంప్రదాయానుగమన వైఖరి ప్రశంస నీయమే యగును.

హోరేస్ మౌలికముగా ఏ కావ్య సిద్ధాంతమును ప్రతిపాదింపకున్నను ఆయన 'కావ్య-కళ'యందు వివేచించిన ఔచిత్య సిద్ధాంతము సర్వదా భారతీయ ఔచిత్య సిద్ధాంతమును పోలి ఉన్నది. సిద్ధాంత సూక్ష్మతి సూక్ష్మ వివేచన మందు ఆయన భారతీయాచార్యులతో సరి కాకున్నను ఔచిత్య తత్త్వ వివేచన మందు ప్రకటించిన కావ్య దృక్పథము లో పోల్చి చూచినపుడు హోరేస్ భారతీయ సాహిత్యాచార్యులకు సన్నిహితు డగుచున్నాడు. అట్లే ఛందస్సు విషయమున. హోరేస్ కావ్య రచనకు ఛందస్సును సమర్థించెను. భారతీయాచార్యులు ఛందస్సును సర్వదా సమర్థించియే యున్నారు; విరోధించ లేదు."

---

## అధోజ్ఞాపికలు - Foot Notes·

1. I would advise the well instructed imitator to take his model from life and custom and from this derive language faith to life
2. Choose a theme suited to your powers and ponder long what weights your shoulders refuse to bear, and what they can support. He who chooses his subject wisely, will find that neither words nor lucid arrangement will fall him.
3. Dr. Nagendra- paschatya Kavya Sastra ke Parampara. P. 63.
4. As the woods change their leaves at the year's decline and the first leaves fall first, so words perish with old age, and others newly born, thrive and flourish like youths. Many words that have become disused shall revive and those now high esteemed shall fall, if custum so wills it-custom the ruler and standard of speech.
5. The aim of poets is either to be beneficial or to delight, or in the phrases to combine charm and high applicability to life. The elders scorn poetry devoid of useful precept: the kinight be caste have little regard for what is austere. By at once delighting and teaching the reader the poet who mixes the sweet with the useful has everybody's approval.
6. Men have asked whether verse wins renown through nature or through art. I can not see how study profits without a vein of genius or skill without training. Thus each gift needs the others aid and joins in friendly union.

7. You my friends study the great originals of Greece, dream of them by night and ponder them by day.

8. The conventional features of traditional characters should be preserved. If in your tale you present the renowned Achilles, let him appear restless, passionate, inexorable and dauntless.

9. These are faults, however, for which we wish to make allowance the archer can not always hit what he aims at indeed, when there is much that shines in a poem, I shall not be offended by a few mistakes which either negligence permitted or human frailty could not avoid.

10. If painter should try to unite a horses neck to a human head and to add various feathers to limbs collected every kind of animals, so that a woman face form above shoud end in a foul and ugly fish beneath, tell me, my friends, could you control your laughter if admitted to private view ?

11. Dr. Nagendra - Paschatya Kavya Sastra ke Parampara. P. 67.

12. 'వయోనురూపః ప్రథమస్తు వేషా, వేషాను రూపశ్చ గతి ప్రచారః
గతి ప్రచారాను గతం చ పాఠ్యం, పాఠ్యానురూపో అభినయశ్చ కార్యః

13. 'లోకసిద్ధం భవేత్సిద్ధం నాట్యమ్ లోక స్వభావజమ్
తస్మాన్నాట్య ప్రయోగే తు ప్రమాణం లోక ఇష్యతే.'

14. 'నానా శీలాః ప్రకృతయః శీలే నాట్యం ప్రతిష్ఠితమ్
తస్మాల్లోకః ప్రమాణం హి కర్తవ్యం నాట్యయోక్తృభిః'

15. 'అదేశ జోహి వేషస్తు న శోభాం జన యిష్యతి
మేఖలోరసి బంధే తు హాస్యాయై వోప కల్పయతే'

16. 'సన్నివేశ విశేశాత్తు దురుక్త మపి శోభతే
నీలం పలాశ మాబద్ధ మంతరాలే ప్రజామివ'

17. 'విరోధః సకలో అప్యేష కదాచిత్ కవి కౌశలాత్
ఉత్క్రిమ్య దోష గణానాం గుణ వీథీం విగాహతే'

18. 'ఏతాః ప్రియత్నాదదిగమ్య సమ్యగౌచిత్య మాలోచ్య తథార్థ సంస్థమ్
మిశ్రాః కవీంద్రై రఘునాల్ప దీర్ఘాః కార్యా ముహుశ్చైవ గృహీత ముక్తాః'

19\. 'ఉచితం ప్రాహురాచార్యాః సదృశం కిల యస్య తత్
ఉచితస్య చ యో భావః తదౌ చిత్యం ప్రచక్షతే'

20 'ఔచిత్యస్య చమత్కార కారిణాశ్చారుచర్వణే
రస జీవిత భూతస్య విచారం కురుతే అధునా
కావ్యస్యాలం మలంకారైః కిం మిథ్యా గణితైర్గుణైః
యస్య జీవిత మౌచిత్యం విచింత్యాపి న దృశ్యతే
అలంకార స్త్వలంకారా గుణా ఏవ గుణాః సదా
ఔచిత్యం రస సిద్ధస్య స్థిరం కావ్య జీవితమ్
ఉచిత స్థాన విన్యాసాదలకం తిగ్లం కృతిః
ఔచిత్యా దచ్యుతా నిత్యం భవంత్యేవ గుణా గుణాః'

21\. 'కంఠే మేఖలయా నితంబఫలకే తారేణ హారేణవా
పాణౌ నూపుర బంధనేన చరణే కేయూర పాశేన వా
శౌర్యేణ ప్రణతే రిపౌ కరుణయా నా యంతికే హాస్యతామ్
ఔచిత్యేన వినా రుచిం ప్రతనుతే నాలంకృతిర్నో గుణాః



## III

# క్వింటీలియన్ - Quintilian.

(35 - 95. A.D.)

## ప్రస్తావన - Introduction.

సిసిరో తరువాత వక్తృత్వశాస్త్ర పారంగతునిగా ఖ్యాతి గాంచిన ఆచార్యుడు క్వింటీలియన్. ఇతని తండ్రి స్పెయిన్ నివాసి; ప్రసిద్ధ వక్త. కుమారుని వక్తగా జేయనెంచి ఆయన క్వింటీలియన్‌ను వక్తృత్వ కళా శిక్షణ నిమిత్తం రోమ్ నగరమునకు పంపించెను. క్వింటీలియన్ రోమ్ నందు శిక్షణను పొంది స్వదేశమునకు తిరిగి వచ్చెను. అట ఆయన దాదాపు (20) సంవత్సరముల పాటు వక్తృత్వశాస్త్ర ప్రొఫెసర్‌గా పని చేసెను. పదవీ విరమణానంతరము రచనా కార్యమును చేపట్టెను. క్వింటీలియన్ వ్యక్తిగత జీవనము దౌర్భాగ్యమునకు ఆలవాలమైయుండెను. వయసు మీరిన తరువాత వివాహము జరిగెను; ఇరువురు కుమారులు కూడా కలిగిరి. కాని వారితో ఆయన చాలా కాలము సుఖశాంతులను పొందలేక పోయెను అనతి కాలంలోనే దౌర్భాగ్యము వారిని కబలించి వేసెను. శేష జీవితమును క్వింటీలియన్ ఏకాకిగనే గడపెను.

పదవీ విరమణానంతరం క్వింటీలియన్ రెండు గ్రంథములను రచించెను. 1. వక్తృత్వ కళా క్షీణదశ — Decawsis corruptae Eloquentee- 2 వక్తృత్వ కళా శిక్షణ- Institutio Oratoria – మొదటిది అనుపలబ్ధము, రెండవది (12) భాగములను కలిగి యున్నది. ఈ గ్రంథ రచనను గురించి స్వయముగా క్వింటీలియన్ ఇట్లు తెలిపెను. ఈ గ్రంథమును నా కుమారునకు సంక్రమించిన అమూల్య వారసత్వ సంపదగా నేను భావింతును. అతని తెలివితేట లద్భుతములు.

అతడే గంభీర విషయముతో నిండియున్న ఈ గ్రంథ రచనకు నన్ను బాధ్యునిగా జేసెను కాలము అనమగ్రముగా నిలిపివేయునో యను బెంగతో రాత్రింబవళ్లు దీని రూపకల్పనకై పరిశ్రమించితిని దౌర్భాగ్యము నన్ను దుఃఖాబ్ధియందు పడ ద్రోసినను ఈ గ్రంథ రచనానంతరం నేననుభవించిన ఆనందము అసీమము,అపారము. నాకు రెండవ వియోగము కూడా తటస్థించింది. అతడు నన్ను విడచి అనంతమును జేరెను. వృద్ధాప్య మందాతడు నాకు సహాయపడునని ఆశించితిని- కనుక అపార దుఃఖమును అధిగమించి రచించెనని తెలియు చున్నది.

వక్తృత్వ కళా శిక్షణ యందు వక్తకు కావలసిన యోగ్యతలు, అనుసరింప దగిన మార్గములు ఉపయుక్త భాషాశైలి, సామాజికునిపై నెరపు ప్రభావము మున్నగు అంశములు వైజ్ఞానిక దృక్పథముతో వివరింపబడినవి ప్లేటో, అరిస్టాటిల్ ప్రతిపాదించిన వక్తృత్వ కళా సిద్ధాంతములను క్వింటీలియన్ స్వీయానుభవంతో వివేచించి వక్తలకు మార్గదర్శక సూత్రముల నిర్దేశించెను. ఈ వివేచన మందాతడు మౌలిక ప్రతిభా పాటవములను ప్రదర్శించెను ప్రసిద్ధ గ్రీకు కవులైన హోమర్, పిండార్, నాటక కర్తలైన సోఫోక్లీజ్. యురిపిడస్, అరిస్టోఫనీజ్ మరియు రోమన్ కవులైన వర్జిల్, హోరేస్‌లయెడ క్వింటిలియస్ అత్యంత ఆదరాభిమానములను ప్రకటించెను. హోరేస్ వలె లాటిన్ భాషా, సాహిత్య పురోగమనమునకు గ్రీకు సంప్రదాయమును సమర్థించెను కనుక వక్తృత్వ కళా శిక్షణ ఉత్తమ వక్తృత్వ శాస్త్ర గ్రంథముగా రాణించింది.

ఈ గ్రంథము వక్తలకు ఉద్దేశింపబడినను కవుల కుపకరించు భాషాశైలీ విశేషము లిందు పొందుపరచబడినవి. ఇందలి 8-10 భాగములందు వక్త అనుసరింప దగిన గద్య భాషాశైలిని క్విటీలియన్ సూక్ష్మదృష్టితో వివరించెను. వక్త మరియు కవి- వీరిరువురును తమతమ వ్యక్తీకరణము ద్వారా సామాజికునిపై ఉద్దిష్ట ప్రభావమును నెరపెదరు. వీరిలో కానవచ్చు భేద మేమన ఒకరు మౌఖిక భాషను మాధ్యమముగా గ్రహింప మరొకరు లిఖితభాషను. అందువలన వక్తకు ఆవశ్యకములైన భాషాశైలీ రీతులన్నియును కవికి అనుసరణీయలే యగుసు. కనుక క్వింటీలియన్ జరిపిన భాషాశైలీ విషయిక పరిశీలన కావ్యశైలీ వికాసమునకు తోడ్పడును. తాను ప్రతిపాదించిన సిద్ధాంతములే సార్వకాలీనములని, అపరివర్తనీయములని క్వింటీలియన్ సమర్థించుకొన లేదు కళా సిద్ధాంతములు కళా సౌందర్యమునకు సాధనములే యగును. కాని సాధ్యము కానేరవని ఆయన వచించెను.

కారణమేమన కొన్ని సందర్భములందు సిద్ధాంతముల కతీతముగా కళయందు సౌందర్యము నెలకొని యుండుట సహజము. అందువలన క్వింటీలియన్ దృష్టి యందు కళ ప్రకృతివలె రహస్యాత్మకమైన అద్భుత సౌందర్యముతో మూర్తి మంతమై యున్నది. ప్రకృతి సౌందర్యము సిద్ధాంతములకు కట్టుబడి యుండని విధముగా కళా సౌందర్యము సిద్ధాంతముల కతీతముగా ప్రకాశించును కాలాను గుణముగా ప్రకృతి యందు పరివర్తన కలుగునట్లు నూతన కళా సిద్ధాంతములు ప్రతిపాదితము లగుచుండును. ఇట్లు సిద్ధాంతములు కళా సౌందర్య వివక్షయందు సౌందర్యవంతములు కాజాల కున్నందున కళా వివేచన కళా సౌందర్య సర్వస్వ నిరూపణము కానేర కున్నది అందువలన కళా సమీక్ష యందు ప్రధానముగా రెండు లోపములు కానవచ్చును. ఒకటి ప్రతిపాదిత సిద్ధాంతములు సార్వ కాలీన ములు కానేరక భావి పరిశోధన కపేక్షితములై యుండుట. రెండు కళా సౌంద ర్యము అత్యంత రహస్యాత్మకమై సిద్ధాంతముల కన్వితము కాక యుండుట అం దువలన తన వక్తృత్వ కళా వివేచన సమగ్రము కానేరదని, వక్తకు అవశ్యక మార్గ నిర్దేశనము మాత్రమే యగునని క్వింటీలియన్ తెలిపెను. ఈ దృక్పథము తో అయన వక్తృత్వ శాస్త్రమును సమీక్షించెను. కావ్యశాస్త్రమున కుపకరించు విధ మున మౌలిక దృక్పథముతో భాషాశైలిని వివేచించెను.

## ప్రతిభ – అభ్యాసము – Nature – Art.

ప్రకృతి దత్తమైన ప్రతిభ మరియు అర్జితమైన అభ్యాసము– రెండింటిని వక్తృత్వ హేతువులుగా క్వింటీలియన్ సమర్థించెను ఈ రెండింటిలో వ్యక్తి సఫల వక్తగా రాణింప వలయునన్న ప్రధాన మేదియై యుండును? ఈ విషయమున ఆయన హోరేస్ వలె రెండింటి ప్రాధాన్యత నంగీకరించెను. వాగ్నైపుణ్యము సా మాజికునిపై వశీకరణ మంత్రము వలె పని చేయును. ఇట్టి కళ వ్యక్తికి అలవడ వలయునన్న అతనికి తదభ్యాసము అనివార్య మగును. కేవలము ప్రతిభయే వ్యక్తిని సఫల వక్తగా మార్చజాలదు ఈ రెండింటి సమాహారము వక్తృత్వ కళా సంపన్న త యందు కానవచ్చును. కళాభ్యాస వశమున అజాగ్రత్త వలన దొరలు కఠిన వాక్కు సైతము శ్రవః పేయముగా మారు అవకాశము కలదు. ప్రతిభ నదీ పరి వాహక ప్రదేశము వంటిది. అభ్యాసము నదీప్రవాహము వంటిది. వేగవంతమైన ప్రవాహము ప్రదేశమును సమతలముగా రూపొందించ గలదు; సారవంతముగా

మార్చగలదు. కనుక వాక్కును వైదగ్ధ్యభరితముగా, ప్రభావంతముగా, వీనుల విందుగా మార్చుశక్తి అభ్యాసమునకే కలదని అంగీకరింపక తప్పదు. ఐనను ఇందు ప్రతిభ ప్రమేయము లేదనరాదు కావున క్వింటీలియన్ దృష్టియందు ప్రతిభ, అభ్యాసముల సమన్వయాత్మక శక్తియే వక్తృత్వ హేతువు.

వక్త అనుసరింపదగిన గద్యశైలిని క్వింటీలియన్ కావ్యశైలికి అన్వితముగు నట్లు వివరించెను. అతని శైలీ విషయిక పరిశీలన ప్రధానముగా భాష, పదచయ నము, పద సంయోజనములను మూడు భాగములందు విభక్తమగును. వానిని సంగ్రహముగా తెలిసికొందము.

## భాష - Language.

మానవుని జ్ఞానప్రాప్తికి మరియు ఆనందానుభూతికి మాధ్యమముగా నిలిచి యున్న భాష క్వింటీలియన్ కాలము నాటికి రూపాత్మక దృష్టితో మౌఖికము మరియు లిఖితములను రెండు ప్రధాన విభాగములుగా పరిగణింపబడెను ఈవిభే దాత్మక దృక్పథము అవైజ్ఞానికమని క్వింటీలియన్ తెలిపెను. వక్త మరియు కవి-వీరిరువురు ఉపయోగించు భాషా రూపములు వేరైయున్న వారి లక్ష్యమైన సామా జికునిపై ఉద్దిష్ట ప్రభావమును నెరవుటలో భేదము కానరాదు. విషయ జ్ఞానముతో పాటు సామాజికునకు ఆనందమును కల్గించుట వీరి లక్ష్యము. ఈ లక్ష్యసిద్ధికై ఒకరు బాషను మౌఖిక రూపమున ప్రయోగింప మరొకరు లిఖిత రూపమున. ఇట్లు భాష నెరవేర్చు లక్ష్యమందు భేదము కానరాదు. ఐనను మౌఖికభాష సత్వ రముగా సామాజికుని ప్రభావిత మొనర్చుట వలన అధికతర శక్తిశాలి యని, లిఖిత భాష సామాజికుని పఠనమునకు బాధ్యునిగా నొనర్చునదైనందున అంత శక్తిశాలి కానేరదని భావించుట తర్కసమ్మతము కానేరదని క్వింటీలియన్ స్పష్ట పరచెను. ఇట్లు లక్ష్యమునందును, ప్రయోజన మందును తారతమ్యము కానరా నందున లిఖిత, మౌఖిక భాషలందు భేదమును పాటించరాదని క్వింటీలియన్ తెలి పెను కనుక ఆయన వక్త ఉపయోగించు గద్యశైలికి నిర్దేశించిన భాషా సూత్ర ములే కవికి అన్వితము లగును.

ప్రయోగాత్మక దృష్టితో భాష లిఖితమైనను, మౌఖికమైనను- గ్రాంథికము మరియు వ్యావహారికము అని రెండు రూపముల నుండును. తన లక్ష్యసిద్ధికై వక్త ఏ భాషా రూపమునకు ప్రాధాన్యత నీయవలయును? ఈ విషయ మందు

క్వింటీలియన్ సామాజిక మానసిక స్థితిని దృష్టి యందుంచుకొని వ్యావహారిక భాషను సమర్థించెను. జనులు దైనందిన జీవన మందు గద్యభాష నుపయోగింతురు. ఆ భాషయే అందరికి అందుబాటులో నుండి వారి సుకర అవగాహనకు తోడ్పడును. క్వింటీలియన్ మత మందు జనులు తమ తమ దైనందిన వ్యవహారములందు ఉపయోగించునదే వ్యావహారిక భాష. ఈ భాష ద్వారా వక్త తన లక్ష్యసిద్ధిని బడయ గలడు. వ్యావహారిక భాష యందు మరల రెండు రూపములు కానవచ్చును. ఒకటి సభ్య పదజాలముతో వ్యాకరణ సూత్ర బద్ధమై నాగరకులచే వ్యవహరింప బడునది. రెండు అధికాంశ అసభ్య పదజాల యుక్తమై వ్యాకరణ సూత్రములకు కట్టుబడి యుండక సామాన్యులచే వ్యహరింపబడునది. ఈ రెండింటిలో నాగరకులుపయోగించు వ్యావహారిక భాషయే వక్తకు ఉపయుక్తముగా నుండునని క్వింటీలియన్ తెలిపెను. ఇట్టి శిష్ట వ్యావహారికము అందరికి అందుబాటులో నుండి అవగాహనకు యోగ్యముగా నుండును. సామాజికుని మనసును మరపించి,మురపించి, వక్త ఉపన్యాస మందు రమింపజేయు శక్తి శిష్ట వ్యావహారిక భాషకే కలదని క్వింటీలియన్ తెలిపెను. అదియే సామాజికుని మానసికావస్థకు అనుగుణముగా నుండు స్వాభావిక భాష. కనుక వక్త భాష శ్రోతకు స్వాభావికమై, సరళమై యుండును. శైలికి విన్యాణమును కల్పించుటకై వక్త అవ్యవహారిక పదముల నుపయోగింప రాదు. అట్టియెడ భాష కృత్రిమమై సామాజికుని అవగాహనకు అవరోధముగా ఏర్పడును. ఇట్లు వక్తయొక్క ఉపన్యాస శైలి యందు క్వింటీలియన్ అవ్యవహారిక పదప్రయోగమును అనుపయుక్తము తెలిపెను. స్వాభావికమైన వ్యావహారిక భాషా ప్రయోగమే వక్తృత్వ శైలికి ఉపయుక్త మనెను.

## పద చయనము - Choice of words.

హోరేస్ వలె క్వింటీలియన్ శైలీ స్వరూపము ఉపయుక్త పదములు మరియు వాని సముచిత సంయోజనముపై ఆధారపడి యున్నదని తెలిపెను. ప్రాక్తన కాలమున పరిమితముగానున్న భాష యుగానుకూలముగా, సాంఘిక అవశ్యకతల కనుగుణముగా వివిధ పరివర్తనలకు లోనై నానారకములైన పదములకు నిలయ మగుచున్నది; మానవ జీవన యాపనకు ప్రాణప్రాయముగా వెలసింది. కనుక భాషా స్వరూపము నియమములకు నిర్ధారితము కాజాలదు. స్వదేశీయములు, విదేశీయములు, ఆలంకారికములు, ప్రాచీనములు, అర్వాచీనములు, సాంకేతికములు, దార్శనికములు మున్నగు పదములను చేర్చుకొని భాష మానవుని వివిధ రంగ

ములందు చేదోడు వాదోడుగా నిలిచి యున్నది వక్త భాష నుండి తన విష యమున కుపయుక్తములుగా నుండు పదములనే ఎన్నుకొని వానిని సము చిత రీతిలో సంయోజించినపుడే శైలి రూపొందును. ఇట్లు శైలికి పదములు ప్రాథమిక ద్రవ్యము కాగా వాని కూర్పు భావ వినిమయమునకు మాధ్యమిక రూప మగుచున్నది

రూపము ననుసరించి పదము లెట్లు నానా రకములో అట్లే అర్థము ననుసరించి. కొన్ని పదములు సామాన్యమైన సాంకేతిక అర్థమును బోధింప మరి కొన్ని గంభీర అర్థమును వ్యక్తపరచును. కొన్ని క్లిష్టములై కర్ణ కఠోరము లు కాగా మరికొన్ని సరళ సుబోధకములై వీనులకు విందుగా నుండును త. శైలిని అర్థగాంభీర్యవంతంగా. శ్రవణపేయముగా రూపొందింప దలచిన వక్త లేక కవి మొదట ఉపయుక్త పదముల నెన్నుకొనవలసి యుండును. అందులో కొన్నింటి నుపయోగించి మరి కొన్నింటిని పరిహరింప వలసి యుండును. సులభంగా స్మృతికి అందినవే సరళములు స్వాభావికములు,ఉపయుక్తములని తలంచ రాదు. అనుపయుక్త పద ప్రయోగము విషయమును క్లిష్టముగా మార్చును. మరియు శ్రోతను ఉపన్యాస విముఖుని కావించును కనుక వక్త విషయము,సందర్భము ననుసరించి సముచితములైన పదములను సేకరించు టలో అత్యంత శ్రద్ధ వహింప వలయును. ఆ పదములు సైతము సామాజికుని మానసిక స్థాయి కనుగుణముగా అందుబాటులో నున్న వ్యావహారిక పదములై యుండుట శ్రేష్టము. కొన్ని సందర్భములందు వ్యావహారికము లనుపయుక్త ములైనపుడు కవి లేక వక్త ప్రాచీనములను వినూత్నార్థములతో నుపయోగింప వచ్చును; విదేశీయములను స్వదేశీయముగా మార్చవచ్చును. పదము లేతర గతికి చెందినవైనను విషయమును సమగ్రంగా వ్యక్తీకరించు క్షమతను కలిగి యుండవలయును; సామాజికుని ప్రభావితపరచి వక్త లేక కవి ఉద్దేశ్యమును నెరవేర్చ వలయును. వున శైలీ నిర్మాణ మందు వక్త లేక కవియొక్క పద చయనము వివేక సమ్మతముగా నుండవలయును.

## పద సంయోజన - Arrangement of words.

పదములను వాక్యములు , వాక్యాంశములుగా మార్చుట పద సంయోజ నము. చిత్రకారుడు వివిధ వర్ణములను సేకరించి తన భావన కనుగుణముగా వానిని సంయోజన పరచి తైల చిత్రమును తయారు చేయును. శిల్పి తన

మనసులోని భావన కనుగుణముగా శిలలను సేకరించి శిల్పాకృతిని నిర్మించును. కవి లేక వక్త తన విషయమున కనుగుణము - నున్న పదముల నెన్నుకొని వానిని సంయోజ పరచి శైలిని రూపొందించును పద సంయోజన మందే కవి కళా కౌశలము యిమిడి యున్నది. అదియే శైలి. తదనంతరం భాషా ప్రయోగమే యుండదు కనుక పద సంయోజనమే శైలికి మాతృక. ఈ విషయమున వక్త లేక కవి సాంప్రదాయికతను దృష్టి యందుంచు కొనవలయును. సంప్రదాయేతర పద సంయోజనము ద్వారా వక్త తన అభీష్ట సిద్ధిని బడయజాలడు

పై విధముగా పదముల ఎంపిక మరియు పద సంయోజనమును శైలికి ఆవశ్యక అంగములుగా నిర్ధారించి క్వింటీలియన్ శైలి నాలుగు గుణములను కలిగియుండ వలయునని తెలిపెను. అవి-

1. స్పష్టత- Perspicuity:- కవి కథనము లేక వక్త ఉపన్యాసము ఏదో యొక ఆశయము నుద్దేశించును ఆతని ఉద్దేశ్యము నెరవేర వలయునన్న వక్త ఉపన్యాసము సామాజికుని ప్రభావిత పరచునట్లు సరళ సుబోధకముగా నుండ వలయును. వక్త యొక్క శబ్దముల ద్వారా ప్రకటితకంపబడు అర్థము సామాజికుని మానసమందు పరివర్తనము కల్గించు శక్తిని కలిగియుండ వలయును. శైలికి ఇట్టి సామర్థ్యము స్పష్టత వలన కలుగును. వక్త పద ప్రయోగము ద్వంద్వార్థ భూయిష్ఠముగా, సందిగ్ధ యుక్తముగా, క్లిష్టపద భరితమైయున్నచో అది సామాజికునకు దురవగాహనమై నీరసమును, అసహ్యతను సృష్టించును. అందువలన వక్త లేక రచయిత తన శైలిని స్పష్టార్థ బోధకముగా తీర్చిదిద్ద వలయును వాక్యములు, వాక్యాంశములు విరుద్ధార్థమునకు దారి తీయరాదు. అల్పార్థ బోధకమైగంభీర పదములను, అట్లే గంభీర అర్థ బోధకమై హీనార్థిక పదములను ప్రయోగింపరాదు. కావున శైలి స్పష్టత యను గుణమును కలిగి యుండుట అత్యంతావశ్యకము.

2. ఆలంకారిత- Ornamented Grace :- స్పష్టతతో పాటు శైలి సామాజికుని వశపరచుకొను ఆకర్షణ శక్తిని కలిగి యుండ వలయును. స్పష్టత నీరసతకు దారి తీయు అవకాశము లేకపోలేదు అపుడు వక్త ఉపన్యాసము శుష్కోదేశముగా మారవచ్చును. సామాజికుని అవ హన అతనిని పరవశింపజేయునదిగా నుండ వలయును; రమ్యాతిరమ్యముగా హృదయాహ్లాదకారిగా నుండ

వలయును ఇట్టి అభీప్సితము నెరవేర వలయునన్న వక్త తన శైలిని అలంకార యుక్తముగా రూపొందించు కొనవలయును; శైలిని సౌందర్యవంతంగా మార్చ వలయును కనుక శైలికి అలంకారిత ఆవశ్యక మగుచున్నది. అందువలన వక్త ప్రసంగానుకూలముగా అలంకారముల నుపయోగించి భావమును రమణీయ రీతిలో వ్యక్త పరచుటకు యత్నింపవలయును. ఐనను అలంకారములు భావమునకు కృత్రిమములుగా నుండక సహజ స్వాభావికము లైనపుడు మాత్రమే శైలికి వశీకరణశక్తి అలవడును తద్వారా సామాజికుని భావములు సత్వరముగా ఉద్రిక్తములై విషయము నందను రక్తము లగును. అలంకారములు అర్థ స్పష్టతకు కూడా తోడ్పడును ఉపమ, రూపకము, సారము, సంక్షిప్తము మున్నగు అలంకారముల ప్రయోగ దక్షతను వక్త కలిగి యుండ వలయును. అరిస్టాటిల్ వలె క్వింటీలియన్ రూపకమును అలంకార రాజ్ఞిగా ప్రశంసించెను. ఉపమాలంకారము వివిధ అంశముల, విషయముల సామ్య నిరూపణ కుపకరించును; సారము గంభీర ధ్వని యుక్తము; స్వల్ప శబ్దముల ద్వారా అనల్పార్థము నిది ధ్వనింప జేయును సంక్షిప్తము వక్తవ్యముయొక్క మూల భావము చెడిపోకుండా సంక్షిప్తముగా, రమణీయముగా మార్చును. పై తీరున అలంకార ప్రయోగముద్వారా శైలికి రమణీయతా గుణము సిద్ధించును కావున అలంకారిత వలన శైలికి సౌందర్యాత్మక శక్తి అలవడును. ఐనను ఇది ఆరోపితముగా నుండరాదు. అలంకారములు ప్రచ్ఛన్నములుగా నున్నపుడే శైలికి అలంకారిత సిద్ధించును.

3. కళాత్మక రచన— Artistic Stru.tu e :- పదము అర్థమును బోధించును కొన్ని పదములు సంయోజింపబడి పదముల అన్విత అర్థమును బోధించును. పద సంయోజనము దైనిక వ్యవహారముకన్న భిన్నమై కళాత్మకముగా నుండవలయునని క్వింటీలియన్ తెలిపెను కారణమేమన దైనిక వ్యవహారము నందలి వాక్యరచన సామాన్యముగా అర్థ బోధవరకే పరిమితమై యుండును. అందువలన పదసంయోజనము భాషాసంప్రదాయమున కనుగుణముగా నుండును. కాని వక్త ఉపన్యాసము అర్థ బోధ వరకే పరిమితమై యుండక మానసిక పరివర్తనమువరకు విస్తరించి యున్నది. అందువలన వక్త పద సంయోజనము భాషా సంప్రదాయమున కతీతముగా కళాత్మకముగా నుండవలయును. క్వింటీలియన్ నిర్ధారించిన కళాత్మకత యను ఈ శైలీ గుణము పదముల

ఎంపిక మరియు వాని సంయోజనము వరకు అన్వితముగా నున్నదని బోధ పడును. వక్త తన విషయమున కుపయుక్తములైన పదముల ఎంపికయందును,వాని కూర్పునందును కళాత్మక దృష్టిని వహింప వలయునని స్పష్టము. అన్యథా వక్త ఉపన్యాసము సామాన్యశైలీ రూపమున సామాజికుని పరవశింప జేయజాలదు. స్పష్టత అలంకారితకు మించిన భవ్యగుణము శైలికి కళాత్మక రచన వలన సిద్ధించును. ఈ గుణమే వక్త కథనమును అసామాన్యముగా, అతి లోక రమణీయముగా తీర్చిదిద్ది సామాజికుని పరవశింపజేయును. ఈ దృష్టితో వక్త లేక కవి కళాత్మక రచన యందు దక్షుడై యుండవలయును. అన్యథా వక్త విషయమెంత ఉదాత్తమైనను శుష్కోపదేశముగా మారి శ్రోతృ హృదయమునకు నీరసతనుకల్పించును కళాత్మక రచన యందు వక్త లేక కవి భాషా సంప్రదాయమును పాటించక వ్యాకరణమునకు విరుద్ధముగా వాక్యములను రచించుట తప్పక పోవచ్చును. అప్పటున వ్యాకరణ విరుద్ధ దోషము నంటగట్ట రాదు. సామాజిక అవగాహన మరియు అతని పరవశతను ప్రధానముగా పరిగణింప వలయును. ఉదాహరణముగా– వారి మనములు చల్లవడగా "నామృతమును వెదజల్లుమా' ఈ వాక్యము కళాత్మక రచన యందు "గానామృతమును వెదజల్లుమా వారి మనములు చల్లవడగ" గా మారినపుడు ఇది వ్యాకరణ విరుద్ధమని పరిగణించుటకు వీలులేదు. ఏలన మొదటి వాక్యము కన్న ఈ రెండవ వాక్యమే అత్యంత ఆకర్షకమై హృదయానంద కరముగా నున్నది. కావున ప్రసంగానుకూలముగా వక్త సామాజిక పరవశతను దృష్టియందుంచుకొని సామాన్య వాక్య రచనకు భిన్నంగా పదములను సంయోజించి తన ఉపన్యాసమును కళాత్మకముగా రూపొందింప వలయును. అపుడే అతని వక్తవ్యము కళాత్మకమై సామాజికుని అత్యంత ప్రభావితుని జేయును. అపుడపుడు ఉపన్యాసమును అత్యంత ప్రభావంతంగా నొనర్చుటకై వక్త పద్యశైలి ననుసరింపక తప్పదు పద్యశైలియందు వ్యాకరణ సూత్రములు పాటింపబడవు. ఐనను అది గద్యశైలికన్న మనోహరమై హృదయమును స్పర్శించును. కావున కవి లేక వక్త ప్రసంగావశ్యకతను మరియు ప్రభావాత్మకతను దృష్టి యందుంచుకొని వాక్య రచనా విధానము నతిక్రమించి యైనను తన కథనమును లేక వక్తవ్యమును కళాత్మకముగా రూపొందింప వలయును. అపుడే వక్తశైలి సౌందర్యాత్మకమై శోభిల్లి సామాజికుని మానసమును వశపరచు కొనగలదు. కనుక క్వింటీలియన్ దృష్టి యందు వక్త లేక కవి శైలి కళావంతంగా నుండుట పరమావశ్యకము.

4. లయాత్మకత - Rhythmical ease :-

నేత్రముల ద్వారా దృశ్యము, వీనుల ద్వారా సంగీతము మరియు భావన ద్వారా సాహిత్యము హ్లాదైకమయము లగుచున్నవి. దృశ్యము నకు అభినయము, సంగీతమునకు లయ మరియు సాహిత్యమునకు శబ్దము ప్రధానము లగును దశ్యము కళా ప్రపంచమునకు నిలయ మగుట వలన సంగీత-సాహిత్యములకు అందు సముచిత స్థానము కలదు. సంగీత-సాహిత్య ములు దృశ్యము నంతటి విస్తారతను కలిగియుండనందున దృశ్య కళను తమ లో యిముడ్చుకొన జాలకున్నవి. ఐనను ఇవి రెండును పరస్పర సహకారమును కలిగి యున్నవి. సంగీతమునందు సాహిత్యమున కెంత ప్రాధాన్యత కలదో అంతే సాహిత్యము నందు సంగీతమునకు కలదు. సాహిత్యమును సంగీత మధుర నాదముగా మార్చుటకే ఛందము ఆవిర్భవించి, సప్తస్వరములందు పాటింపబడు ఆరోహణావరోహణా క్రమమును శబ్ద విన్యాసముద్వారా సంప న్నము కావించింది. పద్యము కన్న గేయ మందు శబ్దస్వర లయాత్మకత అధి కతరముగా చోటుచేసుకొని యున్నది. ఒకవేళ పద్యము నందు వలె గద్యమ మందు కూడా లయాత్మకత పాటింపబడిన యెడల గద్యశైలి శుష్కముగా నుండక పద్యశైలి వలె రాగాత్మక మగును. ఈ దృష్టితో క్వింటీలియన్ వక్త ఉపయోగించు గద్యశైలి లయాన్వితము కావలయునని తెలిపెను. అట్లయిన పుడు వక్త ఉపన్యాసము కేవలము శ్రవణానందకరమే కాదు. సామాజికుని రాగ-ద్వేష భరితమైన వ్యక్తిత్వమును పరిష్కరించు ఆలోచనామృతముగా మారును తత్ప్రభావమున సామాజికుడు పరవశుడై వక్త ఉపన్యాస మందు తల్లీనుడగును. కావున వక్తశైలి లయాత్మకమై యుండుట అతని అభీష్ట సిద్ధికి సూచకము.

## భారతీయ దృక్పథము- Indian View.

వక్తృత్వకళ కావ్య వస్తువుకు సౌందర్యాత్మక భాషారూప మేర్పరచున దైనందున పాశ్చాత్యాచార్యులు వక్తృత్వ కళా సౌందర్యమును కావ్యశిల్ప సౌందర్యమున క్వయించిరి భారతీయాచార్యులు కావ్యశిల్ప సౌందర్యమును రూపొందించు భాషా విధానమును వక్తృత్వశాస్త్ర పరముగా వివరింపక కావ్య మార్గముగా, రీతిగా, సంఘటనగా నిరూపించిరి. పాశ్చాత్యాచార్యులు వక్తృత్వ

శాస్త్ర నియమములు కావ్య భాషా శైలికి అన్వయించు విధానమును నిరూపించిరి కాని భారతీయాచార్యులు వక్తృత్వమునకు మూలములైన శబ్దార్థములు కావ్యవస్తువున కేతీరున అన్వితములై అవిభాజ్య తత్త్వముగా ఏర్పడి యుండునో వివరించిరి దాని నిట సంగ్రహముగా తెలిసికొందము. క్వింటీలియన్ వివరించిన వక్తృత్వశైలి కెంతవరకు సంబంధితమై యున్నదో పరిశీలింతము.

## నాట్య ప్రవృత్తులు- Dramatic Tendencies.

ఆద్యాచార్యుడైన భరతుడు నాట్యమును లోక స్వభావమునకు అనుకృతిగా తెలిపెను. ఆది నాట్యమందు లోక ధర్మియగు ననెను. లోక స్వభావమన ఆతని దృష్టియందు నలుదిశల, నానా రీతుల భాసించియున్న సమగ్ర భారత జనజీవనము. అందు కానవచ్చు ప్రాంతీయ లక్షణముల కనుగుణముగా భారతీయ జీవనము నాయన నాలుగు దిశలందు విభజించెను వానికి బౌద్ధ యుగము నాటి సామ్రాజ్య నామముల నేర్పరచెను అవి– పశ్చిమమున మగధ, తూర్పున అవంతి, ఉత్తరమున పాంచాల మరియు దక్షిణమున దాక్షిణాత్యము '' ఆయా సామ్రాజ్యము లందలి సమిష్టి జీవన లక్షణములు నాట్యమందు ప్రతిఫలించును. అందువలన అవి క్రమముగా మాగధీ, ఆవంతి, పాంచాలీ మరియు దాక్షిణాత్యములని నాలుగు నాట్య ప్రవృత్తులుగా వరిగణింపబడుననెను భరతుడు ప్రవృత్తి నిట్లు నిర్వచించెను-పృధివ్యాం నానా దేశ వేష భాషాచార వార్తాః ఖ్యాపయతీతి ప్రవృత్తిః- అనగా నానా దేశ వాసుల వేష, భాష, ఆచార, వ్యవహారాదులను వ్యక్త పరచునది ప్రవృత్తి. నాట్యమందు నాలుగు రకములైన ప్రవృత్తులు కానవచ్చినను అందు యేదో యొకటి ప్రధానముగా, మిగిలినవి దానికి పోషకములుగా నుండును. ప్రాధాన్యత ననుసరించి నాట్యము ఆ ప్రవృత్తి నామమున వ్యవహృత మగును ఈ ప్రవృత్తులే నాట్య సంప్రదాయములు ప్రచారము నొందినవి.

## నాట్య వృత్తులు – Dramatic Actions.

నాట్యమునకు అనుకార్యమైన లోక స్వభావము నాటక మందు ఇతివృత్త రూపమున నుండునని భరతుడు తెలిపెను ఇతివృత్త మన ఆయా దిశలయందు ప్రసిద్ధమైయున్న గాథ లేక ఐతిహాసిక ఘట్టము. ఇదియును అత్యంత విశాలమై నానారకములైన సంఘటనలకు నిలయమైనందున రంగ

శాల యందు ప్రదర్శించుటకు వలను పడదు; ప్రేక్షకుడు సహిష్ణువై చాలా కాలము ప్రేక్షా గృహమందు కూర్చొన లేడు. ఈ దృష్టితో ఇతి వృత్తమును నాటక కథావస్తువుగా మార్చ వలయునని భరతుడు నిర్దేశించెను. కథావస్తు వన నాయికా నాయకులు తమ ఉద్దిష్ట కార్య సఫలతకై కావించు కార్యవ్యాపారము నటకులు దీని నభినయించగా ప్రేక్షకులు గ్రహించి ఆనందమును బడసెదరు. నాటకానందమును భరతుడు రసానుభూతిగా సిద్ధాంతీకరించెను. ఇది ప్రేక్ష కుల యొక్క నాటక కార్య వ్యాపార అవగాహనపై ఆధారపడి యున్నందున రసానుభూతి సర్వదా అర్థ (భావనా) రూపముననే యుండును. ఇట్లు ఇతి వృత్తము నుండి ఆవిర్భూతమై అభినయాత్మకముగా నుండు కథా వస్తువును భరతుడు నాటక వృత్తముగా తెలిపెను. తద్వారా ప్రేక్షకు లనుభవించు ఆనందమే రసానందము. ఇతి వృత్తమును నాటక వృత్తముగా రూపొం దించుట నాట్యధర్మి యగును.

నాటక వృత్తము లన్ని ఆయా ప్రాంతములందు ప్రచారంలో నున్న గాథలకు అనుకృతులై యున్నందున వైవిధ్యమును కలిగి యుండును. అందు వలన చతుర్విధ ప్రవృత్తును దృష్టియందుంచుకొని భరతుడు నాలుగు వృత్తుల నేర్పరచెను. అవి- భారతీ, కైశికీ, సాత్వతీ మరియు ఆరభటీ. వీని అభిన యము నాలుగు రకములుగా నుండు ననెను. అవి క్రమముగా వాచిక, ఆహార్య, సాత్విక మరియు ఆంగికము. నాటక మందు పైన తెలుపబడిన నా లుగు వృత్తులు, వాని అభినయము కాన వచ్చినను అందు ఏదో యొకటి ప్రధా నముగా నుండును. మిగిలినవి దానికి పోషకములుగా నుండును నాటకము లందలి వృత్తుల కనుగుణముగా నున్న అభినయము ద్వారా ప్రేక్షకు లనుభ వించు ఆనందానుభూతి యందు భేదము కానవచ్చును. ఆ రసానంద భేద మును భరతు డిట్లు తెలిపెను- భారతీ వృత్తి నుండి కరుణాద్భుతములు, కైశికి నుండి శృంగార-హాస్యములు, సాత్వతీ నుండి రౌద్ర-వీరములు మరియు ఆర భటీ నుండి భీభత్స-భయానకముల రసానందము ప్రేక్షకులకు కలుగును.

వృత్తుల గురించి శ్రీమన్నారాయణుడు హిరణ్యాక్షుని సంహరించు ఘట్టము ఆధారముగా నాట్యశాస్త్ర మందిట్లు తెలుపబడినది. మొదట శ్రీమన్నా రాయణుడు హిరణ్యాక్షునితో వాగ్వ్యవహారము సలిపెను. ఇది భారతీ వృత్తికి సంబంధించిన వాచికాభినయము. తరువాత వివిధ కాంతులతో దీపించు తన

రూపమును ప్రదర్శించెను. ఇది కైశికీకి సంబంధించిన వేషాలంకరణాది ఆహా ర్యాభినయము. తదనంతరం మహా తేజోరూపమైన తన శక్తిని చూపించెను. ఇది సాత్వతీకి సంబంధించిన శక్తి ప్రదర్శనాత్మకమైన సాత్వికాభినయము. తుదకు హిరణ్యాక్షునితో సమరము సలిపి సంహరించెను. ఇది ఆరభటీ వృత్తికి సంబంధించిన అంగ సంచలనాది ఆంగికాభినయము. ఇట్లు వృత్తులు ఒక క్రమ మైన అభినయముద్వారా ఒక కార్య వ్యాపారమును సమగ్రముగా ప్రదర్శించి ప్రేక్షకునకు తదను గుణమైన రసానందమును కల్గించును. అందువలన నాటక ప్రయోజనమైన ప్రేక్షక రసానుభూతిని సిద్ధింప జేయుటలో సమర్థవంతము లగుటచే నాట్య వృత్తులు నాట్య మాతృకలుగా తెలుపబడినవి. నాట్య ప్రవృత్తు లకును, వృత్తులకును మధ్యకల అంతరము నిట్లు నిరూపింపవచ్చును.

| ప్రవృత్తులు | వృత్తులు |
|---|---|
| 1. ప్రాంత నామములపై ఏర్పడినవి | 1. కార్యవ్యాపారము ననుసరించినవి |
| 2. లోక స్వభావమునకు ప్రతీకలు | 2. నాటక స్వభావమునకు నిదర్శనములు. |
| 3. అత్యంత విస్తార రూపములు | 3. సారాంశ రూపములు |
| 4 సమగ్ర జాతి కార్య కలాపములను వ్యక్త పరచును. | 4. సమగ్రమైన ఒక కార్యమును ప్రదర్శించును. |
| 5 శబ్దార్థ రూపమున పరిచితములు | 5. అర్థ రూపమున ఆస్వాదితములు |
| 6 లోక ధర్మమును నిరూపించును | 6. నాట్యధర్మమును నిరూపించును. |

## అభినయము – Art of Acting.

ఇక వృత్తులకు అభినయముతో కల సంబంధమును పరిశీలింతము. భారతీ వృత్తి వాచికముగా తెలుపబడినది. అనగా శబ్దార్థ సహితమైన భాషా వ్యవహారము. అదియే వాగ్వ్యవహారము. ఇది నాటక మందు సంభాషణ, గీత ముల రూపమున నుండును. సమగ్ర నాటక వృత్తమునకు ఇది నిలయము; నాటక రచనకు మూలము; ప్రేక్షక రసానుభూతికి మూలాధారము. కారణమే మన మూకాభినయము ద్వారా ప్రేక్షకుడు నాయికా నాయకుల కార్యదీక్ష యందలి వివిధ పరిస్థితులను, మానసిక స్థితిగతులను అవ హాన పరచుకో లేడు. అందువలన రస సిద్ధి యుండదు. అంతేకాక నాటకము అభినయాత్మ

కము కాకున్నను కేవల పఠనము ద్వారా కూడ రసానందమును సిద్ధింప జేయును. కావున భారతీవృత్తి శబ్దార్థపరమైన రచనా వ్యాపారమునకు సంబంధించినది. నటకుల వాచికాభినయము ప్రేక్షకుని కథావస్తు అవగాహనకు తోడ్పడును భారతీవృత్తి నాటక రచన యందెంత ప్రధానమో నాటకాభినయమందు కూడా అంతే ప్రధానము. రెండవ కైశికీ ఇది ఆహార్యముగా తెలుపబడినది. అనగా నాయికా నాయకాదుల వేష, భూషలకు సంబంధించినది ఐనను ఇందు భారతీవృత్తి యుండదనుటకు వీలు లేదు. నటకులు వేష-భూషలతో పాటు వాగ్వ్యవహారమును అవశ్యముగ సలుపవలసియే యుండును. మూడవది సాత్వతీ. ఇది సత్వ సంబంధిగా తెలుపబడినది. అనగా నాయికా నాయకాదుల కోప, శోకాది భావములకు సంబంధించినది నటకులు ఆయా భావములను ప్రదర్శించు నపుడు తదనుగుణమైన వాగ్వ్యవహారమును సలుప వలసియే యుండును. ఇక నాలుగవది కాయికము. అనగా అంగ సంచలనాదులకు సంబంధించినది. సన్నివేశమున కనుగుణముగా నటకులు కర చరణముల ద్వారా కార్యమును ప్రదర్శించునపుడు వారు ఏదోయొక రకమైన శబ్ద వ్యాపారము నాశ్రయించియే యుందురు ఈ తీరున ఒకవృత్తి దాని కనుగుణమైన ఒకే రకమైన అభినయమునకు పరిమితము కానేరదని, కార్యస్థితికి అనుగుణముగా ఇతర వృత్తులకు సంబంధించిన అభినయమున కది స్థానము కల్పించుననుట స్పష్టము. ఐనపుడు అన్నింటికి అన్వయించు ప్రధాన వృత్తియేది? శబ్దార్థపరమైన భారతీ వృత్తియే ప్రధానమని బోధపడును. ఇది శ్రవ్య కావ్యమునకును, దృశ్య కావ్యమునకును అన్వయించు సామాన్యవృత్తి. భారతీయ భాషలన్నింటికి తల మానికమైన సంస్కృత భాష భారతీదేవిగా కీర్తింపబడిన ఆ ప్రాచీన కాల మందు సంస్కృత భాషా మహత్వమును దృష్టి యందుంచుకొని భరత ముని భాషా పరమైన వాచికాభినయమును భారతీ వృత్తిగా పేర్కొనెనని భావించుట సమంజసము.

"భరతుని మతమున కైశికీ, సాత్వతీ, ఆరభటీ వృత్తులు మూడును అర్థవృత్తులు అర్థ మన రసమని కాని, రసానుకూలములగు విషయము లని కాని చెప్పి యుంటిమి. ఇక భారతీ వృత్తి శబ్ద వృత్తి. అనగా వాగ్వ్యవహారము. (భారతీ సంస్కృత ప్రాయా వాగ్వ్యాపారో నటాశ్రయః)"

—సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి.

"వీనిలో భారతీ శబ్దవృత్తి. తక్కినవి అర్థవృత్తులు. ఈ భావమునే సింగభూపాలు డిట్లు చెప్పెను- అసాంచ మధ్యే వృత్తీనాం శబ్ద వృత్తిస్తు భారతీ త్రిసో౽ర్థ వృత్తయః శేషాః" -చెలమచర్ల రంగాచార్యులు.

## కావ్య ప్రవృత్తులు- Poetic Tendencies.

నాట్య వృత్తుల వలె నాట్య ప్రవృత్తుల అవగాహనకు కూడా శబ్దార్థపరమైన భాషయే మూలముగా వెలసి యున్నది. ఈ దృష్టితో భరత దృక్పథమున కనుగుణముగా బాణభట్టు హర్ష చరితమందు నాలుగు కావ్య ప్రవృత్తుల (కావ్య రచనా విధానముల) నిట్లేర్పరచెను.

"ఉత్తర భారత మందు సామాన్యముగా శ్లేష ఉపయుక్తమగును; పశ్చిమమందు కేవలము అర్థ సౌకుమార్యము ఆదరింపబడును; దక్షిణ భాగ మందు ఉత్ప్రేక్ష మరియు పూర్వభాగమందు అక్షరాడంబరత అధికముగా ప్రయుక్తమగును." 2.

భరతుని వలె బాణుడు సైతం ప్రాంతీయతను దృష్టి యందుంచుకొనియే కావ్య రచనా విధానముల నేర్పరచెనే కాని కావ్య సౌందర్య దృష్టితో కాదనుట స్పష్టము. ఉదాహరణముగా దక్షిణమున అధికముగా ప్రయోగములో నున్న ఉత్ప్రేక్ష ఉత్తర మందు ఉపయుక్తముగా నుండదని కాని, తూర్పు భాగ మందలి అక్షరాడంబరత పశ్చిమ మందలి కావ్యరచన యందు కాన రాదనుటకు వీలు లేదు.

బాణుడు బహుశ భరతుడు తెలిపిన నాట్య వృత్తుల నుండి ఆవిర్భూతములగు రసానుభూతులను లక్షించి కావ్య ప్రవృత్తుల నేర్పరచెనని భావింపవచ్చును. కరుణాద్భుతములకు అర్థ సౌకుమార్యము కల పద రచన, శృంగార హాస్యములకు శోభాయమానముగా నుండు అక్షరముల కూర్పు, రౌద్ర-వీరములకు భావోద్రిక్తతను కల్గించు అలంకారిక పదముల కూర్పు మరియు భీభత్స-భయానకములకు ఊహావర్ధకమైన పద రచన ఉప యుక్తముగా నుండునని తలంచి యుండును. అట్లే ఆయన భరతునివలె నాలుగు కావ్యరచనా విధానములను బౌద్ధయుగము నాడు భారతదేశమందు నాలుగు దిశలందు విస్తరించి యున్న నాలుగు సామ్రాజ్యములను దృష్టియందుంచు కొనియే సమకాలీన

రెండింటి యందు ఒకే రూపమున సంతరింపబడవు. నాటక మందు అవి సంభాషణాత్మక, గీతాత్మక రూపములు; కావ్య మందు వర్ణనాత్మక రూప ములు. దృశ్య, శ్రవ్య కావ్యములకు మాధ్యమముగా వెలయు భాష ఒకటేయై నను, రచనా విధాన మందు అది వేర్వేరు రూపముల సంతరింప బడుచు న్నది. నాటక మందు భాషా విధానము వృత్తి రూపమున నుండ కావ్యమందది 'మార్గ' రూపమున నుండును. వివిధ వృత్తులకు నిలయమైన నాటక కథా వస్తువు భారతీ వృత్తి మాధ్యమమున ప్రస్ఫుటించి అభినయ మాధ్యమమున రసానంద రూపమున ప్రేక్షకునకు ఆస్వాదనీయ మగునట్లు వివిధ సంఘటన లకు నిలయమైన కావ్యకథా వస్తువు కావ్యమార్గ మాధ్యమమున ప్రస్ఫుటించి అవగాహన ద్వారా కావ్యానంద రూపమున పఠితకు ఆస్వాదనీయ మగును. కావ్య, నాటకముల ద్వారా ఆస్వాదనీయమగు ఆనందము సామాజికునకు అర్థ రూపమున (భావనగా) నుండును. నాట్య వృత్తి అభినయము ద్వారా రస స్ఫోరకమగును. మరి కావ్యమార్గ రస స్ఫోరకమునకు హేతువేమైయుండును? భామహుడు వక్రోక్తిని కావ్యమార్గ రసస్ఫోరకముగా నిర్ణయించెను తద్వారా కావ్యము సౌందర్యాత్మకమై భాసించును. వక్రోక్తియే సర్వాలంకార మాతృక. కావ్య సౌందర్యమునకు వక్రోక్తియే మూలము. (వివరణకు చూడుము ప్లేటో) నాటక సౌందర్యమునకు అభినయము వలె కావ్యసౌందర్యమునకు వక్రోక్తియే హేతువగును. కావ్యమున కిట్టి లోకోత్తర సౌందర్యము శబ్దార్థ లైన పద ముల కూర్పు ననుసరించి ఏర్పడునని భామహుడిట్లు తెలిపెను- పూలమాలను కట్టువాడు ఏపుష్పము నే పుష్పముతో బాగుగా నుండునో ఆలోచించి కట్టునో కవియును అవధానముతో ఏ పదము నే పదముతో జోడించినచో సౌందర్య వంతముగా నుండునో ఆలోచించుకొని రచింపవలయును.''

పై విధముగా భరతుని వలె భామహుడు సైతము శబ్ద వృత్తినే ప్రధాన ముగా పరిగణించెను. నాటక మందు అది అభినయాత్మక మగుట వలన భార తీవృత్తిగా ప్రసిద్ధమైనట్లు, కావ్య మందు అది పదముల కూర్పుకు అన్వితమై వక్రోక్తితో కూడి యున్నందున కావ్య మార్గముగా పరిగణింప బడును. బాణుడు తెలిపిన అక్షరాడంబరత, సౌకుమార్యము, శ్లేష, ఉత్ప్రేక్ష- యను కావ్య ప్రవృత్తులు రచనా విధానమునకు సంబంధించినవని, అవి వక్రోక్తి వంతములై ఒకే కావ్య మార్గమును ధృవీకరించునని భామహుని అభిమ

రచనా విధానములను ఆయా ప్రాంతముల కన్వయించెను. విశుద్ధ సాహిత్య దృక్పథమును వహించి కావ్య రీతులుగా తెలుప లేదు. ఆయన నిర్ధారించిన కావ్య ప్రవృత్తులందు కావ్య రీత్యాత్మక లక్షణములు కొన్ని కాన వచ్చినను, అవి కావ్య-రీతులు కానేరవని, కావ్య రచనా స్వభావమును తెలుపు ప్రవృత్తులే యని గ్రహింప వలయును. ఉత్తమ రచనకు నాలుగు ప్రవృత్తులు అవశ్యక ములని కాని. అవాంఛనీయములని కాని బాణుడు తెలుప లేదు. కనుక బాణుని దృష్టి యందు కావ్య ప్రవృత్తులన ఆయా ప్రాంతముల రచనా వైఖరులను వ్యక్త పరచు కావ్యరచనా విధానములు. కావ్య ప్రవృత్తుల నుండి గ్రహింప వలసిన ముఖ్యాంశము లివి-

1. జీవన చర్యాత్మకములైన నాట్య ప్రవృత్తుల నుండి కావ్య ప్రవృత్తులు వేరు పరచబడుట.
2. నాట్యప్రవృత్తుల వ్యాపకత కావ్యప్రవృత్తుల రూపమున సంకుచిత పరచబడుట.
3. లోక స్వభావము శబ్దార్థ పరముగా కావ్య ప్రవృత్తుల రూపమున అన్వయింపబడుట.
4. నాట్య ప్రధానమైనదని నాటకమని, శబ్దార్థ ప్రధానమైనది కావ్యమని నిరూపింపబడుట.
5. కావ్య ప్రధానవృత్తిగా భారతీవృత్తి సమర్థింపబడుట.

## కావ్య మార్గము- Poetic way.

భామహాచార్యుడు నాట్య శాస్త్రమును ఆధారముగా గ్రహించి 'కావ్యా లంకార' మను కావ్య శాస్త్రమును రచించెను. నాటి నుండియే కావ్యశాస్త్రము అలంకార శాస్త్రముగా ప్రసిద్ధ మయ్యెను. ఆయన కావ్య ప్రవృత్తులను దృష్టి యందుంచుకొని కావ్యమును శబ్దార్థసహితముగా నిర్వచించెను- శబ్దార్థౌ సహి తౌ కావ్యం- ఆతని మత మందు కావ్యము పద్యమునందైనా, గద్య మందైనా రచితము కావచ్చును. నాటక రచనకు, నాటక అభినయమునకు ప్రధానమైన భారతీవృత్తినే ఆయన కావ్య ప్రధాన తత్త్వముగా అంగీకరించి కావ్యమును శబ్దార్థ పరముగా వివేచించెను. ఐనను శబ్దార్థములు కావ్య నాటకములు

తము అట్లే భరతుడు తెలిపిన వృత్తుల అభినయముద్వారా ఆవిర్భూతములగు రసానందముల అనుభూతిని పాఠకులకు వక్రోక్తి కలుగ జేయునని అతని మతము. కనుక భామహుని దృష్టియందు వక్రోక్తి మంతమైన కావ్య మార్గ మొకటే రచనా విధానము. ఇందు భేదము లేర్పరచుట తగదు. తన కాల మందు ప్రచారములోనున్న కావ్య రచనా విధానముల నాతడు అంగీకరింపక ఇట్లు తెలిపెను

"కొందరు పండితు లిట్లు అంగీకరితురు. వైదర్భీ మార్గమైతే వేరేయై యున్నది. అదియే శ్రేష్ఠముగా నున్నది సుందరమైన అర్థమును కలిగియుండియు ఇత రము శ్రేష్ఠము కాక యున్నది ఈ వైదర్భియే గౌడీయము. దీనిని వేరుగా భావించ నవసరం లేదు. బుద్ధిహీనుల దృష్టి యందు గతానుగతికా వశమున ఏర్పడిన వేర్వేరు నామములు మాత్రమే." 3.

కావున భామహుని దృష్టియందు విదర్భ, గౌడ– ఈ రెండు దేశము లందు ప్రాచుర్యము నొందిన రెండు కావ్య మార్గములందు వ్యత్యాసము లేదు; ఉత్తమాధమ భేదములు లేవు వక్రోక్తి మంతమైన మార్గమేదియైనను శ్రేష్ఠమే; లోకాతి సౌందర్య భాసురమే. వక్రోక్తియన శబ్దార్థముల వక్రత అది ప[illegible] ముల కూర్పుపై ఆధారపడి యున్నది. తద్వార వాక్కు సౌందర్య వంత రమ్యాతి రమ్యమైన అర్థమును వ్యక్త పరచును; సామాజికుల హృదయమ నలరించును. వక్త యొక్క వక్తృత్వ కళా నైపుణ్య మం[illegible]యు పదము కూర్పుతో ఏర్పడిన వక్రోక్తి యందే ఇమిడి యున్నది క్వింటీలియ[illegible] తెలిపి, పద సంయోజన, ఆలంకారిత, కళాత్మక రచన- వక్రోక్తి యందే అంతర్భావము నొందును. వక్త అనుసరింపదగినవిగా క్వింటీలియన్ ఏర్పరచిన వక్తృత్వ నియమములను భామహుడు వక్రోక్తి ప్రతిపాదనము ద్వారా కవికి కావ్య మార్గ రూపమున నిర్దేశించెనని ఇట స్పష్టము భరతుని దశ గుణముల నంగీక రింపక భామహుడు ఓజ, ప్రసాద, మాధుర్యము లను మూడు గుణములనే సమర్థించెను. క్వింటీలియన్ తెలిపిన స్పష్టత, లయాత్మకత యను రెండు గుణ ములు భామహుని మూడు గుణములందు అంతర్భావము నొందును

భామహుడు ప్రతిపాదించిన మార్గమును దండి వర్త్మము, మార్గము లను నామములతో విశదీకరించెను. ఆయన అలంకారములను (వక్రోక్తి) కావ్య శోభాకారక ధర్మములుగా నిర్వచించెను – కావ్య శోభాకరన్ ధర్మాన లంకారాన్ ప్రచక్షతే– భరతుని దశ గుణములను సమర్థించి వానికి విపర్య

యములు దోషములగు ననెను. భామహుడు వైదర్భి, గౌడీ మార్గములందు భేదమును పాటించ లేదు కాని దండి ఆతని మతమును సమర్థింపక వాని యందలి భేదము నిట్లు స్పష్ట పరచెను—

"పరస్పరము అత్యంత సూక్ష్మ భేదములను కలిగియున్న వాగ్విలాసము లనేకములు ఇవి వైదర్భి, గౌడి మార్గములందు స్పష్టపరచ బడును శ్లేష, ప్రసాద, సమత, మాధుర్య, సౌకుమార్య, అర్థవ్యక్తి, ఉదార. ఓజ, కాంతి, సమాధి యను దశ గుణములు వైదర్భికి ప్రాణము వంటివి. గౌడీ మార్గమందు సామాన్యముగా వీనికి విపర్యయములైనవే కానవచ్చును. ఇట్లు తమ తమ స్వరూపములకు నిరూపణములై యున్నందున ఇవి రెండును (వైదర్భి గౌడి), భిన్నము లగును. ప్రతి కవి యందు ఇవి విభిన్నములుగా లక్షితము లగుట వలన ఈ మార్గము లన్నింటి విశదీకరణ సాధ్యము కాక యున్నది. ....చెరకు రసము, పాలు, బెల్లము మున్నగున వన్నియును మధురములే కాని దేని మాధుర్యము దానిదే. అట్లే ఈ రీతులును ప్రతి కవికి భిన్నభిన్నములై యుండుటచే వాని భేదముముల నన్నింటిని వివరించుట సరస్వతీదేవికిని కూడా సాధ్యము కాని పని" 4.

పై విధముగా కావ్యమార్గ నిరూపణ మందు దండి భామహుని కన్న భిన్నమైన దృక్పథము నవలంభించి ఈ క్రింది మౌలికాంశములను ప్రతిపాదించెను—

1 అలంకారములను కావ్య శోభాకారక ధర్మములు గా నిర్వచించుట.

2 గుణములను కావ్య మార్గముల కన్వయింప జేయుట.

3 కావ్య మార్గము లందలి భేదములను నిరూపించుట.

4. కావ్య మార్గము లనేకములను దృక్పథమును ప్రదర్శించుట.

"భారతీయ కావ్య శాస్త్రమందు మొదటిసారిగా రీతిని ఆదరించిన ఆచార్యుడు వాస్తవముగా దండి. ఆయన రీతిని విశదముగా వివేచించుట వలన ఆతనిని 'రీతి' సమర్థకునిగా భావింతురు."

—డా॥ నగేంద్ర.

## శబ్ద వృత్తులు— Word Actions.

దండి తర్వాత ఉద్భటుడు గుణముల,అలంకారముల మధ్య కల భేదము నిట్లు స్పష్ట పరచెను— "గుణములు, అలంకారములు— ఇవి రెండును సమాన రూపమున చారుత్వ హేతువులే యగును. ఈ రెండింటిలో కల భేదము విషయము

లేదా ఆశ్రియము. గుణములు సంఘటనా శ్రితములు (రచన, రీతి). అలంకారములు శబ్దాశ్రితములు''.......''లౌకికములైన శౌర్యాది గుణములు, హారాది అలంకారములందు గుణముల సంబంధము నిత్యమని, అలంకారములది అనిత్యమను భేదము నిశ్చయంగా కాన వచ్చును. కాని కావ్యగత ఓజస్సు మున్నగు గుణములు మరియు అనుప్రాసాది అలంకారమూ లందిట్టి భేదము ఉండనేరదు. అవి కావ్య మందు నిత్య సంబంధమును కలిగి యుండును. లౌకిక గుణాలంకారములవలె కావ్యగత గుణాలంకారము లందు భేదమును పాటింపరాదు.'' 5. అయన నాద సౌందర్య ఆధారముగా శబ్దవృత్తుల నేర్పరచెను అనుప్రాసమును ఉప నాగరికా, పరుషా, కోమలా లేక గ్రామ్యా యని మూడు రకములుగా నేర్పరచెను. కలకల కోకిల లలితే ఇత్యాది స్థలములందు ''ల'' వర్ణము పెక్కుసార్లు వచ్చుటచే శ్రావ్యత కలుగు చున్నది. ఇట్టి శ్రావ్యత లేదా నాద సౌందర్యమును గూర్చువ్యాపారమే వృత్తి. ఇది రస విషయ వ్యాపారమే యగును. ఉద్భటుడు తెలిపిన శబ్దవృత్తుల నిట్లు గ్రహింప వలయును–

1. ఉప నాగరికా .– ''ట'' వర్ణ ప్రయోగ మసలే యుండదు. ఇతర వర్గముల ఐదవ వర్ణముతోపాటు ఆ వర్గమునకు చెందిన ఇతర వర్ణముల సంయోగ మేర్పడును కోమల భావాభి వ్యంజనకు శృంగార రసాభి వ్యక్తికి ఇది ఉపయుక్తము.

2 పరుషా – ''ట'' వర్గము, శ, ష, మరియు రేఫాదులతో కూడిన వర్ణ ప్రయోగము ఇందు ఉండును ఇది కర్ణ కఠోరమైన శబ్ద వృత్తి. దీప్తి కారక భావములకు రౌద్ర, భయానగ రసముల దీప్తికి ఇది ఉపయుక్తము.

3. కోమలా – కోమలములైన భావముల అభివ్యక్తికి, శృంగార, కరుణ, శాంత రసముల దీప్తికి ఇది ఉపయుక్తము.

## రీతి - Riti (Style).

ఉద్భటాచార్యుని అనంతరము వామనాచార్యుడు మార్గమును 'రీతి'గా వ్యవహరించెను రీజ్ ధాతువునకు క్తిన్ ప్రత్యయము చేరగా రీతి పదము ఏర్పడినది. రుచి, గతి, మార్గము, పంథ. పద్ధతి, రచన, శైలి మున్నగునవి

దీని పర్యాయములు. కాని ఆయన రీతిని కావ్య సౌందర్య తత్త్వము అను అర్థ మున రీతి సంప్రదాయమును స్థాపించెను. దానియే కావ్యమునకు ఆత్మగా ప్రతిపాదించెను.

వామనుడు రీతి సిద్ధాంతము నిట్లు వివరించెను– విశిష్ట పదముల కూర్పు రీతి– విశిష్ట పద రచనా రీతి– గుణాలంకార సహితములైనవే విశిష్ట పద ములు గుణములు కావ్యశోభకు ఆకరములైన ధర్మములు –కావ్యశోభాయాః కర్తారో ధర్మాః గుణాః– గుణముల నతిశయింప జేయునవి అలంకారములు– తదతిశయ హేతవో అలంకారః- ఇట్లు గుణాలంకారములచే పరిష్కృతములైన శబ్దార్థములచే కావ్య శబ్దము ఉపయుక్త మగును – కావ్య శబ్దోఽయం గుణాలంకార సంస్కృత యో శబ్దార్థయో ర్వర్తతే కావ్యార్థము అలంకారముల ద్వారా గ్రాహ్య మగును. కావున కావ్య సౌందర్య మన అలంకారములు. ఈ విధముగా వామనుడు "రీతి''ని కావ్య సౌందర్య తత్త్వముగా తెలిపెను. కాని ఆయన విశిష్ట పదముల రచనను రీతిగా పేర్కొనుట వలన గుణాలంకారము లకే అధిక ప్రాధాన్యత నిచ్చె ననుట సరియైనది. అలంకారమును అతడు సౌందర్య వాచిగా భావించి, దాని వివేచన మందు తర్క సమ్మతమైన ప్రౌఢ వైఖరిని ప దర్శించెను. కావ్య శైలికి వ్యాపకమైన ప్రతిపత్తిని కల్పించెను. వామనుడు 'రీతి'ని కావ్యాత్మగా పేర్కొనినను అది మూడు విధములుగా సిద్ధిం చునని మూడు రీతులను వివరించెను. అవి–

1. వైదర్భీ రీతి :– సమగ్ర గుణోపేతా వైదర్భీ– సమగ్ర గుణములతో ప్రకాశించునది
2. గౌడీ రీతి :– ఓజః కాంతిమతి గౌడీయా– ఓజస్సు మరియు కాంతి గుణము లను కలిగి యున్న ఉద్భట రచన.
3. పాంచాలీ రీతి :– మాధుర్య సౌకుమార్యోప పన్నా పాంచాలీ– మాధుర్య సౌకుమార్య యుక్తమైన శిథిల పద రచన.

వామనుని దృష్టియందు వైదర్భీ రీతియే శ్రేష్ఠము మిగిలిన రెండును శిథిలములే అయినను ఈ రీతి భేదము దేశ భేదము ననుసరింపక, పదప్రయోగ విన్యాసము ననుసరించి ఏర్పడియున్నచో సముచితముగా నుండెడిది ఐనప్ప టికిని వామనాచార్యుడు విశిష్ట పదముల కూర్పును రీతిగా నిరూపించుట వలన కావ్య శైలిని సమర్థించిన వాడయ్యెను.

Dramatic action, word action, word acting power
నాట్య వృత్తి, శబ్ద వృత్తి, శబ్ద శక్తి వృత్తి-

ఆనందవర్ధనాచార్యులు వామనుని రీతి సిద్ధాంతము నంగీకరింప లేదు. వృత్తి శబ్దము చేతనే రీతులను వ్యవహరించి వాని నిట్లు వేరు పరచెను- "రసాదుల కనుకూలమైన శబ్దము మరియు అర్థము యొక్క సముచిత వ్యవహారమే రెండు రకములైన వృత్తులుగా పరిగణింప బడును. వ్యవహారమునే వృత్తి యందురు. రసాను గుణముగా ఔచిత్యవంతమైన వాగ్వ్యవహారమును కలిగి యున్నవి కైశిక్యాది వృత్తులు. మరియు శబ్దమున కాశ్రితమైన వ్యవహారమం తయు ఉపనాగరికాది వృత్తులుగా పరిగణింపడును. రసాది పరతయా (రసమున కనుకూలముగా, రసమునే ప్రధానముగా భావించి) ప్రయుక్తములగు (కైశిక్యాది అట్లే ఉప నాగరికాది) వృత్తులు నాటకము మరియు కావ్యము లందు (క్రమశః) అనిర్వచనీయ సౌందర్యమును సృష్టించును. రసాదులు ఆ రెండు రకములైన వృత్తులకు ఆత్మ భూతము లగును మరియు కథావస్తు వాదులు శరీర భూతము లగును "6.

పై విధముగా ఆనందవర్ధనుడు శబ్ద వృత్తులను తెలిపి వానిని కావ్యశైలికి అన్వయించెను. ఆయన రీతి పదమును అంగీకరింపక శబ్దవృత్తి పరముగ 'పద సంఘటన'గా తెలిపెను (చూడుడు-లాంజినస్) సమ్యక్ = యథోచిత మైన, ఘటన = కూర్పు. ఇట్లు పదముల యథోచితమైన అనగా సముచిత మైన కూర్పును కావ్యశైలికి అన్వయించునట్లుగా వివరించెను ఆయన పద సంఘటనను మూడు రకములుగా తెలిపెను. సర్వదా సమాస రహితము, మధ్యమ, దీర్ఘ సమాస యుక్తము. అట్లే గుణసంఖ్యను ఓజము. ప్రసాదము, మాధుర్యములుగా మూడింటికి పరిమితము కావించెను గుణములు రీతికి ఆశ్రితములను వామన మతమును ఖండించి, వానిని రసాశ్రితములుగా తెలిపెను. (చూడుడు లాంజినస్) ఈ తీరున శబ్దవృత్తి పరముగా ఆనందవర్ధనుడు మూడు కావ్యశైలీ భేదముల నేర్పరచెను; ప్రాంతీయ దృష్టితో కావ్య రచనా విధానముల నేర్పరచుట అవైజ్ఞానిక మను దృక్పథము ప్రకటించెను భరతుడు ప్రధానముగా ప్రతిపాదించిన భారతీ వృత్తిని (శబ్దవృత్తి) సమగ్ర సాహిత్యమున కన్వయించునట్లుగా మూడు రకములుగా విభజించెను-

1. నాట్య వృత్తులు (అర్థవృత్తులు)- భారతీ, కైశికీ, సాత్వతీ, ఆరభటీ.

2. శబ్దవృత్తులు- ఉప నాగరికా, పరుషా, కోమలా.

3. శబ్దశక్తి వృత్తులు- అభిధ, లక్షణ, వ్యంజన.

వక్రోక్తి సంప్రదాయ ప్రవర్తకుడైన కుంతకుడు ఆనందవర్ధనుని పద సంఘటన నంగీకరించెను. ఇంకను గంభీరముగా వివేచించి ఆయన రీతులను కవి స్వభావమునకు ముప్విధములుగా అన్వయింపజేసెను. అవి-

1. సుకుమార మార్గము- ఈ శైలి సుకుమార స్వభావము కల కవులకు స్వభావ సిద్ధమై రమణీయముగా భాసించును. కవి ప్రతిభ ఎల్లెడల వ్యాపించును. ఇది రస ప్రధాన శైలి.

2 విచిత్ర మార్గము- ఈ శైలి విచిత్ర ప్రభావము కల కవికి సహజము. ఇది కవి వైదుష్య వైభవమునకు నిలయము. ఇది వక్రోక్తి ప్రధానశైలి, హృదయము కన్న బుద్ధినే అధికముగా ప్రభా ిత మొనర్చును.

3 మధ్యమ మార్గము- సుకుమార, విచిత్ర మార్గముల కలయికచే ఏర్పడుట వలన ఇది ఉభయ లక్షణములను కలిగియుండును. ఇది నూతనార్థమునకు సంకేతితము కానేరదు ఉక్తివైచిత్ర్యము ద్వారా వర్ణ్య విషయమును చమత్కార వంతరముగా ప్రకాశింప జేయును.

అభినవ గుప్తుడు నాట్యవృత్తులను అర్ధవృత్తులుగనే పరిగణించెను. అర్థమన ఆతని దృష్టియందు రసమే-కావ్యేచ నాట్యాయమాన ఇవరసః కావ్యార్థః, కావ్యస్య అర్థః కావ్యార్థః (అర్థ్యతే ప్రాధాన్యేన ఇత్యర్థః నత్వర్థః అభిధేయ వాచీ) కావున అర్థ మన రసమనియు, రసవంతమైన యితివృత్తాదు లని గ్రహింపవలయును. మమ్మటుడు 'ఆయా రస వ్యంజకములుగా నియమితములైన వర్ణములతో కూడిన వాగ్వ్యవహారమును వృత్తిగా తెలిపెను'- వృత్తిర్నియత వర్ణగతో రస విషయో వ్యాపారః- వృత్తి శబ్దముచే వ్యవహృతములైన ఉపనాగరికాదులు వామనాదుల మతము లందు రీతులేయని స్పష్ట పరచెను-ఏతాస్తిస్రోవృత్తయః (ఉప నాగరికా, పరుషా, కోమలా) వామనాదీనాం మతే రీతి రుచ్యతే- రాజశేఖరుడు వాక్కుల విన్యాస క్రమమును రీతి

యనెను- వచన విన్యాస క్రిమో రీతిః- సింగభూపాలుడు పదములను కూర్చు పద్ధతి రీతి యని, భారతీవృత్తిని శబ్దవృత్తిగా, మిగిలిన మూడింటిని అర్థవృత్తులు తెలిపెను- ఏసాంచ మధ్యే వృత్తీనాం శబ్దవృత్తిస్తు భారతీ త్రిసోఽర్థ వృత్తయః శేషాః

లోక స్వభావ వ్యక్తీకరణము నాట్య ప్రవృత్తులుగా, నాట్యవృత్తులుగా, కావ్య ప్రవృత్తులుగా, మార్గముగా, రీతిగా, పద సంఘటనగా క్రమపరిణతిని పొందీ నేడు కావ్య శైలిగా స్థిరపడినది. దీని కన్నింటికి మూలము శబ్ద వృత్తియని అదియే నాట్యవృత్తుల, శబ్దవృత్తుల, శబ్దశక్తివృత్తుల రూపమున అపార సాహిత్య జగత్తు నేలుచున్నదని స్పష్టము. భారతీయ కావ్యశైలి పాశ్చాత్య కావ్యశైలి వలె వక్తృత్వ శాస్త్రమునకు సంబంధితము కానేరక స్వతంత్ర రీతిలో సాహిత్య రూపముల కనుగుణముగా వికసితమై యున్నదని కూడా పై వివరణ ద్వారా స్పష్టము. క్వింటీలియన్ వలె భారతీయాచార్యులు కావ్యశైలీ సౌందర్యమునకై పదముల కూర్పునే సమర్థించి యున్నారు. ఐన వ్వటికిని పాశ్చాత్యులు తెలుపనేరని శైలీ విశేషము లెన్నింటినో భారతీయకావ శైలి సంతరించుకొని యున్నదని గ్రహింప వలయును.

శయ్య- Rhythmopoeia.

వక్తయొక్క ఉపన్యాసము సామాజికుల వీనులకు ప్రభావోత్పాదకముగా నుండ వలయును. అపుడే ఆతడాశించిన ఉద్దేశ్యము నెరవేరును ఉపన్యాసమున కిట్టి ఆకర్షణీయత వక్తయొక్క లయాత్మక పద ప్రయోగముద్వారా చేకూరును. ఈ దష్టితో అన్య ఆచార్యుల వలె క్వింటీలియన్ లయాత్మకతను వక్తృత్వ కళకు అవశ్యక గుణముగా నిర్ధారించెను లయాత్మక యన వచ్చిన పదములే మరల మరల విభిన్నార్థములతో ప్రయోగితములు కాగా పర్యవసితమగు భాషా సౌందార్యాత్మక స్థితి లయాత్మకత వలన వక్తయొక్క గద్యాత్మక ఉపన్యాస శైలి రాగాత్మకమైన పద్యశైలివలె ఆకర్షణీయమై సామాజికుల హృదయముల నలరించును. పాశ్చాత్యాచార్యుల వలె భారతీయాచార్యులు అనుప్రాసాది శబ్దవృత్తుల ద్వారా శైలీ రామణీయకతను వివరించిరి. అంతేకాక లయాత్మకతద్వారా సిద్ధించు కావ్య రాగాత్మక స్థితిని శయ్యా రూపమున విశదీకరించిరి. అట్లే తద్వారా కావ్యమందు నెలకొనియుండు సామాజిక రసాస్వాదనా

రూపమును 'పాకము' (Taste) గా వివరించిరి. శైలిని గురించిన విస్తార వివేచన భారతీయ కావ్యశాస్త్ర మందు జరిగినదనుట స్పష్టము.

లయాత్మకత వలె శయ్యకూడా శైలికి సంబంధితము సామాన్యార్థమందు శయ్య యనగా పదముల కూర్పు. కావ్యపరముగా ఇది పదముల విశేషమైన కూర్పుగా భావింప బడును. పదములు వాక్యముల నేర్పరచును. వాక్యములు శైలిని నిరూపించును. కావ్యశైలి సామాన్యము కన్న భిన్నముగా నుండుట వలన సామాజికుడు కావ్య వస్తువు నందు రమించును ఇట్టి ఆకర్షణీయతను శైలి కలిగి యుండ వలయునన్న అందలి పదముల కూర్పు విశేషమైన విధానముతో రాగాత్మకమై యుండవలయును ఈ దృష్టితో భామహుడు పదముల కూర్పునందు రమణీయతను పెంపొందించుచు కవి అత్యంత జాగరూకుడై యుండవలయు ననెను. పదముల కూర్పు విశేషితమై యున్నచో కావ్యశైలి మనోహరమై ఆనందదాయకము గా నుండును. భామహుడు తెల్పిన వక్రోక్తి చమత్కార మంతయు పదముల కూర్పునకు ఆధారితమైయున్నది. ఇందు అలంకారిత యిమిడి యున్నందున అగ్ని పురాణకర్త ఆలంకారిక పదరచనను "ముద్ర"గా తెలిపెను– ముద్రాదులను శబ్దాలంకారము లందురు కవి యభిప్రాయమును వివరించి సంతోషమును కల్గించుటచే ఇది ముద్ర యన బడుచున్నది. మేము దీనినే శయ్య అందుము" 7. అగ్ని పురాణకర్త తెలిపిన ముద్ర కావ్యము సామాజికునిపై నెరపు ప్రభావమునకు సూచకము. శబ్దమునకు కల ఆకర్షణశక్తికి సామాజికుడు లోబడి కావ్య వస్తువు నందు తన్మయత్వమును బొందుటయే కావ్యము నెరపు ముద్రా ప్రభావము. ఇట్టి ప్రభావాత్మక గుణమును కలిగిన శబ్దముల కూర్పు ముద్ర యని భావము. ధ్వని కారుడు శబ్దములను అర్థపరముగా, ఉపనాగరికా పరముగా, శబ్దశక్తి పరముగా వివరించి రసాశ్రితముల కావించెను. అందువలన శయ్య కావ్య పద సంఘటనకు(శైలి) అంతర్గతముగా పరిగణింప బడెను. మరి పదముల కూర్పుకు ముద్రాత్మక ప్రభావమే తీరున సిద్ధించును ? ఈ ప్రశ్నను గురించి భారతీయాచార్యులు శ్రద్ధ వహింప లేదు. శయ్యను కావ్య రీతులందే పదముల సముచిత కూర్పుగా అంతర్భవింప జేసిరి.

విద్యానాధుడే మొదటి సారిగా శయ్యను గురించి గంభీరముగా పరిశీలించి ఇట్లు నిర్వచించెను– 'యా పదానాం పరా అన్యోన్యమైత్రీ శయ్యా'.

చెలమచెర్ల రంగాచార్యులిట్లు వివరించిరి- శయ్యా లక్షణములోని 'పరా మైత్రీ' యను పదములు గమనింప దగినవి. పదములకు గాఢమైన మైత్రి అన నేమి? పదము లొండొంటిని విడిచి యుండలేక పోవుటయే. సుందరమైన తాత్పర్య స్ఫూర్తి కొరకు కవి సావధానుడై యేర్చి ప్రయోగించిన పదములు మార్పును సహింప కుండుటయే వానికి గాఢ మైత్రి యని ఫలితార్థము. అట్టి పదము లను మార్చి వాని పర్యాయములను ప్రయోగించినచో ఆ ప్రకరణమున తాత్పర్య సౌందర్యమునకు భంగము వాటిల్లునని తెలియ దగును. మల్లినాథ కవి తల్లజుడు ఏకావళీ వ్యాఖ్యలో దీని నిట్లు వివరించెను. పదానాం పరివృత్తి వైముఖ్యం వినిమయా సహిష్ణుత్వమ్ ఏతదేవ శయ్యేతి చాఽఖ్యాయతే, పదములు వినిమయమును సహించ కుండుటయే శయ్య" 8.

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి గారిట్లు వివరించిరి— "పదముల యొద్దికలేక పదముల పొత్తు శయ్య అనగా నే పదము వెంట నే పదముగూర్చిన సొబగో యది శయ్య. స్త్రీ పురుషులు వేషములు ధరించునపుడే చీరకు నే రవిక యందమో, యే కోటుకు నే షర్టు అందమో విచారించు కొందురు కదా! అట్లే పద రచన యందును బొత్తుండ వలెను పొత్తు పొసగని పదరచన కూడదు ఈ శయ్యనే పరివృత్త్యసహిష్ణుత యందురు రీతులలో పదములను మార్చవచ్చును. పరివృత్త్యసహిష్ణువుగా గుణములను సంకలనము చేయుటయే శయ్య యగును. కావున శయ్య రీతుల ధర్మ మనవచ్చును అయా రీతులకు దగిన విధమున బరివృత్త్యసహిష్ణువుగా గుణ సంకలనము చేసిన యెడల శయ్య యగును" 9.

పై వివరణమును బట్టి శయ్య పదముల ప్రగాఢమైత్రి యని తేటపడును. ఈ మైత్రి శబ్దార్థముల సంబంధము వంటిది కాదు. శబ్దము ప్రసంగానుకూలముగా అనేకార్థ బోధకు నిలయమగును. కాని శయ్య సమానార్థక పదములను కూడా సహింపదు. అర్థమునకు భావముతో ఎట్టి సంబంధము కలదో అట్టి సంబంధమే పదముల కూర్పు నందు శయ్య కలిగి యున్నది. కావున శయ్య శబ్ద ధర్మ మగును. రచనా ధర్మ మగును.

## పాఠ ధర్మములు - Reading Rules.

సంస్కృత భాష యందలి వేద పఠనము వలె, ఆంధ్ర సాహిత్యమందు కావ్య పఠనము పాఠ ధర్మముగా వాడుకలోనికి వచ్చినది. కావ్యము పఠనీయము. అనగా చదువదగినది, శ్రవ్యము. చదువుట రెండు రకములు. మౌఖికము మరియు మౌనము. పాఠ ధర్మములు మౌఖిక పఠనమున కేర్పడినవి. అర్థమున కనుగుణముగా విరామమును పాటించుచు శ్రోతలకు అవగాహనమగు రీతిలో సరియైన ఉచ్చారణతో పఠించుటయే మౌఖికము. మౌన పఠనము పఠితయొక్క మేధాశక్తికి అధీనమై యున్నందున పాఠధర్మముల అవశ్యకత యుండదు. వేద పఠనమునకే కాక కావ్య పఠన నిమిత్తము కూడా శిష్యులు గురువుల వద్ద శిక్షణను పొందెడివారు కావ్య పఠన పరీక్షయందు ఉత్తీర్ణులైన వారు రాజాస్థానములందు పాఠకులుగా నియమింపబడెడి వారు. వీరు కావ్య పఠనముతో పాటు ఆజ్ఞా పత్రములను కూడా భావ స్ఫోరకముగా, సభికులకు అర్థమగునట్లు వినిపించెడి వారు. నేడు రేడియో, టి.వి. లలో వ్యాఖ్యాతలున్నట్లే ఆ కాలమున రాజాస్థానములలో పాఠకు లుండెడి వారు మాతృభాషలు కాని ఆంగ్లాది ఇతర భాషల ఉచ్చారణ, పఠనము గురించి శిక్షణము పొందుట లేదా అభ్యాసము నేడు మనకు ఆవశ్యకమైనట్లు, నాడు కావ్య పఠనము కూడా ప్రత్యేకముగా అభ్యసింప బడుచుండెడిది. దేశ భాషలందు లెస్సయైన తెలుగు తేటదనము ఉట్టిపడునట్లు కావ్యమును చదువుటలో అందరు పారంగతులు కాలేరు. ఉత్తమ కవి ఉత్తమ పాఠకునిగా రాణింప లేకపోవచ్చును. అందువలన పాఠధర్మముల ఆవశ్యకత ఏర్పడినది వాల్మీకి రామాయణమును కుశ, లవులు గానము చేసిరి. వారి నుండి మరి కొందరికి, తదనంతరం ఒకతరం నుండి మరొక తరంకు రామాయణ పఠనము సంక్రమించింది. లేఖన సౌకర్యములు లేని ఆ కాలమున కావ్యములన్ని మౌఖిక ప్రచారములై యుండెను. తెలుగు కావ్య పఠన మందు పాఠ ధర్మము లధికముగా పాటింపబడు చుండెను. శబ్ద ధర్మములే పాఠధర్మము లగుట వలన శయ్యయే పాఠ ధర్మముగా ప్రచారము నొంది యున్నది

చెలమచెర్ల రంగాచార్యులు పాఠధర్మములను మూడు శయ్యలుగా తెలిపియున్నారు." 10. అవి- ప్రత్యక్ష శయ్య. పాంచాల శయ్య. బాహాట శయ్య తమ కనుల ఎదుట కథా వ్యాపార వ్యవహారము జరుగుచున్నట్లు శ్రోతలు బావించు రీతిన చదువుట ప్రత్యక్ష శయ్య. పఠిత తనలోతాను స్థాయిగా కావ్యమును చదువుచు రసానుభూతిని బడయుట పాంచాల శయ్య. ఇందు పఠిత తన ఆనందము కొరకే చదువును: శ్రోతల మానసికావస్థను లక్షింపడు. శ్రోతకు స్పష్టముగా తెలియునట్లు రాగాలాపన సహితముగా చదువుట బాహాట శయ్య. ఈ విభజనను ఆచార్యులవారు పఠిత-శ్రోత అవగాహన ఆధారముగా ఏర్పరచిరి. వాస్తవముగా శయ్య శబ్ద ధర్మమైనందున మౌఖికమే యగును. కాని మానసికము కాదు. ఇందు మానసిక ప్రక్రియ లేదనుట కాదు; ఐనప్పటికిని

దాని కంత ప్రాధాన్యత లేదు. పఠిత తనలో తాను రసానుభూతిని బడయుచు అందరు వినునట్లు కావ్యమును పఠించుట శయ్య కానేరదు. అది భావనా వ్యాపారమునకు సంబంధితము. అందువలన అది అర్థధర్మమే యగును; కాని శబ్దధర్మము కాదు. అట్లే ప్రత్యక్ష శయ్య. ఏలన అందు శ్రోత యొక్క భావానుభూతియే ప్రధానముగా నుండును. కావున బాహాటముగా, అవసరమైనచో రాగాలాపన సహితముగా శ్రోతకు తెలియునట్లు సరియైన ఉచ్చారణతో కావ్యము పఠింపబడు ప్రత్యక్ష శయ్యనే శయ్యగా, మౌఖిక కావ్యపఠనముగా గుర్తించుట సముచితము. శయ్య మౌఖికమై శబ్దధర్మమైనందున శ్రోత అవగాహనము అందు అంత ప్రధానము కాదు. అవగాహన శ్రోత మానసిక స్థాయికి చెందిన అర్థధర్మము.

## పాకము– Literal taste.

శయ్య శబ్దమునకు సంబంధించినది పాకము అర్థమునకు సంబంధించినది. శయ్య నుండి ఆవిర్భూత మగు కావ్యాస్వాదన రుచియే పాకము. ఇది అర్థధర్మము. అర్థ గాంభీర్యమే పాకము.– అర్థ గాంభీరిమా పాకః. అర్థాస్వాదన లేనపుడు అర్థ గాంభీర్యము పాక మనబడదు. అందువలన విద్యానాథుని లక్షణమును 'గంభీరిమా'ను 'ఆస్వాద్యమానకా విశేషః' అని సరిపెట్టబడినది. నానాభావ సంయోగము వలన రస నిష్పత్తి ఏర్పడునట్లు వ్యుత్పత్తి, గుణ, రీతుల కలయిక వలన జనించిన ఆస్వాదమే పాకము. కావ్యార్థాస్వాదన యొక్క రుచియే పాకము. అనగా కావ్య రసాస్వాదన రుచి. అర్థమనగా భావమని, తదాస్వాదన రసాస్వాదన యని తెలియదగును. పాకము రెండు విధములు– ద్రాక్షా పాకము, నారికేళ పాకము. రాజశేఖరుడు నవ విధ పాకములను తెలిపెను. అవి– పిచుమంద, బదరీ, మృద్వీకా, వార్తాక, తింత్రిణీ, సహకార, క్రముక, త్రాపుష, నారికేళము. వీని నన్నింటిని సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి గారు (కావ్యాలంకార సంగ్రహము. P.P. 175-178) వివేచించి మూడింటికి పరిమితము కావించిరి. అవి–

1. ద్రాక్షా పాకము– పద్యము యొక్క భావము విశేష యత్నము లేకుండా అర్థమగుట.
2. నారికేళ పాకము– పద్యము యొక్క భావము కష్టతరముగా అర్థమగుట.
3. కదళీ పాకము– రెండు సార్లు చదివిన తర్వాతనే పద్యము యొక్క భావము అర్థమగుట.

భారతీయ సాహిత్య శాస్త్ర మందు కావ్యశైలీ విషయమున జరిగిన పరిశీలన నిట్లు క్రోడీకరింప వచ్చును.

1. ప్రథమ దశ– First Phase – ప్రాంతీయ భేదముల ననుసరించి–

| దిశలు | దేశములు | నాట్య ప్రవృత్తులు | నాట్య వృత్తులు | కావ్య ప్రవృత్తులు | రసానుభూతి |
|---|---|---|---|---|---|
| పడమర | మగధ | మాగధీ | భారతీ | అర్థ సౌకుమార్యము | కరుణాద్భుతములు |
| తూర్పు | అవంతి | అవంతీ | కైశికీ | అక్షరాడంబరత | శృంగార, హాస్యములు |
| ఉత్తరము | పాంచాల | పాంచాలీ | సాత్త్వతీ | శ్లేష | రౌద్ర, వీరములు |
| దక్షిణము | దక్షిణాపథము | దాక్షిణాత్య | అరభటీ | ఉత్ప్రేక్ష | భీభత్స, భయానకములు |

2 ద్వితీయ దశ– Second Phase – శబ్ద వృత్తుల రూపమున–

| శబ్ద శక్తులు | శబ్ద వృత్తులు | అర్థ వృత్తులు |
|---|---|---|
| అభిధ | ఉపనాగరికా (స్థానానుప్రాస) | సాత్త్వతీ |
| లక్షణ | పరుషా (అనుప్రాస) | అరభటీ |
| వ్యంజన | కోమలా (ఈషదను ప్రాస) | కైశికీ |

3. తృతీయ దశ– Third Phase – రీతులు, పద సంఘటనా రూపమున–

| రీతులు | సంఘటన | మార్గము | గుణము | పాకము | రసానుభూతి |
|---|---|---|---|---|---|
| వైదర్భి | అసమాస | సుకుమార | మాధుర్య | ద్రాక్ష | శృంగార, కరుణ, శాంతములు |
| గౌడీ | సమాస | మధ్యమ | ఓజ | నారికేళ | రౌద్ర, వీర, భీభత్సములు |
| పాంచాలీ | ఈషద్ సమాస | విచిత్ర | ప్రసాద | కదళీ | భయానక, హాస్య, అద్భుతములు |

## అధోజ్ఞాపికలు - Foot Notes.

1. చతుర్విధా ప్రవృత్తిశ్చ ప్రోక్తా నాట్య ప్రయోగతః
అవంతీ దాక్షిణాత్యా చ పాంచాలీ చౌడూ మాగధీ ॥

2. శ్లేషః ప్రాయ ముదీచ్యేషు ప్రతీచ్యేష్వర్థ మాత్రకమ్
ఉత్ప్రేక్షా దాక్షిణాత్యేషు గౌడేష్వక్షర డంబరః

3. వైదర్భమన్య దస్తీతి మన్యంతే సుధియోఽపరే
తదేవ చ కిల జ్యాయః సదర్థమపి నాపరమ్
గౌడీయ మిదమే తత్తు వైదర్భ మితి కిం పృథక్
గతాను గతి కన్యాయా యా న్నా నాఖ్యేయమ్ మేధసామ్
—కావ్యాలంకారః— 1-13. 1-14.

4 అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మ భేధః పరస్పరమ్
తత్ర వైదర్భ గౌడియౌ వర్ణ్యతే ప్రస్ఫుటాంతరౌ॥— 1.40
శ్లేషః ప్రసాదః సమతా మాధుర్య సుకుమారతా
అర్థ వ్యక్తి రుదారత్వ మోజః కాంతి సమాదయః— 1.41.
ఇతి వైదర్భ మార్గస్య ప్రాణా దశ గుణాః స్మృతాః
ఏషాం విపర్యయః ప్రాయో లక్ష్యతే గౌడ వర్త్మని.— 1.42
తదేతత్ కావ్య సర్వస్వం సమాధిర్నామ యో గుణః
కవి సార్థః సమగ్రోపి తమేక ముపజీవతి— 1-100.
ఇతి మార్గద్వయం భిన్నం తత్ స్వరూప నిరూపణాత్
తద్భేదాస్తు న శక్యకతే వక్తుం ప్రతికవి స్థితాః — 1-101.
—కావ్యాదర్శః.

6. ఉద్భటాది బిస్తు గుణాలంకారాణాం ప్రాయశః సామ్యమేవ సూచితమ్।
విషయ మాత్రేణ భేద ప్రతిపాదనాత్। సంఘటనా ధర్మత్వేన చేష్టేః।
—అలంకార సర్వస్వమ్.

"ఏవంచ" సమవాయ వృత్త్యా శౌర్యాదియః సంయోగ వృత్త్యాతు
హారాదయః, ఇత్యస్తు గుణాలంకారాణాం భేదః। ఓజః ప్రభృతీ

నామను ప్రాసోపమాదీనాం చోభయేషామపి సమవాయ వృత్త్యా
స్థితి రీతి గడ్డరికా ప్రవాహేసై వైషాం భేదః''

—కావ్య ప్రకాశోష్ఠ మోల్లాసః.

6. రసాద్యను గుణత్వేని వ్యవహారోఽర్థ శబ్దయోః
ఔచిత్యవాన్ యస్తా ఏవ వృత్తయో ద్వివిధా స్థితాః।
వ్యవహారో హి వృత్తి రిత్యుచ్యతే అత్ర రసానుగుణః వౌచిత్యవాన్
వాచ్యాశ్రయో యో వ్యవహారస్తా ఏతాః కైశిక్యాద్యాః వృత్తయః
వాచకాశ్రయా శ్చోప నాగరికాద్యాః వృత్తయో హి రసాది
తాత్పర్యేణ సన్నివేశితాః కామపి నాట్యస్య కావ్యస్య చ ఛాయా
మావహంతి। రసాదయో హి త్వయోరసి తయోర్జీవ భూతాః।
ఇతి వృత్త్యాది తు శరీరభూత మేవ।

—ధ్వన్యాలోక — 111.33

7. శబ్దాలంకార మాహుస్తాన్ కావ్య మీమాంసకా విదః
ఛాయా ముద్రా తథోక్తిశ్చ యుక్తిర్గుంఫనయా సహ
అభిప్రాయ విశేషేణ కవి శక్తిం విపృణ్వతీ
సా ముత్ప్రదాయినీ ముద్రాసైవ శయ్యాపి నోచ్యతే (అగ్ని. పు 342)

—ఆంధ్రప్రతాప రుద్ర యశో భూషణము. P. 116

8. I bid - P. 116.

9. కావ్యాలంకార సంగ్రహము. P P. 178-79.

10. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము- P. 113.



# చతుర్థోద్ద్యోతము - The Fourth Flash·

# ఉపసంహారము

## THE EPILOGUE

## I

## యుగ పరిస్థితులు - The Age Conditions.

అగస్టన్ చక్రవర్తిచే స్థాపింపబడిన రోమన్ సామ్రాజ్యము క్రీ.శ. రెండవ శతాబ్ది నాటికే 'సెసానియన్' (నవ పారసీక) చక్రవర్తుల దురాక్రమణలకు గురియయ్యెను; క్షీణదశకు దిగజారెను. పరిణామముగా "డయొక్లీషియన్" (284–305) పరిపాలనా కాలమందు రోమన్ సామ్రాజ్యము పూర్వ, పశ్చిమములుగా విభజింపబడెను. పశ్చిమ భాగమునకు మండలాధిపతిని నియమించి పూర్వ భాగమును డయొక్లిషియన్ తానే పాలించెను. ఆతని అనంతరం 'కాన్‌స్టాంటైన్' (క్రీ.శ 288–337) క్రీ.శ 312 లో పశ్చిమ రోమ్ సామ్రాజ్యమునకు అధిపతి యయ్యెను. నాడు పూర్వ భాగమును పాలించుచున్న లిపియన్‌ను క్రీ.శ. 324లో వధించి కాన్‌స్టాంటైన్ అఖండరోమ్ సామ్రాజ్యమును స్థాపించెను. తన పేరిట 'కాన్‌స్టాంటినోపుల్' ను రాజధానిగా ఏర్పరచుకొని పాలించెను ఇదియే 'బైజాంటియమ్'గా చరిత్ర ప్రసిద్ధమైనది. ఐనను రోమ్ సామ్రాజ్యమునకు హూణ దండయాత్రల బెడద తప్పలేదు. అవి చాలా వరకు అరికట్టబడినవి. కాని దౌర్భాగ్య వశాత్తు క్రీ.శ. 453 లో అత్తిల రాజు దురాక్రమణతో రోమ్ పతన మయ్యెను. తుదకు జస్టినియన్ చక్రవర్తి రోమ్‌ను కైవసము జేసికొని క్రీ.శ. 530 ప్రాంతమున కాన్‌స్టాంటినోపుల్ రాజధానిగా బైజాంటియమ్ సామ్రాజ్యమును స్థాపించెను. ఈ కాన్‌స్టాంటినోపుల్ నేటి టర్కీ దేశ మందలి 'ఇస్టాంబుల్'యను పెద్ద నగరము.

'క్లావిన్' యను జర్మానిక్ తెగకు చెందిన 'గాత్' చక్రవర్తి క్రైస్తవ మతమును స్వీకరించి పోప్ సహాయముతో క్రీ.శ. 476 లో పశ్చిమ రోమ్‌ను వశపరచుకొనెను. కాని అది క్రీ శ. 568 లో 'లోంబార్డ్' యను యోధ జాతి వారి హస్తగత మయ్యెను. క్షీణ దశలో నున్న రోమ్‌ను ఉద్ధరించి 'చార్లెస్' యను చక్రవర్తి పోప్-III సహాయముతో క్రీ.శ. 771లో 'పవిత్ర రోమన్ సామ్రాజ్యము'ను స్థాపించెను. ఆయన నలుబది సంవత్సరములు సుభిక్షముగా పాలించెను. చార్లెస్ తరువాతి రాజు లందరు దుర్బలు లగుటచే 'ఓటో' యను పశ్చిమ జర్మనీ చక్రవర్తి వారి నోడించి క్రీ శ 911 లో పవిత్ర రోమన్ సామ్రాజ్యము పేరు మీదుగానే పాలించెను.

అనతి కాలములోనే పవిత్ర రోమన్ సామ్రాజ్యముపై అరబ్, నార్స్ తురుష్కుల మూకుమ్మడి దురాక్రమణలు మొదలయ్యెను. 'పోప్‌అర్బన్'-III క్రైస్తవ మత సంరక్షణకై యూరోపియన్ దేశములలో సంఘటిత శక్తిని ప్రోత్సహించెను మతముచే ప్రేరితములైన యూరోపియన్ దేశములు ఏకమైనవి; దురాక్రమణదారులపై విజయమును సాధించినవి వీనిని 'క్రూసేడ్' క్రైస్తవ ధర్మ యుద్ధములుగా చరిత్రకారులు పేర్కొనిరి. ఈ యుద్ధములు ముమ్మార్లు జరిగినవి. పరిణామముగా దురాక్రమణలు సంపూర్ణముగా అరికట్టబడినవి కాని పోప్‌కు తగినంత అధికారము లభించనందున తిరిగి యూరప్ దేశములలో అంతః కలహములు చెలరేగెను ప్రజలలో నాయకులలో విచక్షణా జ్ఞానము మటుమాయ మయ్యెను. నాలుగవ క్రైస్తవ ధర్మ యుద్ధము ప్రారంభ మయ్యెను. సేనావాహిని క్రైస్తవ రాజ్యమైన బైజాంటియమ్‌ను ముట్టడించి కాన్‌స్టాంటినోపుల్‌ను ధ్వంసము చేసెను. ఇది పాశ్చాత్య దేశముల చరిత్ర యందు అతి విచిత్రమైన సంఘటన. ఆనాటి పరిస్థితులను దృష్టి యందుంచుకొని స్వీయ రక్షణార్థము 'పోప్'లు మత ప్రచారమునందు విముఖతను ప్రదర్శించిరి. లౌకిక వ్యవహారములందు అత్యధిక శ్రద్ధను కనబరచి చక్రవర్తులను తమ అధీన మందుంచుకొని అనేక దుండగములకు పాల్పడిరి.

'ఫ్రెడిక్'-II యను చక్రవర్తి పోప్ దుండగములను సహించ లేదు. దేశమందు శాంతి, భద్రతలను స్థాపింపదలచి క్రైస్తవ మత గురువులను దేశము నుండి తరిమి వేసెను. ఫ్రాంసు దేశమునందు వారు తలదాచు కొనిరి. ఈ సంఘటనను చారిత్రికులు 'బాబిలోనియా కారాగార వాసముగా' చిత్రించిరి.

వారట కొంత కాలము మనగలిగిరి. కాని 'సిజ్మండ్' పాలన యందు పోప్ అధికారము పూర్తిగా అంతరించి పోయెను.

ఫ్రెంచ్, ఇంగ్లండుల మధ్య వైరములు తీవ్రతరము లయ్యెను. 'జోన్ అవ్ అర్క్' యను క్రైస్తవ రైతు కన్య ఫ్రెంచి సేనలకు నాయకత్వము వహించి ఇంగ్లండుపై దాడి సలిపెను. కాని ఆమె పరాజయము నొందుటయే కాక ఆంగ్లేయులచే అగ్నికి ఆహుతి కావింపబడెను ఈ హృదయ విదారక సంఘటన క్రీ శ 1431లో జరిగెను. తరువాత రాజ్యాధికారమునకై క్రీ.శ. 1431 నుండి 85 వరకు గులాబీల యుద్ధము జరిగెను "హెన్రీ" - VII. రాజైన నాటి నుండి (1485) అంతఃకలహములు సమసి పోయెను.

కాన్‌స్టాంటి నోపుల్ విధ్వంసకాండ ఐరోపా దేశము లందు ఆనాడు దిగ్భ్రాంతిని కల్గించెను. పరిణామముగా వెనిస్, ఫ్లారెన్స్ మున్నగు దేశము లలో పునరుజ్జీవనోద్యమము (Renaissance) ప్రారంభమయ్యెను. అనతి కాలములో అది సంపూర్ణ ఐరోపా ఖండమందు వ్యాపించి తీవ్ర సంచలనమును రగుల్కొలిపెను. ప్రాచీన సంస్కృతిపై ప్రజలకు ఆసక్తి కలిగెను. భాషలకు ప్రాధాన్యత యేర్పడెను. నూతన ఆవిష్కారములు వెలుగునకు వచ్చెను కళా సంస్కృతు లడుగంటెను. తీవ్ర కల్లోలమునకు గురియైన ఈ మధ్య యుగము పాశ్చాత్య కావ్యశాస్త్ర మందు 'అంధకార యుగము'గా పరిగణింపబడినది. రోమన్ సామ్రాజ్య విభజనము, అంతఃకలహములు, మత కలహముల విజృంభణ, ప్రాచీన సంప్రదాయ తిరస్కారము బౌద్ధిక విరక్తి మున్నగు ఈ యుగ పరిస్థితులు పాశ్చాత్య కావ్యశాస్త్ర వికాసమునకు ఇనుప తెరలుగా నిలిచి యుండెను. క్వింటీలియన్ తరువాత, క్రీ శ రెండవ శతాబ్ది నుండి పదమూడవ శతాబ్ది వరకు దాదాపు 1300 సంవత్సరముల కాలమునందు పాశ్చాత్య కావ్య శాస్త్రమునకు సంబంధించిన రచన ఏదియును కానరాదు. 'డాంటె' యను ఇటాలియన్ మహాకవి 14వ శతాబ్దమందు లాటిన్ భాషయందు రచించిన 'డి వల్గరీ ఎలొక్వెంటియా' యను రచన ఒకటి మాత్రమే కావ్య శాస్త్ర దృష్టితో ఈ అంధకారయుగమందు కానవచ్చును. ఈ కావ్యశాస్త్ర రచన లాటిన్ భాష యందు విరచితమైనందున రోమన్ సాహిత్య శాస్త్ర మందలి అంతిమ రచనగా పరిగణింప బడును. గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్రమునకు భరత వాక్యముగా భావింపవచ్చును. డాంటే తరువాతి పాశ్చాత్య కావ్యశాస్త్రము ప్రధానముగా ఆంగ్ల భాషా మాధ్యమమున వికసించినది. కనుక ఆ సాహిత్యశాస్త్రము ఆంగ్ల సాహిత్య శాస్త్రముగా ప్రసిద్ధమై యున్నది.

## II

## డాంటె – Dante.

( 1625 - 1321 )

### ప్రస్తావన – Introduction.

సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమమునకు పరిణామముగా దేశభాష అభివృద్ధి జెందుచున్న తరుణంలో తన లక్ష్య, లక్షణ గ్రంథముల ద్వారా వానికి సాహిత్య ప్రతిపత్తిని చేకూర్చిన మహాకవి, విమర్శకుడు డాంటె. ఈ మహాకవి ఫ్లారెన్స్ నగర మందు జన్మించెను. ఇటాలియన్ భాషయందు 'డివైన్ కామెడీ' (Divine Comedy = దివ్యగాథ) ను రచించి ఆభాషకు సారస్వత ప్రతిపత్తిని కల్గించెను. హోమర్ ఇలియడ్‌తో వర్జిల్ ఈనియడ్‌తో సమాన స్థాయి నందుకొన్న డివైన్ కామెడీయందు మధ్యయుగ సాంస్కృతిక సంపద అంతయు మూర్తీభవించి యున్నది. ఈ మహాకావ్యము నాయన దేశభాషా సాహిత్య గౌరవమును నిరూపించుటకు లక్ష్య గ్రంథముగా రచించెను. దేశ భాషలందు కావ్యములను రచించునపుడు కవులు పాటింప వలసిన అంశములను గురించి డాంటె "డి వల్గరి ఎలొక్వెంటియా" (De Vulgari Elouqentia = Of writing in the Vernacular = దేశ భాష లందు రచనా విధానము) యను లక్షణ గ్రంధమును లాటిన్ భాష యందు రచించెను. ఇది ప్రధానంగా ఉపన్యాస విధానమును లక్షించి విరచితమైనను కావ్యశాస్త్రమునకు సంబంధించిన మౌలికాంశము లిందు పొందుపరచ బడినవి. ఈ లక్షణ గ్రంధమును డాంటె నాలుగు భాగము లందు రచింప దలచెను. కాని దౌర్భాగ్య వశాత్తు ఇది సమగ్రముగా రచింప బడక రెండు భాగములకు కలిగియున్న అసంపూర్ణ రచనగా మిగిలి యున్నది క్వింటీలియన్ వక్తృత్వ కళా శిక్షణ తరువాత రమారమి 1200 సంవత్సరముల అనంతరం వెలసిన ఒకానొక లాటిన్ లక్షణ గ్రంధ మిదియే. కనుక మధ్య యుగీన పాశ్చాత్య కావ్యశాస్త్ర వికాసము నందు ఈ లక్షణ గ్రంధము ప్రముఖ విశేషముగా పరిగణింపబడినది. యూరప్ నందు నేడు ప్రచారములో నున్న ఇంగ్లీషు మున్నగు భాషల్నియు ఆనాటి నుండియే సారస్వత సంపదను సేకరించుకొని ముందుకు రాగలిగినవి.

సవరణ

డి వల్గరి ఎలోక్వెంటియా యందు డాంటె కావ్యభాషను ప్రధానముగా ఉపేక్షించినను, కావ్య విషయమును గురించి కూడా వెను వెంటనే వివేచించెను. కావున డాంటె కావ్య దృక్పథమును ఇట కావ్య భాష మరియు కావ్య విషయము లను రెండు విభాగము లందు పరిశీలింతము.

## కావ్యభాష- The Language of poety.

కావ్యభాషా విషయమున ఆనాడు భిన్నాభిప్రాయములు ప్రబలి యుండెను. కొ దరు ప్రాచీన లాటిన్ భాషను సమర్థింప మరికొందరు ఫ్రెంచి భాషను కావ్యమునకు ఉపయుక్తమని వాదించిరి సమకాలీన కావ్యభాషా వివాదమును డాంటె ఇట్లు పరిష్కరించె . సామాజికునకు ఆనందముతో పాటు జ్ఞానమును కల్గించుట కావ్య ప్రయోజనము. ఐనపుడు ఇట్టి మహత్తర ప్రయోజనము ఏ భాష ద్వారా నెరవేరగలదో మనము పరిశీలింప వలయును. ఏలన భాషల వికాసము యుగ పరిస్థితుల కనుగుణముగా జరుగు చుండున ఒకనాటి కావ్య భాష నేడు మృత భాషగా పరిగణితము కావచ్చును. మఱుగున పడియున్న భాషలు సమకాలీన పరిస్థితుల దృష్ట్యా కావ్య భాషలుగా ఉపయుక్తములు కావచ్చును రోమన్ సామ్రాజ్య పతనముతో లాటిన్ భాషా ప్రభావము అంతరించింది. క్రైస్తవ మత గురువులు సైతము లాటిన్‌ను ప్రక్కకు నెట్టి దేశభాష లందే మత ప్రచారము కావించిరి సామాజికుని అవగాహనమే వారి ప్రధాన లక్ష్యము. ఈ నియమమే కావ్యభాష కేల వర్తింపదు? ప్రాచీన లాటిన్ భాషనే సమర్థించుట ఎంతవరకు సమీచీనము ? అంతేకాక ఆ భాషా పండితులకు మాత్రమే నేడు అవగాహన యోగ్యముగా నున్నది. కనుక సామాజిక అవగాహనను దృష్టి యందుంచుకొని కావ్య భాషను ఎన్నుకొనవలయును. ఇక రెండవది ఫ్రెంచి భాషను కావ్య భాషగా సమర్థించుట- ఇదియును ఏక పక్షముగానే యున్నది ఎట్లన ఫ్రెంచి భాషా ప్రభుత్వము నంగీకరి చిన యెడల దేశభాషల అభివృద్ధి కుంటువడుట స్వాభావికము. అందరికి అవగాహన యోగ్యములుగానున్న దేశ భాషల నగౌరవ పరచిన వారల మగుదుము. తద్వార జాతీయత సన్నగిలు అవకాశము కలదు. కనుక పరిమిత ప్రయోజన ములను కలిగియున్న లాటిన్, ఫ్రెంచి భాషలలో కావ్యములను రచించుట కన్న అపరిమిత ప్రయోజనములను కలిగియున్న దేశభాషలలోనే కావ్యము

sur
will
poet

లను రచించుట మేల్తరము. దేశ భాషయే కవిత్వమున కుపయుక్తమైన భాష దేశభాష లందు మాండలికము లనేకములు కనుక అవి కావ్యరచనకు ఉపయుక్తములు కావనుట సరికాదు శిష్టులు వ్యవహరించు దేశభాషనే గ్రహించుట ఉపయుక్తము. కనుక శిష్టవ్యావహారిక భాషనే (The agreed practice of educated men) కావ్య భాషగా ఎన్నుకొనుట సర్వ సమ్మతము.

పదజాలము- Vocabulary- శిష్ట వ్యావహారిక భాషకు కావ్య భాషా సౌందర్యమును సమకూర్చునది ఆ భాష యందలి పదజాలము. పదముల కూర్పునందు కవి అత్యంత జాగ్రత్త వహింప వలయును. సందర్భమున కుచితములైన పదముల ఎంపిక మరియు వాని కూర్పునందు భాషా రమణీయత ఇమిడియున్నది. ప్రతిభాషలో పదములు రెండు రకములు నుండును. సంస్కృతములు (urban) మరియు అసంస్కృతములు (Rustic) సంస్కృత పదములు మరల మూడు రకములుగా నుండును. అసంపూర్ణార్థకములు(Childish), అమహదర్థకములు (Feminine), మహదర్థకములు (Masculine). మహదర్థక పదములందు సైతము మాధుర్య వంతములు (Combed), కాంతి మంతములు (Glossy) యుండును. మధుర పదములు వీనులకు ఆనందమును కల్గించును. కాంతి మంతములు వినూత్నార్థములను బోధించి మానసమునకు ఆహ్లాదమును చేకూర్చును. కావున కవి మహర్థక పద ప్రయోగ మందే శ్రద్ధవహింప వలయును. తద్వారా కావ్య భాషకు వినూత్న విన్యాసము సమకూరును

వాక్య రచన- Sentece Structure :- పద ప్రయోగము వాక్యము నేర్పరచును. వాక్య సముదాయము శైలిని రూపొందించును. శైలీ రామణీయకమునకై కవి వాక్య నిర్మాణ మందు విశేష శ్రద్ధను కనబరచ వలయును. అవ్యాకరణికములను పరిహరించి వ్యాకరణ సమ్మతమైన వాక్య నిర్మాణమునే అనుసరింపవలెను. ఐనను వాక్యము నలంకార గర్భితముగా రచించుటకై కవి వ్యాకరణ నియమముల నధిగమించినను దోషము లేదు. కవి వాక్య రచన సౌందర్యాత్మకమై, ఉదాత్త భరితమై అందరి అవగాహనకు యోగ్యముగా నుండవలయును. ఇట్టి నేర్పు కవులకు పూర్వ సత్కావ్య పఠనము మరియు అభ్యాసము ద్వారా సిద్ధించును.

## కావ్య వస్తువు- The Subject of Poetry.

మరి కావ్యమున కెట్టి వస్తువు ఉపయుక్తముగా నుండును? అది సమ కాలీన జీవన సంబంధితమై యుండవలయునా? లేక ప్రాచీన ప్రసిద్ధమై యుండవలయునా? ఈ విషయ మందు డాంటె పరంపరా గత ప్రసిద్ధమైనదే కావ్యమునకు ఉపయుక్త వస్తువుగా నుండు ననెను. అది బహుళ ప్రచారము నొంది జన మనమునకు సుపరిచితమై యుండుట వలన సామాజికుల మాన సము నతి సులభముగా, శీఘ్రముగా ఆకర్షింప గలదు. ప్రాచీన కథావస్తువు అత్యంత ప్రసిద్ధమై యుండుటకు కారణము అది కలిగియున్న ఉదాత్తత మరియు ఒసంగు దివ్య సందేశ మను విషయమును మరువ రాదు అందువ లన అది అశేష ప్రజానీక - నలరింప జేయుచు మానవ మనుగడను మంచి మార్గమున పురోగమింప జేయు సామర్థ్యమును గలిగి యున్నది అట్టి ప్రసిద్ధ కథా వస్తువును కవి గ్రహించి దాని మూలభావన కెట్టి క్షతి కలుగకుండా సమ కాలీన జీవన సరణి కనుగుణముగా మార్పులు, చేర్పులు చేయవలెను; వినూత్న రూపముతో ప్రదర్శింప వలయును. తద్వారా కవి అభీష్టము నెరవేరును సుఖ దుఃఖాలతో చెలగాట మాడుచున్న మానవ మనస్సు అనిర్వచ నీయానందాను భూతిని పొంది, దివ్యపథము వైపు పురోగ మించును.

మరి ప్రాచీన కథావస్తు ప్రదర్శన దేశ భాషలందు సాధ్య మగునా? అందలి పరమార్థమును ధ్వనింప జేయు సమర్థతను దేశభాషలు కలిగి యున్నవా? ఈ విషయ మందు డాంటె దేశ భాషనే సమర్థించెను. ప్రసిద్ధ కథా వస్తువు దేశ భాషల మాధ్యమమున రమణీయ రూపమును సంతరించుకొన జాలదనుట పొరపాటు. కావ్యమునకు కథావస్తువే ప్రాణ తత్త్వము. భాషా రూపము శరీర తత్త్వము. సృష్టివలె భాష పరివర్తన శీల భాషకు అవధుల నేర్పరచ జాలము. కవి కావ్య వస్తువున కనుగుణముగా కని విని యెరుగని మార్పులను భాష యందు చేయవచ్చును. వ్యావహారికమని, అనుపయుక్తమని భావింపబ డిన భాషయే ప్రతిభా సంపన్నుడైన కవి కౌశలము ద్వారా దేవ భాషగా రాణింప వచ్చును. ఆ భాషయందలి వాక్యములు అమరవాణి రూపమును దాల్చ వచ్చును. కనుక దేశభాష ప్రసిద్ధ కథా వ్యంజకతకు అనుపయుక్తమని తలంచుట సబబు కాదు. అసలు కావ్యమునకు ప్రసిద్ధి అందు వర్ణితమైన

sur
wil
poe

ఉదాత్త వస్తువు ననుసరించి కలుగును కాని అందు ప్రదర్శింపబడిన భాషా వైదుష్యము వలన కాదు. కనుక కావ్యప్రసిద్ధికి ఉదాత్త కావ్య వస్తువే సాన పట్టు రాయి. సైనికునకు గుఱ్ఱము వలె కవికి భాషాశైలి. రణరంగ ధీరుడైన సైనికుడు మాత్రమే జవనాశ్వమును అదుపు నందుంచుకొని విజయమును సాధించునట్లు, ప్రతిభావంతుడైన కవి భాషా రూపమును కావ్య వస్తువున కనుగుణముగా రూపొందించి సాహిత్య జగత్తు నందు విజయుడు కాగలడు.

హోరేస్, క్వింటీలియన్ వలె డాంటె ప్రాచీన సంప్రదాయమునే సమర్థించెనని ఉపయుక్త వివరణము ద్వారా స్పష్టము. పదప్రయోగము, వాక్య నిర్మాణము, అలంకారిత మున్నగు శైలీ అంశము లన్నింటిని ఆయన పూర్వాచార్యులను దృష్టి యందుంచు కొనియే సమర్థించె ననవచ్చును. ఐనను పూర్వాచార్యులెవ్వరును దేశభాషలను కావ్యభాషగా నిరూపించు సాహసమును చేయ లేదు. పాశ్చాత్య సాహిత్య జగత్తు నందు దేశ భాషలకు గౌరవ ప్రపత్తులను చేకూర్చిన ప్రప్రథముడు డాంటె లాటిన్ భాషా ప్రభుత్వము ఎల్లెడల వ్యాపించిన ఆ కాలమందు ఇటాలియన్ భాషకు సాహిత్య ప్రతిపత్తిని చేకూర్చుట సామాన్యమైన కార్యము కాదు. లాటిన్ భాషా పండితు లంగీకరింపక తీరని విధమున 'డివైన్ కామెడి'ని రచించి డాంటె ఇటాలియన్ భాషకు చిర స్థాయియైన గౌరవమును తెచ్చెను. ఉదాత్త కావ్యవస్తువును సమర్థించి సాహిత్యమును పాండితీ కక్ష నుండి విడదీసి సువిశాలమైన దేశభాషా జగత్తునందు ప్రతిష్ఠించెను ఆయన వ్యావహారిక భాషామార్గ ప్రవర్తుడై యూరపు నందలి వివిధ భాషల వికాసమునకు తోడ్పడెను. అందువలన మధ్య యుగ మందు వెలసిన డాంటె విరచిత వల్గరి ఎలొక్వెంటియాకు పాశ్చాత్య కావ్యశాస్త్ర మందు సముచితమైన స్థానము కలదు గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్ర మందలి అంతిమ లాటిన్ లక్షణ గ్రంథ మదియే.

ఇంతటితో గ్రీక్-రోమన్ సాహిత్య శాస్త్రము ముగియుచున్నది.



# సాహిత్య పారిభాషిక పద సూచి- Literary Terminology

అతిభౌతిక శాస్త్రము – Metaphysics
అతిశయోక్తి – Exaggreation
అనుకరణము – Imitation, Mimesis
అనుభావము – Emotional response
అనుభూతి – Perception
అనురూపము, ప్రతి రూపము – Copy
ఆద్య రూపము – Arche type
అప్రదర్శనీయము, సూచ్యము – Unpresentable
అభిధ – Denotion
అభినయము – Art of Acting
అమహాదర్థకము – Feminine
అర్థము – Meaning, Sense
అలంకారము – Figure of Speech
అసంభావ్యత – Improbability
ఆకృతి, రూపము – Form
ఆఖ్యాన గేయము – Ballad
ఆడంబర పూరితము – Asiatic
ఆనందము – Delight
ఆదర్శవాదము – Idealism
ఆయామము – Size
ఆరభటీ వృత్తి – Violent Action
ఆలంకారిక భాష – Metaphoircal Language
ఆవశ్యకత – Necessity
అసంస్కృతము, అనాగరకము – Rustic
ఆహార్యము – Costum and make up
ఇంద్రియోప లబ్ధి – Sense perception
ఉత్తర గానము – Satismon
ఉదాత్తత, ఔదాత్యము – Sublimity

ఉదాత్త శైలి - Lofty style, Grand style
ఉద్దేశ్యము - Thought
ఉపమ - Simile
ఉపసంహారము - Epilogue
ఏకరూపత - Consistency
ఓజస్సు - Floridity
కథనాత్మక శైలి - Narrative style
కథా వస్తువు, ఇతి వృత్తము - Plot
కథాన్వితి - Unity of plot
కరుణము - Pity
కల్పన - Imagination
కల్పనా బింబము - Image
కాంతిమంతము - Glossy
కార్యాన్వితి - Unity of Action
కాలాన్వితి - Unity of Time
కావ్యము, కవిత - Poetry
కావ్య పత్రము - Epistle
కావ్య ప్రయోజనము - Poetic Function
కావ్య ప్రేరణ - Poetic Inspiration
కావ్య శాస్త్రము - Poetics
కావ్య సత్యము - Poetic Truth
కావ్యాత్మ - Poetic Soul
కావ్య హేతువులు - Poetic equipment
క్లిష్టత - Ambiguity
కుకవి - Poetaster
కైశికీ వృత్తి - Graceful Action
గద్య శైలి - Prose Style
గరిమ - Dignity
గీతము - Song
గేయము - Lyric

జ్ఞానాత్మకము - Knowing
జ్ఞానోపదేశము - Instruction
చారిత్రక సత్యము - Historical Truth
ఛందము - Metre
తథ్యము - Fact
తత్త్వము - Element
తాండవ స్తోత్రము - Dithryambic Poetry
తాదాత్మ్యము - Empathy
త్రాసము - Fear
తులనాత్మకము - Comparative
ద్రవ్యము - Matter
దృక్పథము - View, Concept
దృశ్య గేయము - Idyll
దార్శనిక సత్యము - Philosophical Truth
ధ్వని - Suggestive Meaning
దివ్యానందము - Bliss
దివ్యావేశము - Davine Madness
దైవ స్తోత్రము - Hymn
నాటకము, రూపకము - Drama
నాటక స్వగతము - Soliloquy
నాటకీయ శైలి - Dramatic Style
నాట్య ప్రవృత్తులు - Dramatic Tendencies
నాట్య వృత్తులు - Dramatic Actions
నియతాప్తి, వివృతి, నిగదము - Denouement
పద రచన - Diction
పద వక్రత - Innuendo
పర్యాయోక్తి - Periphrase
ప్రజ్ఞ - Talent
ప్రజ్ఞా వీక్షణ - Instuition
ప్రతిబింబము - Reflection

ప్రతిభ - Genius
ప్రతీకము - Symbol
ప్రదర్శనీయము, సూచ్యము - Presentable
ప్రయత్నము - Incident
ప్రవృత్తి - Instinct
ప్రసాదము, స్పష్టత - Perspecuity
ప్రశ్నాలంకారము - Interrogation
ప్రహసనము - Mime
ప్రాథమికము - Primary
ప్రాప్త్యాశ - Crisis
ప్రారంభము - Exposition
ప్రేక్షక మానసిక స్థితి - Audience Psychology
ఫల ప్రాప్తి, ఫలాగమము - Catastrophe
పాకము - Literal Taste
పాత్రలు - Characters
పూర్వాభాసము - Irony
ప్రౌఢము - Austre
భంగ్యత - Grace
భావము - Emotion
భావ ప్రత్యయము - Idea
భావనాత్మక వాదము - Romanticism
భావ నౌచితి - Fancy
భావ పరిష్కారము - Katharsis
భావాడంబరత - Parenthyseus
భావాత్మకము - Feeling
మహదర్థకము - Masculine
మహాకావ్యము - Epic
మాధ్యమము - Medium
మాధ్యమికము - Secondary

మిథ్యా ప్రతీతి - Illusion
మూర్త విధానము - Crystalisation
రంగవైభవము - Spectacle
రసము - Sentiment
రసానుభూతి - Aesthetic Experience
రూపకాలంకారము - Metaphor
రూపాంతరితము - Altered, Transferred
లయాత్మకత - Rhythm
లక్షణ - Connotation
వస్తువు - Object
వ్యంగ్య కావ్యము - Satire
వ్యంజక అర్థము - Conventional meaning
వ్యంజక శబ్దము - Articulate Sound
వ్యంజన - Suggestion
వ్యంజనా వృత్తి - Suggestivity
వక్తృత్వ శాస్త్రము - Rhetorics
వాక్య వక్రత - Sentential
వాచికము - Verbal Action
విభావము - Emotional Excitant
విశిష్టానుకరణము - Selective Imitation
విషయము, ద్రవ్యము - Matter
విషాద రూపకము - Tragedy
విస్తారణ - Amplification
వీర ఛందము - Heroic metre
శయ్య - Rhythmopoeia
శైలి, రీతి - Style
శోక గీతము - Elegy
సంకల్పితము, సక్రియాత్మకము - Active
సంకీర్ణ శైలి, మిశ్రమ శైలి - Mixed Style
సంగీత గేయము - Vocal Song

సంచారి భావము } - Transient Emotion
వ్యభిచారి భావము

సంభావ్యత - Probability
సంబోధనా గేయము - Ode
సంవృతి - Complication
సంశ్లిష్టము - Complex
సంస్కృతము, నాగరకము - Urban
సమపత్తి - Accomplishment
సమరసత - Harmony
సమరసితానుభూతి - Harmonius Perception
సమాస శైలి - Periodical Style
సహృదయుడు - Ideal Reader
స్రష్ట - Maker
సృజనాత్మకము - Creation
స్వచ్ఛంద కల్పన - Phantasy
సాంప్రదాయిక వాదము - Classicism
సాత్త్వతీ వృత్తి - Mental Action
సాత్త్వికాభినయము - Mental Gesture
సాధారణీకరణము - Generalisation
సామాన్యము - Simple
సామాన్య శైలి - Loose Style
సారము - Climax
సాహిత్య విమర్శ, సాహిత్య శాస్త్రము - Literary Criticism
స్థానాన్వితి - Unity of Place
స్థాయి భావము - Basic Emotion
స్వాభావిక లోపము - Hamartia
సిద్ధాంతము - Theory
స్థితి విపర్యాసము - Reversal of Situation
సౌందర్యము - Beauty
హాస్య రూపకము - Comedy

# అధ్యేయ గ్రంథ సూచి - Bibliography

## సంస్కృతము - Sanskrit

అభినవగుప్తుడు – అభినవ భారతీ
ఆనందవర్ధనుడు – ధ్వన్యాలోకః
కుంతకుడు – వక్రోక్తి జీవితమ్
జగన్నాథుడు – రస గంగాధరః
దండి – కావ్యా దర్శః
భరతుడు – నాట్య శాస్త్రమ్
భామహుడు – కావ్యాలంకారః
మమ్మటుడు – కావ్య ప్రకాశః
రాజశేఖరుడు – కావ్య మీమాంసా
వామనుడు – కావ్యాలంకార సూత్రవృత్తి
విశ్వనాథుడు – సాహిత్య దర్పణః
క్షేమేంద్రుడు – ఔచిత్య విచార చర్చా

## హిందీ - Hindi

కాక కాలేల్కర్ – భారతీయకావ్య సిద్ధాంత్
కృష్ణ కుమార్ శర్మ – ధ్వని సిద్ధాంత్
కృష్ణదేవ్ – సమీక్షా కే సిద్ధాంత్
కేసరీ నారాయణ్ శుక్ల – పాశ్చాత్య సమీక్షా శాస్త్ర
గులాబ్ రాయ్ – సిద్ధాంత్ ఔర్ అధ్యయన్
గణపతి చంద్రగుప్త – భారతీయ ఏవమ్ పాశ్చాత్య కావ్య సిద్ధాంత్
– సాహిత్య కా మనోవైజ్ఞానిక్ వివేచన్
జగన్నాథ్ పాఠక్ – ధ్వన్యాలోక్
గోవింద్ త్రిగుణాయత్ – శాస్త్రీయ సమీక్షా కే సిద్ధాంత్
జయశంకర్ ప్రసాద్ – కావ్య కళా తథా అన్య నిబంధ్
నగేంద్ర – భారతీయ కావ్యశాస్త్ర కీ పరంపరా

నగేంద్ర – పాశ్చాత్య కావ్యశాస్త్ర కీ పరంపరా
ధ్వన్యాలోక్
అరస్తూ కావ్య శాస్త్ర
కావ్య మే ఉదాత్త తత్త్వ
ప్రతాప్ నారాయణ్ టండన్ – సంస్కృత్ సమీక్షా కీ రూప్ రేఖా
కృష్ణదత్త్ పాలీవాల్ – యూనానీ ఔర్ రోమీ కావ్య శాస్త్ర
బలదేవ్ ఉపాధ్యాయ్ – భారతీయ సాహిత్య శాస్త్ర
భగీరథ్ మిశ్ర – కావ్యశాస్త్ర
భారతీయ కావ్య శాస్త్ర కా ఇతిహాస్
భోలా శంకర్ వ్యాస్ – ధ్వని సంప్రదాయ్
రామచంద్ర శుక్ల – చింతామణి
రామ చంద్ర తివారీ – సాహిత్య కా మూల్యాంకన్
రామ్ దహిన్ మిశ్ర – కావ్య దర్పణ్
రామ్ మూర్తి – భారతీయ సాహిత్య దర్శన్
రేవా ప్రసాద్ ద్వివేదీ – ఆనంద్‌వర్ధన్
లీలాధర్ గుప్త – పాశ్చాత్య ఆలోచనా కే సిద్ధాంత్
విమల్ కుమార్ జేన్ – కావ్య మే శబ్ద శక్తి కా చమత్కార్
విశ్వభారతీ –
శాంతి స్వరూప్ గుప్త – పాశ్చాత్య కావ్యశాస్త్ర కే సిద్ధాంత్
శ్యామ్ సుందర్ దాస్ – సాహిత్యాలోచన్
శివనాథ్ – అనుశీలన్
శ్రీ వాత్సవ్ – శైలీ విజ్ఞాన్
సత్యదేవ్ చౌధరీ – భారతీయ కావ్యాంగ్
సూర్యకాంత్ శాస్త్రీ – సాహిత్య సమీక్షా
హజారీ ప్రసాద్ ద్వివేదీ – సాహిత్య కా సాథీ
సాహిత్య కా మర్మ
హరీశ్ కరుణ్ – గ్రీక్ సాహిత్య శాస్త్ర

నవరణ

## ఆంగ్లము - English


| | |
|---|---|
| Aber Crombie | Theory of Poetry |
| Allan H Guilbert | Plato to Dryden |
| Arnold Mathew | Essays Literary Critical |
| Atkins J.W.H. | Literary Criticism in Antiquity |
| Barret. H. Clark | European Theories of Drama |
| Baston | English Poetry and Language |
| Bradley | Oxford Lectures on Poetry |
| Brereton Geoffry | Principles of Tragedy |
| Brooks & Wimsatt | Literary Criticism |
| Butcher S.H. | Aristotle's poetics |
| Bywater Ingram | Aristotle on the Art of Poetry |
| Coleridge | Biographia Litereria |
| Crane R.S. | Critics and Criticism |
| Daiches David | Critical Approaches |
| Dryden | Essay on Dramatic Poesy |
| Eliot T.S. | Selected Essays |
| Else Georald | Aristotle's Poetics |
| Encyclopedia Britanica | |
| Grube G M.A. | Plato's Thought |
| Geoffrey Bereton | Principles of Tragedy |
| Guerin W L. | A Hand book of Critical Approaches |
| Hamilton Edith | The Greek way |
| Hudson W.H. | Study of Literature |
| Hudson Derek | English Critical Essays |
| Iyangar Srinivas | The Adventure of Criticism |
| Jams Scott | The marking of Literature |
| John. D. Boyd | The Function of Mimesis |
| John Macy | The Story of Word's Literature |
| Kane P.V. | History of Sanskrit Poetics |
| Ker W.P. | Form and Style |
| Krishna Murty | Dhvanyaloka |
| Lucas F.L. | Tragedy |
| Murrey J.M. | The problem of Style |
| Narasimham C. | European and Indian Theories |
| Pandy K.C. | Comparative Aesphetics |
| Patnakar | Aesthetics and Literary Criticism |

| | |
|---|---|
| Prasad Birjadish | English Criticism |
| Paul Harway | Companian to English Literature |
| Rama Swamy | Indian Aesthetics |
| Richards I.A. | Principles of Criticism |
| Sastry P.S. | Aristotle's Theory of Poetry |
| Viswanadham | Essays in Criticism |
| Wellek & Warren | Theory of Literature |
| Words Worth | Preface to Lyrical Ballads |
| Worsefold B. | Principles of Criticism |
| | Judgement In Literature |

## తెలుగు - Telugu

| | |
|---|---|
| అనంతకృష్ణ శర్మ ఆర్. | -సారస్వతాలోకము |
| ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి | -సారస్వత వ్యాసములు |
| కృష్ణారావు. జి.వి. | -కావ్య జగత్తు |
| గణపతి శాస్త్రి సి హెచ్. | -సాహిత్య సౌం ర్య దర్శనము |
| తిరువేంగళా చార్యులు. వి. | -ఆంధ్ర ధ్వన్యాలోకము |
| తెలుగు భాషా సమితి | -విజ్ఞాన సర్వస్వములు |
| నారాయణరెడ్డి. సి. | -ఆధునికాంధ్ర కవిత్వము |
| రంగాచార్యులు. సి. హెచ్. | -ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము |
| రంగారావు. ఎమ్. | -ఆధునిక కవిత్వం సమాలోచనం |
| రామకృష్ణారావు. ఎమ్. | -సమీక్ష |
| రామలింగారెడ్డి. కె. | -కవిత్వ తత్త్వ విచారము |
| లక్ష్మీకాంతం. పి. | -సాహిత్య శిల్ప సమీక్ష |
| వీరభద్రయ్య. ఎమ్. | -విమర్శ మౌలిక సూత్రాలు |
| వేంకటావధాని. డి | -సాహిత్య సోపానములు |
| వేంకటేశం. బి. | -అరిస్టాటిల్ కావ్యశాస్త్రము |
| శివశంకరస్వామి | -కావ్య స్వరూపమ్ |
| శేషేంద్రశర్మ. జి. | -కవిసేన మేనిఫెస్టో |
| సంపత్కుమారాచార్య. కె. | -ఆధునిక సాహిత్య విమర్శ |
| సుబ్బారావు ఆర్. | -రవీంద్ర వ్యాసావళి |
| సూర్యనారాయణశాస్త్రి ఎస్. | -కావ్యాలంకార సంగ్రహము |



# అనుక్రమణిక – Index

గమనిక :- ఉద్ద్యోతముల సంఖ్య రోమన్ అంకెలలో తెలుపబడినది.

# సవరణ – Errata

## ప్రథమోద్ద్యోతము - The First Flash.

| పుట | పంక్తి | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 19 | అభిల్లెన్ | — | అఖిల్లెస్ |
| 16 | 24 | తదంతరం | — | తదనంతరం |
| 29 | 5 | స్వపరూపము | — | స్వరూపము |
| 29 | 10 | క్యావ మందు | — | కావ్య మందు |
| 32 | 9 | సింహావలోకము | — | సింహావలోకనము |
| 43 | 19 | Preception | - | Pereception |
| 53 | 16 | గానాపముల | — | గానాలాపముల |
| 56 | 16 | పంసరించి | — | ప్రసరించి |
| 73 | 3 | Qualites | — | Qualities |
| 75 | 4 | హిన్య రూపము | — | హాస్య రూపకము |
| 94 | 25 | శష్ధోర | — | శబ్దార |
| 99 | 16 | కవర్తృత్వము | — | కర్తృత్వము |
| 103 | 8 | Spech | — | Speech |
| 107 | 16 | సహదిదము | — | సహృదయము |
| 109 | 10 | Deligth | — | Delight |
| 109 | 10 | ఆయుర్వ్యద్ధి | — | ఆయుర్వృద్ధి |
| 112 | 27 | విప్రిబలం | — | విప్రలంబ |
| 115 | 19 | ఓబో | — | ఓజో |
| 115 | 20 | Perspicuty | — | Perspicuity |
| 116 | 16 | bat | — | but |
| 116 | 24 | Pantamimic | — | Phantamimic |
| 117 | 13 | especiailly | — | especially |
| 117 | 29 | aure | — | sure |
| 117 | 8 | wit | — | will |
| 118 | 30 | poeat | — | poet |

| | | | | |
|---|---|---|---|---|
| 119 | 35 | wnat | — | want |
| 121 | 13 | Aesteetics | — | Aesthetics |

ద్వితీయోద్ద్యోతము– The Second Flash

| | | | | |
|---|---|---|---|---|
| 17 | 15 | రూపకము | — | రూపము |
| 19 | 8 | తత్య రూపము | — | తథ్య రూపము |
| 28 | 16 | సామానక | — | సామాన్య |
| 42 | 11 | వ్వారా | — | ద్వారా |
| 61 | 4 | చేకూర్చునకు | — | చేకూర్చునను |
| 78 | 9 | విద్యాగా | — | విద్యగా |
| 78 | 24 | కమత | — | కనుక |
| 89 | 14 | శాంతించకుకడనే | — | శాంతించకుండనే |
| 77 | 24 | అన్నింటింరో | — | లన్నింటిలో |
| 105 | 19 | suggestible | — | suggestible element |

తృతీయోద్ద్యోతము–The Third Flash

| | | | | |
|---|---|---|---|---|
| 17 | 22 | సామాగ్రిని | — | సామగ్రిని |
| 32 | 25 | నూతనాభిషలు | — | నూతనాభిలాషలు |
| 36 | 19 | ఏడ్పడిన | — | ఎర్పడిన |
| 46 | 10 | అఖ్యాయిక | — | ఆఖ్యాయిక |
| 46 | 14 | మూడు | — | రూపకము |
| 56 | 20 | లించ | — | లింగ |
| 61 | 28 | విశునారి | — | పిశునారి |
| 64 | 13 | shoud | — | should |
| 72 | 15 | ప్రకటికంపబడు | — | ప్రకటింపబడు |
| 75 | 24 | క్వయించిరి | — | కన్వయించిరి |
| 81 | 23 | కావ్యకు | — | కావ్యమ్ |
| 86 | 2 | దానియే | — | దానినే |

చతుర్థోద్ద్యోతము–The Fourth Flash

| | | | | |
|---|---|---|---|---|
| 5 | 25 | తద్వార | — | తద్వారా |
| 6 | 19 | Sentece | — | Sentence |



గ్రంథకర్త

డా॥ బి. వేంకటేశం.
లెక్చరర్,
ఇంటి నెం. 5, పద్మానగర్,
కరీంనగర్-505 002. (ఆం.ప్ర.)

''నేడు మనం భారతీయ సాహిత్య శాస్త్రాన్ని అధ్యయనం చేయడంతో తృప్తి పడడం లేదు. నిజానికి దానికన్న పాశ్చాత్య విమర్శ ఎలా ఉన్నది? అన్న ఆలోచన తీవ్రంగా సాగుతున్నది. ఆ రెంటింటిలో సామ్యమెట్టిదో పరిశీలించడానికే డా॥ బి. వేంకటేశంగారు ఈ గ్రంథాన్ని భారతీయ-పాశ్చాత్య తులనాత్మక సాహిత్య దర్శనంగా రూపొందించినారు''.

—ఆచార్య పేర్వారం జగన్నాథం.
వైస్ చాన్సలర్; తెలుగు విశ్వవిద్యాలయము.

''తెలుగులో ఇలాంటి గ్రంథాలు లేవనే చెప్పవచ్చును. ఈ గ్రంథము ప్రాచ్య-పాశ్చాత్య కావ్య శాస్త్ర తులనాత్మక అధ్యయనానికి ఎంతో సహకరిస్తుందనటం సముచితము''.

—ఆచార్య హరి శివకుమార్.
అధ్యక్షులు తెలుగు విభాగము; కాకతీయ విశ్వవిద్యాలయము.

''సాహిత్యంలో నిహితమైయున్న ఉదాత్త విషయాలను, సార్వ జనీన లక్షణాలను యువ తరాలకు అందించే సంకల్పం ఇందులో కనిపిస్తుంది. ఈ విధమైన సాహిత్య దర్శనం తులనాత్మకమైన అధ్యయనంతో మొదటి సారిగా సహృదయులకు సమర్పితమైంది''.

—ఆచార్య మాదిరాజు రంగారావు.
కాకతీయ విశ్వవిద్యాలయము.

''సమతౌల్యం ప్రమాణంగా, నిష్పాక్షిక విశ్లేషణ మూల ధాతువుగా రచింప బడిన ఈ గ్రంథం సాహిత్య విమర్శనా క్షేత్రంలో తెలుగు భాషీయులకు కరదీపిక అవుతుందని ఆశిస్తున్నాను''.

—పద్మభూషణ్ డా॥ సి. నారాయణరెడ్డి.

SRI BALAJI PRINTING PRESS, (Automatic Power Press)